# మొగ్గతొడిగిన ఎర్రగులాబి

కె. ఎ. అబ్బాస్



అనువాదం రావూరి భరద్వాజ

యం. శేషాచలం అండ్ కో
మద్రాసు : మచిలీపట్టణము : సికిందరాబాదు

MOGGA THODIGINA ERRA GULABI (RETURN OF THE RED ROSE by K. A. Abbas)—Telugu Translation by Ravuri Bharadwaja. Published by M. Seshachalam & Co., Madras - Machilipatnam - Secunderabad.

Price: Paper back Rs. 5; Library Rs. 7; Deluxe Rs. 10.

First Edition: July, 1967

Cover Design: Bapu

ప్రథమ ముద్రణ : జూలై, 1967

ప్రచురణ :

యం. శేషాచలం అండ్ కో.,

మద్రాసు : మచిలీపట్టణము : సికిందరాబాదు.

ముద్రణ :

ఫ్రీడమ్ ప్రెస్.

138, టి. హెచ్. రోడ్డు, మద్రాసు-21.

వెల : సాదాప్రతి రూ. 5; మేలుప్రతి రూ. 7; డీలక్స్ ప్రతి రూ. 10.



Regd. 212864

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ వారి
'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళిక
చందాదారులకు ప్రత్యేక ప్రచురణ.

ప్రాప్తిస్థానము :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతిరోడ్డు : : సికిందరాబాదు

అంకితం

జాతిరత్నం

జవహర్లాల్ నెహ్రూకు

# నాంది

భారతదేశంలో జన్మించిన ఇద్దరే ఇద్దరు స్త్రీలు కాంగ్రెసు అధ్యక్షపదవి అలంకరించినారు. వారు శ్రీమతి సరోజినీనాయుడు, శ్రీమతి ఇందిరాగాంధి. ప్రపంచ ప్రజాప్రభుత్వచరిత్రలో ఇద్దరే ఇద్దరు స్త్రీలు ప్రధానిపదవి అందుకో గలిగినారు— శ్రీ లంకలో శ్రీమతి సిరిమావో బండార నాయకే; స్వతంత్ర భారతదేశంలో శ్రీమతి ఇందిరాగాంధి.

ఇంతటి గౌరవస్థానం పొందగలిగిన ఇందిరాజీ జీవితకథ ఈ గ్రంథం. ఈ పదవీ, ఈ ప్రాధాన్యమూ చేరుకోవడానికి పూర్వం ఎంతో చరిత్ర ఉన్నది. అది మూడుతరాల నవభారత చరిత్ర. కొంత సమరచరిత్ర, కొంత సాధనచరిత్ర, కొంత ఫలసాయపు చరిత్ర. దీక్ష, త్యాగం-ఇందులో ముఖ్యవిషయాలు.

ఆ సంగతులన్నీ ఆకర్షణీయంగా, విపులంగా వర్ణించినాడు—తన ఇంగ్లీషు గ్రంథంలో - సుప్రసిద్ధ రచయిత శ్రీ ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్. మన రచనా సంప్రదాయం, పాశ్చాత్య రచనా విధానం వేరువేరు. సత్యం అంటే వారికున్నంత గౌరవం మనకూ ఉన్నది. కాని వాస్తవికతలో సభ్యత, ఔచిత్యం పాటిస్తారు మనవారు. ఆ రీతి గమనించినాడు అబ్బాస్. పాశ్చాత్య పద్ధతిలో ఉన్న ఒకమంచికూడా గ్రంథకర్త స్వీకరించినాడు. అతిశయోక్తులు విడిచిపెట్టినాడు.

ఈ సుగుణములవల్ల ఈ గ్రంథం ఉత్తమ శ్రేణిలో చేరుతున్నది.

ఇందిరాజీ తరుచుగా అంటూ వుంటుంది— "నేను ఇద్దరు పిల్లల తల్లిని; ఆ కష్టసుఖాలు నాకు తెలుసును," అని. మనకు స్త్రీ మాతృమూర్తి. తల్లిగాకూడా ఇందిరాజీ చిత్రం మనకు ప్రసాదించినట్లైతే ఈ జీవితచరిత్ర ఇంకా రాణించేదేమో అనిపిస్తుంది.

ఈ ఉత్తమ గ్రంథాన్ని తెలుగులోకి అనువదించి ప్రకటిస్తున్నారు యం. శేషాచలం అండ్ కో వారు. వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. శేషాచలం కంపెనీవారు నలభై సంవత్సరాలకుపైగా భాషాసేవ చేస్తున్నారు. ఇంకా చెయ్యగలరని నమ్ముతున్నాను.

తెనుగు సేత సరళమైన భాషలో ఉన్నది. సులభంగా అందరికీ అర్థం అవుతుంది. యువతీ యువకులేకాక పెద్దలుకూడా ఈ పుస్తకం చదివి సమకాలిక చరిత్ర తెలుసుకొందురు గాక!

హైదరాబాదు

కాసు బ్రహ్మానంద రెడ్డి
[ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి]

# భూమిక

"నామట్టుకు నేను అబల నని అనుకోవడంలేదు. ఒకానొక నిర్దిష్ట మైన కార్యాన్ని నిర్వర్తించవలసిన వ్యక్తిగా భావిస్తున్నాను."

అని, 1966 జనవరి 19-వ తేదీన, కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీనాయకురాలుగా ఎన్నికైనవెంటనే ఏర్పాటైన పత్రికాప్రతినిధుల సమావేశంలో శ్రీమతి ఇందిరాగాంధి అన్నారు.

సాధారణంగా, ప్రజల్లోకూడా, ఎక్కువమంది ఆమెను 'సబల' గానే భావిస్తారు. చరిత్రపుటలను తిరగవేసినప్పుడు షెబా రాణి, క్లియోపాట్రా మొదలు రెండవ ఎలిజబెత్ వరకూ అనేకమంది మహిళలు సింహాసనాసీనలై రాజ్యపరిపాలన నిర్వహించినట్లు విదితమవుతుంది. అయితే, ప్రజాస్వామిక వ్యవస్థలో, ప్రజాస్వామిక పద్ధతిన ఒకానొక మహిళామణి సమున్నత రాజకీయాధికారపీఠాన్ని అలంకరించే అత్యున్నత స్థితికి చేరుకోగలగడం ఇప్పటికీ- ఈ మానవప్రపంచంలో - అసాధారణంగానే ఉన్నది. భారతదేశపు ప్రధానిని గురించి, ఆమె వ్యక్తిత్వాన్ని గురించి, ఆమె విశ్వాసాలనుగురించి, ప్రధానిపదవికి ఎన్నుకోవడానికి కారణభూతమైన ఆమె యోగ్యతలనుగురించి, ఆమె పొందిన జయాపజయాలూ, అందుకు లభించిన అవకాశాలను గురించీ దేశదేశాల ప్రజలూ తెలుసుకోవా లనుకోవడంలో ఆశ్చర్య మేమీ లేదు. అంతదాకా పోనవసరం లేదు - భారతప్రజానీకం ఆమెపట్ల అనన్యమైన భక్తివిశ్వాసాలను ప్రదర్శిస్తున్నారు. చాలామందికి ఆమె జవహర్లాల్‌నెహ్రూ కూతురుగానే తెలుసు. ఆమెను గురించి చాలా తెలుసుకోవా లనీ, తెలుసుకొందామనీ ఇప్పుడు అనుకొంటున్నారు.

నే నీ గ్రంథంలో ఇందిరాగాంధిని పరిచయం చేయదలుచుకొన్నాను. ఆమె వ్యక్తిగతజీవితంలోని జయాపజయాలను, అదృష్ట

దురదృష్టాలను ప్రస్తావించ దలుచుకోలేదు. భారతదేశంలోనూ, ప్రపంచంలోనూ క్రమానుగతంగా వచ్చిన విప్లవాత్మకమైన అభివృద్ధి, ఆయా సందర్భాలలో ఆమెను ప్రభావితం చేసిన సంఘటనలు, ఆమెను తీర్చిదిద్ది వ్యక్తిత్వాన్ని రూపొందింపజేసిన సంఘటనలూ తీసుకొని ఆమెను పరిచయం చేయదలిచాను. ఇది ఇందిర జీవితగాథమాత్రమే కాదు; ఆమె జనకుడు, మిత్రుడు, వేదాంతి, మార్గదర్శకుడూ అయిన జవహర్లాల్ నెహ్రూ గాథకూడా. నెహ్రూప్రభావం లక్షలాది భారతయువకుల భావాలమీదా, ప్రవర్తనలమీదా ప్రసరించింది. అలాగే ఇందిరాగాంధి కూడా ప్రభావితురా లయింది. ఇందిరగాథ భారతజనతాగాథ. 'ఏ వ్యక్తీ వంటరివాడు కాదు'. సమాజంలోని ప్రజల సమష్టి జీవనసంగ్రామంలో ఆలోచనల్లో, వ్యక్తి, తప్పనిసరిగా భాగస్వామి. వ్యష్టిప్రభావం వ్యక్తి మీద ప్రసరించితీరుతుంది. భారతస్వాతంత్ర్యసమరగాథను దృష్టిలో ఉంచుకొన్నప్పుడు, ఉగ్గుపాలతో రాజకీయాలు నేర్చి, ఈనాడు 49 వ పడిలో, 50 కోట్ల భారతప్రజలకు నాయకత్వసారథ్యం వహించిన ఇందిరా ప్రియదర్శిని నెహ్రూ గాంధీ జీవితంలోని విశేషాలను గుర్తించగలం.

ఇందిరాగాంధి ప్రధానిగా ఎన్నికైన తరుణంతో, ప్రచురణకర్తల కోరికమీద ఈ గ్రంథ రచనకు నేను పూనుకున్నాను. అనేక మంది మిత్రుల సహాయసహకారాలు ఉండబట్టే, అతి స్వల్ప వ్యవధిలో —మూడేమూడుమాసాలా పైచిలుకు కాలంలో—పూర్తిచేయగలిగాను. వారందరూ ప్రధానిని గురించి తమకు తెలిసిన సమాచారం అందజేయడమే కాకుండా, ఆమె జీవితచరిత్ర తెలిసినవారి వివరాలనుకూడా అందించి ఎంతగానో తోడుపడ్డారు. ముఖ్యంగా—పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి శ్రీ సత్యనారాయణసిన్హా, సమాచార ప్రసారశాఖల మంత్రి శ్రీ రాజబహదూర్, విదేశ వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ దినేష్‌సింగ్, పార్లమెంటు సభ్యులైన శ్రీమతి సుభద్రాజోషి, బీగం అనిస్ కిద్వాయ్, సమాచార ప్రసారశాఖ సంయుక్త కార్యదర్శి బి. డి. భగత్, ఇందిరకు చదువుచెప్పిన శ్రీమతి కున్వార్ బాయి వకీల్, తమ శాంతినికేతనం ముచ్చటలు తెలియజేసిన శ్రీ క్షితీశ్ రాయ్, శ్రీ కృష్ణ కృపలాని, శ్రీమతి

అశోకసిన్హా, 'బ్లిట్జ్' సంపాదకుడు రూసీ కరంజియా, 'ఫారిన్ ఎడిటర్' రమేష్ సంఘ్వి, ప్రధానికి సమాచార సలహాదారుడు శ్రీ జార్జి వర్గీస్, ప్రధాని అంతరంగిక కార్యదర్శి శ్రీ యన్. కె. శేషన్, వాషింగ్టన్‌లోని మన దౌత్య కార్యాలయంలో గల ప్రెస్ క్లిప్పింగ్ ఫైళ్ళలో ఉన్న సంక్షిప్త వివరాలను అందజేసిన 'ప్రెస్ ఎటాచి' శ్రీ అకిల్ అహమ్మద్, అమెరికా రాజధానీనగరంలో మన ప్రధాని పర్యటించినప్పుడు 'రన్నింగ్ కామెంటరీ' చెప్పిన శ్రీ జానకీగంజూ, ప్రస్తుతం శాన్‌ఫ్రాన్సిస్కోలో కాన్సల్ జనరల్‌గా ఉన్న, నా చిన్ననాటి మిత్రుడు మహమ్మద్ యూనుస్, లండన్‌లో ఇందిర చదువుకొన్నప్పటి జ్ఞాపకాలను మననం చేసుకొని చెప్పిన శాంతాగాంధి—వీరంతా ఈ పుస్తక రచనలో నాకు తోడుపడ్డారు. అయితే, ఇందిర వ్యక్తిత్వచిత్రణలో నేను ప్రకటించిన అభిప్రాయాలు, చేసిన నిర్ణయాలతో వీరి కేమీ సంబంధం లేదు.

ఇక చివరిమాటగా— నా కృతజ్ఞతలను ఇందిరాగాంధికి చెప్పుకోవలసి ఉన్నది. విశేష కార్యభారంతో ఏమాత్రం తీరిక లేకపోయినప్పటికీ, ఎలాగో తీరికచేసుకొని చాలా ఇంటర్వ్యూలిచ్చి, స్పష్టంగా, హృదయం విప్పి మాట్లాడి తన కాలాన్ని వెచ్చించారు. ఈ గ్రంథరచన విషయమై చివరి ఇంటర్వ్యూ ఆమె నివాసగృహంనుంచి హడావుడిగా (వెళ్ళవలసిన వేగాన్ని మించి) వెళ్ళుతున్నప్పుడు జరిగింది. ప్రధాన మంత్రి చాలా హడావుడిగా ఉన్నారు. అలాగని ఆమెగారే ఒకసారి అన్నారు. ప్రజల ధోరణికూడా అలాగే ఉన్నది.

27, మే, 1966. కె. ఎ. అబ్బాస్.

గమనిక : ఇందులో పేర్కొనబడిన వ్యక్తులు కొందరు ఇప్పు డా పదవులలో లేరు.

—అనువాదకుడు.

# తాజా వార్త

న్యూఢిల్లీ, మార్చి 12 : చరిత్రాత్మక మనదగిన నాలుగే నాలుగు నిమిషాలలో, ఈవేళ, శ్రీమతి ఇందిరాగాంధీ, కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీ నాయకస్థానానికి ఏకగ్రీవంగా, తిరిగి ఎన్నికయ్యారు. ఆ సందర్భంలో చెలరేగిన హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

నూతన మంత్రి మండలిని ఏర్పాటు చేయవలసిందిగా, రాష్ట్రపతి రాధాకృష్ణన్ మధ్యాహ్నం, శ్రీమతి గాంధీని ఆహ్వానించారు,

ప్రధానమంత్రి ప్రాతినిధ్యం వహించే కాంగ్రెస్ పార్టీ ఆదేశాలతో సంబంధం లేకుండా వ్యవహరించే ప్రభుత్వాలు, ఎన్నికలద్వారా, ఆరు రాష్ట్రాలలో ఏర్పాటయ్యాయి. ఈ ఆరురాష్ట్రాలూ చేరిన దేశ పాలనాధికారాలు వహించవలసిన తొలి ప్రధానమంత్రి ఇందిరాగాంధీ. ఇన్నాళ్లూ, పార్లమెంటులో, ప్రతిపక్షాలను చిత్తుచేసేందుకు కాంగ్రెస్‌కు గల సంఖ్యాబలం ఉపయోగపడుతూ వచ్చింది. ఇప్పుడా సంఖ్యాబలం ఎంతగానో తగ్గిపోయింది.

రాజ్యాంగరీత్యా జవహర్‌లాల్‌నెహ్రూకాని, లాల్ బహదూర్‌శాస్త్రికాని ఎదుర్కొన్న సమస్యలకన్నా బహుజటిలమైన గడ్డు సమస్యలను ఆమె ఎదుర్కొనవలసి ఉన్నది. భారతదేశం, మొట్టమొదటిసారిగా, ఫెడరల్ వ్యవస్థకూ, రాష్ట్రాల స్వతంత్ర ప్రతిపత్తి సిద్ధాంతానికీ మధ్య ఉత్పన్నమైన సవాలును ఎదుర్కోవలసి వచ్చింది.

కాంగ్రెసేతర ముఖ్యమంత్రులందరివద్దనుండీ అత్యంత ఆదరపూర్వకమైన అభినందనలు ఆమెకు లభించడాన్నిబట్టి చూస్తే, వారు, ఇంక ఏ ఇతరవ్యక్తినుండికన్నా, ఆమెనుండే సామరస్యమూ, సానుభూతీ ఆశిస్తున్నా రనవచ్చు. చాక చక్యమూ, స్ఫురద్రూపమూ, స్త్రీసహజమైన ముందు చూపూ గల ఇందిర సమైక్యతాసాధనకు బాగా తోడ్పడవచ్చును. ఉమ్మడి కుటుంబం అన్నది భారతదేశంలో అనాదిగా వస్తున్న ఒకానొక వ్యవస్థ. దానిలో ప్రతిస్పర్ధులైన సభ్యులందరినీ కలిపి ఉంచ డానికి ఒక స్త్రీ అవసరం. భారతమాత అనగానే మనకంటికి గోచరించే కరుణాస్వరూపిణిగా ఆమె పరిణతిచెందగలదా ?

వచ్చే అయిదు సంవత్సరాలపాటు, ఆమె చర్యలను, భారతదేశం — ఆమాటకొస్తే యావత్ప్రపంచం — కుతూ హలంతో, ఆదుర్దాతో, ఆశతో గమనిస్తూ ఉండగలదు.

కె. ఎ. అబ్బాస్



# అనువాదకుని

## మనవి

ఇందిరాగాంధి చరిత్ర వ్రాయాలన్న సంకల్పం ఈనాటిది కాదు. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షపీఠాన్ని ఆమెగారు అలంక రించినప్పుడే నాకీ అభిప్రాయం కలిగింది. ఆనాటినుండీ, వారికి సంబంధించి పత్రికలలోనూ, పుస్తకాలలోనూ వెలువడిన ప్రతి అంశాన్నీ సేకరించాను.

"A Bunch of Old Letters", "The Discovery of India", "After Nehru Who?" మొదలైన ఆంగ్ల గ్రంథాలు, నెహ్రూ ఆత్మకథ, గాంధీజీ ఆత్మకథ, కాంగ్రెసు చరిత్ర, ప్రపంచ చరిత్ర, ఇందిరకు లేఖలు మొదలైన తెలుగు గ్రంథాలు, ఆమెగారు వివిధ సందర్భాలలో జవహర్‌తోబాటు విదేశాలలో పర్యటించినప్పటి వార్తలూ విశేషాలు, చేసిన ప్రకటనలు, వెలిబుచ్చిన అభిప్రాయాలు—వీటన్నిటినీ సంతరించాను. కొందరు మిత్రులు ఇందిరా గాంధికి సంబంధించి తమవద్ద నున్న సమాచారాన్ని కూడా నాకందించారు.

గ్రంథరచన ఎక్కడనుండి ప్రారంభించాలన్న విచికిత్సతో కొంత కాలం గడిచిపోయింది. భారత స్వాతంత్ర్య పోరాటంలో అనన్యమైన పాత్ర వహించిన నెహ్రూ కుటుంబీకుల చరిత్ర వ్రాయడ మంటే, భారత స్వాతంత్ర్యసమర చరిత్ర వ్రాయడమే అవుతుంది. ఇది విడదీయరాని, విడదీయలేని సంబంధం.

జవహర్ పండితుని వివాహంతో ప్రారంభించి, అప్పటి జాతీయోద్యమాలను, అందులో నెహ్రూవంశీయుల పాత్ర, ఇందిరా ప్రియదర్శిని జననం, విద్యాభ్యాసం, స్వాతంత్ర్య పోరాటాలు, విదేశాలలో పర్యటనలూ వివరిస్తూ, అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షపీఠా న్నలంకరించి, తొలిసారిగా పత్రికాప్రతినిధులతో జరిపిన గోష్ఠితో ఆ గ్రంథాన్ని ముగింపజేదా మనుకొన్నాను. అది పూర్వభాగం—ఆ దరిమిలా జరిగిన సంఘటనలను ఆధారంచేసుకొని ఉత్తర భాగం వ్రాసి, ప్రకటిద్దా మనుకొన్నాను. ఈ రెండు భాగాలనూ జవహర్ పండితునకు అంకితం చేయడం సముచితంగా ఉంటుం దనీ అనుకొన్నాను. చాలావరకు తొలిభాగం వ్రాశాను. ఇంతలో పిడుగువంటి వార్త వినవచ్చింది. జవహర్ మరణంతో, మరింక, వారినిగురించి కలం కదపలేకపోయాను. ఇందిర చరిత్ర వ్రాయాలన్న నా కోరిక కోరికగానే ఉండిపోయింది.

ప్రఖ్యాత రచయిత క్వాజా అహమ్మద్ అబ్బాస్ 'ఇందిరా గాంధి' అన్న పుస్తకం వ్రాశారని మిత్రులు శ్రీ యం. యన్. రావుగారు ఆమధ్య తెలియజేశారు. దానిని తెలుగులో ప్రచురించాలనుకొంటున్నట్లు కూడా వా రన్నారు. "దీనిని మీచేత అనువదింపజేద్దా మనుకొంటున్నాను" అన్నారు వారు. "మహాభాగ్యం!"—అంటూ అంగీకరించాను.

నా చిరకాల స్వప్నం ఈ రూపంలో యథార్థ మవుతున్నందుకు ఎంతో సంతసించాను.

వాడీ, వేడీ ఉన్న లేఖిని అబ్బాస్ గారిది. ఝురీసదృశమైన శైలి. తాము చెప్పదలచిన విషయాన్ని సూటిగా, పదునుగా చెప్పడంలో వారికి వారే సాటి. మూల రచనలోని ఆవేశాన్ని, అంద చందాలను, సాధ్యమైనంతవరకు తెలుగులోనికి తీసుకురావడానికి

ప్రయత్నించాను. ఈ సందర్భంలో, అనుభవజ్ఞులైన మిత్రుల సహకారాన్ని, సలహాలను కూడా పొందాను.

1966 ఆగస్టు 15 వ తేదీన అనువాదాన్ని ప్రారంభించి, 1967 మార్చి 12 వ తేదీనాటికి ముగించాను. ఆరోజునే ఇందిరా గాంధీగారు కాంగ్రెసు పార్లమెంటరీపార్టీకి నాయకురాలుగా రెండవసారి ఎన్నికైనారు.

ఇది దైవికంగా జరిగింది!

మూలరచయిత తమ గ్రంథాన్ని జవహర్ పండితునకు అంకితం చేశారు. నేనుకూడా ఈ అనువాదాన్ని, ఆ మహానాయకునికే అంకితం చేస్తున్నాను.

'పద్మాలయ'
హైదరాబాదు-28.

రావూరి భరద్వాజ

# విషయానుక్రమణిక

# చిత్రానుక్రమణిక



# 1

# మధ్యప్రాంగణమందలి నాటకం



నడిపించే నాయకూడా!
జాగ్రత!
అజ్ఞానాంధతను క్షమించగలం
కాని,
నికృష్టతనుమాత్రం సంహరింపకపోము!

—విలియం వామ్ మూడీ.

హృదయాన్ని స్పందింపజేసే దృశ్యాలనూ, చరిత్రను సృష్టించిన ఘట్టాలనూ ఎన్నిటినో తిలకించింది క్రొత్తఢిల్లీలోని పార్లమెంటుభవనంలోని సెంట్రల్ హాల్ (మధ్యప్రాంగణం), అన్నిటిని అది సాక్షిగా అవలోకించింది.

1929 వ సంవత్సరం....

ఏప్రిల్ 8 వ తేదీ....

నాడు ఈ భవనాన్ని ఆనుకొనిఉన్న అసెంబ్లీమందిరంలో వైస్రాయికౌన్సిల్ సభ్యులు—ఇంగ్లీషువారు,కొద్దిమంది భారతీయులు—ఆసీనులై ఉన్నారు. ఆసమయము లోనే ఆ ట్రెజరీబెంచీలమీదికి ఒక బాంబు వచ్చిపడింది. దాన్ని విసిరినవారు వీరవిప్లవ యువకులు భగత్‌సింగ్, బటుకేశ్వరదత్‌లు. ఆ యువకు లిద్దరినీ నిర్బంధించి ఈ సెంట్రల్‌హాల్‌లోంచి తీసుకువస్తూంటే—"వారిని చంపడం మా ఉద్దేశ్యంకాదు. అధి కారబధిరకర్ణాలకు శ్రవణశక్తి కలిగించడమే మా లక్ష్యం" అన్నాడు భగత్‌సింగ్. విజ మంతే! రాజకీయనాయకుల వందలాది ప్రసంగాలకంటె ఈ ఒక్క సంఘటనే ఎంతో శక్తివంతంగా భారతీయుల స్వేచ్ఛాస్వాతంత్ర్య సంకల్పాన్ని వ్యక్తం చేసింది.

నాడు ప్రేల్చిన ఆ బాంబు—ఆ అసెంబ్లీమందిరాన్నేనా కదిపి కుదిపేస్త! కాదు, బ్రిటిష్ సామ్రాజ్యాన్నే క్రక్కదలజేసింది.

భగత్‌సింగ్‌చేతిబాంబు ప్రేలిన క్షణంలో, అక్కడి యింగ్లీషువారిలో కొందరు బల్లలకింద దూరి తలదాచుకుంటే, ఆ పొగల మధ్య నుంచి పరుగెత్తుకుంటూ పోయి సీక్ళగదిలో తలుపు బిగించుకున్న ధైర్యవంతుడు ఒక దుండకపోతాడా! అక్కడి భారతీయులలో కూడా నరాలపట్టు తప్పినవారే అందరూ! అయితే అంతటి విపరీత విషమ ఉద్రిక్తసన్నివేశంలోనూ అచంచలంగా ఉన్న వ్యక్తి ఒకడే ఒకడు. ఆయనే ఆసభలో ప్రతిపక్షనాయకుడు! ఎవ రాయన?

ఆయన మోతీలాల్ నెహ్రూ....ఇందిరాగాంధి తాతగారు; జవహర్‌లాల్ నెహ్రూను కన్న తండ్రి. ఈనాడు ఆ సెంట్రల్‌హాల్ గోడలపై అలంకృతాలయిన భారతస్వాతంత్ర్యయోధుల చిత్రాలలో ఆయన వర్ణచిత్రం రోమక ఘరానా దొరను (Roman Patrician) ను మనకు స్ఫురణకు తెస్తుంది.

రోజులు గడిచిపోయాయి....

తిరిగి....

ఆగస్టు 14-15 అర్ధరాత్రి.

అదే సెంట్రల్‌హాల్‌లో, ఆఖరి బ్రిటిష్‌వైస్రాయ్ సమక్షంలో భారతదేశం స్వతంత్రదేశంగా ప్రకటితమైనక్షణంలో—జవహర్‌లాల్‌నెహ్రూ తన చరిత్రాత్మకప్రసంగాన్ని—'చాలాఏళ్ళక్రితం మనం ఒకలక్ష్యంతో తీసుకొన్న ఉద్యమశపథాన్ని ఈనాడు మరోమారు పునశ్చరణ చేసుకోవాలి' అని ప్రారంభించారు. నరాలు పొంగించే ఆ మాటలు నేటికీ ఆ సెంట్రల్‌హాల్ గోడలమధ్య ప్రతిధ్వనిస్తూంటాయి!

> అర్ధరాత్రి గంట ఠంగున మ్రోగీ మ్రోగగానే ప్రపంచం నిద్రాముద్రలో ఉండగా భారతదేశం చైతన్య, స్వాతంత్ర్యాలతో మేల్కొంటున్నది. ఒక ఘడియ—చరిత్రలో ఎప్పుడో కాని రాని ఘడియ; పాత పుంతలు విడిచి కొత్తదారుల్లో నడిచే ఘడియ; చిరకాలంగా అణచివేయబడిన ఒక జాతి ఆత్మ గొంతు విప్పుకొని నూతనోత్తేజంతో నవయుగానికి నాంది పలికే ఘడియ రానున్నది.

పదిహేడేళ్ళ అనంతరం—

1964 జూన్ 2 వ తేదీ...

అదే సెంట్రల్‌హాల్...

"నెహ్రూతరువాత ఎవరు?" అని ప్రపంచమంతా ఘోషిస్తున్న సవాల్‌కు సమాధాన మిచ్చింది. నిస్వార్థపరుడూ, నిరాడంబరమూర్తి అయిన లాల్‌బహదూర్ శాస్త్రిని

కాంగ్రెసుపార్లమెంటరీపార్టీ ఏకగ్రీవంగా ఎన్నుకోవడమూ, తద్వారా ఆయన జవహర్‌లాల్‌నెహ్రూ అనంతరం ప్రధానికావడమూ జరిగిన రోజది.

తిరిగి,

1966 జనవరి 19 వ తేదీన దేశీయ, విదేశీయప్రజల దృష్టి మరోమారు సెంట్రల్‌హాల్‌వైపు కేంద్రీకృతమయింది. 19 మాసాల వ్యవధిలోనే కాంగ్రెసు పార్లమెంటుసభ్యులందరూ నాయకుని ఎన్నికకోసం అక్కడ సమావేశమయారు. అవ్యక్తే జాతిప్రధానమంత్రిత్వ బాధ్యతకూడా నిర్వహించాలి. అయితే ఈసారి ఏకగ్రీవనిర్ణయం లేకపోవడంవల్ల వాతావరణమంతా ఎన్నికసంరంభంతో నిండింది. ఈ ఎన్నికరూపకంతో ప్రత్యక్షసంబంధంకలవారు పార్లమెంటు ఉభయసభలకు చెందిన 526 మంది సభ్యులు. వీరిలో కొందరు ఎన్నికలలో పోటీచేసి వచ్చినవారు; మరి కొందరు పరోక్షంగా జరిగిన ఎన్నికలలో నెగ్గినవారు. చరిత్రలో నూతనాధ్యాయాన్ని సృష్టించిన తాష్కెంట్ ఒడంబడికపై చేసిన సంతకాల తడి ఆరకుండానే లాల్‌బహదూర్‌శాస్త్రి కన్నుమూసి సరిగ్గా తొమ్మిదిరోజులయింది. ఈ తొమ్మిదిరోజులుగా లాల్‌బహదూర్‌స్థానాన్ని భర్తీచేసేవారి విషయమై దేశమంతా చర్చలు సాగుతూనే ఉన్నాయి.

అమెరికాలో అధ్యక్షుని ఎన్నుకునేటట్లు మన ప్రధాని ఎన్నికలో దేశప్రజలందరూ పాల్గొనరు. అయినా దేశం నలుమూలలా ఆందోళన, ఆతురత, భయం, ఏం జరుగుతుందో అనే ఆదుర్దా, అన్నిటినీ మించి ఒక ఆశారేఖ ద్యోతకమయాయి. రాజకీయజ్ఞులా, సంఘసేవాపరాయణులా నివాసమందిరాలలోనేకాక, కాలేజీల్లో, విశ్వవిద్యాలయాల్లో, వ్యాపారకేంద్రాల్లో, ప్రభుత్వకార్యాలయాల్లో, తమతమ పనుల కోసం వెళ్లే ప్రయాణీకులతో క్రిక్కిరిసిన రైళ్ళలో, బస్సుల్లో, మారుమూల గ్రామాల లోని రచ్చసావిళ్ళలో, సామాజిక రేడియోసెట్లముందు సమావేశమయిన ప్రజలలో— ఎక్కడా యిదే చర్చ!

తెల్లవారేసరికి ఆవురావురుమంటూ దినపత్రికలకోసం ఎగబడి, ఆ పత్రికలు తమలో తాము చదువుకొని తృప్తిపడేవారు కారు; గట్టిగా పైకి చదివి నలుగురి ముఖాల్లోకీ చూసేవారు. ప్రతిపదాన్నీ చదివి అంతరార్థం గ్రహించడానికి తాపత్రయపడ్డారు. ఆయా పత్రిక ప్రత్యేక విలేఖరుల—సర్వజ్ఞులయిన విలేఖరుల—కథనాలపై వ్యాఖ్యానాలు చేసేవారు. అందులో తమకు నచ్చినవాటిని అభినందించడం, లేని వాటిని తెగనాడి ఖండించడం జరిగింది. ఆకాశంలోకి తారాజువ్వల్లా కొన్ని కొన్ని పేర్లు వినిపించి మరుక్షణంలోనే మటుమాయమయేవి. తాత్కాలిక ప్రధానిపదవి నిర్వహిస్తున్న గుల్జారీలాల్ నందా పేరుకూడా వినిపించింది. అయితే ఆయన వామపక్షాభిమాని అయిన కారణంగా ప్రజల వర్గాలవారికి కొందరి కాయనపై విశ్వాసం లేదని తేలడంతో ఆయనపేరు అదృశ్యమయింది. తరువాయి, రైల్వేమంత్రి ఎస్.కె.పాటిల్

పేరు వినిపించింది. అమెరికా విలేఖరులందరూ ఎంతో ఉత్సాహంతో ఈయన ప్రధాని కాగల అవకాశాలను అధికంగా చర్చించారు. అయితే ఆయనరైలూ పట్టాలు తప్పింది. దీనికి కారకులు, బహుశా, కాంగ్రెస్ ప్రెసిడెంట్ కామరాజ్. రెండు మూడు రోజులపాటు యశ్వంతరావ్ చౌహాన్ పేరుకూడా మోగింది. మహారాష్ట్ర ముఖ్య మంత్రిగా, కేంద్రరక్షణమంత్రిగా ఆయనప్రతిష్ఠ బాగా పెరిగింది. అందులో ముఖ్య ముగా మొన్న మొన్ననే పాకిస్థాన్‌తో జరిగిన సంగ్రామంలో భారత సైనిక, వైమానికదళాల విజృంభణలు ఆయన కీర్తిప్రతిష్ఠలను యినుమడింపజేశాయి. అయినా ఆయన వయస్సు, భారత రాజకీయరంగంలో ప్రవేశించి కొద్దికాలమే కావడమూ ఆయ నకు ప్రతిబంధకా లయాయి. ఆ తరువాయి - కాంగ్రెస్ ప్రెసిడెంట్ కామరాజ్‌ను నిల బెట్టడానికి తీవ్రప్రయత్నాలే జరిగాయి. అయితే ఈ యత్నం కేవలం అనాసక్తంగా జరిగింది కాదు. ఆయన అంగీకరించి ఉంటే పోటీలేకుండా ఎన్నిక జరిగి ఉండేదేమో! స్వయంకృషితో పైకి వచ్చిన—తన మాతృభాష తమిళంతప్ప హిందీ, ఇంగ్లీషు భాషలు మాట్లాడడం రాని కామరాజ్‌ను వీరు తమ ప్రయత్నానికి సుముఖం చేసుకో లేకపోయారు. ఆయన తెరవెనుక ఉండి అధినేతనిర్ణాయకుడుగానే ఉండిపోదలిచాడు! అప్పుడే తన మొగ్గుదలను ఆయన ఇందిరాగాంధివైపు సూచించాడు. అప్పటికే ఇందిరాగాంధి - జవహర్‌లాల్‌నెహ్రూ కుమార్తె - శాస్త్రి మంత్రివర్గంలో సమాచార శాఖమంత్రిగా ఉన్నారు.

ఆమెఅభ్యర్థిత్వాన్ని చాలారాష్ట్రాల ముఖ్యమంత్రులు అదివరకే అంగీక రించారు.

ఆమెనాయకత్వం అందరికీ అభిలషణీయమే అయినా కామరాజ్ ఆ సూచన చేసేవరకూ ఎవరూ ఆ పేరును గురించి అంతగా ప్రచారంచెయ్యలేదు. ఆయన సూచించడంతో సర్వేసర్వత్రా హర్షామోదాలు వ్యక్తమయాయి. అటు వామపక్షాభి మానినో, యిటు తద్భిన్నులయిన దక్షిణవర్గీయునో ఎన్నుకోవలసిన ప్రమాదం నివారించదలచినవారికి ఈ సూచన చక్కని పరిష్కారంగా గోచరించింది. కాంగ్రెస్ పార్లమెంటరీపార్టీసభ్యులలోని అధికసంఖ్యాకులతోపాటు, అశేషప్రజకు అత్యంత ప్రియతముడయిన జవహర్‌లాల్‌నెహ్రూ రాజకీయవారసురాలుగా కూడా ఆమె నాయ కత్వం అందరికీ ఆమోదయోగ్యం కాగల దని భావించారు. ఎదురునిలిచిన మహిళా ప్రత్యర్థికి అవకాశం విడువలేని మొరార్జీ ఉద్దండవ్యక్తిత్వం కామరాజ్‌కు సమస్య అయింది. కాంగ్రెస్ ప్రెసిడెంట్ సూచించిన అభ్యర్థితో పోటీచెయ్యడానికి తన స్థిర సంకల్పాన్ని వ్యక్తంచేస్తూ ఆయన చాలా తీవ్రప్రచారం సాగించాడు. అందులో స్వోత్కర్ష పరువులు తీసింది. ఈసందర్భంలో ఆయన పత్రికాప్రకటనలే కాదు, స్వయంగా ఉత్తరాలు కూడా వదిలారు. అంతతో ఆగలేదు. పరంపరగా టెలిఫోన్ సందేశాలూ సాగాయి.

ఈ సందర్భంలో ఏం తేలిందంటే మొరార్జీదేశాయ్ ఆశయాలూ, ఆదర్శాలూ కల వ్యక్తిమాత్రమే కాదనీ, అవి సంఘవిద్రోహాలయినా సరే ఆయన విడనాడడనీ, ఆయన అప్పుడప్పుడు చెప్పుకునే విధంగా, తాను ఏకైకంగా ఈ సంగ్రామం సాగించడం లేదనీ, ఆయనవెనుక ఏవేవో రాజకీయ, సాంఘిక, ఆర్థిక శక్తులు బలిష్ఠమైన తమ ప్రయోజనాలకోసం చేరి ఉన్నాయనీ, ఈ అన్నిటికీ ఆయన ప్రాతినిధ్యం వహిస్తాడనీ స్పష్టమయింది.

1966 జనవరి 19 వ తేదీ ఉదయం సెంట్రల్‌హాల్‌లో మరో నూతన రూపకానికి తెరయెత్తారు. మొరార్జీకి ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించే అందరి ఆశయాలూ, వాంఛలూ అక్కడ గోచరిస్తున్నాయి. ఇన్నిటినీ మించి దేశ భవిష్యత్తును తీర్చిదిద్దే బాధ్యత దైవం తన భుజస్కంధాలమీదనే ఉంచాడనే మొరార్జీ భావం కూడా అక్కడ దృగ్గోచరమయింది. ప్రధానమంత్రిత్వానికి తనకు గల హక్కును నిరూపించుకోవడంలో ఆయన ఎటువంటి నమ్రతలకూ తావివ్వలేదు.

దైవనిర్ణయ మనే ఆవేశం ఒక్కటే కాదు, బలవత్తరమయిన రాజకీయశక్తుల ప్రభావంకూడా నాడు మొరార్జీని ముందుకు నడిపించింది. జవహర్‌లాల్ నెహ్రూ హయాంలోనే మొరార్జీదేశాయ్‌ని వీరు తమ ప్రతినిధిగా భావించారు. మిత్రద్రోహంతో చైనా భారతదేశంపై వెన్నుపోటుపొడిచినపుడు, శాంతిప్రియుడయిన నెహ్రూ నిరాశా నిస్పృహాలని చూసి ఆయన శత్రువులు పరిహసిస్తున్నప్పుడు దేశంలోనూ, విదేశాలలోనూకూడా ప్రముఖులైనవారు నెహ్రూ సుకుమారహస్తాలలోంచి నాయకత్వాన్ని మొరార్జీవంటి 'ఉక్కుమనిషికి' కట్టబెట్టాలనే ఊహలు రేగాయి కాని, వారి దురదృష్టంకొద్దీ, శాంతికాముకుడైన నెహ్రూ ఆ విషమఘట్టంలో పట్టుగా నిలిచి దేశప్రజలందర్నీ సమీకరించి శత్రువులను ఎదుర్కొన్నాడు. అంతలో ఈ 'ఉక్కుమనిషి' కాళ్ళూ చేతులు చల్లబడ్డాయి.

నెహ్రూ అస్తమయానికి సంవత్సరంముందు అమెరికా విలేఖరి వెలెస్ హెంగెన్ ప్రచురించిన 'నెహ్రూ అనంతరం?' అనే గ్రంథంలో మొరార్జీయే ఆస్థానానికి అర్హుడని పేర్కొన్నాడు:

> "న్యూఢిల్లీలో నన్ను తెల్లవారుఝామునే లేపి, 'నెహ్రూ అనంతరం ప్రధాని అయేందుకు ఎక్కువ అవకాశంకల వ్యక్తి ఎవరు?చూడు' అనిఅంటే, వెల్లింగ్టన్ క్రిసెంట్‌రోడ్డులోని మొదటి యింట్లో అడుగుపెడతాను. నే నన్వేషించే వ్యక్తి అక్కడ తన శయనంమీద యోగాసనాలతో సాక్షాత్కరిస్తాడు. దేశ ఆర్థిక సుస్థిరత్వానికి, దుఃఖవిమోచనానికి నడుంకట్టిన పవిత్రప్రవక్త మొరార్జీ దేశాయ్, తన నూతన కార్యరంగ పదక్షేపానికి సన్నాహాలు చేస్తుంటాడు.

# 6

తన కీ 'పవిత్రాచార ప్రవక్త' పట్ల అటువంటి భావం ఎందుకు కలిగిందో వివరిస్తూ ఆ అమెరికన్ రచయిత "పూర్వసంప్రదాయప్రియులందరూ మొరార్జీనే అభిలషిస్తారు. మొరార్జీ ప్రధాని అయితే ప్రైవేటురంగానికి తగినంత అవకాశం యిస్తాడు. విదేశీవ్యక్తుల పెట్టుబడులనుకూడా ఆయన భారతదేశంలో ఎక్కువగా ప్రోత్సహిస్తాడు. ప్రైవేట్‌రంగంపై నెహ్రూకుగల సందేహాలు కాని, లాభదృష్టిపై ఆయనకున్న జుగుప్సకానీ మొరార్జీలో లేవు...సమాజంలో విప్లవంద్వారా పరిణామం తీసుకురావాలనే ధోరణిని ఆయన ఎంతమాత్రం సహించడు...." అన్నాడు.

భారతీయ జనతకే కాని, ఆఖరికి కాంగ్రెస్‌పార్టీకి కాని ఈ అమెరికన్ రచయిత భావాలతో ఏకీభావం లేదు. అందుచేతనే, నెహ్రూ అస్తమించిన అనంతరం పవిత్రాచార ప్రవక్తనూ, లాభదృష్టిపరునీ విడిచి నిరాడంబరుడు, సాత్వికస్వభావుడూ అయిన లాల్‌బహదూర్‌శాస్త్రిని ఎన్నుకున్నారు. నెహ్రూ భౌతికావశేషాలకు అంత్యక్రియలు జరగకముందే మొరార్జీ తన అభ్యర్థిత్వాన్ని ప్రకటించుకున్నాడు. కాని, కామరాజ్ రూపొందించిన 'అత్యధిక సంఖ్యాకుల అభిప్రాయం' అనే నూతన విధానంవల్ల మొరార్జీవర్గీయుల ఆటలు సాగలేదు. పర్యవసానంగా లాల్‌బహదూర్‌శాస్త్రి ఎన్నిక ఏకగ్రీవంగా జరిగింది. మళ్ళీ 19 నెలల అనంతరం—

అత్యధికసంఖ్యాకుల అభిప్రాయ విధానాన్ని సవాల్‌చేసి మొరార్జీ రహస్యపద్ధతిని ఓటింగు జరిగితీరాలని పట్టుపట్టాడు.

ఈ ఎన్నిక కేవలం వ్యక్తిగతప్రాతిపదికపై జరిగింది కాదు. అభ్యర్థు లుభయులూ పరస్పరవిరుద్ధ ప్రకృతి కలవారు. ఇందిర నాగరకురాలు, ఉన్నత విద్యావతి, ఉదారస్వభావురాలు. మానవత విలువల నెరిగిన వ్యక్తి, విచక్షణజ్ఞానం కలది. ఇన్నిటినీ మించి నెహ్రూ ప్రసాదించిన సామ్యవాదాన్నీ, మతప్రాధాన్యంలేని లౌకికరాజ్యాంగాన్నీ, అలీనవిధానాన్నీ యథాక్షరంగా అమలుజరపడానికి దీక్షాకంకణం ధరించిన వ్యక్తి. ఇక మొరార్జీ? ఈ 20 వ శతాబ్దానికి ఈషణ్మాత్రం కుదరని పూర్వాచార పునరుద్ధరణతత్వం జీర్ణించిన వ్యక్తి.

ఈ ఎన్నికలో వర్గప్రయోజనాలు బహుముఖాలుగా ప్రతిబింబించాయి.

లాల్‌బహదూర్‌శాస్త్రి అస్తమయవార్త వెలువడింది. ఆ ఉదయమే బొంబాయి నుంచి వెలువడే ఒక పత్రికలో, దాని విలేఖరి కథనంకూడా ప్రచురితమయింది. ఆ సందర్భంగా ఆ విలేఖరి కలిసిన వ్యక్తు లందరూ మొరార్జీనే అనంతర ప్రధానిగా పేర్కొన్నట్లు స్పష్టంగా ప్రకటించాడు. మరొకపత్రం మొదటి పేజీలోనే అచ్చొత్తిన సంపాదకీయంలో భారతదేశం తన ప్రధానిగా ఒక మహిళను ఎన్నుకోబోయే ముందు సిరిమావో బండారనాయకేను ఎన్నుకొన్న సింహళాన్ని దృష్టిలో ఉంచుకోవడం అవసరం అని హెచ్చరించింది. బొంబాయి షేర్‌మార్కెట్ అంతటా మొరార్జీపేరు ప్రతి

ధ్వనించింది. ఇందిరాగాంధీ ప్రధాని కావడానికి గల అవకాశాలకు హర్షం తెలుపుతూ భారత కమ్యూనిస్టుపార్టీ అధ్యక్షుడు యస్. ఎ. డాంగే కొంచెం తొందరపాటుతో, ముందుచూపు లేకుండా ఒక ప్రకటన చేశాడు. ఉత్తరక్షణంలోనే పార్లమెంటులోని స్వతంత్ర, జనసంఘాలకు చెందిన ఏడుగురు సభ్యులు ఈ ప్రకటనను ఖండిస్తూ "రేపు బుధవారం జరిగే ఎన్నికలలో పాల్గొనే సభ్యులు మనదేశంలో వంశ పారంపర్యాధికార విధానాన్ని కాని, వర్గపాలనారీతిని కాని అనుద్దేశపూర్వకంగా అయినా నెలకొల్పరాదు" అని హెచ్చరించారు. అంటే "మొరార్జీనే ఎన్నుకోండి, ఇందిరాగాంధీని గెలిపించకండి" అనే కదా తాత్పర్యం!

మరునాడు సరిగా పది గంటలా నలభై అయిదు నిమిషాలకు జరిగే చరిత్రాత్మకమయిన ఎన్నికఘట్టానికి రాబోయేముందు—ఆ ఉదయం తన అనుభవాలూ, జ్ఞాపకాలు నెమరువేసుకుంటూనే గడిపింది. మంచుతెరలలో యమునా తరంగాలు దోబూచులాడుతూనే వున్నాయి. అటువంటి ఉదయవేళ, ఆమె, ఆ నదివొడ్డున ఉన్న మహాత్మాజీ సమాధి రాజఘాట్‌కి చేరింది. ఎందరో భారతీయులు విషమ సన్నివేశాలలో సందర్శించి ఆశ్వాసనపొందే పవిత్రస్థలం ఆ సమాధిప్రాంతం. కాని, ఇందిరకు మాత్రం అత్యంతాత్మీయమైన భావసంచలనం కలిగించే వ్యక్తి ఆయన. ఆ నీరవ తుషారాచ్ఛాదితస్థలంలో నిలబడ్డ యిందిర మనసులో బాపూజీ సన్నిధానంలో గడిచిన చిన్ననాటి స్మృతు లెన్నో కదలివుంటాయి. తండ్రియైన జవహర్‌లాల్‌ను మించిన పితృవాత్సల్యం ఆమెకు బాపూజీవగ్గర లభించేది. ఎప్పుడూ నీరసంగా, బక్కచిక్కినట్లుండే తనను చూసి ఆందోళనపడే బాపూజీ ఆర్ద్రహృదయంకూడా సోకి ఒక విషాదస్మితమూ ఆ సమయంలో ఆమెపెదవులపై ఆడివుండవచ్చు.

కారాగారంలో ఉన్నా, బైట ఉన్నా మహాత్మాజీ ఎప్పుడూ పసిపాప యిందూని మరిచిపోయేవారు కారు. జవహర్‌కు రాసే రాజకీయ విషమ సమస్యలకు సంబంధించిన లేఖలలో సైతం ఆయన తాజాకలం ఇందిర యోగక్షేమాలు విచారించకుండా ఉండేది కాదు. ఎరవాడజైలులో ఉండగా ఆయనను చూడవచ్చిన ఇందిరను గురించి జవహర్‌లాల్‌కు తంతివార్త పంపుతూ, "ఇందిరను చూశాను. చాలా కులాసాగా, నవ్వుతూ ఉంది. కొంచెం ఒళ్ళుచేసినట్టే వుంది. నేను కుశలం" అని వ్రాశాడు. ఈ తంతిని తన కూతురుకి చూపించి జవహర్‌లాల్ విరగబడి నవ్వాడు.

అక్కడ నిలబడి ఆ సమాధుల పరిసరాలలోని నీరవతలోంచి ఏదో శక్తిని ఉచ్ఛ్వసిస్తున్న సమయంలో ఆమె మనసులో యిటువంటి సంఘటనలూ, సన్నివేశాలు ఎన్నో తరలి ఉంటాయి.

రాజఘాట్‌నించి ఆ సమీపంలోనే ఉన్న శాంతివనానికి వెళ్ళింది. అది జవహర్‌లాల్ చిరవిశ్రాంతి తీసుకున్న స్థలం. అక్కడనించి, తన తండ్రితో అనేక సంవత్సరాలపాటు గడపిన 'తీన్‌మూర్తిభవన్' చేరింది. ఆ భవనంలో తన తండ్రి

చిత్రపటంయెదుట మౌనప్రార్థనతో నిలబడింది. ఆబాల్యం తల్లిగా, తండ్రిగా తనను సాకిన పితృదేవునికి ఘటించే శ్రద్ధాంజలి అది. అంతే కాదు; ఆమెకు గురువూ ఆయనే. ఆమె వ్యక్తిత్వానికీ, మనోవికసనానికీ సర్వానికీ ఆయనే ఆలంబం. ఈనాటి ఆమె అభ్యున్నతికి ఏ కళాశాలకానీ, పాఠశాల కానీ కారణంకావు. అన్నిటికీ తండ్రే సాధనం; ఆయన రాసిన ఉత్తరాలే హేతువులు. ఆ లేఖలలో ఆయన ప్రపంచ చరిత్రనూ, మానవశాస్త్రాన్నీ బోధించాడు. అవే 'ప్రపంచదర్శనం' (Glimpses of World History) గా ప్రఖ్యాతమయాయి. ఈ అదృష్టరేఖను జవహర్‌లాల్ ముందే ఊహించాడా అన్నట్లుగా ఎన్నో ఏళ్ళక్రితం ఆమె పుట్టిన రోజునాడు రాసిన లేఖలో—

"ధైర్యం విడనాడకు. అప్పు డన్నీ అవే కలిసొస్తాయి; ధైర్యవంతుల్ని భయం దరిజేరదు. అటువంటప్పుడు సిగ్గుతో తల వంచవలసిన పని లేం చెయ్యవు.

"ఏపనీ చాటుమాటున చెయ్యకు; నిబ్బరంగా, అంతా బహిరంగంగానే చెయ్యి. తేజస్సుతో చేయి కలుపు; అప్పుడేం జరిగినా నువ్వు చలించ నవసరంలేదు. నువ్వొక తేజోమూర్తిగా రూపొందుతావు. ధైర్యసాహసోపేతమయిన వ్యక్తిగా నువ్వు మాతృదేశసేవకురాలివిగా వర్ధిల్లుదువుగాక!"—

అని వ్రాశాడు. భారతేతిహాసంలో ప్రప్రథమంగా పోటీ జరిగిన ఎన్నికలో నిలబడడానికి ధైర్యసాహసాలు ఈ లేఖలోని శబ్దాల ప్రతిధ్వనులే ప్రసాదించాయి,

పార్లమెంట్ భవనం మొదటిద్వారందగ్గిర ఆగిన కారులోంచి దరహసితసుందర వదనారవిందంతో దిగింది ఇందిరాగాంధీ. అప్పటికే చాలామంది జనం అక్కడ గుమిగూడిఉన్నారు. తెల్లని ఖద్దరుచీరపైౖ, గోధుమరంగు శాలువా వేసుకొనిఉంది. ఆ శాలువాపై ఎర్రగులాబీ శోభిస్తుండగా కారులోంచి దిగిన ఇందిరకు అక్కడి ప్రజలు కరతాళధ్వనులతో స్వాగతమిచ్చారు. ఎర్రగులాబీతో ముడివడిఉన్న నెహ్రూస్మృతులు వారి మనస్సులో మసిలాయి. ఆ అభినందనలకు ప్రతిగా ఆమె హస్తాలు ముకుళించినప్పుడు వారందరూ—

'ఎర్రగులాబీ జిందాబాద్'

అనే నినాదాలు చేశారు. జవహర్‌లాల్‌నెహ్రూ విధానాలకూ, ప్రాణప్రదంగా భావించిన విలువలకూ ప్రతినిధి ఆమె అని వారికీ, ఆమెకూ కూడా తెలుసు.

చరిత్రాత్మకమయిన ఎన్నిక జరగవలసిన సెంట్రల్‌హాల్‌లో ఆమె అడుగు పెట్టగానే అక్కడి సభ్యులందరూ లేచి నిలబడి హర్షధ్వానాలతో ఆమెకు స్వాగతమిచ్చారు. తా నెరిగిన సభ్యులందరినీ చిరునవ్వుతో పలకరిస్తూ, కైమోడ్చి సెంట్రల్ హాల్‌చుట్టూ తిరిగింది. మొరార్జీని చూస్తూనే దగ్గరగా వెళ్ళి కరచాలనం చేసింది.

నెహ్రూప్రకృతిలో ఒకభాగమయిన ఈ మర్యాదను గ్రహించిన సభ్యులందరూ మరో మారు హాలు దద్దరిల్లేటట్లు హర్షధ్వానాలు చేశారు.

అప్పటికి 'ఎన్నికవేళ' సమీపించింది. సభ్యులందర్నీ అకారాదిగా పిలుస్తుంటే ఒక్కొక్కరే వెళ్ళి ఓటు చేసివచ్చారు.

ఈ రహస్యపద్ధతిఓటింగ్ చాలా మందంగా సాగుతోంది. ఒక్కొక్కరూ తమ పేరు పిలిచినప్పుడు వెళ్ళి రిటర్నింగ్ఆఫీసర్వద్ద బాలెట్ కాగితం తీసుకుంటుం డగా, మిగిలినవారు తమ వంతుకోసం నిరీక్షిస్తున్నారు. హాలంతా ఆదుర్దాతో నిండిన నిశ్శబ్దం ఆవరించింది. మొక్కవోని మొరార్జీ, వినయలలితవతియైన ఇందిర వంటి విరుద్ధప్రకృతులు గల వ్యక్తుల మధ్య అధికారానికి సంబంధించిన సంఘర్షణమాత్రమే కాదు; ఒకేపార్టీకి చెందిన సభ్యులయినా, రెండు భిన్నసిద్ధాంతాలకూ, జీవనరీతులకూ, సాంఘికదృక్పథాలకూ జరుగుతున్న ముఖ్యసంఘర్షణ యిది. 500 మందికి పై చిలుకుగా గల పార్టీసభ్యులు ఆ క్షణంలో చేసే నిర్ణయం దేశభవితవ్యాన్ని నిర్ధారించబోతున్నది.

జవహర్లాల్ నిర్దేశించిన పథంలో దేశం పురోగమించడమా —
లేక—మొండిపట్టుతో హేతువాదబద్ధంకాని సంప్రదాయ పునరుద్ధరణకు అంకితుడైన మొరార్జీ ననుసరించి తిరోగమించడమా ?

గడియారపు టక్కుటిక్కుల్లో నిమిషాలూ, గంటలూ గతిస్తున్నాయి. అయినా కాలం ఆగిపోయినట్లే అనిపించింది, అక్కడ, ఫలితంకోసం ఉత్కంఠతో నిరీక్షించే సభ్యులందరికీ. నాడు వోటుచేయడానికివచ్చిన సభ్యులలో, రాజధానీ నగరంలోని వైద్యాలయాల్లో చికిత్స పొందుతున్నవారు 26 మందిదాకా ఉన్నారు. ఒకరు అసలు కదలలేని స్థితిలో ఉండడంచేత తోపుడుకుర్చీలో వెళ్లి 'బాలెట్ కాగితం' తీసుకున్నారు. అందరూ ఆదుర్దాతో ఎదురు చూస్తూనేఉన్నారు. ఆ ఉద్రిక్తతను సడలించుకోడానికి మధ్యమధ్య ఛలోక్తులు సాగుతున్నాయి. పార్లమెంటు కాంటీన్ నుంచి కాఫీ, పాలూ, ఫలహారాలూ తెప్పించుకుంటున్నారే తప్ప, భోజన సమయం అయినా హాలు వదిలి వెళ్లినవారు లేరు. రక్షణమంత్రి వై. బి. చౌహాన్ తమ మహారాష్ట్రసహజ హాస్య ధోరణితో, పార్లమెంటరీ వ్యవహారాలమంత్రి సత్యనారాయణసిన్హాను ఉసిగొల్పుతూ 'పాటపాడతావా ? కథ చెపుతావా' అన్నారు.

'భూఖే, భజన్ నహోయే కృపాలా....' — "ఆకలి కడుపు మాడుస్తూఉంటే పాటేం పాడతాను, కథేం చెబుతాను ?" అని జవాబిచ్చారు.

అప్పటికి రెండునిమిషాల వ్యవధి ఉంది, మూడుగంటలు కొట్టడానికి.

ఒక మహారాష్ట్రసభ్యుడు పరుగుపరుగున వచ్చి 'బధాయిహో' అని అరుస్తూ, అభినందనలు తెలిపాడు. అప్పటికి తెలిసిం దందరికీ ఇందిర ఎన్నికయిందని. సభ్యుల

ఆనందోత్సాహాలతో నిండిన అభినందన పరంపరల మధ్య వోట్ల వివరాలు ప్రకటితమయాయి. ఇందిరకు ౩౫౫ వోట్లు రాగా, మొరార్జీకి 189 వోట్లు వచ్చాయి. అంటే 186 వోట్ల మెజారిటీ—అదేం అంత అల్పమయిందికాదు. ఆవిధంగా ఇందిర భారతదేశపు ప్రప్రథమమహిళాప్రధానిగానేకాక ఆ పదవి నలంకరించినవారిలో పిన్నవయస్కురాలు కూడా అయింది.

సెంట్రల్‌హాల్‌లో ఫొటోగ్రాఫర్ల, టెలివిజన్ కెమెరాల అలజడి ఆరంభమయింది. గంభీరస్వభావులయిన పార్లమెంటుసభ్యులుకూడా పరస్పరాలింగనాదులతో తమ ఆనందాన్ని వ్యక్తంచేశారు. జ్ఞానవృద్ధుల నేత్రాలలో ఆనందబాష్పాలు జాలువారాయి. ఆ సమయంలో ఆమెవదనంలో వారికి ఆమెతండ్రిజ్ఞాపకాలు కనిపించడమే కారణం.

పార్లమెంటుభవనంవెలుపల గుమిగూడివున్న వేలమంది ప్రజల కంఠాలనుంచి అప్రయత్నంగా వెలువడిన జయజయధ్వానాలలో ఇందిరపేరుకాదు వినిపించింది—అందరినోటా "జవహర్‌లాల్‌నెహ్రూకీ జై" అన్న శబ్దాలే ప్రతిధ్వనించాయి.

వారనుకున్నారు — వారాసించారు — వారికి తెలిసింది, నెహ్రూయే తిరిగి వచ్చాడని!

# 2

## ఘనతను చూసి భయపడకు

ఘనతను చూసి భయపడకు.
కొందరు గొప్పవారుగా జన్మిస్తారు.
కొందరు గొప్పతనాన్ని సాధిస్తారు.
కొందరికి గొప్పదనం ఆపాదించబడుతుంది.

—విలియమ్ షేక్స్పియర్

గొప్పదనం మనసులో ఉదయిస్తుంది. సహనం, అనుకంప ఉన్నవారికి అదృష్ట దురదృష్టాలవల్ల వ్యాకులత్వం చెందనివారికి, సమదృష్టి గలవారికి ఇది లభిస్తుంది.

—జవహర్‌లాల్ నెహ్రూ

1966 సంవత్సరం జనవరి 19 వ తేదీన కాంగ్రెసుపార్టీ నాయకత్వానికి ఎన్నికకావడంతో, మర్నాఁడయిదురోజుల అనంతరం, ఇందిరాగాంధీ ప్రధానిపదవీ ప్రమాణం స్వీకరించింది. ఆమె అభిలషించిఉన్నట్లయితే ఈ పదవిని తన తండ్రి మరణానంతరం, అంటే 19 మాసాల ముందే అధివసించిఉండేది. కాంగ్రెస్‌పార్టీలో పలుకుబడి గల ప్రముఖనాయకులు కొందరు అప్పుడే ఈ పదవిని స్వీకరించవలసిందని ఆమెను కోరినసంగతి అందరికీ తెలిసిందే. వారిమద్దతుతో ఆవిడ అప్పుడు ఏకగ్రీవంగానే ఆ ఆసనం అధిష్ఠించగలిగేది. కాని, ఆ ప్రతిపాదనను అప్పు డామె మర్యాదగానే వదలుకుంది. శోకసాగరంలో ఉండడమే అందుకు కారణం కావచ్చు. అంతే కాదు, నెహ్రూకుమార్తెగా తన కా అర్హత లభించిం దనే అపవాదుకు కారణం అవుతుం దనే ఊహకూడా ఉండిఉండవచ్చు.

అటువంటి అపోహతో నాడు ఆ ఉన్నత పదవీస్వీకారం చేసివుంటే, అది ఆమె ఆత్మగౌరవానికీ, సుకుమార ప్రకృతికీ అఘాతమయేది. దానితోబాటు ప్రధానిగా సాగించవలసిన విధినిర్వహణకూడా సమర్థంగా సాగేది కాదు. అందుకే

అప్పు డామె అందుకు దూరంగానే ఉండిపోయి, తన తండ్రికి అత్యంత విశ్వాస నీయుడయిన లాల్‌బహదూర్‌శాస్త్రి నాయకత్వంలో, రేడియో సమాచారశాఖవంటి సామాన్యశాఖమంత్రిత్వాన్ని స్వీకరించింది.

లాల్‌బహదూర్‌శాస్త్రి అస్తమయానంతరం అదే అవకాశం మళ్లీ వచ్చి నప్పుడు ఆమె అందుకు తలవొగ్గింది. ఈ పదవి నెహ్రూ వంశపారంపర్యహక్కు అవుతుందనే ఆరోపణ భీతి ఈనాడు లేకపోవడమే ఆమె అంగీకారానికి కారణం.

తన కభిమానరచయిత అయిన రాబర్ట్‌ఫ్రాస్ట్ గేయం ఒకటి ఆ సమయంలో తనకు గుర్తుకొచ్చిందని అక్కడి పార్టీసభ్యులలో ఒక మిత్రునితో అన్నారు. ఆయనే రాసిన 'బహుదూరయాత్ర' గేయంలోని కొంత భాగం నెహ్రూ మరణా నంతరం ఆయన టేబిల్‌మీద కనిపించింది. ఇందిరకు గుర్తుకొచ్చిన ఆ గేయం—

"నీలో శక్తిసామర్థ్యాలుండి, పరిస్థితులు అనుకూలించినప్పుడు సింహాస నానికి దూరంగా ఉండడం మామూలు విషయం కాదు.

"నే ననుభవించిందాంతో తృప్తిపడ్డాను. ఈ రాజ్యం నీది; నీయిష్టం వచ్చినట్టు చేసుకో. నే నీ రాత్రే నిష్క్రమిస్తున్నాను. ఇదిగో నవరత్న కిరీటం— అని రాజు కుమారుడితో అన్నాడు.

"తాను కోరేది అది కా దనే భావంతో ఆ అవకాశాన్ని తన్ని త్రోసి పుచ్చాడు."

అయితే యిప్పుడు—ఈసారిమాత్రం ఇందిర ఆ అవకాశాన్ని త్రోసిపుచ్చలేదు. నేడు సవాల్‌ను ఎదుర్కొ-గలిగిన శక్తి తన కుండడం, పరిస్థితు లనుకూలించడం కారణంగా ఆమె ఈసారి చేతులు దులిపెయ్యలేదు. మనోబలంతో తన వైముఖ్యాన్ని విడనాడింది.

"దేనికయినా అడుగుపెట్టేముందు చాలా తటపటాయిస్తాను, కాని చేపట్టానో నా శాయశక్తులా కృషిచేస్తాను" అని ఆమె ఆ సందర్భమున ఒక విలేఖరితో అన్నారు.

పోటీ తథ్యమని తెలిసినప్పు డామె ఈషణ్మాత్రం జంకలేదు. ఆ పదవికి తాను తగననే భావంతో కాని, ఆ పదవి యేదో తనకు దైవదత్తం అన్న ఊహతో కాని ప్రచారం సాగించలేదు. తనకు తాను ప్రచారం చేసుకోకపోగా, ప్రత్యర్థిని తెగనాడనూ లేదు. జయాపజయాలను నిష్కామంగానే భావించింది. ఇందుకు విరుద్ధంగా, మొరార్జీదేశాయ్. కొంపలంటుకుపోతున్నంత తీవ్రంగా ప్రచారం సాగిం చాడు. పార్లమెంటు సభ్యులందరికీ రాసిన లేఖలో తనకు వోటిమ్మని అడగడమే కాకుండా, తనకు ఓటు వెయ్యవద్దని ప్రత్యర్థులు బలవంతం చేస్తున్నట్టు కూడా ఆరోపణలు చేశాడు.

ఈ ఉత్తరం విషయం విలేఖరు లడిగినప్పుడు ఇందిర ఏ వ్యాఖ్యానమూ చెయ్యలేదు. "అది సభ్యులాలోచించి నిర్ణయించుకోవలసిన అంశం" అన్నా. రంతే!

వారు ఆలోచించుకున్నారు. నిశ్చయించుకున్నారు; ఆమెనే ఎన్నుకున్నారు!

ఆత్మవిశ్వాసంతో, హుందాగా ఈ బాధ్యతను స్వీకరించడం ఆమె మానసిక పరిణతికీ, రాజకీయపరిజ్ఞానానికీ చిహ్నం. అయితే ఈ సంగతి ఆమె కత్యంత సన్నిహితులుమాత్రమే గ్రహించగలరు. అటువంటివారిలో జవహర్‌లాల్ నెహ్రూ ఒకరు. ఆమెకు అధికారం సంక్రమించడానికి తన పలుకుబడి ఎంతమాత్రం వినియోగపడకుండా ఉండడానికే ఆయన తీవ్రజాగ్రతలు తీసుకున్నాడు. అయితే సమయం వచ్చినప్పుడుమాత్రం ఆమె తన శక్తితో ఎటువంటి స్థితినయినా ఎదుర్కోగలదనే విశ్వాసం తండ్రిగా ఆయనకు లేకపోలేదు.

నెహ్రూ, మరణానికి కొద్దినెలలముందు, బ్లిట్జ్ సంపాదకుడు కరంజియాతో జరిపిన గోష్ఠిలో, ఆయన అనంతరం కామరాజ్, లాల్‌బహదూర్, గుల్జారీలాల్ నందాల సమష్టినాయకత్వం సాగే అవకాశం ఉన్నట్లు సూచించాడు.

"ఇందులో కామరాజ్ 'మన దేశ సిద్ధాంతాలకు కట్టుబడివున్న సామాన్య ప్రజానాయకుడు'; లాల్‌బహదూర్‌శాస్త్రి 'గాంధీజీ మూసలో పూసిన నాయకులలో ఒకడు, నిరాడంబరుడు, సౌమ్యుడు. ఆయనలో నిరంకుశత్వం ఏకోశానా లేదు. అందుచేతనే విభిన్నవర్గాలవారిని మధ్యేమార్గంలో సమన్వయించుకోగలిగినవాడున్నూ'. గుల్జారీలాల్ నందా—'మంచి సామ్యవాది, గొప్ప నిజాయితీపరుడు.'"

ఇలా నెహ్రూ అంటున్నప్పుడు, "మిగతావారితోపాటు ఇందిరాగాంధీకి కూడా గల దేశనాయకత్వాధికారాన్ని మీ రెందుకు కాదంటున్నారు?" అని కరంజియా ప్రశ్నించాడు.

"'ఇందిరను మీ వారసురాలుగా రూపొందిస్తున్నారా' అని అనేకులు పదేపదే ప్రశ్నిస్తున్నారు. అటువంటి ప్రయత్నం నేనేం చెయ్యడంలేదని ఖండితంగా చెప్పాను. అంటే దాని అర్థం, నా అనంతరం ఆమె ఎటువంటి బాధ్యతాయుతాధికారాలూ స్వీకరించకూడదని కాదు" అని నెహ్రూ సమయోచితంగా జవాబిచ్చారు.

ఇంకా యిలా అన్నారు: "ఆమెకు కాంగ్రెస్ అధ్యక్షపదవిని నేను కట్టబెట్టలేదనీ, అందుకు అసలు ఎటువంటి తోడ్పాటూ చెయ్యలేదనీ లోకవిదితమే! అయినా ఆమె ఆ పదవిని స్వీకరించింది. నన్నూ, నా విధానాలనూ హర్షించనివారు కూడా ఆమె అధ్యక్ష నిర్వహణను ఎంతగానో మెచ్చుకున్నారు. అప్పుడప్పుడామె నా ఆలోచనలకు భిన్నంగా నడుస్తూనే వుంది. అయితే అలా నడవడం సబబే. నేను స్పష్టంచెయ్యదలచిం దేమిటంటే, దేశంలో అత్యున్నతమయిన ఆ

పదవికి ఆమెను ఎన్నుకోమనీ అనలేదు, ఎన్నుకునేటట్లూ చెయ్యలేదు. ప్రజలే ఆ నిర్ణయం చేశారు. కాంగ్రెస్‌పార్టీ ఎన్నుకుంది. నేను తటస్థంగానే ఉండి పోయాను, ఒకప్పుడు నేను యిందుకు విరుద్ధంగా కూడా ఉన్నాను. కాని ఆమె ఎన్నిక జరిగింది. మేము తండ్రీ - కూతుళ్ళంగా కంటె రాజకీయసహచరులు గానే ఎక్కువగా పనిచేశాం. కొన్ని విషయాల్లో ఏకీభావం, కొన్ని వ్యవహారాల్లో వ్యతిరేకభావం వుండేది, మామధ్య. ఆమెకు స్వతంత్రమయిన ఆలోచనాశక్తి, దృఢమయిన అభిప్రాయాలు వున్నాయి. నిజానికా శక్తి అవసరం. అంతే!'' అని ముగించారు.

"అంటే, రాజకీయాలలో ప్రభుత్వంలో మీ అమ్మాయి ప్రముఖస్థానం వహించే అవకాశాన్ని మీరు కాదనరన్నమాట?" అని కరంజియా ప్రశ్నించాడు.

"ఆ మాట అనడానికి నేనెవర్ని! కాంగ్రెస్‌పీఠం దిగినప్పట్నుంచీ ఆమెను మళ్లీ ఆ అధ్యక్షపదవి స్వీకరించమని ప్రజలు కోరుకున్నారు. నా దృక్పథంతో ఏకీభవించని మొరార్జిదేశాయ్‌వంటివారు కూడా ఈ సూచన చేశారు. ఆమె నిరాక రించినప్పుడు నా దగ్గర కొచ్చారు. 'ఇదేదో వంశపారంపర్యంగా తయారవు తోం'దనే భావం ప్రజల్లో కలగడం నా కిష్టంలేదు కనక ఆమెను ఈ విషయమై బలవంతపెట్టబోనని స్పష్టంగా చెప్పాను. అది ప్రజాస్వామ్యవిరుద్ధమే కాక అవాంఛ నీయం కూడా! ప్రజలు కోరుకుంటే, పార్టీ ఎన్నుకుంటే ఆమె ఎటువంటి పదవిని స్వీకరించినా నా అభ్యంతరం లేదు. అయితే ఎటువంటి పదవికీ ఆమెను నేను తీర్చడమూలేదు, నిరోధించడమూలేదు'' అన్నారు నెహ్రూ.

ప్రజాస్వామ్యచరిత్రలో ప్రప్రథమంగా తండ్రి అనంతరం అదే స్థానాన్ని కుమార్తె అధిష్ఠించడం జరిగిం దానాడు. అయితే ఇది వంశపారంపర్యపు హక్కుగా కాక శక్తి సామర్థ్యాలతో జరిగింది. నెహ్రూ అడుగుజాడలలో రాజకీయరంగంలో పొందిన శిక్షణఫలాలే ఈ శక్తిసామర్థ్యాలు.

భారతదేశంవంటి (బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా, రష్యా) ముఖ్యదేశాలలో నూతన అధినేత పదవీస్వీకారం చేసినప్పుడు ఆయా మిత్రదేశాల అధినేతలు ఉత్సాహాసక్తులు ప్రదర్శించడమో, ప్రదర్శిస్తూనో, హర్షం ప్రకటిస్తూనో సందేశాలు పంపడం రాజలాంఛనం. కొన్ని కొన్ని సందర్భాలలో ఇటువంటి లాంఛనాలు చిత్తశుద్ధియుతాలు కావడమూ కద్దు. ఉదాహరణకి జవహర్‌లాల్ అనంతరం లాల్ బహదూర్‌శాస్త్రి ఆ పదవిని అధిష్ఠించినప్పుడు ఇటువంటి భావాలే వ్యక్తమయాయి. అటు అమెరికా, ఇటు రష్యా కూడా సమంగా సంతోషించడం విచిత్రవిరోధా భాసం. వామపక్షాభిమాని ఎన్నిక కానందుకు అమెరికా ఆనందిస్తే, నెహ్రూ వైదేశిక విధానాలను తిరగదోడే దక్షిణవర్గీయుడు ఎన్నిక కానందుకు రష్యా సంతోషిం చింది. సౌమ్యుడూ, మధ్యేమార్గగామీ అయిన లాల్‌బహదూర్ ఎన్నిక ఉభయ

రాజ్యకూటాలకే నూ ఆనందానందాన్ని కలిగించినా, కలిగించకపోయినా వారికి పూర్ణమయిన సంతృప్తి కలిగించింది. ఇక ఇందిర ఎన్నికలో అంతర్జాతీయంగా అభివ్యక్తమయిన భావాలలో ఒక ప్రత్యేకత వుంది: జవహర్‌లాల్ నెహ్రూ టమా ర్తిగా చైతన్యవంతమూ, ప్రయోజనాత్మకమూ అయిన నాయకత్వం దేశానికి లభిం చిందనే కాక, ఆమెపట్ల వ్యక్తిగతంగా కల అభిమానంకూడా వ్యక్తమయింది.

ప్రపంచ రాజధానీనగరాలలోనుంచి వచ్చిన అభినందన వర్ష పరంపరలలో ప్రెసిడెంట్ నాజర్ పంపిన సందేశం భావోద్వేగభరితమయింది. దేశ దేశాలలోని రాజనీతివేత్తలందరిలో నెహ్రూ కుటుంబంతో ఆయనకు గల సన్నిహితత్వం అందుకు కారణం కావచ్చు.

"భారతదేశచరిత్రలో అతిక్లిష్టసమయంలో గురుతరమూ, క్లేశయుతమూ అయిన పదవిని స్వీకరించడంలో మీరు ప్రదర్శించిన ధైర్యసాహసాలను నేను ఆసక్తితో, ఆనందంతో గమనిస్తూ వచ్చాను. ఈ బాధ్యతలో అంతర్భూతమై వున్న గౌరవప్రతిష్ఠలను గ్రహించడమేకాక, ప్రజలలో మీకు గల దృఢవిశ్వా సమూ, వారి ఆశయాలపట్ల, భవితవ్యంపట్ల మీకున్న సాధనాకాంక్ష ఈ ధైర్య సాహసాల్లో వ్యక్తమవుతున్నాయి"—ఆ మహోన్నత పదవీ స్వీకారసమయంలో ఇందిరమనసులో తిరిగే భావాలను మరెవరూ ఇంత చక్కగా క్రోడీకరించి ఉండరు.

ప్రపంచవార్తాపత్రికలు వెలిబుచ్చిన అభిప్రాయాలు ప్రభుత్వాధినేతల సందేశాలకేమీ తీసిపోలేదు. పాత్రికేయులు, రాజకీయావధులకూ అతీతులు కాబట్టి వారి అభిప్రాయాలు ఆసక్తిజనకాలేకాక అర్థవంతాయిన్నూ. ప్రగతిశీల వార్తాపత్రికలు ఆమె ఎన్నికకు హర్షం తెలుపుతూ, నెహ్రూవిధానాలు కొనసాగుతా యని ఆశించాయి. అయితే వీటిలో అరబ్ రిపబ్లిక్‌లోని ఒక సంపాదకుడు, ఆమె మతాతీతదృష్టిని ప్రశంసిస్తూ:

> "పాకిస్తాన్‌తో సంబంధాలు ఒడిదుడుకుల్లోవున్న ఈ సమయంలో మతో న్మాదంలేని తంత్రివలెనే ఇందిర ఇటు భారతదేశంలోనూ, అటు పాకి స్తాన్‌లోనూ ఉన్న కోట్లాది ముస్లిముల విశ్వాసాన్ని చూరగొనగలదు" అన్నాడు.

ఒక ప్రముఖ యుగోస్లోవియా పత్రిక:

> "దేశంలో సామ్యవాదాన్ని, అంతర్జాతీయంగా అలీనవిధానాన్ని అను సరించిన నెహ్రూ ధోరణిని భారతదేశం తప్పక అనుష్ఠించగల దన డానికి శ్రీమతి ఇందిరాగాంధీ ఎన్నిక నిదర్శనం" అని వ్యాఖ్యానించింది.

ప్రపంచ పత్రికా వ్యాఖ్యలలో సందర్భోచితమైన వ్యాఖ్య 'గార్డియన్' పత్రికదే. "స్వేచ్ఛగా, క్రమబద్ధంగా జాతినాయకత్వనిర్ణయంలో భారత ప్రజాస్వామ్యం మరోసారి తన సామర్థ్యాన్ని ప్రకటించుకుంది. వాస్తవానికి 'జాతీయ' భావాధిక్యం కలవారినే వారు ఎన్నుకున్నారు. మత, కుల, ప్రాంతీయ, భాషాభిమానాలు ప్రత్యర్థులకంటె చాలా తక్కువగా ఉండడంవల్ల ఈమె 'జాతీయ' భావాలు కలది."

రాజకీయాలలో మహిళలు ప్రముఖస్థానం అలంకరించని అమెరికాలో, భారతదేశం ఒక మహిళను ప్రధానిగా ఎన్నుకొనేసరికి నిశ్చేష్టులే అయారు. "ఆసియామహిళలు ఇంకా ఘోషాలోనే ఉంటున్నారని అమెరికావారు అనుకుంటూ ఉంటారు" అని వాషింగ్టన్ విలేఖరి టెలిగ్రాం పంపాడు.

"భారతప్రధాని రాజకీయభావాలు, కేశాలంకరణ ఎలా ఉంటాయో తెలుసుకోవాలనే కుతూహలం అమెరికాస్త్రీల కుంది" అని అక్కడి స్త్రీల పత్రిక వ్యాఖ్యానించింది.

ప్రపంచంలోని అనేకవర్గాలలో ఈ ఎన్నిక కొందరికి ఆశ్చర్యాన్ని కలిగించగా, కొందరికి ఆందోళన హేతువయింది. పాశ్చాత్యదేశాలలో (పెట్టుబడిదారీ, కమ్యూనిస్టు) మహిళ అంతటి ఉన్నతపదవి నధిష్ఠించలేదు. సింహళప్రధానిగా సిరిమావోబండారనాయకే ప్రపంచంలో మొట్టమొదటి మహిళాప్రధానిగా ఎన్నికకావడం నిజమే! అయితే అది ఆమెశక్తిసామర్థ్యాలవల్ల కాదు. హత్యచేయబడ్డ ఆమె భర్తపట్ల ప్రజలకు గల ప్రేమాభిమానాలే అందుకు కారణం.

కాగా పోగా ఆ దేశం మరీ చిన్నది. ఆమెపాలనకూడా అదో పరిణామదశగానే నిలిచింది.

ప్రపంచంలోకల్లా చెప్పుకోదగ్గ పెద్ద ప్రజాస్వామ్యదేశమయిన ఇండియాలో మహిళాప్రధాని ఎన్నిక అపూర్వసంఘటన. ఇది ప్రపంచదేశాలలో ఎందరినో చకితులను చేసింది; కొందరిని పులకింపజేసింది. యవనికాంతరంలో ఉండి నడిపే ప్రబలమయిన వర్గంచేతులలో కీలుబొమ్మగా ఉండి, సింహాసనంమీద అలంకారప్రాయంగా ఉంటుందా? భారతదేశం ఎదుర్కొంటున్న గురుతరసమస్యలను ఈ 'అబల' పరిష్కరించగలుగుతుందా? ప్రౌఢిమ గల పురుషుల మధ్య పనిచేసి తన శక్తిని నిరూపించుకోగలదా?

మహోత్కృష్టస్థానా లలంకరించిన మహిళలనుగురించిన గాథ లెన్నో భారతీయపురాణేతిహాసాలలో ఉన్నాయి. ధైర్య, సాహసాలకు శక్తినీ, ఐశ్వర్యానికి లక్ష్మినీ, కళామతల్లిగా సరస్వతినీ అధిదేవతలుగా పేర్కొన్నారు. సీతారాములనూ, రాధాకృష్ణులనూ విడివిడిగా ఆరాధించడమే భారతీయు లెరుగరు. ప్రాచీనహిందూ

సమాజంలో స్త్రీకి గౌరవస్థానం ఉన్న దనడానికి సందేహం ఈషణ్మాత్రం లేదు ఆధ్యాత్మికవిషయంలో పురుషునితో సమానత్వాన్ని స్త్రీకి లభింపజేశాడు, గౌతమ బుద్ధుడు. అశోకచక్రవర్తి ఆగ్నేయాసియాలో బుద్ధుని సందేశాల ప్రచారానికి తన కుమార్తె సంగమిత్రను పంపించాడు.

మధ్యయుగంలో హిందువులలో, ముస్లిములలో కూడా కొందరు మహిళలు ప్రముఖనాయకత్వం వహించడమేకాక పాలకులుగాకూడా చరిత్రలో స్థానం సాధించారు. చిత్తూరురాణి పద్మిని సౌందర్యరాశిగానేకాక ధైర్యసాహసాలకూ పేరెన్నికగన్నది. రాజకీయచాతుర్యంతో, నీతిజ్ఞతతో ఢిల్లీసింహాసనం అధివసించిన సుల్తానా రజియాకూడా మన చరిత్రలో నిలిచినదే. దక్షిణభారతచరిత్రలో చాంద్ బీబీపరిపాలన ఆమె సమకాలిక రాజన్యులను మించినది. జహంగీర్‌పరిపాలనలో రాజ్యచక్రాన్ని తిప్పిన గౌరవం ఆతని రాణియైన నూర్జహాన్‌దే. ఔరంగజేబు చక్రవర్తికుమార్తె జేబున్నీసాగేయాలు నేటికీ ఉదాత్తకృతులుగానే పరిగణింపబడుతున్నాయి. 1857 లో బ్రిటిష్‌వారిపై జరిగిన ప్రథమస్వాతంత్ర్యసంగ్రామంలో ఝాన్సీరాణి తన రాజ్యసమగ్రతకూ, దేశస్వాతంత్ర్యానికీ అసువు లర్పించిన విషయం మన స్మృతిపథంలో ఉంది.

ఈదృశమయిన అసామాన్యస్థానా లలంకరించిన మహిళలను తలుచుకొని భారతీయులు భుజా లెగరేసుకోవడం ఉచితమే; అయినా కొన్ని శతాబ్దులుగా స్తబ్ధమైపోయిన భూస్వామ్యవ్యవస్థలో మహిళల స్థితి దిగజారిన మాట వాస్తవమే. సతీసహగమనం, ఘోషావంటి సాంఘికదురాచారాలు ఈ దేశమహిళలను అమానుషంగా హింపించాయి.

పురాణాలలోని శక్తిస్వరూపిణులకు, ఇతిహాసాలలోని శౌర్యఖనులయిన మహారాణులకు ప్రతిగా ఈనాడు బానిసకన్యలు మిగిలారు.

ఒక్క శతాబ్ది వ్యవధిలోనే మళ్ళీ దేశప్రధానిబాధ్యత స్వీకరించగల స్థితిని భారతీయమహిళ చేరుకోగలిగిందంటే, అందుకు ఈదేశపు సాంప్రదాయ, ప్రపత్తులు కాదు కారణం; స్వాతంత్ర్యసంగ్రామంలో వారు నిర్వహించిన ప్రముఖపాత్రలు తెచ్చిపెట్టిన కీర్తియే హేతువు. భారత స్వాతంత్ర్యసమర చరిత్రలో చాతుర్యం కల రాజనీతిజ్ఞులుగా, ఆత్మార్పణ చేసిన దేశభక్తులుగా ప్రసిద్ధికెక్కిన మహిళ లెందరో గోచరిస్తారు. భారతమాతదత్తపుత్రిక అనిబిసెంట్—ఐరిష్‌వనిత—జాతీయకాంగ్రెస్ మూల స్తంభాలలో ఒకరు.

తొలినాళ్ళలో కాంగ్రెస్‌అధ్యక్షపదవి నలంకరించిన అనిబిసెంట్ దేశంలో రాజకీయజాగృతిని కలిగించడంలో, ప్రముఖభూమిక నిర్వహించింది. వియద్గంగా ఝరీసదృశవాగ్ధోరణి, అసదృశకవితానైపుణి కల సరోజినీదేవి దశాబ్దులపాటు మూల

స్తంభంగా నిలిచింది. కాంగ్రెస్ అధ్యక్షపీఠంనుంచి ఆవిడ చేసిన సింహగర్జనలు అశేషభారతప్రజను కార్యోన్ముఖుల్ని చేశాయి.

ప్రజాస్వామ్యసంస్థలు ప్రవృద్ధమయే రోజులలో ప్రపంచవ్యాప్తంగా మహిళా లోకం తమ ప్రాథమికహక్కులకోసం సుదీర్ఘమూ, తీవ్రతరమూ అయిన పోరాటం సాగించవలసివచ్చింది. ఈ పోరాటం ఫలితంగా వారికి వోటుహక్కు నివ్వక తప్ప లేదు. మన దేశంలో మహిళలు సాంఘిక సంస్కరణోద్యమాలు సాగించారేతప్ప ప్రజాస్వామ్యహక్కులకోసం రాజకీయపోరాటం సాగించే అవసరం వారికి కలగ లేదు. జాతీయోద్యమఫలితంగానే వారికీ అవకాశాలు లభించాయి. పురుషులతో చెయ్యీ చెయ్యీ కలిపి, ఊరేగింపులలో పాల్గొంటూ, పోలీసుల అత్యాచారాలకు గురి అవుతూ, పసికందులతో కారాగృహాలలో మగ్గుతూ, తమ సహకారంతో రూపొందే సాంఘికవ్యవస్థలో సమానహోదాను సహజంగానే సాధించుకున్నారు.

ప్రధానమంత్రిత్వం స్వీకరించిన ప్రథమమహిళ ఇందిరాగాంధియే; కాని, రాజ కీయబాధ్యతలు వహించిన ప్రథమమహిళమాత్రం కాదు. ఆమెమేనత్త విజయలక్ష్మి పండిట్ ఉత్తరప్రదేశ్ప్రభుత్వంలో మంత్రిగా, అనంతరం మాస్కో, వాషింగ్టన్, లండన్‌లలో భారతరాయబారిగా, చివరకు ఐక్యరాజ్యసంస్థ సర్వసభ్యమండలి అధ్యక్షు రాలుగా ఎంతో సామర్థ్యాన్ని ప్రదర్శించింది. కేంద్రప్రభుత్వంలో ఆరోగ్యశాఖ సాధా రణంగా మహిళలే నిర్వహిస్తున్నారు. ప్రస్తుతం డాక్టర్ సుశీలా నయ్యర్ ఆ పదవిలో ఉన్నారు. భారతదేశంలో అధికజనసంఖ్యగల ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిపదవిని అలంకరించింది శ్రీమతి సుచేతాకృపలానీ!

ప్రఖ్యాతులయిన వీరేకాక, విముక్తమహిళాలోకంలో జాతీయపునర్నిర్మాణ బాధ్యతను వహిస్తున్నవా రెందరో ఉన్నారు. ఉద్యోగులుగా, న్యాయమూర్తులుగా, న్యాయవాదులుగా, అధ్యాపకులుగా, డాక్టర్లుగా, శాస్త్రజ్ఞులుగా, నర్సులుగా, వైమానిక సంస్థలలో ఉద్యోగినులుగా ఎందరో కనిపిస్తున్నా రీనాడు. విశ్వవిద్యాలయాల స్నాత కోత్సవాలలో పట్టాలుతీసుకునే మహిళల సంఖ్య నానాటికీ పెరుగుతూనేఉంది. కాలే జీలలోని యన్. సి. సి. ల్లో విద్యార్థినులు కవాతులోనూ, తుపాకీ పేల్చడంలోనూ శిక్షణ పొందుతున్నారు. వివిధభాషల్లోనూ ప్రముఖరచయితల శ్రేణిలో మహిళలూ ఉన్నారు. పార్లమెంటుకి ఎన్నికైన మహిళాప్రతినిధులు 60 మందికి పైగా ఉన్నారు. ప్రపంచదేశాలలో యింతగా మహిళాప్రాతినిధ్యం ఉన్న దేశం మరొకటి లేదు.

ఇందిరాగాంధీ ప్రధానమంత్రి కావడం యాదృచ్ఛికంగా జరిగిన సంఘటన కాదు. సుదీర్ఘ చారిత్రకపరిణామం అది. నవభారత జాతీయజీవనంలో మహిళలు వహిస్తున్న బాధ్యతాయుతమయిన సేవల పతాకసన్నివేశం యిది. సమానహక్కుల కోసం సాగించే పోరాటఫలితం అనుభవంలోకి వచ్చిందని ఇందిరఎన్నికతో మహిళా లోకం అమందానందం పొందింది. పురుషుల నిరంకుశాధికారంనించి విమోచనం

లభించిందని మహిళాజగత్తు ఆనందిస్తున్నట్లు చిత్రించి వ్యంగ్యచిత్రకారులూ, ప్రహసనకర్తలూ సంతోషించారు. ఈవ్యంగ్యంలో 'పస' ఎంతోకాలం నిలబడలేదు. ఇందిర మహిళే అయినా, నెహ్రూ ఎన్నడూ నారీద్వేషి కానట్లే, తాను అబలను కానని ఋజువు చేసుకోవడమే ఆ పస తగ్గడానికి కారణం. అబల కావడంవల్ల ఆమె ఆ పదవికి ఎన్నిక కారాదన్న వాదాన్ని లెక్కచెయ్యనట్లే అబలాత్వభావాన్ని కూడా ఆమె దరిజేరనియ్యలేదు.

'మహిళలుకూడా ప్రజలే. దేశజనాభాలో వారూ ఒక భాగమే. అంతేతప్ప వారు తప్పిన్ను లేం కాదు.'

అని ఒక విలేఖరితో అన్నారు, ఇందిర.

ఏదేశచరిత్రపుటలు త్రిప్పినా, అవసరం ఎదురయితే పురుషుల సరసన స్త్రీలు దక్షతతో తమ విధిని నిర్వర్తించిన సంఘటనలుకూడా ఆమె విలేఖరులముం దుంచి ఉండవలసింది; అది జోన్ ఆఫ్ ఆర్క్ కావచ్చు, ఝాన్సీరాణీ లక్ష్మీబాయ్ అవవచ్చు, టర్కీకి చెందిన హలిడే ఎడిబ్ (Halide Edib) కావచ్చు, లేదా, ఫ్రెంచి మహిళ మదాం క్యూరీ, స్పెయిన్‌వనిత లా పాసినేరియా, చైనా స్త్రీ మదాం సన్‌యెట్‌సేన్, ఇండొనేషియానారి మదాం కార్తినీ, లేదా సరోజిని, ఇందిరాగాంధీ.... కాదు—భారత దేశానికి చెందిన ఇందిరానెహ్రూ కావచ్చు....

షార్డ్ ఘోషించినట్లు, కొందరు జన్మతః గొప్పవా రౌతారు; మరికొందరు గొప్పతనాన్ని సాధిస్తారు; కొందరిని గొప్పదనం వరిస్తుంది. ఇందిరవిషయంలో ఈ మూడూ కలిసివచ్చాయి. రాజనీతిజ్ఞులు, ప్రతిభావంతులు ఉన్న కుటుంబంలో జన్మించింది; అత్యున్నతమానవసేవాలక్ష్యాన్ని చేరుకోగల రీతిలో తండ్రిచేతులలో పెరిగింది; దేశం అత్యంతక్లిష్టదశలో ఉండగా ఈ గురుతరబాధ్యతను ఆమె రక్షణగా స్వీకరించలేదు; సవాల్‌గా చేపట్టింది.

"జన్మతః గొప్పవారు కావడం యథార్థమేనా?" అని.

భారతీయసమాజంలో కుటుంబబంధాలు దృఢమయినవే అయినా రాజకీయ రంగంలో మాత్రం వాటి కవకాశంలేదు. మోతీలాల్‌నెహ్రూకొడుకు జవహర్‌లాల్ నాయకత్వం వహించడం దీనికి అపవాద. మహాత్మాజీనాయకత్వాన్ని ఆయన ముగ్గురుకొడుకుల్లో ఏఒక్కరికీ కట్టబెట్టాలని ఎవరూ అనుకోలేదు. టాగూర్, రామన్, ఘోష్‌ల ప్రతిభలు వంశపారంపర్యం కాలేదే?

గొప్పతనాన్ని సాధిస్తారు, నిజమే! అదెలా? పరిస్థితులవల్లనా, ఆదర్శం మూలంగానా, విద్య హేతువా, ఉత్తేజప్రోత్సాహాలా - ఇందులో ఏది ఆధారభూమి? ఇందిర చరిత్ర మహత్వసాధన కృషికి దర్పణం.

# 3

## మహోదయం

భగవంతుడింకా భగ్నోత్సాహుడు కాలేదన్న సందేశంతో ప్రతిశిశువూ జన్మిస్తున్నది.

—రవీంద్రనాథ్ టాగోర్

సుఖపడే సంసారాలన్నీ ఒక్కలాగే ఉంటాయి. కష్టపడే సంసారాలు? వేటి దోవ వాటిదే!

—టాల్‌స్టాయ్

ఆనందభవన్‌తో దీర్ఘకాలానుబంధం కల వృద్ధుడు మున్షీ ముబారక్ ఆలీ మరణశయ్యపై ఉన్నాడు. ఆయన మృత్యుముఖంలో ఉన్నట్లు డాక్టర్లు ఆయనకు తెలియ నివ్వలేదు. 'కాన్సర్' అనే పదాన్ని ఆయన చెవులకు వినపడ నివ్వకపోయినా తాను పడే బాధనుబట్టి ఆ వ్యాధిని ఆయన గ్రహించకపోలేదు. పవిత్ర, ప్రశాంతజీవితం గడిపిన ఆ వృద్ధుడికి మృత్యుభీతి లేదు. తన అనంతరం తన కుటుంబం ఏ అవస్థలు పడుతుందో అనే ఆదుర్దా కూడా లేదు. తన యజమాని మోతీలాల్‌నెహ్రూ తనను సోదరునిగానే ఆదరిస్తూండడంవల్ల తన భార్యా, బిడ్డలను జాగ్రత్తగా సంరక్షిస్తా డనే విశ్వాసం ఉంది. చిరకాలం ఆనందభవన్‌వ్యవహారాలన్నీ ఆయనే చూస్తూండేవాడు. మోతీలాల్ సంతానం అందరూ—జవహర్, ఆయన చెల్లెళ్లు స్వరూప్, కృష్ణ—ఆయనను ప్రేమాభిమానాలతో చూసేవారు.

చావుకి సిద్ధంగా ఉన్న ఆయనలో తుదివాంఛ ఏదో ఎదురుతెన్నులు చూస్తోంది. ఆ సమయంలో మోతీలాల్ ఆయన యోగక్షేమాలు విచారించడానికి వచ్చినప్పుడు, "జవహర్లాల్ కుమార్తెను ఒక్కసారి ఎత్తుకుని నాదీవన లిచ్చేవరకూ ఈ ప్రాణం పోదు" అన్నాడు.

చివరి కంతే జరిగింది. కమలానెహ్రూ ప్రసవించగానే ఆ పసికందును పొత్తిళ్లలో తెచ్చి ఆ వృద్ధుని చేతుల్లో ఉంచింది దాది.

ఆ పసికందును అందుకుంటున్నప్పుడు ఆ వృద్ధుని కన్నులు ఆనందబాష్ప పూర్ణాలయాయి. ఆ పురిటిగుడ్డును చూస్తున్నప్పుడు ఆయన కన్నులనుండి, పండుగడ్డం మీదుగా, రెండు ఆనందబాష్పాలు జారాయి.

"శుభం నాయనా, శుభం'' అని మోతీలాల్‌ను అభినందిస్తూ,

"ఈ బిడ్డకు అల్లా చిరాయురారోగ్యైశ్వర్యాలు ప్రసాదించుగాక! నీ కీర్తి ప్రతిష్ఠలు నిలబెట్టే అర్హత గల వారసుడు జవహర్. అలానే ఈమె తన తండ్రి గౌరవమర్యాదలు నిలబెట్టే దయితీరుతుంది."

అన్నాడు.

పసికందును తీసుకుని దాది గడపదాటింది. అప్పు డా వృద్ధు డంటాడూ—

"మోతీలాల్ మనవడు నెహ్రూవంశ కీర్తిప్రతిష్ఠలను మహోజ్జ్వలం చెయ్యగలడు"

అన్నాడు.

ఎవరికీ వినపడని ఆ ఆశీస్సు లేవో పెదవులలో కదులుతూండగానే స్మారకం తప్పిం దాయనకి. అంతే-ఆ మూతవడ్డ పెదవులు మరి విడలేదు; కనురెప్పలు లేవలేదు.

జవహర్‌దంపతుల తొలిచూలు మగబిడ్డ కాదనీ, ఆడపిల్ల అనీ, ఆమెపేరు ఇందిర అనీ ఆవృద్ధుడికి చెప్పి, అతని అభిప్రాయాన్ని సరిచేసే అవకాశం లేకపోయింది.

నాడు ఆ శిశువును ఆశీర్వదించింది మున్షీ ముబారక్ ఆలీ ఒక్కరే కాదు, ఎందరో దేవదూతలుకూడా ఆ పసిపాప లావణ్య, సౌందర్య, ప్రతిభాసముపేత కావాలని ఆశీర్వదించారు. ఈ సుగుణసంపద దేవతాప్రసాదం కాదనీ, పితృ, పైతామహ దత్తమే అనీ అనేవారుకూడా ఉన్నారు.

వ్యక్తిగుణగణనిర్ణయం పరిసరాలపై ఆధారపడిందా, వారసత్వమేనా అనే వివాదం యింకా సాగుతూనేఉంది. సాధారణంగా పిల్లలు తల్లిదండ్రులు సమకూర్చే పరిసరాలలోనే పెరుగుతారు కనక వాళ్ళ వ్యక్తిత్వాధారభూమి వారసత్వమే అనడమూ కష్టమే.

వారసత్వప్రభావం అధికంగా సంక్రమించేది తల్లిదండ్రులనుంచే; తాతముత్తాతలనించి కొంతలో కొంత రావచ్చు.

అద్వితీయమేధ, సుకుమారస్వభావం, నిర్విరామకృషికి లొంగని పరిపూర్ణారోగ్యం కల జవహర్లాల్ కూతురు ఇందిర. అయితే ఇందిరతల్లి కమలానెహ్రూ. ఆవిడ అర్చనాకారి, ఆహ్లాదకరమయిన కాశ్మీరసుందరి. పిరికితనం, సిగ్గు మూర్తీభవించింది. దీర్ఘకాలం కారాగృహంలో ఉన్న భర్తృవియోగాన్ని మౌనంగా

సహిస్తూ, క్షయచికిత్సాలయాలలోనే జీవితం గడిపి బహుదూరదేశంలో - లాసేన్‌లో - కన్నుమూసిం దావిడ.

తల్లినుంచి అర్చనాకారిత్వం, అర్థగంభీర నీలనయనాలూ లభిస్తే, తండ్రి నుంచి ఆయన నాసిక, దృఢనిశ్చయాన్ని స్ఫుటంచేసే చిబుకం, శారీరకశ్రమను సహించే శక్తి లభించాయి.

పరిసరాల ప్రభావంకూడా వ్యక్తిమానసికస్థితిపై ఉంటుందికనక తల్లిలో ఉండే సిగ్గూ, మౌనసహనభావం ఆమెకు అలవడ్డా యనిపిస్తుంది. అలాగే ఎటువంటి ఒడిదుడుకుల్నయినా నిర్భయంగా ఎదుర్కొనే సాహసం తండ్రినుంచి సంక్రమించింది.

'సాహసోపేతులై జీవించండి.'

అని జవహర్‌లాల్ తన ఆటోగ్రాఫ్‌కోసం వచ్చే అందరి పుస్తకాల్లోనూ గిలుకుతూండేవాడు. బహుశా అదే ఇందిరకు అలవడడానికి కారణం. ఇందిర అంచనాప్రకారం బిడియం జవహర్లాల్‌లోనూ ఉంది. "అయితే ఈ బిడియానికి అర్థం అందరూ అనుకునేటట్లు ఆయన నలుగురికీ దూరంగా ఉండేవాడు కాదు, స్వభావతః ఆయనలో ఈ బిడియం ఉండేది. ఈ స్వభావం ఆయనలో చివరవరకూ ఉంది."

సుతిమెత్తగా మాట్లాడుతూ, నిన్నమొన్నటివరకూ, బహిరంగసభలో మాట్లాడడానికి సైతం జంకే యువతి, ఒంటరిగా, అనాలోచితంగా, మతోన్మాదపుమూకలో చొరబడి వారిని ఆపే ప్రయత్నం చేయడం విరుద్ధంగా కనిపించవచ్చు. జవహర్, కమలానెహ్రూలలో గోచరించే పరస్పరవిరుద్ధమూ, పోషకమూ అయిన స్వభావ, తత్వాలను గ్రహించగలిగినప్పుడే మనం ఈ చర్యను అవగాహనచేసుకోగలం.

జవహర్‌లాల్ 'ఆత్మకథ' లో, తన వివాహప్రస్తావనలో, భార్య కమలకీ, తనకీ స్వభావాల్లో గల తారతమ్యాలు వివరిస్తూ—

> "అప్పటికి నాకు ఇరవైఆరేళ్లు. ఆమె అప్పుడే యౌవనంలో అడుగుపెడుతోంది. ఆమెవయస్సు పదిహేడేళ్లు. ప్రపంచం పోకడలేమీ తెలియని అమాయకురాలు. మామధ్య వయోభేదం ఎక్కువే. అయితే అంతకు మించి మా మనోవికాసంలోని అంతరం మరీ ఎక్కువ. ఆమెకంటె నేనే మానసికంగా ఎంతో పరిణతి చెందిఉన్నాను. అంత పెరిగినా నన్నింకా కుర్రతనం విడిచి పెట్టలేదు. ఈ విడుస్తూవిడుస్తూఉన్న సుకుమారసుమాన్ని బహుసున్నితంగా సాకాలని నేను గ్రహించలేకపోయాను. మా హృదయాలు పరస్పరానురాగంలో తేలిఆడాయి. అయితే మేం పెరిగిన వాతావరణాలు భిన్నాలు కాబట్టి మామధ్య సర్దుబాటు సాగేదికాదు. ఈ లోపంవల్ల చిటిపొటికలహాలు—పరమ స్వల్పవిషయాల్లో—తలెత్తేవి. అయితే యివన్నీ భార్యాభర్తలమధ్య కలహాలే. చాలా త్వరగానే అంతరించేవి. ఇద్దరికీ, కోపం, ముక్కుచివర ఉండేది.

మాయిద్దరిదీ మరీ సున్నితస్వభావం. ఇంక పోతే పసిపిల్లల్లాగా పట్టుదల జాస్తీగా ఉండేది. ఇవన్నీ యిలా ఉన్నా మా అనురాగబంధం దృఢతరమవు తూనేఉంది. క్రమక్రమంగా సర్దుబాటుభావమూ అలవడింది. మా పెళ్ళయిన ఇరవై ఒక్కమాసాలకే కమల ఇందిరను- మా ఏకైకసంతానం- ప్రసవించింది."

ఇందిర ఎదుగుతున్నకొద్దీ తల్లిదండ్రుల స్వభావప్రభావం ఆమెవ్యక్తిత్వంపై ప్రస్ఫుటం కాసాగింది. ఒకేరకమయిన ఆశయాదర్శసాధనకు సమష్టిగా సాగించిన పోరాటం ఫలితంగా కమలానెహ్రూల మధ్య అవగాహనను పెంపొందించి అనురాగ బంధాన్ని పటిష్ఠంచేసింది. ఈ ఉభయుల ప్రభావం ప్రసరించిన హేతువుగా ఇందిర జీవితంలో వారి పరస్పరవిరుద్ధస్వభావాలు ఏకీభూతమై ఆమె కొక నూతనశక్తినీ, సౌకుమార్యాన్నీ, చైతన్యాన్నీ, ఆత్మార్పణప్రకృతినీ సంతరించాయి. ఇక పోతే, పరిసరాల ప్రభావంకూడా ఆమె వారసత్వంలో ఒక భాగమే అయింది. పాలరాతి రాజప్రాసాదసదృశవిశాలానందభవనం—పాలరాతిగచ్చుతో, సువిశాలమయిన సావ డులతో, నవవికసితసుమసౌరభశోభితోద్యానవనాలతో అలరారే ఆనందభవనం— ఆమెవాసగృహం. అత్యంతగంభీరుడూ, దయార్ద్రహృదయుడూ అయిన మోతీలాల్ ఆ భవనానికి అధిపతి.

"మా నాన్నకంటెకూడా మా తాతగారి వ్యక్తిత్వమే నాపై ఎక్కువగా ప్రసరించింది—''

అని ఇందిరే చిన్నప్పుడు అంది.

"మహా సత్వసంపన్నుడయిన మా తాతగారంటే నా కెంతో గౌరవం. జీవితంపై ఆయనకు గల ఆకాంక్ష ఎంతో ఉన్నతమయింది. తరవాతతరవాత మా నాన్నలోకూడా అది ఏర్పడింది. ఇన్నిటినీ మించి ఆయన పెద్దతనం నన్ను అధికంగా ఆకర్షించింది. అయితే ఈ పెద్దతనం శారీరకమైంది కాదు. మీ రెరుగుదురో ఎరగరో, ఆయన విశాలవిశ్వాన్ని యిముడ్చుకున్న మహా వ్యక్తిలా ఉండేవాడు. ఆయన గంభీరహాసం నా కెంతో ఆనందం కలిగించేది."

పిల్లల్నీ, పిల్లలపిల్లల్నీ విపరీతంగా ప్రేమించే పూర్వకాలపు పితృ, పితామహ తత్వం బాగా కలవాడు మోతీలాల్. పిల్లలకు కావలసిన సర్వసంభారాలూ సమకూర్చా లనే ఆసక్తే కాదు, శక్తికూడా కలవాడు. అందులోనూ యివ్వగలిగినంత మంచివే యివ్వాలనేది ఆయనవాంఛ. సుఖానికి లోటు లేని రాజప్రాసాదంవంటి భవనం, ఖరీదయిన ఆటబొమ్మలు, అత్యుత్తమవిద్యాసంస్థలలో విద్యాభ్యాసానికి యేర్పాట్లు, ప్రైవేటు చెప్పడానికి సమర్థులగు అధ్యాపకులు, ఇన్నిటినీ మించి యింట్లో ఆదరాభి మానాలు వెల్లివిరిసే, విజ్ఞానదాయకమయిన వాతావరణం—ఇన్నిటినీ ఆయన సమ కూర్చాడు. మోతీలాల్‌చేతుల్లోనే పూర్తిగా పెరిగిఉంటే ఆయనగారంవల్ల ఇందిర ఈ

శ్రేణికి చేరిఉండేది కాదు. కాని, యితరుల జోక్యంవల్ల ఆయనగారం ఆమెమీద అంతగా ప్రసరించలేదు. ఇందిరనాయనమ్మ పూర్తిగా పూర్వాచారపరాయణురాలు. ఆవిడ పాడే భక్తిగీతాలు, స్తోత్రాలు, చెప్పే పురాణగాథలు వంటివి వింటూండడం వల్లనే నెహ్రూవంశీయులందరికీ చిన్ననాటినుంచీ భారతీయనైతికసంప్రదాయసూత్రాలు పట్టుబడ్డాయి. మోతీలాల్ ప్రసిద్ధుడైన న్యాయవాదిగా రెండుచేతులా డబ్బు సంపాదించే వాడు. పిల్లల పెంపకంలో, చదువుసంధ్యల్లో ఆయనకు జమీందారీఫాయా ఊహ లుండేవి. ఎక్కువ జీతాలు తీసుకునే స్కూళ్ళలో చదివించాలనీ, కేవలం శ్రీమంతులే ఉండే బోర్డింగులలో ఉంచాలనీ, అవికూడా యూరపియన్‌మిషనరీలు నడిపేవి కావా లనీ, పిల్లలవెంట పరిచారికాగణం ఉండాలనీ భావించేవాడు. అయితే జవహర్‌లాల్, సామ్యవాది కావడంవల్ల, తన కూతురు సామాన్యప్రజల మధ్య పెరగాలని ఆశించే వాడు. అంతే కాదు, తండ్రి ఆలోచనలను సాగనిచ్చేవాడు కాదు.

ఆమెజీవితంలో ఎవరెవరి ప్రభావం ఎంతెంతగా పడిందో వివరించమని అడిగి నప్పుడు, ఆమె అదంత సాధ్యంకాదని అంటూ—చిన్నతనంలోనే తన తండ్రి తాతల, గాంధీ-టాగూరల ప్రభావం ప్రగాఢముద్రలు వేశాయని అన్నారు. అయితే ప్రకృతి సౌందర్యోపాసన—ముఖ్యంగా మహోన్నతపర్వతశిఖర సందర్శనం—పఠనాభిలాష, శారీరకంగా, మానసికంగా ధైర్యసాహసోపేతకార్యాచరణ తండ్రినుంచే ఎక్కువగా అలవడ్డాయని ఆమె అంగీకరించింది. "శాంతినికేతన్‌లో నేనున్నప్పుడు కళాసౌందర్య తృష్ణను టాగూర్ రేకెత్తించారు," అన్నా రామె.

"నామీద మావారి ప్రభావం, ఇంకా చెప్పవలిస్తే నాపిల్లల ప్రభావం కూడా ఉంది. నాపిల్లలు ప్రతివిషయాన్నీ నూతనదృక్పథంతో, యువజనసహజమయిన రీతిలో దర్శించేవారు కనక, వారి మాటలూ, చేతలూ నామీద బాగా పనిచేసేవి. ఇప్పు డాలో చిస్తే, మా నాన్నమీద నాప్రభావంకూడా ప్రసరించిందనే అనాలి. ఆయన మనోభావా లను నేను మరింత ఉద్రేకంతో, తీవ్రంగా ప్రకటించేదాన్ని." చిన్ననాడు ఇందిరకు చదువుచెప్పిన శ్రీమతి వకీల్ ప్రభావం - నెహ్రూదంపతులు కారాగారంలో ఉన్నపుడు - కూడా తనమీద లేకపోలేదని ఆమె అంటారు. ప్రఖ్యాతులయిన అనేకులకంటె ఇందిరలో విశేషం యేమంటే, భిన్న భిన్న రంగాలలో ప్రముఖుల ప్రభావం తనపై ఉన్నదని అంగీకరించ గలగడమే.

> "అయితే ఈ ప్రభావాల్ని మనం కోరితెచ్చుకుంటామని కాదు; కొన్నిటికి తలవొగ్గుతామనీ కాదు. కొందరు ప్రసిద్ధుల ప్రభావం సహజంగా, అజ్ఞాతంగా మనమీద పడుతూంటుంది. కొందరు వ్యక్తుల సహవాసం నాకు లభించిఉండక పోతే నా జీవితగతి ఈ దారిని ఉండేది కాదని నాకు తెలుసు."

ఆకాలంలో ఉండే పిల్లలందరిపైలాగే, ఈమెపై కూడా నాటి రాజకీయ, సాంఘిక కల్లోలాల ప్రభావం విపరీతంగా పడింది. భారతేతిహాసంలో, అత్యంతవిప్లవసమ

యంలో దేశంలోని ప్రతివ్యక్తిపైనా ఆ ప్రభావం ప్రసరించింది. దానికి ఎంతెంతవారూ తట్టుకోలేకపోయారు. జమీందారీజీవితం సాగించే మోతీలాల్‌నెహ్రూసైతం రాజకీయ రంగంలో మునకలువేయక తప్పలేదు. కేంబ్రిడ్జ్‌లో విదేశీధోరణులలో చదువు సాగించిన జవహర్లాలూ గ్రంథగ్రాంథికజ్ఞానాన్ని విడిచి, దరిద్రనారాయణులమధ్య సంచరిస్తూ, ఆనందభవనంలోకంటె కారాగారపు కటకటాలవెనుకనే దీర్ఘకాలం గడిపాడు. ఇందిర చిన్ననాడే తల్లిదండ్రులకు దూరమై జీవితం వెళ్ళదియ్యవలసి వచ్చేది. తాతకూడా దగ్గరుండే భాగ్యం లేదామెకు. ఒక్కొక్కప్పుడు విడివిడిగా అయితే, మరొకప్పుడు అందరినీ కలిపి కారాగారానికి పంపేవారు.

1918 లో ఇందిర పుట్టింది. మొదటి ప్రపంచయుద్ధం పూర్తికావస్తున్న రోజులవి. రష్యాలో విప్లవం రేగిందీ ఆ యేడే! ఈ రెండు సంఘటనలకీ తోడు భారత రాజకీయరంగంలో గాంధీజీ కాలుపెట్టడంతో దేశవ్యాప్తంగా అసంతృప్తి చెలరేగింది. ఎక్కడ చూసినా బహిరంగసభలు, సమావేశాలు, హర్తాల్స్, నిరాయుధప్రజాసమూహంపై లాఠీఛార్జీలు, తుపాకీకాల్పులు .... అన్నిటినీ మించిన దారుణ రాక్షసకృత్యం అమృతసర్‌లోని జలియన్‌వాలాబాగ్‌లో సంభవించింది, ఉన్నతభవనాలమధ్య ఉన్న జలియన్‌వాలాబాగ్ ప్రవేశానికి ఒకే ఒక ఇరుకుదారి.... అందులో గుమిగూడిన వేలాది ప్రజానీకాన్ని చిత్రవధచేశారు. రక్తం ఏరులై ప్రవహించింది. అప్పుడప్పుడే జాతీయోద్యమంలో ప్రవేశిస్తున్న జవహర్లాల్ హుటాహుటి పంజాబ్ వెళ్ళి అక్కడి దారుణహత్యాకాండను చూసి, ఆగ్రహావేశాలతో తిరిగి వచ్చాడు. ఆరోజునించి ఆనందభవన్‌వాతావరణంలో ప్రశాంతి సన్నగిల్లింది. జోల పాడి ఇందిరను జోకొట్టే అవకాశంకూడా ఆ భవనంలో ఎవరికీ ఉండేది కాదు. అసంతృప్తి, ఆగ్రహావేశాలు పెచ్చుపెరిగాయి.

# 4

## బొమ్మల తిరుగుబాటు

పసిపాపల్లారా!
మీ రిప్పుడే జన్మించారు
ఇప్పు డున్నారు-అంతే!
ఇంకా-ఏదీ-జీవించడం లేదు మీరు
అందుకు, అప్రతిహతమైన
సమయ మాసన్నమౌతుంది;
కదిలిస్తుంది.
అప్పుడు మీ హృదయాలు
మెలకువతో ప్రేమాస్పదా లవుతాయి.
వేటికోసం మీ కళ్ళు కాయలు కాస్తాయో
వాటికోసం ఉవ్విళ్ళూరుతూ ఉంటారు.

—సరోజినీనాయుడు

ఒక వేసవి మధ్యాహ్నం. చిన్నపాప ఇందిర ఒంటరిగా ఉంది. పొద్దు గడవడం లేదు. తల్లిదండ్రులు దగ్గర లేనప్పుడు కనిపెట్టుకుని ఉండే వృద్ధపరిచారిక గుర్రు కొట్టి నిద్రపోతోంది—చల్లని పాలరాతి నేలమీద చెంగుపరుచుకుని. ఆ విశాలసౌధంలో అలికిడే లేదు. తండ్రిగదిలో కిటికీలూ, ద్వారాలూ మూసిఉన్నా అక్కడ అల్మైరాలలో చక్కగా పేర్చిఉన్న పుస్తకాల నిండా దుమ్ము పేరుకునిఉంది. తాత మోతీలాల్‌గదిలో ఆకుపచ్చని మేజామీద న్యాయశాస్త్రగ్రంథాలు తెరిచినవి తెరిచినట్లే ఉన్నాయి. ఆయన్ను అరెస్టుచెయ్యడానికి పోలీసుఆఫీసర్ వచ్చేసమయానికి ఆయన పరిశీలిస్తున్న గ్రంథా లవి. ఎప్పుడూ పదిమందిజనంతో కలకల్లాడుతూఉండే ఆనందభవనంలోని డ్రాయింగురూముతలుపులూ, కిటికీలూ మూసుకునిఉన్నాయి. సోఫాలమీద, కుర్చీలమీద దుమ్ము పడకుండా తెల్లగుడ్డలు తొడిగారు. విశాల వటవృక్షచ్ఛాయలో విశ్రమిస్తున్న గోవుల్లా ఉన్నా యవి.

ఆ మహాసౌధంలో ఇందిర ఒక్కతే చిన్నపిల్ల. ఆమె యిల్లంతా తిరుగు తూండడానికి సంపూర్ణస్వేచ్ఛ ఉండేది. కొత్త రిబ్బన్ కావాలని తల్లిని వేధిస్తూనో, ఏవో చిలిపిప్రశ్నలతో తండ్రిని చికాకుపరుస్తూనో, నాయనమ్మ పూజలకూ, ప్రార్థనలకూ ఆటంకం కలిగిస్తూనో, పార్టీలతో కేసులగురించి చర్చించే తాతగారి ఒడిలోకి చేరుతూనో వుండేది. కాని, ఈ క్షణంలో ఆ మహాసౌధంలో ఎవరూ లేరు—గుర్రుకొట్టి నిద్రపోయే ఆయా, కన్నులు మూతపడని ఈ చిన్నపిల్లా తప్ప. నాన్నా, తాతయ్యా కటకటాల వెనకాల ఉన్నారు. ఇంట్లోని ఆడవాళ్ళందరూ విదేశీవస్త్ర బహిష్కారోద్యమంలో పికెటింగ్ సాగిస్తూ, ఊరేగింపులూ, సభలూ జరిపించడానికి వెళ్ళారు. త్రివర్ణ పతాకం చేత్తో పట్టుకుని ఊరేగింపులో తిరగాలని తనకూ ఉన్నట్టు పేచీపెట్టింది. అయితే అంత పెద్దపెద్ద ఉద్యమాల్లో పాల్గొని, ఆ ఉద్వేగసన్నివేశాలలో నిలబడే వయస్సు కాదని ఆమెతల్లి అందుకు నిరాకరించడంవల్ల ఆ పిల్ల ఒంటరిగా ఉండిపోవలసివచ్చింది. కాదు, ఒంటరితన మేం....ఆమెకు తోడుగా ఆట బొమ్మ లెన్నో ఉన్నాయి.

ఆ బొమ్మలలో ఎన్నోరకాలవి ఉన్నాయి. తాతగారు ఇంగ్లాండునించి తెప్పించిన ఆ బొమ్మలు ఖరీదయిన దుస్తులతో వున్నాయి. తిరగేస్తే కుయ్యోమనే చంటిపాపబొమ్మకూడా వుంది. గుడ్డపేలికలతో తయారుచేసిన బొమ్మలూ వున్నాయి. అందులో ఆడబొమ్మకీ, మగబొమ్మకీ ఈమధ్యనే పెళ్ళిచేసిం దా అమ్మాయి. పెళ్ళి కొడుకు గుర్రమెక్కి వున్నాడు. పెళ్ళికూతురు ధగధగ మెరిసే ఎర్రగుడ్డలు కట్టుకుంది. ఉత్తరప్రదేశ్‌లో దొరికే రకరకాల మట్టిబొమ్మలున్నాయి: రాజు లున్నారు, రాణీలున్నారు, పరిచారకు లున్నారు, డవాలాబంట్రోతు లున్నారు, సులోచనాలతో నవ్వు తెప్పించే పంతుళ్ళున్నారు, త్రిపుండ్రాలతోడి పూజారు లున్నారు, లాఠీలతో పోలీసు లున్నారు, తమతమ దుస్తులలో చతురంగబలాలూ వున్నాయి. ఇవన్నీ బ్రిటిష్ సైన్యానికి చెందిన నమూనాలు (ఆశ్విక, శతఘ్నిదళాలున్నాయి).

కాలక్షేపంకోసం ఆ పిల్ల ఆ బొమ్మలన్నిటినీ కొత్తరకంగా అమర్చుకుంటూ కూర్చుంది. ఆ అమరికతీరును అలహాబాదు జిల్లామేజిస్ట్రేటు చూసిఉంటే ఆయన కళ్ళు చింతనిప్పులు కురిసేవి. ఆ బొమ్మరింటిమీద త్రివర్ణపతాకం ప్రతిష్ఠించింది. దాని ముందు హిందూచక్రవర్తుల, రాణుల, వారి పరిచారకుల, చివరకు సాధువుల బొమ్మలన్నీ బారులలో నిలబెట్టింది.

ఈ సత్యాగ్రహుల సముదాయంలో మొన్ననే ఆమె పెళ్లిచేసిన నవవధూవరులు సైతం నిలబడి, భారతీయ చిహ్నమైన ఆ మూడు రంగుల జెండాను కాపలా కాస్తున్నారు. ఆ సమయంలో ఆమె ఆ బొమ్మల నుద్దేశించి "మీరు సత్యాగ్రహు లన్న మాట మరిచిపోకండి. పోలీసులకు మీరు భయపడకూడదు" అని హెచ్చరించింది.

అప్పుడు రంగులతో తయారుచేసిన కాగితం పతాకాన్ని పెళ్లికూతురుచేతులలో పెట్టి, సత్యాగ్రహుల్ని ఒకవైపునించీ, పోలీసుల్నీ సైనికుల్నీ మరోవైపునుంచీ నడిపించింది. ఈ ఉభయవర్గాల మధ్య సంఘర్షణ దగ్గరయ్యే కొద్దీ జరగబోయే సంఘటనలు మనసులో మెదలిన ఆమెహృదయం ఉద్వేగభరితమయింది. అంతతో సహాయ నిరాకరణోద్యమనినాదాలు ప్రారంభించింది.

భారత్‌మాతాకీ జై !

హిందూ - ముస్లిం జిందాబాద్

మహాత్మాగాంధీకి జై !

అని నినాదాలు సాగిస్తూ సత్యాగ్రహుల బొమ్మలు కదిలించింది. ఎర్రటోపీ పోలీసుల్నీ, బ్రిటిష్ సైనికుల్నీ ఎదుర్కొనేవరకూ ఆ బొమ్మలు నడిపించింది. ఆమె కేవలం ప్రేక్షకురాలిగాకాక ఆ ఉద్యమంలో భాగస్వామిగానే భావించుకుంది. ఆ ఘర్షణలో ఆవిడసానుభూతి ఎటు ఉన్నదీ విదితమే. జాతీయపతాకా లెగురవేసుకుంటూ వచ్చే సత్యాగ్రహులు తమ ఎదురుగావున్న పోలీసుల్నీ, సైనికుల్నీ తొక్కుకుంటూ వచ్చే ధ్వనికి ఉలిక్కిపడి లేచింది, గుర్రుకొట్టి నిద్రపోతూన్న ఆయా...

ఈ బొమ్మల తిరుగుబాటు ఇందిర బాల్యజీవనానికి దర్పణం. జాతీయోద్యమ రాజకీయాలు ఆమె బాల్యస్మృతులతో పెనవేసుకుపోయాయి. ఇందిర తప్పటడుగులు వేస్తూన్ననాడే ఆ కుటుంబసభ్యు లందరూ సహాయనిరాకరణోద్యమంలో అగ్రశ్రేణిని నిలిచినవారే !

అప్పటికే ఆమెతండ్రి భారతకర్షకులతో కలిసి మెలిసి గ్రామగ్రామాలూ తిరుగుతూ, వారితో సహపంక్తి భోజనాలతో ఆ మట్టిగుడిసెలలో గడుపుతూ, గంటల కొద్దీ వారితో చర్చలు సాగిస్తూ వున్న రోజులవి (నెహ్రూ స్వీయచరిత్ర). అయితే, ఇందూ యోగక్షేమాలు చూసే అవకాశం తాతగారికి ఉండేది. ఆయన కలకత్తా రాజకీయమహాసభకు వెళ్ళినప్పుడు, రెండేళ్ళ తన మనమరాలికి తోపుడుసైకిలుబండి తెచ్చాడు. "నే నెప్పుడూ ఇందిరను గురించే ఆలోచిస్తుంటాను. అమాయకత్వం మూర్తీభవించిన పిల్లల్ని గురించి ఆలోచించడంకంటె ఆనందం ఏముంది ? ఆధునిక నాగరికుడు అంధవిశ్వాసంగా భావించే విగ్రహారాధనకూ, తత్సంబంధమైన యితరాలకూ యిది సన్నిహితమైనదే. దానికీ దీనికీ పెద్ద తేడా యేంలేదు."

తండ్రి, తాతలు జైలుకి వెళ్లేనాటికి ఇందిరకు నాలుగేళ్లు నిండలేదు. రాజకీయ నేరవిచారణను ఆమె మొదటిసారి చూసింది తాతఒడిలోనే. ఈ విచారణ కేవలం బూటకం అని తెలిసినా, ఆయన, గాంభీర్యాన్ని అభినయిస్తూ ఆ విచారణకు సన్నద్ధుడయాడు. గవర్నమెంటుప్లీడరు బార్‌లో తనకు సహచరుడేకాక పాత స్నేహితుడు కూడా. ఆయనపేరు బెనర్జీ. రాజద్రోహానికి తలపడిన జాతీయకాంగ్రెస్‌లో మోతీ

లాల్ ఉత్తి స్వచ్ఛందసేవకుడే అని ఋజువుచెయ్యడానికి ఆయన నానా తంటాలూ పడ్డాడు. కాని ఈ విషయాన్ని ఆ మోతీలాల్ స్వంతపత్రిక 'ఇండిపెండెంట్' అంతకు ముందే ప్రచురించింది. అయినా న్యాయశాస్త్రరీత్యా జరగవలసిన లాంఛనాలన్నీ జరగాలిగా! సాక్షివిచారణ పూర్తిఅయాక మోతీలాల్‌కి ఆరుమాసాల ఖైదు, అయిదు వందల జరిమానా పడింది. అంతవరకూ ఒడిలోవున్న చిన్నఇందూను తాతగారి కౌగిలినుంచి విడదీయవలసివచ్చింది. అది నడిశీతాకాలపు సంజవెలుగుల్లో జరిగిన సంఘటన. ఆయన ఒడిలోంచి దూరమవుతున్నపుడు ఆమెకు గొల్లున యేడవాలని పించింది. కాని తాను లేనప్పుడు ఏడవవొద్దని, ధైర్యంగా ఉండాలని తాతగారు చెప్పడంవల్ల ఆమె మౌనంగా ఊరుకుంది. ఇంటిదగ్గర నాన్నలేడు. హర్తాల్‌కు పురి కొల్పుతూ కరపత్రాలు పంచిపెట్టినందుకు జవహర్‌లాల్‌కు ఆరుమాసాలు ఖైదు, అయిదు వందలు జరిమానా విధించారు. 'బ్రిటిష్‌న్యాయస్థానాలకి శిక్ష విధించే అధికారం లే'దంటూ వారు ఆ జరిమానాలు చెల్లించనేలేదు. అంతతో ప్రభుత్వ ధార్ష్ట్యం ఆనంద భవనంమీదకూడా పడింది.

జరిమానాలు వసూలుచేసే దృష్టితో వారి ఆస్తి జప్తుచెయ్యడానికి ఉక్కుటూట్ల పోలీసులు ఆ జమీందారీ భవనాన్ని చుట్టుముట్టి, ప్రాణప్రదంగా పెంచుకున్న పూల మొక్కలనూ, పచ్చికమైదానాలనూ ధ్వంసంచేసేశారు. ఆనందభవనంలో ఉన్న ఖరీ దయిన కుర్చీలూ, సోఫాలూ లారీల కెక్కిస్తున్నారు. మంచి ఉన్నితో తయారయిన తివాసీలూ చుట్టబెట్టారు. ఈ అత్యాచారాలు చూసేసరికి ఆ నాలుగేళ్ళయినా నిండని ఇంది రకు చాలా బాధకలిగి, పోలీసులతో వాదానికి దిగింది. కోపంతో అరిచింది. తన బుల్లి చేతుల పిడికిలి బిగించి, క్రూరదృష్టులు నిండిన పోలీసులవైపు నడుస్తూ బెదిరించింది. వారి పైశాచిక అట్టహాసమే ఆమె ప్రతిఘటనకు ఫలం! ఆమె రాజకీయపరిజ్ఞాన ప్రవే శానికి ఇక్కడే తెరయెత్తబడింది. బాధ్యతారహితమయిన బాల్యక్రీడల కానాటితోనే స్వస్తి! అది మొదలుగా తీవ్రసంఘర్షణలలో ప్రవేశించింది.

గాంధీమహాత్ముణ్ణి మొదటిసారి ఎప్పుడు కలిసిందీ ఇందిరకు గుర్తులో లేదు. "నా జీవితంలోనూ, స్మృతిపథంలోనూ లీనుడై ఉన్న ఆయన నాకు అపరిచితుడుగా ఉన్న సమయం గుర్తేలేదు". ఆయన అలహాబాద్ వచ్చినప్పుడల్లా ఆనందభవనంలోనే ఉండేవాడు. పసిపాపలంటే పరువులుపెట్టే గుండెగల గాంధీజీ, ఉయ్యాలలో ఉన్న ఈ పాపాయిని ఎత్తుకు ముద్దాడేవాడు. తండ్రి, తాతలు కారాగారంలో ఉన్నప్పుడు, నెహ్రూ కుటుంబంలోని స్త్రీలందరూ నాలుగేళ్ళ ఇందిరను వెంటబెట్టుకుని గాంధీగారి సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళారు. జాతీయకాంగ్రెస్ వార్షిక సమావేశం జరుగుతున్న దక్కడ. నాన్నకోసం, తాతయ్యకోసం కన్నీరు మున్నీరౌతున్న ఇందిరకన్నులు గాంధీజీని చూడడంతో, ఆయన ప్రేమపూరితమయిన ఆదరాభిమానాలతో ఊరట పొందాయి. అప్పటిదాకా హంసతూలికాతల్పాలవంటిపరుపులమీద సాగించిన ఇందిరకు,

కఠోర నియమబద్ధమైన ఆశ్రమజీవితం చూడడం అదే మొదటిసారి — "తెల్లవారు ఝామున నాలుగింటికే లేవడం, సబర్మతీతీరాన ప్రార్థనకు హాజరుకావడం, రుచీ పచీ లేని సామాన్య భోజనం చెయ్యడం, కటికనేలమీద పరుండడం, అంట్లు తోమడం, ఇల్లు ఊడ్చి, కడగడం"* ఆదిలో యివి కొంచెం కష్టంగానే ఉండిఉండవచ్చు ; కాని చిన్నపిల్లలుగా ఉన్నప్పుడయితే కష్టపడవలసివచ్చినా అదేదో ఘనకార్యం చేస్తున్నా మనే సంతోషం ఉంటుంది.

ఆశ్రమనియమాల్ని ఇందిర ప్రతిఘటించిందని కాని, వాటిపట్ల అయిష్టం ప్రకటించిందని కాని అనుకోవడానికి ఆస్కారం లేదు. రాజకీయోద్యమాలలో పాల్గొన డంలో వచ్చే కష్ట, సుఖాలు అవగతం కావడానికి ముందే సబర్మతీ ఆశ్రమంలో కొద్దికాలంపాటు పొందిన శిక్షణ భావికి ఉపకరించింది.

కొన్నాళ్ళ తరువాత తిరిగి ఆనందభవనం చేరింది. ఈనాడు ఆనందభవనంలో వెనకటి విలువయిన సామానులేమీ లేవు. ప్రాసాద వైభవంమాత్రం ఒంటరిగా మిగిలి, మోతీలాల్, జవహర్‌లాల్‌లు లేకపోవడంవల్ల అది మరీ దిగులుగా కని పిస్తోంది. ఇంట్లో ఆడువారందరూ—అమ్మా, నాయనమ్మాకూడా—రాజకీయాలలో మునిగిపోయారు. తరుచుగా ఇందూని ఇంట్లో విడిచేపి వెడుతూండేవారు. ఖద్దరు పైజమా, చొక్కా, గాంధీటోపీ వేసుకుని మగపిల్లల్లాగే మీటింగులకీ, ఊరేగింపులకీ వెళ్ళే మేనత్తలు స్వరూప్, కృష్ణలను చూస్తూంటే ఇందూకి కొంచెం ఈర్ష్యగానే ఉండేది. ఇల్లు కదలనిచ్చేవారు కాదు కనక తనకు సరిపడే ఖద్దరుదుస్తులు కుట్టించు కుని, గాంధీటోపీతో, ఆమె కాంగ్రెస్ వలంటీర్‌నే అనే సంతోషంతో తన బొమ్మల సైన్యానికి ఉత్తరువులు జారీచేసే అర్హత తనకు వచ్చిందని భావించేది.

తన కుటుంబంలోనివా రందరూ ఎటువంటి రాజకీయ వాతావరణంలో యిరు క్కున్నారో తెలుసుకోగల జ్ఞానం లేకపోయినా, ఆమెకూడా ఎంతో హడావుడిగా కాల క్షేపం చేస్తూఉండేది. కోటవంటి ఆనందభవనంలోంచి వీధిలో త్రివర్ణపతాకాలతో ఊరేగుతూవెళ్ళే కాంగ్రెస్ వలంటీర్లను చూసినప్పుడు ఆమెలో కలిగే ఆవేశాన్ని అప్పు డక్కడి ఆయా నిరోధించి ఉండకపోతే నాడే ఆమె ఆ బృందాలలో చేరిఉండేది. రాత్రులలో విదేశీవస్త్రాలన్నీ కుప్పపోసి పెద్ద నెగళ్ళంటించి తగలబెట్టేవారు. హోలీ ముందునాటి మోస్తరుగా ఆ జ్వాలలు ప్రజ్వరిల్లేవి. అయితే ఈ జ్వాలలు కర్రా కంపాతో వచ్చేవి కాదు. సూట్లూ, కోట్లూ, చీరలూ, సిల్కులూ ఆహుతయేవి! విదేశీ వస్త్రదహనం స్వదేశీ ఉద్యమంలో ఒక భాగం. ఆంగ్ల వస్తు బహిష్కారం అందుకు దోహదకారి. స్వపరిపాలనకు ఆర్థిక స్వాతంత్ర్యమే ప్రధానమని భావించడంవల్లనే గాంధీజీ ఈ మార్గం అనుసరించాడు.

---

*B. R. Nanda: *The Nehrus*.

ఈ గొడవంతా ఇందిర కేం తెలీదు. తెలిసిందల్లా తాత, తండ్రుల విదేశీ సూట్లూ, షేర్వాణీలూ, తల్లివీ, నాయనమ్మవీ విదేశీ సిల్కుచీరలూ తగలబెట్టడమే. మొట్టమొదటి సారి తండ్రితో ఘర్షణ పడ్డ రోజు ఆమెకు గుర్తుంది. తోట ప్రహరీగోడవతల... ఒక రోజు రాత్రి.... పెద్దమంటలు లేచి... ఆకాశంలో నెరసులు పడుతున్నాయి. అక్కడి కెళ్ళి మిగిలిన పిల్లలందరిలానే దానిచుట్టూ గంతులేస్తూ తిరగా లనిపించింది. "ఇప్పుడింక నిద్రపోవాలమ్మా" అంటూ జవహర్‌లాల్ ఆమెను ఇంట్లో ఉంచేశాడు. అయిష్టంగా, నసుగుతూనే పక్కమీద చేరింది.

ఆ వైముఖ్యం ఎంతోసే పుండలేదు. తండ్రి జైలుకెళ్ళినప్పుడు ఆయన తన దగ్గరికి ఎప్పుడొస్తాడా అని రోజులు లెక్కపెడుతూ కూర్చుంది. ఆయనకూ, ముద్దుగా పిలుచుకునే 'ప్రియదర్శిని' (ఇందిర)ని విడిచిఉండడం కష్టంగానే ఉండేది. "ఆమెను చూసి రేపటికి మూణ్ణెల్లవుతుంది" అని తన స్నేహితుడికి రాసిన ఉత్తరంలోకూడా ఉటంకించారు. ఆమెను తీసుకొచ్చినప్పుడు దుర్బలంగా, రక్తహీనంగా ఉన్న ఆమెను చూసి ఆందోళనపడ్డాడు.

"ఇందూకి చదువు చెప్పించే యేర్పాట్లు చేస్తే బావుండేది. నే నుంటే నేనే చూసుకునేవాణ్ణి. కాని, నే నిక్కడ నాలుగోనెంబరు గదిలో ఉన్నాను" అన్నా డాయన పక్కనున్నవారితో. ఇంకా ఉత్తరాలు చదవగల శక్తి రాని రోజులలోనే, ఆమె కొక ఉత్తరం రాస్తూ "ఇందుకి ముద్దులు. నువ్వు తొందరగా ఆరోగ్యవంతురాలివి కావాలి. అక్షరాలు రాయడం నేర్చుకుని, వచ్చి న న్నిక్కడ కలుసుకో. నిన్ను చూడాలని ఎంతగానో ఉంది. (దాదూ) తాత తెచ్చిన చరఖా వడుకుతున్నావా? నువ్వు తీసిన దారం నా కొంచెం పంపించు. అమ్మతో కలిసి ప్రార్థనలు చేస్తున్నావా?" అని మరో రెండు నెలలకే రాశాడు.

మరోనెల గడిచింది. కుటుంబం అంతా కలిసి కలకత్తా వెళ్ళినప్పుడు రాసిన ఉత్తరంలో, "అమ్మాయి ఇందిరకు, నాన్న ముద్దులు. కలకత్తా నీకు నచ్చిందా! బొంబాయికంటె బావుంటుందా? అక్కడ 'జూ' చూశావా? ఏ ఏ జంతువు లున్నా యక్కడ? అక్కడున్న పెద్ద చెట్టు కనిపించిందా! నువ్వు యింటికి వెళ్ళేలోగా బాగా ఒళ్ళుచేసి బలం తెచ్చుకోవాలి" అన్నాడు.

నాన్న జైలునుంచి వచ్చేసరికి ఇందూ సంతోషానికి పట్టపగ్గాలు లేవు. ఇప్పుడింక ఎప్పుడూ నాన్నతో ఉండి, ఆడుకుంటూ, షికారుచేస్తూ, సందేహాలన్నీ తీర్చుకో వచ్చు అనుకుంది. అది కొన్నాళ్ళే సాగింది. ఇంటిదగ్గ రున్నంతసేపూ జవహర్లాల్ తన బిడ్డతోనే గడిపేవాడు. అయితే ఇంట్లో ఉండడ మనేదే అరుదు కదా! ఆయన రోజులన్నీ కాంగ్రెస్ కార్యకలాపాలకోసమే వినియోగపడేవి. ప్రయాణాలు సాగిస్తూ, ఉపన్యాసాలిస్తూ, సభా, సమావేశాలకు వెడుతూ, వాడవాడలలో కాంగ్రెస్‌సంఘా లేర్పాటుచేస్తూ తిరగడంతోనే సరిపోయేది. ఇందిర స్కూళ్ళు మారుతూండేది - ఢిల్లీ

కిండర్ గార్టెన్ స్కూల్లో కొన్నాళ్ళు, అలహాబాద్‌లోని కాన్వెంటు స్కూల్లో కొన్నాళ్లు, మరో బోర్డింగు స్కూలు....

"తరుచుగా నేను స్కూళ్ళు మారుతూండేదాన్ని. ఎన్ని మారానో నాకు గుర్తు లేదు" అంది ఇందిర. ఆరోయేట సెయింట్ సిసీలియా స్కూల్లో చేర్పించారు. దాన్ని అలహాబాద్‌లో కొందరు యూరపియన్ స్త్రీలు నడిపేవారు. అయితే ఈ ఏర్పాటు జవాహర్లాల్‌కి నచ్చలేదు. ఇందూను ఈ స్కూల్లో చేర్పించే విషయమై తండ్రీ-కొడుకులు ఘర్షణపడ్డ విషయం గాంధీవరకూ వెళ్ళింది. ఆ సంగతి విన్న మోతీలాల్ అటువంటి ఘర్షణేమీ లేదనీ, అదంతా బూటకమనీ గాంధీకి టెలిగ్రాం పంపాడు. జవాహర్లాల్‌కున్న అభ్యంతరం సహాయనిరాకరణోద్యమ హేతువువల్ల కాదనీ, కేవలం విద్యాబోధనకు సంబంధించినదే అనీ వివరించా డందులో. "తన యీడు పిల్లలతో ఎక్కడో ఓ చోట కలిసిమెలిసి తిరిగే అవకాశం కల్పించడమే నా ఉద్దేశం. అందుకు జవహర్లాల్ కాదనలేదు" అని మోతీలాల్ స్పష్టంచేశాడు.

పట్టుమని పదిరోజులపాటు ఎక్కడా స్థిరంగాఉండే అవకాశం ఇందిరకు లేక పోవడంవల్ల తన ఈడుపిల్లలతో కలిసి మెలిసి తిరిగే 'యిది' కూడా ఆమెకు లభించ లేదు. తరుచుగా తండ్రి జైలు కెడుతూండడం, తల్లికి తరుచు జబ్బు చేస్తూండడం - అప్పటికప్పుడే అది ఆ నాటికి అసాధ్యమయిన క్షయవ్యాధిగా మారడం జరిగి పోయింది. అందువల్ల కుటుంబంలో స్తిమితం బాగా లోపించింది. ఇహ ఇందిరకు ఎప్పుడూ పాఠశాలగా ఉన్నది తండ్రి పుస్తక భాండాగారం. చెదపురుగులా, పుస్తకాలు, విడవకుండా చదివేది. తన ఈడుపిల్లలు కాకమ్మ కథలు చదివేరోజుల్లోనే ఆమె షేక్స్పియర్, షాల నాటకాలు చదివేసింది.

ఆ రోజుల్లోనే ఆమె జోన్ ఆఫ్ ఆర్క్‌ను గురించి చదవడం తటస్థించింది. సాహసోపేతమైన ఆ బలిదాన గాథ ఆమెను ఉత్తేజితం చేసింది. ఓమాటు ఆమె ఉపాధ్యాయిని "నువ్వేం కాదలుచుకున్నావ్?" అని ప్రశ్నించింది. ఏ టీచరో్నో, డాక్టరో్నో, పోర్షియాలా లాయరో్నో అవుతానని అంటుందనుకుని ఆశించిన ఆమె "నేను జోన్ ఆఫ్ ఆర్క్‌లా అవుదామనుకుంటున్నాను" అని ఇందిర యిచ్చిన సమాధానంతో చకితురాలయి ఉంటుంది. ఆటబొమ్మల తిరుగుబాటుతో ఆరంభమయిన జీవితం క్రమపరిణామం చెంది ఆత్మార్పణ కాంక్షవరకూ చేరింది.

# 5

# విశ్వమొక విద్యాలయం

ఒక ఉపగ్రభూమిని, ఒక పర్వతాన్ని, ఒక సముద్రాన్ని, ఒక నదిని చూడు. సమస్తాన్నీ దర్శించు.

—సోక్రటీస్.

చిన్నవారికి విద్యావిజ్ఞానాలు, పెద్దవారికి అనుభవమూ యాత్రలవలన లభ్యమౌతాయి.

—బేకన్.

ఇందిర పెరిగి పెద్దదవుతోంది.

ఆనందభవనం ఆనాటి కానాడు యాత్రిక శిబిరంగా రూపొందుతోంది. ఒక్కొక్కప్పుడు ప్రముఖవ్యక్తులు చేరుతూండేవారు. పరిచితస్వరాలు వినిపిస్తూంటాయి. గాంధీమహాత్ముడు వచ్చి ప్రశాంత వాతావరణం ప్రవేశపెడతాడు. ఆయన ఘనతను గ్రహించే శక్తి లేకపోయినా ఆ సన్నిధానంలో, చల్లని నవ్వులో ఇందిర అనిర్వచనీయ శాంతిని అనుభవించేది. ఆలీ సోదరులు—మహమ్మదాలీ, షౌకతాలీలు—పొడుగాటి, నల్ల అరబ్బీ దుస్తులలో హఠాత్తుగా ఊడిపడుతూండేవారు. వారి గంభీరగాత్రాలు ఆనందభవనంలో ప్రతిధ్వనిస్తూండేవి. భారతీయ వైద్యబృంద నాయకుడుగా టర్కీ వెళ్ళిన డాక్టర్ ముక్తార్ అహమ్మద్ అన్సారీ ఢిల్లీనుంచి దిగుతూండేవాడు. ఆయన టర్కీ విప్లవగాథలు ఏకరుపెడుతూండేవాడు. నల్లని చిన్నగడ్డంతో జవహర్లాల్ మిత్రుడు మౌలానా అబుల్‌కలాం ఆజాద్ వచ్చిపోతూండేవాడు. ఆయనకు చిరాకెక్కువే ఉన్నా, బహుమర్యాదగా ఉండేవాడు. గుజరాత్‌నించి వల్లభాయ్ పటేల్ వచ్చేవాడు. ఆయన కొంచెం మోటుమనిషి. నిర్మొహమాటి. బార్డోలీరైతుల తిరుగుబాటు గాథలు కవిలె కట్ట విప్పేవాడు. ఇహ సరోజినీనాయుడు వస్తే ఇందూ ఆనందానికి పట్టపగ్గా లుండేవికావు. ఆమె చమత్కార ధోరణితో యింటిల్లిపాదినీ నవ్వించేది. కవితలు చదివి వినిపించి సంతోషపెట్టేది. హాలులో ఓమూల కూర్చుని, తండ్రి, తాతల మిత్రులు

చెప్పే కబుర్లు వింటూ, ఆ ధోరణిలో స్కూలు ఎగవేయడమే కాదు, ఆటపాటలు కూడా మరిచిపొయ్యేది. లాంఛనప్రాయంగా స్కూళ్ళు మారేదే తప్ప, ఆనందభవనం లోని తండ్రి గ్రంథాలయం, ఈ డ్రాయింగు రూమూ ఆమెకు ముఖ్యమయిన పాఠా లన్నీ నేర్చుకోవడానికి విద్యాలయాలే అయాయి.

మోతీలాల్ జవహర్‌లాల్‌లు ఇద్దరూ సర్వజనమిత్రులు. వారికి జీవితంపై విశ్వాసాసక్తులు అపారం. వారు ఇంటివద్ద ఉన్నప్పుడు ఇందూ అన్నిపండగలూ జరుపు కోవడానికి వీలుకలిగేది. హోలీపండుగ వస్తే ఇల్లంతా రంగులమయమయ్యేది. దీపావళి నాడు తోటలో బాణసంచా అపరిమితంగా కాల్చేవారు. దసరాకి ఇంటినంతనీ పచ్చని పూలతో అలంకరించేవారు. ఇక ఈద్ పండుగ వస్తే తన తండ్రీ, తాతా ముస్లిం స్నేహి తులకి అభినందనలు తెలిపేందుకు ఆమెను చక్కగా ముస్తాబు చేసేవారు. క్రిష్టమస్ పండుగకి ఆమెకోసం ఒక క్రిష్టమస్ వృక్షాన్ని నెలకొల్పేవారు. ఆరాత్రి వ్రేలాడగట్టిన ఆమె స్టాకింగ్స్‌లో అనేక బహూమతులు నింపేవారు. ఇక నూతన సంవత్సరాది పండుగ సంగతి సరేసరి! ఆవేళ పెద్దవిందు జరిగేది. క్రొత్త సంవత్సరం పేరిట కేక్‌ను కోసి పంచేవారు. అనేక బహూమతులు ఆమెకు లభించేవి. తండ్రి, తప్పని సరిగా, అనేక పుస్తకాలు పార్సిల్ చేసి పంపేవారు.

సత్యాగ్రహంచేసి జైళ్ళకువెళ్ళే సమయం వచ్చేది. అప్పుడు ప్రముఖ అతిథులు అందరూ ఒక్కొక్కరే జైళ్ళకి యాత్రలు సాగించేవారు. దేశం నలుమూలలా తలొక జైలులోనూ వారిని నిర్బంధించడం జరుగుతూవుండేది. మళ్లీ ఆనందభవనంలో నిర్జన, నీరవత్వాలు తాండవించేవి. వేసవిలో ఎప్పటికీ సంధ్యపడని మధ్యాహ్న సమయం లోనూ, శీతాకాలంలో నిరవధికమైన సాయంసమయాలలోనూ ఇందూ, ఒంటరిగా, ఆలోచనలతో సతమతమవుతూఉండేది. బొమ్మల ఆటలతో ఆమెకు విసుగెత్తిపోయింది. బొమ్మలతో ఆడుకునే వయస్సు పన్నెండేళ్ళకే తనకు మీరిపోయిందని భావించేది. పుస్తకపఠనంలో నిమగ్నురా లవుతూవుండేది. అవి పాఠ్యపుస్తకా లనుకునేరు— కాదు. తండ్రి తరుచుగా ఇస్తూండే విజ్ఞానగ్రంథాలు అవి. ఇంతేకాక ఎప్పటికప్పుడు అనేక దేశాలలోని ప్రచురణకర్తలవద్ద నించీ, గ్రంథవిక్రేతలవద్ద నించీ నెలనెలా వస్తూండేవి. పుస్తకాలతో నిత్యనూతనంగా విలసిల్లే తండ్రి గ్రంథాలయంలో కావలసి నన్ని పుస్తకాలు ఉండేవి. కాని ఒక్కొక్కప్పుడు ఆమెకి పుస్తకపఠనంకూడా విసు గెత్తేది. ఏదో చేయాలనే ఆకాంక్ష ఆమెను తపింపజేసేది.

లాహోరులో జరిగిన కాంగ్రెసు సభలకి తన తండ్రి అధ్యక్షత వహించిన ఉద్వేగభరితమయిన సంఘటనలు ఆమెకు జ్ఞాపకం. ముఖ్యంగా డిసెంబరు 31 వ తేదీ అర్ధరాత్రి రావీ నదీతీరంలో జవహరలాల్ స్వాతంత్ర్య పతాకాన్ని ఆవిష్కరించి "సంపూర్ణ స్వాతంత్ర్యం ఒక్కటే జాతీయోద్యమ పరమలక్ష్యం'' అని ప్రకటించిన పన్నివేశం ఆమె మనఃఫలకంపై గాఢమయిన ముద్ర వేసింది. లాహోరులో ఒకవంక

ఎముకలు కొరికివేస్తున్నా ఎంతో ఉత్తేజాన్ని కలిగించే ఆ చలి, చరిత్రాత్మకమయిన ఆ నిర్ణయంలోని విప్లవాత్మక ఉద్వేగ ఉత్సాహాలు, ఆ నిర్ణయ పర్యవసానంగా జరిగే పోరాటం, చేయవలసిన త్యాగాలు తలుచుకున్నప్పుడు కలిగే ఆవేశం, తండ్రిని ఎల్లప్పుడూ పరివేష్టించి వుండే యువజనులలోని పరవళ్లు తొక్కే ఉత్సాహం—ఇవన్నీ ఇందిరకి అత్యంత ఉత్తేజకరమయిన అనుభవాలు. ఈ అనుభవాలు ఆమెను ఎంతో ఉత్తేజితురాలిని చేయడమే కాక ఎంతో ఆనందదాయకంగా కూడా ఉండేవి. ముఖ్యంగా యువతీయువకులు కొంతమంది—ఇంచుమించు తన యీడువారు కూడా—కాంగ్రెసు వలంటీర్లు—విన్యాసం జరిపిన దృశ్యం ఆమె కెంతో ముచ్చటగొలిపేది. అందుచేతనే తాను కూడా ఖద్దరు చొక్కా, నిక్కరు, గాంధీ టోపీతో వలంటీరు దుస్తులు కుట్టించుకుంది. కత్తిరించిన జుట్టుతో, ఆమె, బక్కపలచగా మొగపిల్లవాడుగా కనపడేది. అందుచేతనే మోతీలాల్ నెహ్రూ తన సహజ హాస్యపుచో ధోరణిలో ఇతర రాష్ట్రాలనించి వచ్చిన కాంగ్రెసు నాయకులు కొందరికి "వీడు మా మనుమడు" అని పరిచయం చేసేవారు. వారుకూడా "అచ్చంగా తండ్రిలాగే వున్న ఈ జవహర్‌లాల్ కొడుకును" మనస్ఫూర్తిగా ఆశీర్వదించేవారు. ఇందిరకి రకరకాల దుస్తులు వేసుకోవడం ఎంతో సరదా. మరికొన్ని రోజులకి ఆమె పంజాబీ బాలికలాగా దుస్తులు వేసుకునేసరికి ఒకరు "మీ అన్నయ్య ఏడీ, ఈవేళ అతను కనపడలేదే" అని అడిగేవారు.

లాహోరునించి వచ్చాక ఒకరోజురాత్రి తండ్రి అతిముఖ్యమయిన ముసాయిదా తయారు చేస్తూండడం చూసింది ఆమె. అది స్వాతంత్ర్యసాధనదీక్ష. జనవరి 26 వ తేదీని స్వాతంత్ర్య దినంగా పాటించాలని నిర్ణయించారు. కాబట్టి ఆవేళ ప్రతి భారతీయుడూ ఆ దీక్షను వహించవలసి వుంటుంది. ముసాయిదా పూర్తికాగానే ఆయన దానిని ఇందిరకిచ్చి గట్టిగా చదవమన్నారు. "ఎలా వుందో విందాం" అన్నారు ఆయన. ఆమె ఆ ప్రతినను చదివినప్పుడు చక్కని ఆ పదాలలోని చారిత్రక ప్రాధాన్యం ఉట్టిపడింది :—

> "స్వాతంత్ర్యం భారతప్రజల - సర్వమానవుల - అనుల్లంఘనీయమైన జన్మహక్కని మా దృఢవిశ్వాసం. తమ శ్రమ ఫలితాన్ని తామనుభవించడానికీ, తమ నిత్యావసరాలను పొందడానికీ, తద్వారా పరిపూర్ణవికాసం చెందడానికీ వారికి సర్వ హక్కులూ వున్నాయి. ఏ ప్రభుత్వంగాని ఈ హక్కులను నిరాకరించి వారిని అణచివేయడానికి ప్రయత్నిస్తే అట్టి ప్రభుత్వాన్ని మార్చేందుకూ, నిర్మూలించేందుకూ కూడా ప్రజలకి హక్కువుందని మా దృఢవిశ్వాసం."

ఆ ప్రతినలో ఆమె చదివిన చివరిభాగం :—

> "దేశానికి నాలుగువిధాలా హానికరమయిన పరిపాలనకి బద్ధులమై ఉండడం మానవత్వానికీ, భగవంతునికీ కూడా అపచారంచేసినట్లే........ అందుచేత

బ్రిటిష్ పాలకులతో మనం ఐచ్ఛికంగా పెట్టుకున్న సంబంధాలను సాధ్యమై నంతవరకూ వదులుకుని శాసనోల్లంఘనానికి సంసిద్ధుల మవుదాము....."

ఇది చదవడం పూర్తికాగానే ఆమె నేత్రాలు నూతనోద్వేగంతో ప్రజ్వలించాయి. "ఇందూ, బాగా చదివావు, కాని-ఇది గట్టిగా చదవడంవల్ల నువ్వుకూడా ఈ ప్రతిన తీసుకున్నట్లే అయింది సుమా'' అని ఆయన హెచ్చరించాడు.

నిజమే. ఆమె తండ్రి, తాత, కుటుంబంలోని మిగతా బంధువులూ అనుసరించిన మార్గాన్ని నడవడానికి ఆమె దీక్ష వహించింది. వారంతా సత్యాగ్రహం చేసి, హేయమయిన బ్రిటిష్ శాసనాలను ధిక్కరించి అనేక జైళ్ళలో మ్రగ్గుతూఉంటే, ఆమె ఈనాడు, ఇక్కడ, బొమ్మలతో ఆడుకుంటూ, పుస్తకాలు చదువుకుంటూ తన గదిలో ఉండిపోవలసివచ్చింది. తనకు తోడుగా ఇప్పుడు బొమ్మలూ, పుస్తకాలతోబాటు రెండేళ్ళ క్రితం తను తల్లిదండ్రులతో విదేశాలకు వెళ్లి తెచ్చుకుని తన వ్రాతబల్ల దగ్గర గోడకి కొట్టుకున్న కార్డు బొమ్మలు మిగిలాయి....

స్టీమరుమీద ప్రయాణం ఆమెకి ఎంతో హాయిగా ఉండేవి. ఆడుకునేందుకు ఎందరో పిల్లలుండేవారు. కాని ఆమెకు తండ్రితో ఓడ పైభాగాన ఆడుకోవడమే సరదాగా వుండేది. చిట్టచివరకి ఎలాగయితేనేం, ఎల్లప్పుడూ తనతో ఆడుకునేందుకు తండ్రికి తీరిక చిక్కింది. నాన్న ఇప్పు డామెకు సొంతం. సాయంకాలం సూర్యుడు సముద్రంపైన, సుదూరమైన ఎడారి తీరంలోనూ అస్తమించే సమయంలో వారంతా ఓడ పైభాగంపైన కుర్చీలలో కూర్చునేవారు. నాన్న ఆమెకు జీవజాలం ఎలా ఉద్భవించిందీ, అశోకుడు, అక్బరు వంటి వివేకవంతులైన చక్రవర్తులు ఎలా పాలించిందీ, మానవజాతి విమోచనానికీ, వారి శ్రేయస్సుకీ గొప్ప విప్లవకారులు ఎటువంటి త్యాగాలు చేసి జీవితాలు అర్పించిందీ కథలుగా చెపుతూండేవారు.

వారు చాలాకాలం స్విట్జరులాండులో గడిపారు. ఊపిరితిత్తుల వ్యాధితో బాధ పడుతున్న కమలకి ఆ దేశంలోనే చికిత్స జరిగింది. చక్కని పర్వతశ్రేణులూ, సుందరమయిన లోయలూ, మనోహ్లాదకరమయిన సరస్సులూకల దేశం అది. మాంటెసీ వద్దగల శానిటోరియంలో వారు గడిపిన శీతాకాలంలోనే ఇందిరకి ప్రప్రథమంగా 'మంచు' అంటే ఏమిటో తెలిసింది. ఆ అనుభవం ఆమెకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. వెచ్చని ఉన్నిదుస్తులు వేసుకొని అస్తమానమూ మంచులోనే ఆడుకోవాలనిపించింది ఆమెకి. తండ్రితో పాటు స్కేటింగ్‌కీ, స్కీయింగ్‌కి వెళ్ళేది. ఎన్నోసార్లు పడుతూ లేస్తూ రాగా, చివరకి ఎలాగయితేనేం ఈ హిమాలయ క్రీడలలో నైపుణ్యం లభించింది. వారు లండన్, ప్యారిస్, బెర్లిన్ వంటి ఇతర నగరాలకి కూడా వెళ్లారు. పదేండ్ల ఇందిరని ఆయా నగరాలలోని కళ్లు చెదిరిపోయే వింత దృశ్యాలు ఆనందాశ్చర్యాంబుధిలో ముంచివేసేవి. అక్కడి హోటళ్లు బ్రహ్మాండంగా ఉండేవి. ఆనందభవనం కంటేను కూడా. వీథులలో తిరిగే ప్రజలు చక్కని దుస్తులలో

కనిపించేవారు. పిల్లలు ఆరోగ్యంగా ఎఱ్ఱని బుగ్గలతో ఎంతో ఆరోగ్యంగా కనిపించేవారు. ధగధగ మెరిసే కారులు రోడ్లమీద తోరణంలా సాగిపోతూండేవి. దుకాణాల్లో చక్కని ఖరీదయిన వస్తువులు ఎన్నో ఉండేవి. వాటిలో కొన్నింటిని తాతగారు ఎంతో ముచ్చటపడి ఆమెకు కొనియిచ్చేవారు. కాని అక్కడి దృశ్యాలు చూస్తే తన స్వదేశంలోని స్థితిగతులు ఆమెకు జ్ఞాపకం వచ్చేవి. తమ స్వంత ఊరు అలహాబాదులో ఊగిస లాడుతూ ఉండే టాంగాలూ, గతుకుల రోడ్లపై సాగిపోయే బండ్లూ, వీథులలో ముసిరే బిచ్చగాండ్రూ, కుష్ఠురోగులూ, మురికి సందులలో ఆడుతూండే దిగంబరులయిన బాల బాలికలూ ఆమెకి గుర్తు వచ్చేవారు. తెలిసీతెలియని ఆమె పసి మనస్సుకీ కొట్టవచ్చినట్లు కనిపించే యంత్రాలు ఎంతో వేదన కలిగించేవి. అస్పష్టమయిన ప్రశ్నలు ముసురుకునేవి. కాని ఒకరోజున తండ్రి ఆమెను కూర్చోబెట్టి పాశ్చాత్య దేశాలలో కనిపించే యీ సంపద అంతా, భారతదేశంవంటి వలసదేశాలనించి పీల్చి పిప్పిచేసి సంపాదించిందేనని వివరంగా చెప్పాడు. పుష్కలమయిన సంపద గల పాశ్చాత్యదేశాలలో కూడా పేదరికంలో వున్న పేదప్రాంతాలు లేకపోలేదని ఆయన చూపించాడు. లండన్, ప్యారిస్ వంటి నగరాలలోని మురికి పేటలలో వెలుతురు చొరని ఇరుకుటిళ్లు ఎన్నో ఉన్నాయని ఆయన పేర్కొన్నాడు. దీనినిబట్టి పాశ్చాత్య దేశాలలోకూడ దారిద్ర్యం, స్వలాభపరాయణత్వం లేకపోలేదని చెప్పా డాయన.

ఆమెతల్లితండ్రులు యూరపులో ఉన్నప్పుడు ఇందిరని మూడు స్కూళ్లలో చేర్పించారు. వీటిలో ఒకటి జినీవాలో నానారాజ్య సమితి (League of Nations) నడిపే అంతర్జాతీయ పాఠశాల. మరొకటి బెక్స్‌లోని 'ఎకోలే నవెల్లి' నూతన పాఠశాల. రాజకీయ వాతావరణంలో పెరిగిన యీ భారతీయ బాలికకి ఆ పాఠశాలలోని మిగతా బాలికలు ప్రదర్శించే చిన్నతనపు చేష్టలూ, ఆటపాటలూ అతి అల్పమయినవిగా తోచేవి. సరిగ్గా ఆమె తండ్రికీకూడా, చిన్నప్పుడు - హారోలో చదువుకున్నప్పుడు- తోటి విద్యార్థులలో కనిపించిన రాజకీయ స్తబ్ధత, అజ్ఞానం నిశ్చేష్టుడిని చేసేవి. సెలవలలోనూ, ఒక స్కూలు మాని మరోస్కూలులో చేరే మధ్యకాలంలోనూ ఇందిర తన తల్లితండ్రులతో ఆనందంగా గడిపేది. వీలయినప్పుడల్లా తండ్రితో ప్రపంచంలోని ప్రముఖవ్యక్తులను, ప్రజలను కలుసుకోవడానికి వెడుతూండేది.

తన తండ్రి, తాతలవంటి భారతజాతీయనాయకులపట్ల సానుభూతితో స్నేహం చేసే పాశ్చాత్యులను చూసినప్పుడు ఇందిరకి మొదట్లో ఆశ్చర్యం కలిగేది. తరువాత వారంటే అభిమానం ఏర్పడేది. స్విట్జర్లాండులో వున్నప్పుడు ఆమె రొమే రోలా యింటికి వెళ్లింది. తన తండ్రీ, ఆ ప్రఖ్యాత ఫ్రెంచి రచయితా ప్రపంచంలోని స్థితిగతులూ, ఫాసిజంవల్ల ఏర్పడబోయే అనర్థాలూ, భారతస్వాతంత్ర్య సమస్యా వంటి విషయాలు చర్చించుకుంటూవుంటే, తా నొక మూల నిశ్శబ్దంగా కూర్చుని, వాటిని ఆలకిస్తూండేది. తన తాతగారితోగాని, తండ్రితోగాని వెళ్ళినప్పుడల్లా ఆమెకి వారి సంభా

షణలు అర్థమయ్యేవని కాదు; రోలావంటి వ్యక్తుల గొప్పతనాన్ని, వారి అపారమేధా శక్తిప్రభావాన్ని తెలుసుకో గలుగుతుందనే భావంతోనే జవహర్‌లాల్ ఆమెను కూడా తీసుకువెళ్ళేవారు. ఇక తరువాతికాలంలో ఆమె తనతండ్రితో వెళ్ళి రోలా, ఎర్నెస్ట్ టోలర్, ఐన్‌స్టీన్, బెర్నార్డ్‌షా, ఛార్లీచాప్లిన్ వంటి ప్రపంచ విఖ్యాతిచెందిన రాజనీతి వేత్తలను, విప్లవకారులను, మహారచయితలను, విజ్ఞానశాస్త్రవేత్తలను కలుసుకో వలసివచ్చింది. ఈ సమావేశాలు ఆమె విజ్ఞాన వికాసాలకి ఎంతో దోహదంచేసేవి. ప్రపంచంలోని మహావ్యక్తులను కలుసుకున్న ప్రతి సన్నివేశమూ ఆమెకి తన తండ్రి గొప్పతనాన్ని గుర్తుకు తెచ్చేవి. ప్రపంచమేధావులు ఆయనపట్ల చూపే ఆదరాభిమా నాలూ, గౌరవప్రపత్తులూ ఆయన గొప్పతనాన్ని గ్రహింపజేసేవి.

1927 ఫిబ్రవరిలో జవహర్‌లాల్ బ్రసెల్స్‌లో జరిగిన దళిత జాతీయుల మహా సభకి భారతజాతీయకాంగ్రెసు ప్రతినిధిగా వెళ్లివచ్చాడు. జావా, ఇండో-చైనా, పాలస్తీనా, సిరియా, ఈజిప్టు దేశాలనించీ, ఉత్తర ఆఫ్రికాలోని అరబ్బుల, ఆఫ్రికా లోని నీగ్రోల, యూరప్, అమెరికాల్లోని వామపక్ష కార్మికసంస్థల నించీ ఎంతమంది ప్రతినిధులు వచ్చినదీ ఆయన తనవారందరికీ చెప్పాడు. వారంతా సమావేశమై, ఉమ్మడి సమస్యలను చర్చించి, వలసల నిర్మూలనకి ప్రపంచవ్యాప్తంగా ఆందోళన సాగించేందుకుగాను సామ్రాజ్యతత్వ నిర్మూలనాసమితి ఒకటి ఏర్పాటుచేసుకున్నారు. ఇవన్నీ చెబుతూన్నప్పుడు ఆయన ఎంతో ఉత్తేజంతో, ఆనందోత్సాహాలతో కనిపించే వాడు. అందుచేత ఇది చాలా మంచిపనే అయివుండాలన్న నమ్మకం ఇందిరకి ఏర్పడింది.

ఆ తరువాత ఇందిర తప్ప, కుటుంబంలోని మిగతా వారంతా మాస్కో వెళ్లారు. రష్యాలో అక్టోబరు విప్లవం జరిగి పదేండ్లునిండిన వార్షికోత్సవాలకి వారిని ప్రత్యే కంగా ఆహ్వానించారు. "చరిత్రలో అత్యద్భుతమయిన సంఘటనలలో ఒకటి"— అంటూ తండ్రి తనకు వ్రాసిన లేఖలో అభివర్ణించిన ఈ ఉత్సవాన్ని తాను స్వయంగా చూడడానికి లేకపోయిందిగదా అని ఇందిర ఎంతో విచారించింది. అక్కడినించి తిరిగి వచ్చాక, జవహర్‌లాల్, ఆమెకు, సోవియట్ భూమిలో తాను గమనించిన గణ నీయమయిన పరిణామాన్ని వివరించి చెప్పాడు. "భూస్వామికదేశంగా ఉండేదల్లా హఠాత్తుగా అభ్యుదయ పారిశ్రామిక దేశంగా పరిణామం చెందింది. సాంస్కృతిక రంగంలో అద్భుతమయిన అభ్యుదయాన్ని సాధించింది. ఇక సాంఘికభద్రతా కార్య క్రమాలలో చెప్ప నవసరమే లేదు. సామాజిక ఆరోగ్యవిధానమూ, ప్రమాదాల నివార ణకి భీమాసదుపాయాలూ అందరికీ వర్తిస్తాయి. ప్రపంచంలో ఎక్కడా అంత అభ్యు దయం సాధించలేదు. ప్రపంచంలోని ఇతర దేశాలందలి కార్మికులలో గోచరించే నిరుద్యోగ భయమూ, పస్తులభయమూ అక్కడ లేవు. అక్కడి ప్రజలలో ఆర్థిక భద్రత లభించిందన్న నూతనభావం ప్రబలంగా వుంది." అని వివరించాడు.

తన తండ్రి, తాత, తల్లి, మేనత్త కృష్ణ—వీరందరూ చేసిన వర్ణనలనుబట్టి, ఇందిర వారి వారి అనుభవాలను తెలుసుకున్నది. వారు నెమ్మదిగా సాగిపోయే రైలులో పోలెండు మీదుగా ప్రయాణంచేసి, నవంబరు 7-వ తేదీ రాత్రికి సరిహద్దులో గల నైగరోలొజీ అనే పట్టణాన్ని ఎలా చేరుకున్నదీ, సరిహద్దులో గల ఆ పట్టణాన్ని అరుణపతాకాలతోనూ, సోవియట్ చిహ్నాలైన కొడవలి, సుత్తి బొమ్మలతోనూ, లెనిన్ చిత్రాలతోనూ ఏవిధంగా అలంకరించిందీ తెలుసుకుంది. ఇవన్నీ వింటూంటే తన తండ్రీ, తాతా రాజకీయ పర్యటనల సందర్భంగా గ్రామాలకి వెళ్లినప్పుడు అక్కడ తోరణాలతో, పతాకాలతో చేసే అలంకారాలు ఆమెకు గుర్తువచ్చాయి. ఆ సరిహద్దు పట్టణంలో ఈ భారతీయ అతిథులకి ఏవిధంగా హృదయపూర్వకమయిన స్వాగతం యిచ్చినదీ, అక్కడి అమాయకులయిన గ్రామీణప్రజలు—వారిలో కొందరు స్త్రీలుకూడా ఉన్నారు—చీరలు ధరించిన ఈ భారతీయ మహిళలను చూచి ఎంతగా అబ్బురపాటు చెందిందీ ఇందిర తెలుసుకుంది.

"సహాయ నిరాకరణోద్యమం రోజులలో కాంగ్రెసు ప్రతినిధివర్గం ఒక చిన్న గ్రామానికో, పట్టణానికో వెళ్లిననాటి పరిస్థితులకీ, ఈ సరిహద్దు పట్టణంలో వారికి లభించిన ఆతిథ్యానికీ ఎక్కడా పోలికేలేదు" అని మోతీలాల్ నెహ్రూ మనమరాలికి చెప్పారు.

మాస్కోలో విప్లవం చరమ దశను లెనిన్ ఏ హోటలునించి నడిపించాడో, ఆదే గ్రాండ్ హోటలులో తమ కుటుంబంవారందరికీ వసతి చూపించిన సంగతికూడా ఇందిరకి తెలిసింది. "మాస్కోలో అతివిలాసాలకీ, అతిదారిద్ర్యానికీ మధ్య అంతరాలు కనిపించవు. కులసర్గతత్వాలు గోచరించవు. రైలుస్టేషనులో పోర్టరునుగానీ, హోటలులో సర్వరునుగానీ టోవరిష్—కామ్రేడు—గా పరిగణిస్తారు. కామ్రేడనే పిలుస్తారు. ప్రతిభనుకానీ, హోదానుకానీ డబ్బును బట్టే, వేతనాన్ని బట్టే నిర్ణయించరు" అని జవహర్‌లాల్ తన కుమార్తెకు అక్కడి స్థితిగతులు వివరించి చెప్పాడు.

నాట్యం నేర్చుకోవాలని ఇందిరకి ప్రత్యేకమైన ఆసక్తి ఉండేదేమో—అక్కడి బోల్‌షాయ్ నాటకరంగాన్ని గురించి చెబుతున్నప్పుడు, చెవులు రిక్కించి, అత్యంత శ్రద్ధతో వినేది. అక్కడగల అత్యంత ఆధునికమయిన వసతులను గురించీ, నాటక రంగంపై వారు దర్శించిన అద్భుత ప్రదర్శనను గురించీ, శ్రోత్రపేయంగా ఆనందించిన మధురగానాన్ని గురించీ అత్యంతాసక్తితో తెలుసుకుంది. సరిగ్గా తనయీడు పిల్లలే—ఒకబాలుడు, బాలిక—రంగంమీదికి వచ్చి, అత్యంత నైపుణ్యంతో, ఆనంద దాయకంగా, స్వానుభవపూర్వకమయిందిగా గోచరించినట్లు జరిపిన దృశ్యాన్ని అభివర్ణించినపుడు ఆమెఒడలు పులకించింది. సోవియట్ రాజధాని మాస్కో నగరాన్ని కన్నులకు కట్టినట్లు తెలియజెప్పే కార్డుసైజు బొమ్మలు ఎన్నింటినో తండ్రి ఆమెకోసం తెచ్చారు.

ఇప్పుడు ఆ బొమ్మలలో కొన్ని గోడకి కొట్టివున్నాయి. మరికొన్ని యారవులో తీపిన తన ఆప్తుల ఛాయాచిత్రాలతోపాటు ఆల్బంలో జాగ్రత్తగా పదిలపరచబడి వున్నాయి. ఆమెకి ఏమీ తోచనప్పుడు, ఈ ఆల్బంలోని పేజీలు తిరగేసి, ఆ ఫోటోల లోని దృశ్యాలతాలూకు జ్ఞాపకాలను నెమరువేసుకోవటం ఆమెకు పరిపాటి. కాని ఈ వేళ దానివల్లకూడా ఆమెకు ఊసుపోలేదు. ఈనాడు ఆమె యౌవనమూ, వయస్సూ వంటి పెద్ద సమస్యలనుగురించి ఆలోచిస్తోంది. దానికి కారణం ఒక్కటే. తమ యింటిప్రక్కనే ఉన్న 'స్వరాజ్య భవన్'లో - తన తాత దేశానికి కానుకగాయిచ్చిన భవన మది - ఉన్న కాంగ్రెసు కార్యాలయంవారు తనను కాంగ్రెసులో సభ్యురాలుగా చేర్చుకోవడానికి, మరీ పసిపిల్ల అన్న కారణంచేత, నిరాకరించడమే. అక్కడి కార్య కర్తలలో ఒకాయన, "నీకు బొత్తిగా పన్నెండేళ్ళే. నీకు పూర్తిసభ్యత్వం లభించా లంటే 21 ఏండ్లు నిండాలి" అన్నాడు. మరొక ఆయన "కనీసం 18 ఏండ్లయినా నిండాలి" అన్నాడు. దానితో ఆమెకు కోపంవచ్చి "సరేలేండి, మరో ఆరేళ్ళు పోయాకే మిమ్మల్ని కలుసుకుంటాను" అని ఉద్రేకంతో దబదబా అడుగులు వేసేసు కుంటూ వచ్చేసింది.

బహుశా తన మూగబొమ్మలని చూస్తూంటే, తాను కాంగ్రెసు దళంలో చేరితే బాగుండుననే భావం ఆమెకు తట్టిఉంటుంది. బ్రిటిష్ రాజరికాన్ని ధిక్కరించడానికి తన బొమ్మలని నడిపించగలిగినప్పుడు, తన యీడుపిల్లలని పోగుచేసి వారికి వేరే ఒక సంస్థని ఎందుకు నడపకూడదు? ఈ విషయాన్ని ఆమె ఇరుగుపొరుగున ఉన్న కొందరు పిల్లలతో సంప్రదించింది. వాళ్ళు మరికొందరితో చెప్పారు. క్రమంగా అది అలహాబాదులోని పాఠశాల లన్నిటిలోనూ ప్రాకింది. పిల్లలు ప్రత్యేకంగా ఒక 'కాంగ్రెసు' ఏర్పాటు చేసుకుంటున్నారని, ఇందిరా నెహ్రూ దానిని ఏర్పాటు చేయ బోతోందని గుసగుసలు బయలుదేరాయి. త్వరలోనే నగరంలోని బాలబాలికలందరూ ఎంతో ఉత్సాహంతో దానికోసం ఎదురుచూడసాగేరు.

మొట్టమొదటి సభకే అనేకవేలమంది బాలబాలికలు వచ్చారు. ఇందిర ఆ సభలో ప్రసంగించి, వారు ఏం చేయవలసిందీ చెప్పాలనుకుంది. కాని అంతమంది పిల్లలూ ఒకచోట సమావేశం కావడంతో, వారుచేసే గోలలో సన్నని ఈమెకంఠం ఎవరికీ వినపడలేదు. తనమాట వారికి వినిపించేటట్లు చేయడానికి, ఆమె, కొంతసేపు ప్రయ త్నించి, చివరికి ఒక కొత్తపద్ధతి అనుసరించింది. విశ్వంభరనాథ్ పాండే అనే ఒక యువకాంగ్రెసు కార్యకర్తను జనంమధ్యలో నుంచోమంది. తాను అనే ప్రతిమాటనీ గంభీరస్వరంతో తిరిగి ఉచ్చరించవలసిందిగా ఆతన్ని కోరింది. ఈ విధంగా వరుసగా కొందరిని నిలబెట్టి, తనమాటలను వారిచే తిరిగి ఉచ్చరింపజేస్తూ, అందరికీ తన ప్రసంగం అర్థమయ్యేలా చేసింది. పిల్లలుకూడా కొంతసేపటికి దారిలో పడ్డారు. అల్లరి కొంత సద్దుమణిగింది. చివరికి సమావేశం కార్యక్రమ నిర్వహణకు ఉపక్రమించింది. తనను వలంటీరుగా చేర్చుకోవడానికి కాంగ్రెసు కార్యకర్తలు ఏ విధంగా నిరాకరించిందీ

సభాసదులకి తెలియజెప్పింది. "కాని ఇప్పుడు మనకి ప్రత్యేకంగా బాలల సంస్థ ఒకటి ఏర్పాటయింది. మనంకూడా దేశానికీ, కాంగ్రెసుకీ సేవచేయవచ్చు. పసివారన్న కారణంచేత ఎవరికీ ఇందులో ప్రవేశాన్ని నిరాకరించడం జరగదు" అని ప్రకటించిందామె. అంతేకాదు. "కాని ఒక్కటిమాత్రం నిజం. 21 ఏండ్లకి పైబడినవారి నెవరినీ ఈసంస్థలో చేరనివ్వం" అని ఆమె ఉద్ఘాటించేసరికి నవ్వులూ, చప్పట్లూ తరంగాలుగా వ్యాపించాయి.

ఈ బాలల సంస్థకి అప్పటి కింకా పేరేమీ పెట్టలేదు. కాని అది జాతీయ కాంగ్రెసుకి అనుబంధమయిన జూనియరు సంస్థగా వుంటుందని భావించేవారు. ఈ సంస్థ వారు బారులుతీరి విన్యాసాలు, కవాతు చేయటమే కాక, కాంగ్రెసులోని గౌరవ కార్యకర్తలు నిర్వర్తించే తేలిక పనులుకూడా చేపట్టేవారు. వ్రాయడం, కాపీలు తీయడం, కాంగ్రెసు కరపత్రాలు పంచిపెట్టడం, పతాకాలు తయారుచేయడం, ఊరేగింపులకీ, సభలకీ అలంకారాలు చేయటం, కాంగ్రెసు ప్రధాన కార్యాలయంలో ఉండే వలంటీర్లకి భోజనపదార్థాలు వండడం, వేసవిరోజులలో ఊరేగింపులలో పాల్గొని ప్రజలకి మంచినీళ్ళు అందించడం వంటి చిన్నచిన్నపనులు వీరు చేసేవారు. కాని వీరు చేసే పనులలోకల్లా అతి కష్టమయినదీ, ప్రమాదభరితమయినదీ ఒకటి వుండేది. అది ఒక వ్యక్తివద్దనించి గానీ, వర్గంవద్దనించి గానీ మరొక వ్యక్తికీ, వర్గానికీ సందేశాలు అందించడం. వీరిలో కొందరు ప్రచ్ఛన్న కార్యకర్తలు. అంటే పోలీసులను తప్పించుకుని తిరిగే అండర్ గ్రౌండ్- పొడి అక్షరాలలో 'యు. జి.' - కార్యకర్తలు. ఆ రోజులని తలుచుకున్నప్పుడు ఇందిర ఇప్పటికీ ఉత్తేజితురాలు అవుతూవుంటుంది. "ఒక్కొక్కప్పుడు ఒక యింటిని పోలీసులు చుట్టుముడతారు. అలాటప్పుడు ఏ సందేశం పంపడానికీ వీలుండదు. అయినా పోలీసుల మధ్యనించి ఆడుతూ, పాడుతూ, గెంతుకుంటూ పోయే పసిపిల్లలని ఎవ్వరూ పట్టించుకోరు. అలాంటివారు సందేశాలు అందించగలరనికూడా యెవరూ అనుకోరు. అలాటప్పుడు, ఒక పిల్లవాడు, పంపవలసిన సందేశాన్ని కంఠస్థంచేసి తిన్నగా కావలసిన ఆసామివద్దకు పోయి "చేయవలసింది ఇది, ఇదికాదు. పోలీసులు అక్కడ ఉన్నారు. ఫలానావారిని అరెస్టు చేయబోతున్నారు, ఇవీ విశేషాలు' అని చెప్పేవాడు. పిల్లలు రహస్య సమాచారాన్ని సేకరించేందుకుకూడా తోడ్పడేవారు. ఎందుచేతనంటే పోలీసువారు తరుచుగా తమతమ స్టేషన్లముందు కూర్చుని ఎక్కడెక్కడ దాడిజరిగేదీ చెప్పుకుంటూ వుండేవారు. ఆ ప్రాంతంలో ఆటలాడే నలుగురైదుగురు పిల్లలని చూసినా, ఎవ్వరూ పట్టించుకోరు. వారు ఆ సంగతి తెలుసుకుని ఉద్యమంలోని మిగతావారికి ఆ సమాచారాన్ని చేరవేసేవారు."

ఇది చాలా ఉపయోగకరమయిన, బాధ్యతాయుతమయిన, ఒక్కొక్కప్పుడు ప్రమాదకరమూ అయిన పని. మొదట్లో ఇటువంటి ఏర్పాట్లగురించి చెప్పినప్పుడు అదెక్కడ సాగుతుందిలే అని కొట్టిపారవేసిన తలనెరిసిన పెద్దలే పిల్లలుచేస్తున్న

సేవను ప్రశంసించడం మొదలుపెట్టారు. జవహర్‌లాల్ జైలులో వుండగా, ఈ సంగతిని గురించి చెప్పినప్పుడు, తనకుమార్తె దక్షతకీ, నాయకత్వానికీ ఆయన యెంతో గర్వించాడు. ఆమె ఆప్తులందరూకూడా ఈ ఏర్పాటుని ఎంతో ఉత్సాహంతో మెచ్చుకున్నారు. కాని ఒకనాడు ఇందిర తన తల్లితో, "మా సంస్థ కింకా తగిన పేరేమీ దొరకలే"దని అన్నప్పుడు, కమల, చిరునవ్వుతో "'వానర సేన' అని ఎందుకు పెట్టుకో కూడదు?" అని ప్రశ్నించింది. వానరులతో పోల్చి, తల్లి, తమ దేశభక్తిని కించపరుస్తున్నట్లుగా భావించి, ఇందిర ఒక్క క్షణం బాధపడింది. కాని హనుమంతుని వానరసేన శ్రీరాముడు లంకపై దండెత్తడానికి ఎలా తోడ్పడిందీ, రావణుని స్వర్ణభవనంలో బందీగా వున్న సీతను విడిపించడానికి వారెలా సహాయంచేసిందీ, ఆ గాథనంతనీ కమల కూతురికి వివరించి చెప్పింది.

దానితో అలహాబాదులోని బాలబాలికలకి 'వానరసేన' అన్న పదం గౌరవచిహ్నమయింది. ఐతే వీరు ఎక్కువగా పోలీసులపట్లా, అప్పుడప్పుడు తల్లిదండ్రులూ అధ్యాపకులపట్లా కోతిచేష్టలు ప్రదర్శిస్తూ వుండేవారు. అర్భకాకారంగా, బలహీనంగా వున్నా కృతనిశ్చయురాలయిన ఇందిరానెహ్రూకి, చిట్టచివరికి, ఎలాగయితేనేం, తానుకూడా జాతీయోద్యమంలో జవహర్‌లాల్ నెహ్రూకి తగ్గ కుమార్తెగా తనకు అర్హమయిన పాత్ర వహించగలిగాననే తృప్తి కలిగింది.

# 6

# జన్మదినోత్సవ బహుమతి

విద్యవలన కలుగవలసిన సత్ఫలితం సచ్ఛీలత.

—హెర్బర్ట్ స్పెన్సర్.

విద్యాధ్యయనం పూర్తికావాలంటే, నేర్చుకొన్న విద్య పరోపకారశీలం కలదిగా ఉండాలి. బుద్ధికి పదునుపెట్టడమే కాదు; అందులో హృదయసంస్కారం, ఆత్మశిక్షణకూడా ఉండాలి.

—రాధాకృష్ణన్.

1930 వ సంవత్సరం నవంబరు 19 వ తేదీ ఇందిర 13 వ జన్మదినోత్సవం. ఆవేళ ఆమె కొక అసాధారణమైన బహుమతి వచ్చింది. అది తన తండ్రినించి వచ్చిన లేఖ. అప్పు డాయన అలహాబాదుకి సమీపంలోనే వున్న నైనీ సెంట్రల్ జైలులో వుండేవాడు. ఈ లేఖకి శీర్షికగా పెద్ద అక్షరాలలో

''ఇందిరా ప్రియదర్శినికి—
ఆమె 13 వ జన్మదినోత్సవం సందర్భంగా''

అని వ్రాసివుంది.

ఆమెకి అత్యంత ప్రేమపాత్రుడైన జవహర్ ఆ లేఖలో—

"నీ జన్మదినోత్సవంనాడు అనేక బహుమతులు, శుభాకాంక్షలు లభించడం కద్దు. శుభాకాంక్షలకేమీ కొదవలేదు. కాని నైనీ జైల్నించి నేను నీకేం బహుమతి పంపగలను? వస్తురూపంలో ఏదీ పంపలేను. వాయుతరంగాలలో లీనమై పోగలిగినవీ, భావసంబంధమైనవీ, ఈ జైలుగోడలు నిరోధించజాలని వాటినిమాత్రమే నేను నీకు పంపగలుగుతాను. దేవతల ఆశీస్సులుకూడా అటువంటివే.''

అని వ్రాశారు. ఈ లేఖ అనేక కారణాలవల్ల అత్యంత చిరస్మరణీయమైనది. జవహర్‌లాల్‌నెహ్రూ నాలుగేండ్ల వ్యవధిలో వేర్వేరు జైళ్ళనుంచి తన కుమార్తెకు వ్రాసిన మొత్తం 196 లేఖలలో యిది మొట్టమొదటిది. ఇవన్నీ, తరువాత, 'ప్రపంచ దర్శిని' (Glimpses of World History) అనే ఉద్గ్రంథంగా ప్రచురించబడ్డాయి.

ఈ లేఖలో మరొక విశేషంకూడా వుంది. ఈ లేఖను రచించిన తండ్రి వ్యక్తిత్వాన్నీ, దానిని అందుకున్న కుమార్తె ప్రత్యేకతనూ, ఈ ఉభయులమధ్యా గల అత్యంత సన్నిహితమయిన అనురాగబంధాన్నీ అది వ్యక్తంచేస్తుంది. 'నేను తండ్రిని' అనే 'అధికారరేఖ' దానిలో ఎక్కడా గోచరించదు. విశేషానుభవం గల మహావ్యక్తి చాలా చిన్నవయస్కులను ఉద్దేశించినప్పుడు గోచరించే పెద్దరికంకూడా వ్యక్తంకాదు. తండ్రినించి దూరం చేయబడిన ఒక బాలికపట్ల గోచరించే దృఢప్రేమానురాగాలే దానిలో గోచరిస్తాయి.

> "ప్రియనందినీ, నీతిబోధలు చేస్తూ హితోపదేశం చేయడం నా కెంత అసహ్యమో నువ్వెరుగుదువు,—"

అంటాడు జవహర్‌లాల్—ఒక ఆప్తమిత్రునితో చెప్పుతున్నట్లు. అంతేకాదు—

> "ఐతే ఇక నేనేం చేయాలి? మన సంభాషణతో ఎన్నటికీ సమంకాలేదు ఉత్తరం. ఇది ఎంతసేపూ ఏకపక్షంగా వెళ్ళబోసుకునేదే. నేను వ్రాసినదాంట్లో సలహామోస్తరుగా ధ్వనించే దేమయినా వుంటే దానిని చేదుమాత్ర మ్రింగినట్లు బలవంతంగా జీర్ణించుకో నక్కరలేదు. నువ్వు స్వతంత్రంగా ఆలోచించడానికి మాట సామెతగా ఒక సూచన చేసినట్లుగానే భావించుకో.
>
> నీకు జ్ఞాపకం వుండేఉంటుంది. జోన్ ఆఫ్ ఆర్క్ కథ మొదటిసారిగా చదివినప్పుడు నీకు ఎంత ఆసక్తికలిగిందీ, ఆమె మోస్తరుగా మానవసేవ చేయాలని నువ్వు ఎలాంటి కలలు కన్నదీనూ."

అదే లేఖలో, ఆమె జన్మదిన ప్రాముఖ్యాన్ని ప్రస్తావించి, ఆయన—

> "నువ్వు పుట్టిన సంవత్సరం 1917. చరిత్రలో అత్యంత సంస్మరణీయమయిన సంవత్సరాలలో అదికూడా ఒకటి. ఒక మహానాయకుడు తన దేశంలోని దరిద్ర, దళిత ప్రజానీకంపట్ల ప్రగాఢ సానుభూతి, అభిమానాలు గలవారిని పురికొల్పి చరిత్రలో చిరస్మరణీయమై మహోత్కృష్టమయిన అధ్యాయాన్ని లిఖింపజేసింది ఆ సంవత్సరంలోనే. సరిగ్గా నువ్వు పుట్టిన నెలలోనే లెనిన్ రష్యా, సైబీరియా స్వరూపస్వభావాలను పూర్తిగా మార్చివేసిన మహావిప్లవానికి నాందీప్రస్తావన చేశాడు."

వ్యక్తిగత విషయాన్ని ప్రస్తావించి తన లేఖను ముగిస్తూ, ఆయన—

"ఈనాడు మనదేశంలో సాగుతూన్న స్వాతంత్ర్య పోరాటాన్ని దర్శించ గలగడం నీ అదృష్టం. అర్భకురాలైనా, మహా సాహసవంతురాలయిన తల్లి దొరకడంకూడా నీ అదృష్టం. నీ సందేహాలు తీర్చడానికీ, నీ చిక్కులను పరిష్కరించడానికీ అంతకంటే ఆప్తులెవరూ దొరకరు నీకు.

ఉంటాను మరి. దేశసేవకి ధైర్యసాహసాలు గల యోద్ధగా నువ్వు తయారు కాగలవని ఆశిస్తూ -

—నా శుభాకాంక్షలతో."

ఇందిర వ్యక్తిత్వంపై గల ప్రగాఢ ప్రభావానికి యీ లేఖ ఒక దర్పణం. తల్లి దండ్రులు ఆమెపట్ల ప్రదర్శించిన గాఢమైన అనురాగం, ఆమెకిచ్చిన స్వేచ్ఛ, చూపిన మైత్రీ వీనిలో వ్యక్తమవుతాయి.

1931వ సంవత్సరం నూతన సంవత్సరాదినాడు వ్రాసిన రెండవ లేఖలోనే జవహర్‌లాల్ తాను ఒక లేఖాపరంపరను వ్రాయదలిచినట్లు వెల్లడించాడు. "గతాన్ని గురించీ, అప్పట్లో జీవించి ప్రపంచరంగంలో ప్రముఖపాత్ర వహించినవారిని గురించీ" ఆ లేఖలలో ప్రస్తావించదలిచినట్లు ఆ లేఖల్లోనే పేర్కొన్నాడు. అప్పట్లో తల్లిదండ్రు లిద్దరూ జైలులోనే వున్నారు.. ఇందిర బ్రహ్మాండమయిన భవనంలో ఒంటరిగా వుంటోంది. ఆమెకి యీ లేఖాపరంపర వ్రాయాలని నిర్ణయించుకోవడంలో జవహర్ లాల్ మనోవీథులలో ప్రపంచ మానవచరిత్రకి, తన వ్యక్తిగత జీవితానికి అవినాభావ సంబంధం ఏర్పడిపోయింది :

"నీకు ఒంటరితనంతో విసుగెత్తి వుంటుంది. పదిహేనురోజుల కొకసారి నువ్వు మీ అమ్మను చూడవచ్చు. పదిహేనురోజుల కొకసారి నన్నుకూడా చూడవచ్చు. మామధ్య ఒకరి సందేశాలు మరొకరికి అందించవచ్చు. కాని నేను కాగితం, కలం పట్టుకు కూర్చునేసరికి నువ్వే జ్ఞాపకం వస్తావు. నువ్వు నిశ్శబ్దంగా నాదగ్గరికి వచ్చి కూర్చున్నట్లు, మనం అనేకవిషయాలు మాట్లాడు కుంటున్నట్లుగానే అనిపిస్తుంటుంది. మనం గతాన్ని గురించి కలలుకంటూ భవితవ్యాన్ని ఉజ్జ్వలతరం చేయడానికి తగిన విధానాలను ఆలోచిస్తూ వుంటాం."

మానవశాస్త్రాలను గురించి ఉత్తరప్రత్యుత్తరాల ద్వారా సాగిన, ప్రపంచంలో కల్లా అత్యంతగణనీయమయిన ఈ ఉత్తరాల బోధన (Correspondence Course) ఆవిధంగా మొదలయింది. ఒక విప్లవకారుడు వ్రాసిన ప్రపంచ చరిత్ర, సామాజిక పరిణామాలకి కారణభూతమయిన ఆర్థికశక్తుల పరిశీలన, ప్రపంచంలోని అన్నిప్రాంతా

లకీ చెందిన సాంస్కృతిక పరిణామాల పరిశీలన, మానవజాతి అభ్యుదయానికి గణ నీయమయిన కృషి చేసిన మహావ్యక్తుల సునిశితమైన చిత్రణా ఈ లేఖల మూలంగా ప్రపంచానికి లభించింది. తన కూతురికి విశాలదృక్పథాన్ని అలవరిచే వుద్దేశ్యంతో, జవహర్‌లాల్ రచించిన యీ గ్రంథం భారతదేశంలో ఒక యువతరంవారిపై ప్రగాఢ మయిన ముద్ర వేసింది.

ఒకవంక యీ లేఖావళి సాగుతూవుండగానే, తన కూతురికి మామూలుగా విద్యాబోధనకి ఏర్పాట్లు చేయాలని జవహర్‌లాల్ ఎంతో తాపత్రయ పడుతూండేవాడు. తన రాజకీయ కార్యకలాపాలవల్లా, కమల అనారోగ్యంవల్లా ఆమె విద్యాభ్యాసానికి తరుచూ అంతరాయం కలుగుతూ ఉండడమే అందుకు కారణం. పూనాలో జాతీయ భావాలుగల ఒక పార్సీ దంపతులు ప్రైవేటుగా చిన్న బోర్డింగు స్కూలు ఒకటి నడుపు తూన్న సంగతి విన్నారు. విద్యావిధానంపై, వారికికూడా, జవహర్‌లాల్‌కి వున్న అభి ప్రాయాలే వుండేవి. గాంధీజీ సూచనపైన ఇందిరని ఆ పాఠశాలకి పంపారు. దానిపేరు ‘The Pupils’ Own School’. “ఇందిర పాఠశాలకు వెళ్లి చదువుకోవాలేగాని జైలుకి వెళ్ళవలసిన యీడు యింకా రాలే” దని గాంధీజీ నిర్ణయించడమే అందుకు కారణం.

ఈ పాఠశాల నిర్వాహకురాలు కూన్‌వర్‌బాయ్ జహంగీర్ వకీల్. ఆమె, ఆమె భర్త కలసి దానిని నిర్వహించేవారు. ప్రతిభావంతురాలైన తమ శిష్యురాలిని గురించి ఆమెకి బాగా జ్ఞాపకం. ఇందిరని, పాఠశాలకి రాగానే, ఏడో తరగతిలో చేర్చుకున్నారు. మొత్తం నాలుగేళ్ళ కోర్సును ఆమె మూడేళ్ళలోనే పూర్తిచేసి పదహారేళ్ళకే మెట్రిక్యు లేషన్ పరీక్షలో, మంచి మార్కులతో ఉత్తీర్ణురాలయింది. అప్పటి ఇందిర “బాగా చురుకుగా, శ్రద్ధాసక్తులతో ఇతరులతో కలిసిమెలిసి తిరుగుతూ సత్ప్రవర్తన, సాధు స్వభావం కల”దని శ్రీమతి వకీల్ వర్ణించింది. ఇక చదువుసంగతి; లెక్కలలో ఆమెకి మంచి ప్రతిభ వుండేది. ఇంగ్లీషు, చరిత్ర ఆమెకి బాగా వచ్చు. ఫ్రెంచి భాష బహు సుల భంగా నేర్చుకుంది. సాహిత్యాన్నధ్యయనం చేయడంలో ఆమె మిగతా బాలికలకి అగ్రగామిగా వుండేది. ఆమె వ్యాసాలు సాహితీస్ఫోరకంగా వుండేవి. కాని ఆమె ఎన్నుకునే విషయాలు మాత్రం విధిగా రాజకీయ సంబంధమైనవే. తోడివిద్యార్థులవలె కాక రోజూ దినపత్రిక చదువుతూండేది. తన తండ్రిని గురించిగానీ, తనకుటుంబం లోని మిగతా సభ్యులను గురించిగానీ ఏమయినా వార్తలు కనబడతాయేమోనని ఆమె శ్రద్ధగా వెతుకుతూండేది. ఆ పాఠశాల సారస్వతసంఘానికి ఆమె కార్యదర్శిని. సహ జంగా ఆమెకి సిగ్గే ఐనా వాగ్వివాదంలో విషయం తనకి ఆసక్తికరమయినదయినప్పుడు తన భావాలను చక్కగా వివరించగలిగేది. ఔత్సాహికనాటకాలలో పాల్గొనడం మొదలుపెట్టినప్పటినించీ ఆమెకి బిడియం పూర్తిగా తగ్గిపోయింది. ఠాగూరు రచించిన ‘ఋతురాజ్’, ‘భైనో భేష్’ (ఆంగ్లనాటకానికి గుజరాతీ అనుసరణ) వంటి నాటకాలలో

ఆమె ప్రధాన భూమికలు వహించింది. ఆ స్కూలులో మాక్ పార్లమెంట్ కూడా ఉండేది. దానికి వార్షిక ఎన్నికలు జరిగినప్పుడు ఇందిర ఏకగ్రీవంగా ప్రధానమంత్రిగా ఎన్నికయింది!

ఐతే ఆమెకి క్రీడలలో ఏమైనా ఆసక్తి వుండేదా? ఉండేది. నిజమే. ఆమె పాఠశాల క్రీడల పోటీలలో ముఖ్యమయిన పాత్ర వహించేదంటే ఆశ్చర్యంగావుంది కదూ! ఆమె బాడ్మింటన్‌లోనే కాదు, కబడ్డీవంటి శ్రమతో కూడిన క్రీడలలోకూడా పాల్గొనేది. లాఠీతో సాము నేర్చుకుంది. లెజీం డ్రిల్ అంటే ఆమె కిష్టం. మిగతా బాలికలతో పిక్‌నిక్‌లకీ, వినోదయాత్రలకీ వెళ్ళడం ఆమెకి ఇష్టం. ఐతే ఆరుబయటి క్రీడలన్నిటిలోకీ ఆమెకి కొండలెక్కడమంటే బాగా సరదా. ఆమె సింహగఢ్ కోటగల నిట్రమైన గుట్టమీదికి ఒక్క ఊపున ఎక్కి, పరిగెత్తుకుంటూ క్రిందికి వచ్చేది.

స్కూలులో చేరినప్పుడు ఆమెకి పాలంటే ఇష్టం ఉండేది కాదు. ఐతే ఆమె బాగా బలహీనంగా వుండేది గనుక వకీల్ సతీమణి ఆమెను బాగా పాలుత్రాగమని బలవంతపెట్టేది.

"చిట్టచివరకి, ఎలాగైతేనేం, ఆమెకి పాలంటే యిష్టం ఏర్పడింది. ఇప్పటికీ ఆమెకి పాలంటే చాలా యిష్టం'' అని సగర్వంగా చెపుతుంది వకీలు సతీమణి.

విద్యార్థినిగా ఆమెలో నాయకత్వలక్షణాలు ఏమయినా కనిపించేవా? "ఇందిర మిగతా బాలికలకంటె పెద్దదికావడంచేత తోడివిద్యార్థినులకి ఆమె స్వతహాగా నాయకత్వం వహిస్తుంది. చిన్నపిల్లలపట్ల మాతృప్రేమతో గుడ్డలు తొడగడం, తలదువ్వడం, పాఠాలు, తెలియకపోతే, చెప్పడం చేస్తూండేది. వారందరూ 'ఇందిరా దీదీ' కోసం చూస్తూండేవారు'' అంటుంది వకీల్ సతీమణి. ఇందిరలో సంస్థల నిర్వహణదక్షత సహజంగా వున్నదని ఆమె అధ్యాపకురాలు అంటుంది. క్రీడలపోటీలూ, పిక్నిక్‌లూ, వినోదయాత్రలూ, వాగ్వాదపోటీలూ, సమావేశాలూ—అన్నీ విధిగా ఇందిరే ఏర్పాటు చేస్తూండేది. ఏదో ఒక పని చేయకుండా తీరికగా కూర్చున్న సమయాలు బహు అరుదు అని వకీలు సతీమణి అంటుంది.

క్లాసులయిపోగానే ఆమె ఇతర పుస్తకాలు చదువుకోవడమో, తోడి బాలికలకి పాటలు నేర్పడమో, తన గది శుభ్రం చేసుకోవడమో చేసేది. ఆ తరువాత తోటలోకి వెళ్ళి చెట్లక్రింద రాలిన ఆకులు తుడవడమో, పూలమొక్కలు కత్తిరించడమో చేసేది. "కాయకష్టం చేయడానికి ఇందిర ఎన్నడూ సిగ్గుపడేది కాదు'' అంటుంది వకీలు సతీమణి. పగలంతా ఎంత హడావుడిగా తిరిగినా చీకటిపడక మానదు కదా! ఇందిర అలా ఒంటరిగా ఉన్నప్పుడు జైలులోఉన్న తండ్రో, జైలులోనో ఆసుపత్రిలోనో వున్న తల్లో జ్ఞాపకం వచ్చేవారు. ఒక్కొక్కప్పుడు తల్లి జైలులోనే జబ్బుతో వుండేది. ఇందిర, తన గదిలో దీపాలన్నీ తీసేసిన తరువాత, ఎవరికీ వినపడకుండా

ఏడవడం ఆమెసహచరులు కొందరు కనిపెట్టారు. ఐతే తన 'వెక్కు' గదిలోఉన్న మిగతావారికి వినపడకుండా చేయటానికె ముసుగు బిగదన్ని నానాతంటాలూ పడుతూండేది ఆమె.

ఇది యిలావుండగా ఎప్పుడో ఒకసారి, మళ్లీ, తండ్రివద్దనించి ఉత్తరం వస్తూండేది. జైలు అధికారుల పర్యవేక్షణలు అన్నీ ముగిసి అది చేతికందేటప్పటికి ఎంతో ఆలస్యం జరుగుతూండేది. ఈ ఉత్తరాలు చాలా భాగం మానవచరిత్రను తరతరాలుగా ఏకరువుపెట్టే చారిత్రకగాథలే అయినా అప్పుడప్పుడు హృదయాన్ని స్పందింపజేసే వ్యక్తిగత విషయాలుకూడా వుంటూండేవి. వాటిని చదవగానే ఇందిరకి తాను ఒంటరిగా లేననీ, తల్లిదండ్రులతోనే వున్నాననే భావం కలుగుతూండేది. మళ్ళీ ఆమెలో ఉత్సాహాసక్తులు పుంజుకునేవి. నిరాశా నిస్పృహలకి తావు ఇవ్వరాదనీ, తండ్రికి తగ్గకూతు రనిపించుకోవాలనీ నిశ్చయించుకునేది.

> "ప్రియదర్శిని అంటే దర్శించుటకు ప్రియమయినది అని అర్థం. కాని దర్శనమే దూరమయినప్పుడు అది ప్రియతరంగా తోస్తుంది."

అని జవహర్‌లాల్ నైనీ జైలునించి 1931 వ సంవత్సరం జనవరి 7 వ తేదీన వ్రాశాడు.

> "నేను ఈవేళ ఉత్తరం రాస్తున్నప్పుడు దూరంగా ఎక్కడో ఉరిమినట్లు లీలగా కేకలు వినిపించాయి. మొదట్లో అవేమిటో నాకు అంతుపట్టలేదు. కాని అవి నాకు పరిచితమయినవిగానే అనిపించేవి. వాటికి నాహృదయం స్పందించినట్లు తోచింది. అవి క్రమేపీ సమీపించి గట్టిగా వినిపించసాగాయి. మరికొంతసేపటికి అవేమిటో స్పష్టమయింది. 'ఇన్‌క్విలాబ్ జిందాబాద్' అన్న నినాదాలతో కారాగారం ప్రతిధ్వనించింది. మా హృదయాలు ఆనందంతో పరవళ్ళు త్రొక్కాయి. వారెవరో—మా యుద్ధ నినాదాలను, మాజైలు వెలుపల, అంత దగ్గరగా, అరిచినదెవరో—నాకు తెలియదు. వారు స్త్రీలో పురుషులో, పట్టణవాసులో గ్రామాలలోని రైతులోకూడా నేనెరగను. వాటికి కారణంకూడా నా కవగతంకాలేదు. కాని, వారెవరైనా, మాకు ఉత్తేజాన్ని కలిగించారు. వారికి మౌనంగానే మా అభివాదాలూ, శుభాకాంక్షలూ తెలిపాము...."

ఆమెకు అత్యంత ప్రేమపాత్రుడయిన తండ్రి ఉండే కారాగారాన్నీ, ఆయన వ్యక్తిత్వానికి మూలమయిన భావాలనూ, ఆశయాలనూ ఆ లేఖ విశదీకరించింది. తానూ, తన భార్యా, ఇంకా వేలాది పౌరులూ పోరాటాన్ని సాగిస్తూ జైళ్లలో కృశించడానికి మూలమయిన విప్లవసిద్ధాంతాన్ని ఆ లేఖలో పేర్కొంటూ—

> "నిజంగా మనకి కావలసింది స్వతంత్రమే. కాని మనకి అంతకంటే ఎక్కువే కావాలి. దేశంలో అనారోగ్యాన్నీ, దారిద్ర్యాన్నీ, దైన్యాన్నీ తుడిచి

వేయాలి. మన ముందున్న యీ గురుతర కర్తవ్యపాలనలో సహకరించడానికి అడ్డుగావున్న కొందరు వ్యక్తుల మనోవీథులలో బూజును సాధ్యమయినంత వరకు దులిపివెయ్యాలి. ఇది బ్రహ్మాండమయిన కృషి. ఇందుకు కొంతకాలం పడుతుంది. అందుకు కనీసం గట్టి ప్రయత్నమైనా చేద్దాం.

—ఇన్‌క్విలాబ్ జిందాబాద్."

జవహర్‌లాల్ తన లేఖావళిలో చరిత్రలోని విప్లవచైతన్యాన్ని గురించి తన కుమార్తెకి తెలియజెపుతూనే వచ్చారు—"చరిత్ర అంటే ఏమిటి? పరిణామ చిత్రణమే కదా." ఈజిప్టు, గ్రీకుదేశాలలోని ప్రాచీన సంస్కృతులూ, భారతదేశంలోని గ్రామీణ గణతంత్ర పరిషత్తుల పరిణామమే ఇది. చరిత్రవిషయాలే కాక ఆయన తన కూతురికి తన వ్యక్తిగత వేదననుకూడా వెళ్ళబోసుకునేవాడు. జైలులో మగ్గుతూన్న తనభార్య అనారోగ్యాన్నిగురించీ, ఆమెకు సరియయిన చికిత్స జరగని సంగతినిగురించీ వ్రాస్తూండేవాడు - "ఆమె ఎంతో ధైర్యవంతురాలు. ఆడుసింహంవంటి ధైర్యం ఆమెది. కాని అంతటి గుండె ధైర్యానికి తగ్గ శరీరదారుఢ్యం లేదు. ఆమె మరీ బలహీనురాలు కావడం నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు"—ఇక తన తండ్రిని గురించి—"తాతను చూసినప్పుడు నేను నిశ్చేష్టుడినయ్యాను. ఆయన అతి బలహీనంగా, జబ్బుమనిషిగా కనబడ్డాడు".

అప్రతిహతుడైన మోతీలాల్ నెహ్రూ అస్తమయంతో ఇందిరకీ, ఆమె కుటుంబంలోని మిగతావారికీ అపారమయిన దుఃఖం కలిగింది. మొట్టమొదటిసారిగా ఇందిరహృదయం దుఃఖసంభరితమైన దప్పుడే! తన కతి ప్రీతిపాత్రుడయిన తాత తన కిక లేడన్నసంగతి ఆమె ఊహించుకోలేకపోయింది. ఇల్లంతా జనంతో నిండిపోయింది. బంధువులు, మిత్రులు—అందరూ సమావేశమయ్యారు. వారిలో చాలామంది కొద్దిరోజుల క్రితమే విడుదలయారు. సంపూర్ణజీవితాన్ని అనుభవించిన తమ మిత్రుని అంత్యక్రియలకి హాజరుకావడానికే వారు విడుదల అయారా అనిపించింది.

ఆనందభవనాన్ని అంతటి శ్రద్ధాసక్తులతో, అభిమానంతో పాలిస్తూవచ్చిన మోతీలాల్ లేని ఆ గృహం ఎంతో బోసిపోతూండేది. కనీసం ఇందూకి అలా అనిపించేది. ఆమె వసారాలో తిరుగుతున్నా, తెరల సందునించి, యింకా ఆయన అక్కడ వున్నాడేమోనని తొంగితొంగి చూస్తూండేది. "నువ్వే నా కూతురివీ, కొడుకువీకూడా" అని అంటూండే తాత యీనాడు వెళ్ళిపోయాడు. ఎక్కడికి? ఆయన భౌతిక కాయానికి దహనసంస్కారాలు చేసి చితాభస్మాన్ని గంగా, యమునానదుల సంగమంలో నిమజ్జనంచేశారు. కాని ఆయన ఆత్మశక్తి ప్రభావం ఏమయింది! ఎల్లప్పుడూ నవ్వుతూ, ప్రేమిస్తూ, ధైర్యసాహసాలు మూర్తీభవించినట్లు సంతోషంగా కనిపించే ఆ మూర్తి ఏమయింది! ఊహకి అందని జీవన్మరణసమస్యలు పధ్నాలుగేళ్ళ ఇందిరను వేధించసాగాయి. హఠాత్తుగా తా నూహించలేనంత వృద్ధాప్యం వచ్చి అలసిపోయి

నట్లుగా భావించసాగింది. ఆమె మళ్ళీ స్కూలుకి వెళ్ళేటప్పటికి ఆమెలో బాల్యం పూర్తిగా వదిలిపోయింది.

నెహ్రూ కుటుంబానికే కాక యావత్తు దేశానికే దిగులు పట్టుకుంది. మోతీలాల్ మరణానికి జాతి యావత్తూ శోకాంబుధిలో మునిగింది. తండ్రిపోయిన బెంగతో ఉన్న జవహర్‌లాల్‌కి, గాంధీ-ఇర్విన్ ఒప్పందం ఫలితంగా శాసన ధిక్కారోద్యమాన్ని తాత్కాలికంగా నిలుపు చేయడం మరింత బాధ కలిగించింది. "ఇందుకేనా మన ప్రజలు ఏడాదిపాటు అంత ధైర్యసాహసాలతో పోరాటం సాగించింది? మన ప్రజ్ఞలూ ప్రగల్భాలూ చివరికి యిలా నీళ్లుకారిపోవలసిందేనా?" అని అడిగా డాయన.

"అమూల్య మయినదేదో శాశ్వతంగానే పోగొట్టుకొన్నంత వెలితి ఏర్పడింది" ఆయనహృదయంలో.

ఏప్రెల్ నెలలో ఇందిరకి వ్రాస్తూ ఇలా అన్నాడు—

"దాదాపు మూడు నెలలు గడిచాయి-దుఃఖంతో, కష్టాలతో, వేదనలతో. ఈ మూడు నెలల్లోనూ దేశంలోనూ, మన కుటుంబంలోనూ కూడా పెద్ద మార్పు వచ్చింది. భారతదేశం శాసన ధిక్కారాన్ని, లేదా సత్యాగ్రహాన్ని కొంతకాలం నిలిపివేసింది. కాని మనం ఎదుర్కోవలసిన సమస్యల పరిష్కారం సులభం కాదు. మన కుటుంబంలో, మనకి అండగా ఉంటూ ఉత్తేజాన్నిచ్చే 'పెద్దతల' రాలిపోయింది.........రోజులు గడుస్తున్న కొద్దీ దుఃఖం తగ్గుతూన్నట్లు లేదు. ఆయన లేని లోటు తీరడమూ లేదు. కాని మనం దుఃఖవివశుల మయిపోవాలని ఆయనఅభిమతం కాదనుకుంటాను. ఆయన మొత్తంగా మనం కూడా చిక్కులను ఎదుర్కొని విజయులం కావాలనే ఆయన అభిలాష. ఒకవంక దాస్యశృంఖలానిబద్ధమైన భరతమాత ఆ కోశిస్తూంటే మనం విశ్రాంతి తీసుకోవడం ఎలా సాధ్య మవుతుంది? దుఃఖంతో దిగులుగా ఎలా కూర్చోగలం?"

జవహర్‌లాల్ మళ్లీ కార్య రంగంలోకి ఉరికాడు. స్వరాష్ట్రంలోని రైతుల దుస్థితి భరించలేక, వారి ఇబ్బందులు తీర్చడానికి ఆందోళనలు ప్రారంభించాడు. ఇది ఇలా ఉండగా మరో వంక లండన్‌లో రౌండుటేబిల్ సమావేశం జరుగుతోంది. అది విషాదాంతమయిన ఒక తమాషాగా తయారయింది చివరికి. ఇందిర కూడా తన చదువులో పడింది. తన పుస్తకాలూ, హోం వర్కూ, స్కూలు వర్కూ, ఆటలూ, వాగ్వాదాలూ, అప్పుడప్పుడు సింహగడ్ దుర్గాన్ని అధిరోహించడం వంటి దైనందిన కృత్యాలలో నిమగ్నమై పోయింది. ఈ కొండ దుర్గాన్ని అధిరోహించినప్పుడు తా నిటువంటి పర్వతా లెన్నిటినో అధిరోహించిన పిమ్మటవే శిఖరాన్ని అందుకోగలుగుతానని ఆమె ఎరగదు. తండ్రికి కారాగార విమోచనం కలిగినందుకు ఆమె సంతోషించినా చక్కని ఆ ఉత్తరాలు ఆగిపోయినందుకు బాధపడుతూండేది. అలెగ్జాం

డర్ ది గ్రేట్ విజయాల అనంతరం మానవచరిత్ర అసంపూర్ణంగా ఉండిపోయింది. దానిని పూర్తి చేయడానికి ఆ చరిత్రకారుడు తిరిగి జైలు కెళ్లాల్సి వచ్చింది.

తాను విడుదలయిన ఏడాది జవహర్‌లాల్ ఇందిరకి వ్రాస్తూ ఇలా అన్నాడు—

“ఈనాడు భారతదేశంలోని దారులన్నిటికీ ఎప్పటికయినా గమ్యం ఒకటే. అన్నీ స్వప్నాలూ, యాత్రలూ. చివరికి జైలుతో అంతం కావలసిందే! కనుకనే నాకు సుపరిచితమయిన గోడలమధ్య నేను మళ్ళీ ప్రవేశించాను. ఇప్పుడు మళ్ళీ ఆలోచించుకోవడానికీ, నీకు వ్రాయడానికీ కావలసినంత తీరిక. మళ్ళీ పోరాటం మొదలయింది. పురుషులు, స్త్రీలు, బాలురు, బాలికలూ దేశ దారిద్ర్య నిర్మూలనకి స్వాతంత్ర్య పోరాటంలోకి ఉరుకుతున్నారు. కాని స్వాతంత్ర్య దేవత అంత సులభంగా ప్రసన్నంకాదు. గతంలో లానే ఆమెకు భక్తుల నించి మానవ నివేదన కావాలి.”

చదువులో పడిన ఇందిర రాజకీయపోరాట ప్రగతిని ఎప్పటి కప్పుడు గమనిస్తూనే వుండేది. ఆమె వార్తాపత్రికలు బహుశ్రద్ధగా చదివేది. తన కుటుంబానికి సంబంధించిన వార్తలు తరుచుగా ఆమెకు పత్రికలద్వారానే తెలుస్తూండేవి. ఒకసారి వృద్ధురాలైన తన నాయనమ్మ ఒక ఊరేగింపును నడుపుతూండగా పోలీసులు లాఠీ ఛార్జీ జరిపారనీ, దానిలో ఆమె బాగా గాయపడిందనీ ఆమెకు పత్రికలద్వారానే తెలిసింది. ఈ వార్త ఆమె కెంతో దుఃఖాన్ని కలిగించింది. ఆమెని క్రిందపడేసి తుపాకీ మడమలతో తలమీద పదే పదే బాదారనీ, తల పగిలి రక్తం కారుతూంటే ఆమె స్పృహతప్పి కొంతసేపు రోడ్డుప్రక్కన అలాగే పడి ఉందనీ, చివరి కొకరు ఆమెను తమ కారులో ఇంటికి చేరవేశారనీ ఆమె పత్రికలో చదివింది. బరైలీజైలులో వున్న తన కొడుకుని చూడడానికి వెళ్ళేటప్పటికి ఆమె కింకా కట్లు విప్పనేలేదు. ఆమె ఇందిరకి వ్రాస్తూ ఈ సంగతిని ఏదో అతిసాధారణమయిన సంఘటనగా ప్రస్తావించింది. “స్వచ్ఛంద సేవకులూ, సేవికలతో పాటు బెత్తపు దెబ్బలూ, లాఠీదెబ్బలూ తినే అదృష్టం” తనకు కూడా కలిగినందుకు ఆమె ఎంతో ఆనందాన్ని వ్యక్తంచేసింది. దానిని చదివినప్పుడు ఇందిరకి, ఆమె ఎలావుందోననే బాధతోపాటు ఎంతో గర్వం కూడా కలిగింది.

ఆ తరువాత కొన్నినెలలకి గాంధీమహాత్ముడు ‘ఆమరణ నిరాహారదీక్ష’ ప్రారంభించినవార్త వచ్చింది. దళిత జాతులకి ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పాటు చేయాలని రామ్సే మెక్డొనాల్డు ఇచ్చిన తీర్పుకి నిరసనగా, అది కులతత్వాన్ని రెచ్చగొట్టుతుందన్న ఆందోళనతో ఆయన నిరాహారదీక్ష ప్రారంభించారు. ఈ నిర్ణయం వల్ల ప్రతివారిలోనూ సంచలనం కలిగింది. జవహర్‌లాల్ ఈ సంగతి విన్న వెంటనే “తన బలిదానానికి మహాత్ముడు కేవలం నియోజక వర్గాలకి చెందిన సమస్యను ఎన్నుకున్నందుకు” విసుగు ప్రదర్శించాడు. అది మొట్టమొదట ఆయనకు కలిగిన భావం. తరువాత “మత సంబంధమయిన ఒక సమస్యను మహాత్ముడు మత దృక్పథంతోనూ,

భావావేశంతోనూ ఎదుర్కొంటున్నందుకూ, ఈ సందర్భంలో తరుచు భగవంతుడిని పేర్కొంటున్నందుకూ'' ఆగ్రహాన్ని వ్యక్తం చేశాడు. చివరికి ఆయనకి భయంకూడా వేసింది. "బాపూ చనిపోతే: భారతదేశం అప్పు డెలా వుంటుంది?" ఆ ఉద్వేగంలో ఆయనకి ప్రజలమీద కోపం వచ్చింది. సాంఘిక చైతన్యం లేక ఇటువంటి విషమ సంకట స్థితిని తెచ్చిపెట్టినందుకే ఆయన కా ఆగ్రహం. ఇందిరకి వ్రాస్తూ "భారత దేశం దుర్భరమయినది. ఇక్కడ మహానుభావులు మరణిస్తూంటే చూస్తూ ఊరుకుంటారు. భారతీయులు బానిసలు. స్వల్ప విషయాలకి కీచులాడుకుంటూ స్వాతంత్ర్యాన్ని విస్మరించే బానిస మనస్తత్వం వారిది" అన్నాడు. కాని ఆ వెంటనే—

> "దేశవ్యాప్తంగా బ్రహ్మాండమయిన కల్లోలం బయలుదేరినట్లు వార్తలు వచ్చాయి. మంత్ర ప్రభావమా అన్నట్లుగా హిందూసమాజంలో నూతనోత్సాహం ఉవ్వెత్తుగా లేచింది. అంటరానితనం అంత మయ్యేటట్లు కనిపిస్తోంది. ఆయన ఎంతటి మంత్రవేత్త! ఎరవాడజైలులో-మారుమూల ఎక్కడో పిట్టంత మనిషి అనుకున్నాను నేను. కాని మానవ హృదయాలను చలింప జేయ గలిగిన కీ ల క ం ఆయనకి బాగా తెలుసు.''

గాంధీమహాత్ముని అదృశ్య తంత్రులవల్ల ప్రచోదితులయిన వారిలో ఇందిరా నెహ్రూ ఒకతె. ఆమె స్కూలుకి సెలవుపెట్టి, తన మేనత్త కూతురుతో, ఎరవాడ జైలులో నిరాహారదీక్ష సాగిస్తూన్న బాపూ వద్దకు వెళ్ళింది. అది వారి స్కూలుకి అట్టే దూరంలేదు. తన అరోగ్యాన్ని గురించి ఆ పసిపిల్ల పడుతూన్న ఆందోళన మహాత్మున్ని కదిలించి వేసింది. ఆయన జవహర్‌లాల్‌కి ఒక టెలిగ్రాం ఇచ్చాడు—

> "వేదనా భరితమయిన ఈ రోజులలో నువ్వే నాకళ్ళ ముందు మెదులుతున్నావు. నీ అభిప్రాయం తెలుసుకోవాలని నా కెంతో ఆందోళనగా వుంది. నీ అభిప్రాయాన్ని నేనెంతగా మన్నిస్తానో నీకు తెలుసు. ఇందునూ, స్వరూప్ పిల్లలనీ చూశాను. ఇందూ సంతోషంగా కనిపించింది, కొద్దిగా ఒళ్లు చేసినట్లుగా వుంది. కులాసాగా వున్నాను. సమాధానంగా టెలిగ్రాం యియ్యి."

మహాత్మునికి ఉత్సాహం కలుగ జేయాలన్న ఆదుర్దాతోనే ఇందూ "సంతోషంగా కనపడింది." కాని ఆమె హృదయం తీవ్రమైన ఆందోళనతో నిండి వుంది - ఆందోళనా భరితమై, వేదనా భరితమై. ఈ నిరాహారదీక్ష నించి బాపూజీ గడిచి గట్టెక్కకపోతే ఏమవుతుంది? తానూ, ఇతరులూ ఆయనని రక్షించడానికి చేయగలిగిందేమిటి? అంటరానివారు అనబడే వ్యక్తులపట్ల తమలో హృదయపరివర్తనం కలిగిందని జాతి యావత్తూ మహాత్ముడిని నమ్మించవలసివుంది. ఐతే ఈ హృదయ పరివర్తన తేవడం యెలా?

తన అధ్యాపకురాలు వకీల్ సతీమణితోబాటు ఇందిర కూడ ఒకరోజు ఉపవాసం చేసింది. వారేకాదు. దేశవ్యాప్తంగా వేలాది పౌరులు ఉపవాసాలు చేశారు. అంత

కాని తనాన్ని తొలగించవలసిన అగత్యాన్ని ఉద్ఘాటిస్తూ ఆమె ఒక వ్యాసం వ్రాసింది. ఈ విషయమై తన తండ్రి వద్దనుంచి తాను విన్నదే గాక ఈ సాంఘిక దురన్యాయం పట్ల యౌవన సహజమైన హేయ భావాన్నంతనీ ఆమె ఆవ్యాసంలో వెళ్ళగక్కింది. మహాత్ముని ప్రాణానికి ముప్పు రానివ్వరాదని కోరుతూ జరిపిన ప్రార్థనా సమావేశంలో ఆమె అదేతీరులో ప్రసంగించింది. "బాపూజీకి ఈనాడు కావలసింది ప్రార్థనలు కాదు; క్రియాత్మక మయిన చర్య. ఆయనప్రాణం కాపాడడానికి మనం అందరం ఏదో ఒకటి చెయ్యాలి."

మరునాటి ఉదయమే ఆమె నిజంగా అన్నంత పనీ చేసింది. స్కూలులో పని చేసే పాకీదాని కూతురుని తాను పెంచుకుంది. పాపం, ఆ పిల్ల మురికి దుస్తులతో, చిరిగిన గుడ్డలతో ఉండేది. ఇందిర ఆమెకి శుభ్రంగా నలుగుపెట్టి స్నానం చేయించింది. తలకి నూనెరాసి దువ్వింది. తన సొంత ఖర్చుకోసం పంపిన సొమ్ముతో కొనితెచ్చిన శుభ్రమయిన కొత్త గుడ్డలు తొడిగింది. ఆ రాత్రి ఆ అంటరాని బాలికను తన ప్రక్కనే పడుకోబెట్టుకొంది. ఇది చూసి తోడివిద్యార్థినులు ఆశ్చర్యపోయారు. ఆ పసిపిల్లను తన గుండెలకి హత్తుకుని ఇందిర వినూత్నమైన శాంతినీ, సంతృప్తినీ పొందగలిగింది. ఆమె తాను ఉపన్యసించినట్లు నిజంగా ఏదో ఒకటి చేయగలిగింది. మహాత్ముని అసువులు రక్షించడానికి ఇటువంటి క్రియాత్మక చర్యలు అవసరమని ఆమె ప్రగాఢ విశ్వాసం. వాస్తవం కూడా అంతే. మహాత్ముడు ఆ నిరాహార దీక్ష తట్టుకుని నిలువగలిగాడు.

జైలునించి వచ్చే లేఖావళిలో ఇప్పుడు ఫ్రెంచి విప్లవానంతర పరిణామాలు చిత్రించబడుతున్నాయి. తండ్రి మాటలలో ఒక విధమయిన విసుగుదల, అలసట గోచరిస్తున్నట్లు ఇందిర పసిగట్టగలిగింది.

> "రెండు వారాలుగా నీకు వ్రాయలేదు. నాకు బద్ధకం ఎక్కువవుతోందేమోనని భయమేస్తోంది. నా కథనం పూర్తి కావస్తోందన్న భావంవల్ల నేను కొంత వెనకాడుతున్నాను. అప్పుడే మనం పద్దెనిమిదో శతాబ్దాంతానికి చేరుకున్నాం. ఈ మానవగాథను 1932 వరకూ చిత్రించాక చివరికి ఏం చేయాలో నాకు బోధపడకుండా వుంది. గతం వర్తమానంలో లీనమై భవిష్యత్తు నీడలో నిలిచి పోతుంది. అప్పుడు నీ కింకేం వ్రాయనమ్మా! అప్పటిక నువ్వేదో ప్రశ్నించావని అనుకుని సమాధానం వ్రాయడానికి ప్రయత్నిస్తూ కాగితం, కలం పట్టుకు కూర్చోవడానికి ఏంసాకు దొరుకుతుంది!"

జన్మదినం కానుకగా మొదలయిన ఈ అపూర్వ లేఖావళి ఏదో ఒకనాడు ఆగిపోతుందన్న భావం ఇందిరకు కూడా ఆందోళన కలిగించింది. కాని వాస్తవానికి తన కుమార్తె విద్యాబోధన కార్య క్రమానికి భరతవాక్యంగా తాను అనుకున్న 'చివరిలేఖ' వ్రాసే ముందు జవహర్‌లాల్ మరో వంద ఉత్తరాలయినా వ్రాసి వుంటాడు.

# 7

## "ఓ పాంథుడా! ఎచటనుండి నీ రాక?"

శాంతి నికేతనం:
అది మనది, మనకు ప్రియతమమైనది.
మన స్వప్నాలన్నీ ఆమె బాహువల్లరిలో బందీలై ఉన్నాయి.
చూచిన ప్రతిసారీ, సరిక్రొత్త వింతలతో కనిపిస్తుం దామెముఖం. ఎందుచేత:
ఆమె మనది, మనకు హృదయంగమ మైనది.

—రవీంద్రనాధ్ టాగూర్

బాలికలంతా నానా హంగామా చేస్తున్నారు. హాస్టలులో ఒకరిమాట ఒకరికి వినపడకుండా గొణగొణలాడు తున్నారు.

"ఈవేళ ఎవరు వస్తున్నారో చెప్పుకో చూద్దాం. నీకు మూడు ఛాన్సు లిస్తున్నాను."

"'ఆమె' వస్తోందని నాకు తెలుసు."

"నేను ఇప్పటికీ నమ్మలేకుండా ఉన్నాను. 'ఆమె' మనతో కలసి మెలిసి ఇక్కడ గడపడానికి ఒప్పుకుంటుందనే అనుకుంటున్నావా?"

"అది సాధ్యపడేది కాదు. 'ఆమె' ఎటువంటి వంశంలో పుట్టిందో నీవు ఎరుగుదువా?"

"'ఆమెకి' డజన్ల కొద్దీ పరిచారిక లున్నారని విన్నాను. చిటికెనవ్రేలుకూడా కదపక్కర్లేదు."

"బహుశా పొద్దున్నే నిద్రపక్కమీద మనల్ని టీ అందించమంటుందేమో!"

"'ఆమె' తాతగారు 'ఆమె' దుస్తులను ప్యారిస్‌లో ఉతికించి తెప్పించేవారట."

"ఆమె విదేశాలలోని పాఠశాలలలో చదివిందట కూడా. బహుశా ఆ దొర సాములు ధరించే రకరకాల దుస్తులన్నీ తెచ్చి వుంటుంది........."

"ఆమె ఫ్రెంచి షిఫాను చీరెలు కట్టుకుంటుం దనుకుంటాను."

"........ఎత్తు మడమల బూట్లుకూడా........"

ఈ రణగొణధ్వని....ఎక్కసకాలు .... హఠాత్తుగా నిలిచిపోయినాయి. చెట్ల మధ్యనించి హాస్టలువైపుకి ఎవరో వస్తూండడం వారు గమనించడమే అందుకు కారణం.

ఆమె సుమారు పదహారేళ్ళ బాలిక. బక్కపలచగా, తెల్లగా ఉంది. కోల మొహం. ముతక ఖద్దరు చీర కట్టుకుంది. ఆమె ఉత్తికాళ్ళతో నడిచిరావడం వారికి కనిపించింది. ఒక చేత్తో పాత సూట్ కేస్ పట్టుకుంది. మరోచేతిలో చిన్న పక్కచుట్ట ఉంది. ఆమె అతి అమాయకంగా, అతి సాధారణంగా కనపడడంచేత ఆమె హాస్టలు దగ్గరికి వస్తున్నప్పుడు అక్కడి బాలికలలో ఒకరు టాగూరు రచించిన గీతంలో ప్రథమ చరణం—

"ఓ యాత్రికా! ఎక్కడినించి నీరాక?" అని ఆలాపించింది.

"ఎవరామె?"

"బహుశా 'ఆమే' అనుకుంటాను."

"అసంభవం...."

కాని ఆమె ఇందిరా నెహ్రూయే! మొదటి సంవత్సరం విద్యార్థినిగా చేరడానికి శాంతినికేతన్‌కి వచ్చింది. ఆమెకి ప్రత్యేక సదుపాయాలేవీ కలుగజేయ వద్దనీ, మిగతా బాలికలలాగే హాస్టలులో గడిపేటట్లు చూడమనీ జవహర్‌లాల్ నెహ్రూ రవీంద్రనాథ్ టాగూర్‌కి వ్రాశారు.

ఇందిర శాంతినికేతన్ ప్రవేశం ఆ విధంగా జరిగింది. ఆమె నిరాడంబరత్వం, వినయం హాస్టలులోని విద్యార్థినులందరినీ ఆశ్చర్యంలో ముంచివేశాయి. బహుస్వల్ప కాలమే అయినా ఆమె జీవితంలో ఒక విశిష్టమయిన అధ్యాయానికి అది నాంది. హాస్టలులో ఆమె తన యీడు బాలికలతో సమంగా జీవించేది. అక్కడి పిల్లలలో చాలా మంది మధ్య తరగతి కుటుంబాలవారూ, విద్యాగంధంలేని కుటుంబాల వారూనూ. నగరాలలోని రాజకీయ సాంఘిక కల్లోలాలకి అతిదూరంగా నెలకొన్న యీ శాంతినికేతనంలో విద్యార్థుల మానసిక వికాసానికి దోహదకారి అయిన ప్రశాంత వాతావరణం లభిస్తుంది. మృదుస్వభావుడయిన రవీంద్రనాథ టాగూర్ దీనికి అధినేత. కవిగా, రచయితగా, సంగీత విద్వాంసుడుగా, కళాకారుడుగా—అన్నిటికంటే మానవత్వం మూర్తీభవించిన కారుణ్య మూర్తిగా, బహుముఖ ప్రజ్ఞావంతుడయిన

ఆ మేధావి శాంతినికేతనానికి వచ్చినవారందరిపై తన ప్రభావాన్ని, కొద్దో గొప్పో, ప్రసరించేవాడు. తన జీవితంలో అతి ముఖ్యమయిన, శాశ్వత మయిన ప్రభావాన్ని ప్రసరింపజేసినవాడు టాగూరేనని ఇందిర అభిప్రాయం: "మా నాన్నగారి దయవల్ల నాకు సాహితీ ప్రపంచంతో అప్పటికే పరిచయం ఏర్పడింది. కాని శాంతినికేతనం వెళ్ళాక హృదయాహ్లాద కరమయిన కళా ప్రపంచాన్ని నాకు చూపింది టాగూరే."

* * *

1934 లో, కొద్దికాలంపాటు జైలునించి బయటికి వచ్చినప్పుడే, జవహర్‌లాల్, రవీంద్రనాథ్ టాగూర్‌తో, ఇందిరను శాంతినికేతన్‌కి పంపేవిషయం సంప్రదించాడు. ఆమె సరిగ్గా అప్పుడే బొంబాయి విశ్వవిద్యాలయంలో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణురాలైంది. 1934 ఏప్రెల్ 27 న టాగూర్ సెక్రెటరీ—అనిల్ కుమార్ చాందాకి వ్రాస్తూ, ఇందిరని అక్కడ "కనీసం ఒక్క ఏడాదో, వీలయితే అంతకంటే ఎక్కువ కాలమో" వుంచదలిచినట్లు సూచించాడు. కమల అనారోగ్యంవల్ల కుటుంబం అనిశ్చిత పరిస్థితులను ఎదుర్కో వలసివస్తూండడంచేత ఈ తాత్కాలిక ఏర్పాటు చేయవలసి వచ్చింది. జవహర్‌లాల్, అదే లేఖలో, "నేను ఆమెను (ఇందిర) కలుసుకున్నప్పుడు ఈ సంగతి ఆమెతో చర్చిస్తాను. ఆధునిక యువతుల విషయంలో మన నిర్ణయాలను వారిపై రుద్దకూడదు కదా……ఇక ఆమె అభ్యసించవలసిన విషయాల సంగతి ఆమెతో మాట్లాడాక మీకు వ్రాస్తాను. ఏ విషయాలు నేర్చుకునేదీ ఆమే నిర్ణయించుకోవాలి. అక్కడికి వచ్చాకనే వాటిని ఆమె నిర్ణయించుకుంటుంది" అని వ్రాశాడు.

శాంతినికేతన్‌లోని పూర్వ ఆచార్యులలో ఒకరు ఆనాటి సంగతులు జ్ఞాపకం చేసుకుంటూ చెప్పినదానినిబట్టి "1934 జూలై నెలలో-నూతన విద్యాసంవత్సరం ఆరంభంలో ఇందిర మొదటి సంవత్సరపు ఆర్ట్సు తరగతిలో ప్రవేశించింది"…. ….

"మొదటి సంవత్సరం కోర్సులో ఇందిర నా విద్యార్థిని. కలకత్తా విశ్వవిద్యాలయంవారు నిర్ణయించిన వచనభాగం, ఓల్డు టెస్టమెంట్‌లోని కొన్ని భాగాలు వారితోకలిసి నేను చదివాను. మరోవంక విశ్వభారతి డిప్లొమా కోర్సు చదివేవారికి బ్రౌనింగ్ వ్రాసిన 'Men and Women' అన్న గ్రంథాన్ని చెప్పేవాణ్ణి. ఇందిర ఆ గ్రూపులో కూడా ఉండేది. వస్త్రధారణలోనూ, ప్రవర్తనలోనూ నిరాడంబరత్వం, విద్యాభ్యాసం పట్ల ఆమె కనబరిచే నెమ్మది, శ్రద్ధాసక్తులూ నన్నెంతో ముగ్ధుణ్ణి చేసేవి. ముఖంలో విషాదరేఖలు కనిపించేవి. తల్లిదండ్రులను గురించిన సహజమయిన ఆందోళనే అందుకు కారణమనడంలో సందేహంలేదు. తండ్రి జైల్లోనూ, తల్లి అనారోగ్యంతో మంచం మీదా ఉన్నప్పుడు విచారంకాక సంతోషం ఎలా ఉంటుంది? ఆమె ఒకటే జడ వేసుకునేది. తెల్లని ఖద్దరు ధరించేది. పొడుగుగా, సన్నగా తండ్రిలాగే తీక్షణమైన ముఖభంగిమతో ఉండేది. ప్రత్యేకమైన సదుపాయాలేమీ ఆమె

అంగీకరించేది కాదు. తన తోటి విద్యార్థినులతో సమానంగా కష్ట సుఖాలలో పాలు పంచుకునేది. బాలికల హాస్టలులో ఆమెకుకూడా ఒక సీటు ఉండేది. ఆమె బట్టలు ఆమె ఉతుక్కునేది. పక్క తనే వేసుకునేది. ప్రాతః సమావేశాలలో తానుకూడా మిగతా వారితోబాటు నిలబడేది. భోజనాలూ, ఫలహారాలూ వడ్డించడంలో తనవంతు వచ్చినపుడు తానుకూడా పాల్గొనేది. ఆమె ప్రవర్తన ఆదర్శప్రాయంగా, నిర్దుష్టంగా ఉండేది.........హోం వర్కులోగానీ, క్లాస్ వర్కులోగానీ చెప్పినపని చేసుకురాని సందర్భం ఒక్కటికూడా నాకు జ్ఞాపకం లేదు. ప్రతిసారీ ఆమె ఉత్తమశ్రేణిలోనే నిలిచేది. ఆమె జవాబులు సూటిగా, స్పష్టంగా, అతిచక్కగా వ్రాసేది. దస్తూరీ తండ్రిదస్తూరీ మోస్తరుగానే సన్నగాఉండేది.''

ఇది ఆ కళాశాల ఆచార్యులు ఇచ్చిన మంచి యోగ్యతా పత్రమే. చదువులో మంచి ప్రజ్ఞావంతురాలనీ, ఐతే వ్యక్తిగతంగా కొద్ది మంద కొడిగా ఉండేదనీ తెలుస్తుంది దీనివల్ల. కాని మనకి ఆసక్తి పెంపొందించగలిగినంత మంచితనం కనిపిస్తుంది దీనిలో. ఆయనే ఈ సంగతి కూడా, ఇందిరను గురించి, చెబుతాడు——

''ఇందిర నెమ్మది, మృదుస్వభావం కలది మాత్రమే కాదు. అవసరంవచ్చినప్పుడు దృఢంగా వ్యవహరించి నిలబడగలదు. అనిల్ కె. చాందా ఒక ఉత్తేజకరమయిన సంఘటనను పేర్కొన్నాడు. ఇందిరా గాంధీ చదివే రోజులలోనే శాంతి నికేతనంలో సరిహద్దు గాంధీ కుమారుడు ఘనిఖాన్ కూడా ఒక విద్యార్థి. వీ రిద్దరూ కలిసి తెలివిగా, హుందాగా నడిపిన అహింసా ఉద్యమం వల్ల ఆశ్రమంలోని ప్రశాంత జీవితంలో ఒక్కసారిగా సంచలనం బయలుదేరింది. చివరికి ఈ ఉద్యమం ఫలితంగా దొంగ పాండిత్యం, అసహ్య కరమయిన ప్రవర్తన గల ఒక పురావస్తుతత్వశాస్త్రజ్ఞుడు హడావిడిగా శాంతి నికేతన్‌ని వదిలిపోవలసి వచ్చింది.''

అక్కడి పూర్వాచార్యులు ఒకరు చెప్పిన ఈ అంశాలకంటే కూడా ఇందిర సహచరి శ్రీమతి అశోకసిన్హా రేఖాచిత్రణ ఆమెవ్యక్తిత్వాన్ని మరింత స్పష్టం చేస్తుంది. శ్రీమతి సిన్హా అప్పట్లో బాలికలహాస్టల్లో ఇందిరతో ఉండేది. ఆమె బెంగాలీ వారపత్రిక 'దేశ్'లో ఒక వ్యాసం వ్రాస్తూ, మానవతా దృక్పథంతో ఆమెను చిత్రించింది.

ఇందిరతో తన ప్రథమ సమాగమం ఎలా జరిగిందీ ఆమె పేర్కొన్నది. హాస్టల్‌లోని బాలికలు మొదట్లో అహంకారంతో, కొత్తకొత్త ఫ్యాషన్లతో, గొప్ప వంశంలోని దానినన్న గర్వంతో ఉండే ఇందిరను ఊహించుకున్నారు. కాని వారు చూసినది నిరాడంబరంగా ఉండే వినయవంతురాలయిన ఇందిరను. "ఈమె నిజంగా

ఇందిరానెహ్రూయేనా?'' అని, బాలికల హాస్టలులోవుండే 'శ్రీభవన్' ఆశ్రమానికి ట్రంకూ, హోల్డాలూ పట్టుకొని వచ్చిన ఇందిరను కలుసుకొన్న వారందరూ ఆశ్చర్యపోయారు.

దుబారా లేకుండా, ఎవరిపనులు వారు చేసుకోవాలనే సూత్రంపైన ఆ సంస్థను నడిపేవారు. కనుకనే పరిచారికలు ఎవరూ లేరు. అక్కడి బాలికలే పనులన్నీ చేసుకోవలసి వచ్చేది. ఉతకడం, దులపడం, తోముకోవడం, వంట, వడ్డనా అన్నీ వారే చేసుకోవలసి వచ్చేది. కఠినమయిన ఈ దినసరి కార్యక్రమం ఆమెకు గాంధీజీ ఆశ్రమాన్ని గుర్తుచేసేది. నక్షత్రాలు ఇంకా మినుకు మినుకు మంటూండగానే, తెల్లవారు ఝామున, వారందరూ నిద్రలేవవలసివచ్చేది. ఎవరి పక్కలు వారే ఎత్తుకుని, గది ఊడ్చుకుని, శీతాకాలంలో కూడా చన్నీళ్ళతో స్నానంచేసి, ఆదరాబాదరా ఉదయ భోజనం ముగించుకుని ఆరు గంటలకే క్లాసులకి వెళ్ళవలసివచ్చేది. బాలికలు పంక్తుల వారీగా వంట, వడ్డన చేసేవారు. వంటసామగ్రి తోమడం, కడగడం కూడా వంతుల వారీగా జరిగేవి.

మోతీలాల్ నెహ్రూ మనమరాలూ, జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తే అయిన ఇందిరకూడా, మిగతా వారిలాగే ఈ పనంతా చేస్తుందా? అక్కడి బాలికలందరి మనస్సులలోనూ మెదులుతూన్న ప్రశ్న ఇదే. కాని ఆమెవంతు వచ్చినప్పుడు ఇసుమయినా సంకోచించలేదు. ఆమె తన వంతు పని నణుక్కోకుండా చేయడమే కాదు- సంతోషంగా, ఎంతో చురుగ్గా చేసేది.

అక్కడి జీవనం బహు కఠినంగా ఉండేది. టాగూర్ ఉద్దేశ పూర్వకంగానే ఆవిధంగా నడిపేవారు. ధనవంతుల కుటుంబాలనించి వచ్చిన వారితోసహా తన విద్యార్థులందరూ జన సామాన్యం పడే ఇబ్బందులకి అలవాటు పడాలనే ఆయన అభిప్రాయం. హాస్టలుకి విద్యుత్ సరఫరా ఉండేదికాదు. అందుచేత బాలికలంతా లాంతర్ల దగ్గరే చదువుకోవలసి వచ్చేది. మండువేసవిలో కూడా విద్యుత్‌పంకా లుండేవి కావు. కాని ఇందిర ఎన్నడూ కూడా ఈ విషయమై ఫిర్యాదు చేయలేదు. ఆనందభవనంలో లభించే సదుపాయాలవంటివి తాను ఆశిస్తున్నట్లు ఎక్కడా కనపడనిచ్చేదికాదు. వేసవి కానీ, శీతాకాలంగానీ ఎప్పుడూ ముతక ఖద్దరే ధరించేది. వంటింట్లో పని చేయవలసి వచ్చినప్పుడు ఎంతో సహజంగా, అతిసాధారణంగా జరిగే పని అన్నట్లు, వంటచేయడం తనకేమి కొత్త కాదన్నట్లు మెలగేది. తోటి బాలికలందరికీ వడ్డన పూర్తిచేసి మిగతా అందరి భోజనాలూ అయాక తాను తినేది. అప్పుడు అంట్లగిన్నెలు కడిగి నేలనంతవీ శుభ్రంచేసి అద్దంలా ఉంచేది. ఆమె నడుంవాల్చేసరికి అందరూ గాఢనిద్రలో ఉండే వారు.

ఇంక ఆమెఆలోచనలు దేశమంతటా విహరించేవి. తండ్రి బందీగాఉన్న జైలులోనూ, దారుణవ్యాధిపీడితురాలై తల్లి చికిత్స పొందుతూన్న శానిటోరియం లోనూ ఆలోచనలు ప్రసరించేవి. అడపా దడపా ఆమెకు వారివద్దనుంచి ఉత్తరాలు

వస్తూండేవి. కాని ప్రత్యేకంగా ఆమెకు విజ్ఞానబోధ చేసేందుకు తండ్రి వ్రాస్తూ ఉండినే లేఖావళిమాత్రం ఆగిపోయింది. ఆయన వ్రాసిన చివరిలేఖ అత్యంత ఉత్తేజ కర మయింది; అర్థవంత మయిందీ; అన్నిటికంటే అమూల్యమైందీనూ. ఆ లేఖను ఆమె పదే పదే చదువుకుంటూండేది. దానిని చదివినప్పుడల్లా ఆయన మనోభావాలను తర్కించినట్లు అనిపించేది. దానిని ఎంత చక్కగా వ్రాశాడో—

"నేను వ్రాసిన లేఖలన్నీ కలిపితే ఒక పెద్ద గుట్ట అవుతుందేమో! నా లేఖల వల్ల నీకు ఆసక్తికరమయిన విషయాలు ఏమయినా తెలిశాయా! నువ్వు 'ఔ' నంటావని నాకు తెలుసు. మరే సమాధానం యిచ్చినా నేను బాధపడతానవి అనుకుంటావు. నేనంటే నీ కుండే అభిమానంవల్ల నన్ను బాధించడం నీకు ఇష్టం ఉండదు. వాటివల్ల నీకు ప్రయోజనం కలిగినా, కలగకపోయినా గత రెండేళ్ళుగా నేను వాటిని వ్రాయడంలో నాకు లభించిన ఆనందాన్ని మాత్రం నీవు కాదనలేవు"... ....

అటువంటి 'వ్యక్తి' తండ్రిగా లభించడం ఎంతో అదృష్టం అని ఆమె అను కుంటూ ఉండేది. కేవలం విశిష్టమయిన వ్యక్తే కాదు. ప్రేమాభిమానాలూ, అవగాహనా కలవాడు ఆయన. ఆయన స్వేచ్ఛావాది. దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం కావాలనడమే కాదు, తన కుమార్తెకి పూర్తి స్వాతంత్ర్యాన్ని ఇవ్వగలిగినవాడాయన. తన ఇష్టా యిష్టాలను ఎన్నడూ ఆమెపై రుద్దలేదు. కాని ఆమె చేతలూ, భావాలూ, ఆలోచనలూ అన్నీ ఆయన ప్రేమాభిమాన ప్రభావితాలే. ఆ 'చివరిలేఖ' లో ఆయన వ్రాస్తాడు గదా—

"నేను ఈ లేఖలలో వ్రాసినదే శిలాక్షరాలని భావించుకోవద్దు. రాజకీయి వాది ప్రతీ విషయంపై మాట్లాడ గల ననుకుంటాడు, తనకు తెలిసినదాని కంటే ఎక్కువ తెలిసినట్లు నటిస్తాడు. అటువంటి వారి విషయంలో జాగ్ర త్తగా ఉండాలి. బహుశా నా ఉత్తరాలు నీకు బాగా అంతుపట్టి వుండవను కుంటాను. అర్థంకాని భాగాలుంటే వాటిని విడిచి పెట్టేయి, వాటిని గురించి మనస్సు పాడుచేసుకోకు. ఒక్కొక్కప్పుడు నాలోని పెద్దరికం నా చేత అలా వ్రాయించింది. నే నలా వ్రాయకుండా ఉండవలసింది........"

ఆ లేఖనూ, ఆ లేఖావళినీ ముగిస్తూ ఆయన ఉటంకించిన పద్యం ఆమెకు కంఠస్థమే :

"ఎచ్చోట నిర్భీతి నెప్పుడు తలను
పైకెత్తి విహరింప స్వాతంత్ర్య మొందు,
ఎచట విజ్ఞానంబు స్వేచ్ఛగా వడయ
అందరి కందుబాటయ్యెందు, ఎచట
ఈ ప్రపంచంబు ప్రాంతీయావరణము

లన్శకలంబులై సంకుచితంబు
కాకుండు........
ఎచట నీ సారథ్యపు నేర్పునన్ భావ
కర్మ విశాలదృక్పథ మెల్లవారి
కబ్బు తత్పరిపూర్ణస్వాతంత్ర్య స్వర్గ
సీమలో మేలుకొల్పవే మమ్ము దేవ"

ఈ పద్యం గీతాంజలిలోనిది. రవీంద్రనాథ టాగూర్‌కీ, జవహర్‌లాల్ నెహ్రూకీ గల భావసమన్వయం ఇందిరను మంత్రముగ్ధురాల్ని చేసేది. ఒకరు ఋషితుల్యులు; మరొకరు విప్లవవాది. ఒకరు వేదాంతి; మరొకరు కార్యదక్షులు. ఇటువంటి విభిన్న వ్యక్తుల మధ్య సమన్వయం ఎలా పొసగింది-అనే ప్రశ్న ఆమెను వేధిస్తూండేది. చివరికి విద్రాదేవి ఒడిలో కన్నుమూస్తూ తన తండ్రిలో వేదాంత తత్వమూ, ఎమటివారిని ఆకట్టివేసే శాంతినికేతన ఆశ్రమఋషి నిష్కపాటి గడ్డంవెనుక విప్లవవాది కుండే కార్యాచరణ దక్షతా ఉండడంవల్లనే వీరిద్దరిమధ్య భావసమన్వయం కుదిరిందేమో అని ఆమె తలపోస్తూండేది.

* * * *

శాంతినికేతన్‌లో ఉన్నప్పుడు ఇందిర "ఎంతో బిడియంతో, గంభీరంగా, మంచి చెలాకీగా, ప్రతి విషయంలోనూ ప్రత్యేక ఆసక్తితో" ఉండేదని శ్రీమతి అశోక సిన్హాకి జ్ఞాపకం. విజ్ఞానార్జనపట్ల ఆమెకి అపారమయిన అభిరుచి ఉండేది. మామూలు క్లాసులకి హాజరు కావడమే కాకుండా చిత్రలేఖనం, సంగీతం, నృత్యం కూడా నేర్చుకోవాలని ఆమె అభిలషించింది. ఎక్కువసేపు ఆమె కళాభవనంలో (శాంతినికేతనం లోని కళాకేంద్రంలో) గడిపేది. చదువుకునేటప్పుడు గంభీరంగా, మౌనముద్రలో గడిపినా, తోటివిద్యార్థినులతో, హాస్టలు మిత్రులతో మాత్రం కులాసాగా గడిపేది. చివరికి ఒంటరితనాన్నీ, బిడియాన్నికూడా క్రమేణా విడిచిపెట్టి హాస్టలులోని క్రీడలలోనూ, వినోదాలలోనూ అల్లరి పిల్లల తమాషాలలోనూ పాల్గొంటూ ఉండేది.

ఇందిర గంభీర ప్రకృతినీ, కులాసాగా గడిపే స్వభావాన్నీకూడా చిత్రించే ఆసక్తికరమయిన సంఘటనలు కొన్నింటిని శ్రీమతి అశోకసిన్హా చెప్పారు. ఒకటి— హాస్టలులోని మరొక విద్యార్థిని-గుజరాతీ మహిళ ఆమె - 'బటిక్' హస్తకళలో నిపుణురాలు. ఆమె ఈ కళపట్ల అతిశ్రద్ధ వహిస్తూండేది. అందుచేత మిగతాపిల్లలు ఆమెను ఎగతాళి చేస్తూండేవారు. అదీగాక ఆమె బటిక్ సరుకులు దుకాణంనించి కొని తెచ్చి తానే తయారు చేసినట్లు చెప్పుకుంటోందని కొంతమందికి అనుమానం. ఇందిర ఒకతే ఆమె శ్రద్ధాసక్తులను మెచ్చుకునేది. అందుచేతనే ఆమె ఇందిరను తనగదికి తీసుకువెళ్లి తలుపులువేసేసి తాను తయారు చేసిన 'బటిక్' కళాఖండాలను చూపిస్తూం

దేవి. వాటిలో చక్కని సంచీ కూడా ఒకటి ఉంది. దీనిని కళాభవన్ అధిపతి అయిన ప్రసిద్ధ చిత్రకారుడు నందలాల్ బోసుకే బహూకరించాలని ఆమె అభిలాష. ఆమెను ఏడిపించాలనే ఉద్దేశ్యంతో ఆ సంచీని ఎలాగయినా 'దొంగిలించ' మని కొందరు బాలికలు ఇందిరను కోరారు. మరి కొన్నాళ్ళకి ఆ సంచీ నిజంగానే కనపడ లేదు. ప్రతివారూ దానికోసం వెతుకుతున్నట్లే నటించారు. కాని చివరికి ఆ గుజరాతీ వనిత నిరాహారదీక్ష ప్రారంభిస్తానని బెదిరించేసరికి సరిగ్గా ఇందిరకి హాస్టలు ఆవరణలో ఒక చెట్టు కింద ఆ సంచీ దొరికింది. ఆమె దొంగ తిరుగుడుగా తానా సంచీని కొన్నట్లు ఒప్పుకోవడంతో ప్రతివారూ కడుపుబ్బ నవ్వేశారు. కాని 'బటిక్' కళాకారిణిగా చెప్పు కుంటూండే ఆ గుజరాతీ వనితకి ఇందిరమీద పట్టరానంత ఆగ్రహంవచ్చింది. "నువ్వెంతో గంభీరంగా, మంచి దానిలా కనపడతావు. నువ్వు కూడా వాళ్ళతో కలిసి న వ్వాటలుపట్టిస్తావని ఎన్నడూ అనుకోలేదు" అందామె.

ఇతర సమయాల్లో ఆమె ఎంతో గంభీరంగా ఉండేది. హాస్టలులోని ఒక బాలిక ఒకసారి తన వస్తువులు పోగొట్టుకుంది. హాస్టలు మాట్రన్‌కి ఈ విషయమై ఫిర్యాదు చేసింది. ఇది బాగా తీవ్రమయిన విషయమని చెప్పి ఆమె "ఇందిరా నెహ్రూ ట్రంకు" తప్ప మిగతా అందరి పెట్టెలూ తెరిచి పరీక్షించాలని ఆజ్ఞాపించింది. కాని సోదా జరిగేటప్పుడు ఇందిరే ముందుగా తన ట్రంకుతెచ్చి దానిని వెతకమని పట్టు పట్టింది. తన విషయంలో ప్రత్యేకత యేమీ చూపకూడదని ఆమె అభిమతం." చివ రికి ఆ వస్తువులు స్నానాలగదిలో దొరికాయి. ఆ అమ్మాయి ఉదయం స్నానాని కెళ్ళినపుడు వాటి నక్కడ పెట్టి మరిచిపోయిందని తేలడంతో అందరూ నవ్వుకొని ఊరుకున్నారు.

ఇందిర తనకి ప్రత్యేక సదుపాయాలు ఏమీ వుండకూడదని ఎంతో ప్రగాఢంగా వాంఛించేది అనడానికి తార్కాణం ఆమె టాగూరును కూడా ఎప్పుడో గాని కలుసు కోక పోవడమే. కాని ఆయనమాత్రం ఎప్పుడూ జవహర్‌లాల్ నెహ్రూ కూతురు యోగక్షేమాలూ, చదువు సంధ్యలూ విచారిస్తూండే వాడు. ప్రతిరోజూ వారు సాయం కాలం అలా తిరిగి వచ్చేటప్పుడు రవీంద్రనాథ్ ఇంటిముందుగా వెళ్ళవలసి వచ్చేది. ఒక నాడు ఇందిర మెల్లిగా జారుకోవడం ఆయన గమనించాడు. లోపలికి పిలిచి "ఇలా రామ్మా, నన్నుచూసి భయపడుతున్నావా?" అని కరుణాపూరిత మయిన మృదుల స్వరంతో అడిగాడు. ఆయన పనికి అంతరాయం కలిగించరాదనే ఉద్దేశ్యంతోనే రావటం లేదని ఇందిర వివరించింది. కాని అప్పటినించీ తరుచుగా ఆయన బొమ్మలు గీసుకునే స్టూడియోకి వెళ్ళి ఒక మూల కూర్చుని ఆ మహానుభావుడు చిత్ర రచనలో నిమగ్నుడయినప్పుడు నిశ్శబ్దంగా గమనిస్తూండేదామె. రవీంద్రనాథ్ సూచనపైనే ఆమె మణిపురినృత్యం మొదలుపెట్టింది. సిగ్గు మూలంగా ఆమె ఆక్లాసులో చేరడానికి కొంత సంకోచించింది. కాని అందులో చేరి తొలిముద్రలు నేర్చుకున్నాక సలాకలా ఉండే

ఆమె అవయవాలు సంగీతానికి అనుగుణంగా చెప్పినట్లు వినేవి. ఆమె నృత్యం ఎంతో సహజంగా, అందంగా ఉండేది. మణిపురి నృత్యం లఘువుగా, ఆనందంగా, ఎంతో ఉత్తేజకరంగా ఉంటుంది. అందుచేతనే జవహర్‌లాల్ కుమార్తెకి ఆ నృత్యం అంటే ఇష్టం. "ఆనందానికీ, సౌందర్యానికీ ప్రతీక అయిన మణిపురి నృత్యం బృంద నాట్యానికి ఎంతో అనుగుణమైనది". ఈ నాట్యం టాగూర్‌కి ఎంతో యిష్టం. దీనిని పునరుద్ధరించడానికి ఆయన ఎంతో పాటుబడ్డారు. శాప్ మోచన్. నటీర్‌పూజా, కింగ్ డమ్ ఆఫ్ కార్డ్స్ అనే సంగీత రూపకాలలో ఆయన ఈ నృత్య విధానాలనే అనుసరించారు. శాంతినికేతనంలో టాగూర్ మణిపురి నృత్యాన్ని ఎంతో ప్రోత్సహించేవారు. ఆ నాట్య ఆచార్యులలో విఖ్యాతులయిన నవకుమార్‌ను పిలిపించి, అది అక్కడి నృత్య విద్యార్థులకు నేర్పమని కోరారు"

ఈ విద్యార్థులలో ఇందిర కూడా ఉండేది. ఈ నృత్యం నేర్చుకోవడంపట్ల ఆమెకుగల ఉత్సాహాసక్తులు ఆమె నాట్యాచార్యునికి బాగా జ్ఞాపకం.

> "ప్రత్యేతర కార్యకలాపాలలో ఆమెకి బాగా ఎక్కువ ఆసక్తి కలిగించే అంశం మణిపురినృత్యమే. 1935 వ సంవత్సరం మార్చినెలలో వసంతోత్సవ సందర్భంగా ఏర్పాటు చేసిన రెండు నృత్య కార్యక్రమాలలో ఇందిర కూడా ఉంది. ఆమె మేనత్త విజయలక్ష్మీ పండిట్‌తో సహా, ఆ కార్యక్రమాన్ని తిలకించిన అతిథులందరూ ఆమె నృత్యాన్ని చూసి ఆనందించారు. ఆమె చక్కదనమూ, లాలిత్యమూ విద్యాభ్యాసంలో ఆమె ప్రతిభకు సరితూగేటట్లుండేవి."

తనకి అంతకద్దు సిగ్గులేకుండా ఉన్నట్లయితే తాను మంచి నాట్యకత్తె నయి వుండేదానినని ఇందిర ఒప్పుకుంటుంది. "నిజానికి గురుదేవుడు (టాగూర్) దేశం అంతటా పర్యటించే నాట్య బృందంలో నన్ను కూడా తీసుకు వెళ్లాలని అనుకున్నాడు." ఆ బృందం టాగూరుతో దేశం అంతటా పర్యటించింది. కాని ఇందిర మాత్రం ఆ నృత్యకళా కారులలో లేదు. టాగూర్ శాంతినికేతన్‌కి సొమ్ము సేకరించేందుకు ఈ పర్యటన జరిపారు. నాట్యబృందం పర్యటన బయలుదేరేసరికి ఇందిర ఎక్కడో జర్మనీ లోని శానిటోరియంలో, జబ్బుతో ఉన్న తన తల్లికి సేవచేస్తూ ఉండిపోయింది.

ఆమె మిత్రురాలు శ్రీమతి అశోక సిన్హాకి ఇందిర శాంతినికేతన్‌లో గడిపిన చివరిరోజు బాగా జ్ఞాపకం. ఆవేళ బెంగాలీ సంవత్సరాది. శాంతినికేతన్ అంతా పండగ సంబరంలో వుంది. సాయంత్రం జరిగే ఉత్సవాలకి సన్నాహాలు జరిపేందుకు అందరూ హడావిడిగా వున్నారు. గురుదేవుని సమక్షంలో విద్యార్థులంతా పాటలుపాడి, నృత్యాలు చేసి నాటకాలు ప్రదర్శిస్తారు. అప్పటికి ఇందిర శాంతినికేతన్‌లో అడుగుపెట్టి సరిగ్గా ఒక ఏడాది పూర్తయింది. ఆమె ఉద్వేగానికి మరోకారణం కూడా ఉంది.

ఆమె ఒంటరిగా నాట్యరంగంమీద ప్రదర్శన లివ్వటం అదే ప్రథమం. చక్కని తుణిపురిదుస్తులు ఆమెకోసం సిద్ధంగా ఉన్నాయి. ఒకసారి అవి వేసుకుని చూపింది కూడా. రంగు రంగుల గాగరా, ముఖమల్ చోళీ, పుష్పాలంకృతమయిన వేణీభరంపై ధరించిన పలచని ముసుగులో ఆమె సౌందర్యాన్ని చూసి మిగతా విద్యార్థినులు ముగ్ధులైనారు.

కళాభవన్‌లోని మందిరంలో ఇందిర అతిసూక్ష్మభావప్రకటనలోనూ, సున్నితమైన నాట్య భంగిమలోనూ అభ్యాసం చేసుకుంటోంది. ప్రతీదీ నిర్దుష్టంగా వుండాలన్న అభిలాషగల ఇందిరకి తానెలా చేస్తానో అని ఏమూలో కొంచెం సంకోచం ఉన్నా తనలో తనకి గట్టి నమ్మకం వుంది. ఒక ఏడాది పాటు చేసిన అభ్యాసంవల్లా, పాటించిన క్రమశిక్షణవల్లా "ఓ యాత్రికుడా, ఎక్కడవించి నీ రాక" అనే టాగూర్ గేయానికి అనుగుణంగా తన అవయవాలు అత్యంత సున్నితమయిన భంగిమలు కూడా ప్రదర్శించ గలవన్న విశ్వాసం ఆమె కుంది. ఆమె శాంతినికేతన్‌లో అడుగుపెటినపుడు ఈ పాటతోనే ఆమెకు స్వాగతం లభించింది. మళ్లీ సరిగ్గా అదే తనకు వీడ్కోలు గీతం కూడా అవుతుందని అప్పటి కామెకు సరిగ్గా తెలియదు.

ఆ సమయంలో ఎవరో ఒక సందేశం తేవడంతో రిహార్సల్‌కి అంతరాయం కలిగింది. "గురుదేవులు నిన్ను వెంటనే రమ్మంటున్నారు" అని కబురు. వెళ్ళి, టాగూర్‌ని, ఆయన స్టూడియోలో కలుసుకోగానే జైలునించి తండ్రి పంపిన టెలిగ్రాం ఆమెకు చూపించాడు. కమలకి జబ్బు ఎక్కువగా వున్నదనీ, తల్లిని కనిపెట్టుకుని వుంత టానికి ఇందిరను తక్షణమే అలహాబాద్ పంపమనీ ఆయన టాగూర్‌ను కోరాడు.

ఈలాటి వార్తకూడా ఆమెలో తీవ్రమయిన సంచలనాన్ని కలిగించలేక పోయింది. ఆమె అనాసక్తంగా, ధైర్యంతో పరిస్థితిని ఎదుర్కొంది. అలహాబాదు వరకూ శాంతినికేతన్‌లోని ఆచార్యులలో ఒకరిని కూడా తీసుకుని వెళ్ళమని టాగూర్ చేసిన సూచనను ఆమె మర్యాదగానే తిరస్కరించింది. "ఒంటరిగా ప్రయాణం చేయటం మానాన్న నేర్పారు" అని చెప్పి ఆమె తన కృతనిశ్చయాన్ని వెల్లడించింది. గురుదేవునివద్ద సెలవు తీసుకుని తన సామానులు తీసుకునేందుకు హాస్టల్‌కి వచ్చింది. ఇందిర వెళ్లిపోతోందనీ, ఆ సాయంత్రం జరిగే ఉత్సవాలలో ఆమె పాల్గొనదనీ శాంతినికేతనంలో అందరికీ అప్పుడే తెలిసిపోయింది. ఆనందమయమయిన నంవత్సరాది వేడుకలలో, హఠాత్తుగా, అందరిలోనూ దిగులు ఏర్పడింది. తండ్రి జైలులో ఉండడంచేత ఇందిర తన తల్లితో విదేశానికి వెళ్ళవలసివస్తుందని కూడా తెలిసింది. తాను తిరిగి అక్కడికి రావడంలేదని ఇందిరకి కూడా తెలుసు. తన మిత్రులు ఒక్కొక్కరికీ వీడ్కోలు చెప్పేటప్పుడు కొందరు బాలికలకి కాళిదాసు నాటకంలో శకుంతల అత్తవారింటికి వెళ్ళేటప్పుడు, కణ్వాశ్రమంలో అందరికీ చెప్పే సన్నివేశం గుర్తుకు వచ్చి, నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి. ఒక ఏడాది తరువాత

టాగూరు జవహర్‌లాల్‌కి ఆమెగురించి ఎంతో అభిమానంతో యిలా వ్రాశాడు: "ప్రియమయిన ఇందిరకు నన్ను జ్ఞాపకం చేయండి. ఎప్పుడో ఒకసారి వీలుచేసుకుని ఆమె మళ్లీ మా ఆశ్రమానికి వచ్చి, కొద్దిమాసాలపాటు ఇక్కడ గడిపి మమ్మల్నందరినీ ఆనందభరితులను చేసిన సంగతిని ఆమె జ్ఞాపకం చేసుకోగలదని ఆశిస్తున్నాను". ఇందిరకూడా కొన్నాళ్ళకి తండ్రితో చెబుతూ, "శాంతినికేతన్‌లో నాకెంతో ఆనందంగా గడిచింది. ముఖ్యంగా గురుదేవులే ఇందుకు కారణం. ఆ వాతావరణంలో ఆయనఆత్మ నిరంతరం సంచరిస్తూ ప్రతివారినీ ఆదరాభిమానాలతో కనిపెడుతూ వుందా అనిపిస్తూ వుంటుంది. ఆయన భావాలు నా జీవితాన్నీ, మనః ప్రవృత్తినీ ఎంతో ప్రభావితం చేశాయనుకుంటాను'' అన్నది.

ఇందిర శాంతినికేతనం విడిచి బైటపడేటప్పటికి సాయంకాల మవుతోంది. ఆమె గుర్రపు బగ్గీలో పెద్ద రోడ్డుమీదుగా వెడుతూన్నప్పుడు, దూరంగా—

"ఓ యాత్రికా! ఎక్కడినించి యీరాక!
ఓ యాత్రికా! ఎక్కడి కీ ప్రయాణం!"

అనే గీతం లీలగా వినిపించసాగింది. కొందరు బాలికలు ఆ సాయంత్రం జరిగే నృత్య కార్యక్రమంలో పాల్గొనడానికి ఆ పాటను అభ్యాసం చేసుకుంటున్నారు, కాని దానిలో వినూత్నమయిన విషాదరేఖ మిళితమయి ఉంది ఈనాడు.

# 8

## యోధులతో ప్రస్థానం

వ్యూహ సంగ్రామ మని గర్జించు;
సంగ్రామ భైరవాలను విడిచిపుచ్చు.

—షేక్స్‌పియర్

యుద్ధమంటే, సత్యానికి, పరహితేచ్ఛకు స్వస్తి చెప్పడ మన్నమాట.

—జవహర్‌లాల్ నెహ్రూ

1935 అక్టోబరు 25 వ తేదీ—జవహర్‌లాల్ నెహ్రూ, జర్మనీలోని బ్లాక్ ఫారెస్టులోని బేడెన్ వైలర్ శానిటోరియంలో, (జబ్బు మనిషి అయిన) తన భార్య ప్రక్కన కూర్చుని తన ఆత్మకథకి 'చివరిమాట' వ్రాశాడు. దాని నిలా ముగించాడు:-

> "నే నిక్కడినించి చూస్తూంటే లోయలోనించి పొగమబ్బులు తప్పుకు పోవడానికి ప్రయత్నిస్తున్నాయి. ఇవి, దూరాన, ఫ్రాన్సు సరిహద్దును కనపడ కుండా చేస్తున్నవి. ప్రకృతి నంతనీ మబ్బు తెరలు కప్పేశాయి. వాటి వెనక ఏముందా అని నాకు ఆశ్చర్యం వేస్తోంది"

భవిష్యత్తనే పొగమంచు వెనుక దాగిఉన్నది విషాదమే—వ్యక్తిగతంగా అయనకీ, విశ్వానికీ కూడా.

1935 మే నెలలో ఇందిర తల్లితో జర్మనీలోని ఆ శానిటోరియంకి బయలు దేరింది. అప్పటికే తల్లికిగల ఊపిరితిత్తుల జబ్బు తారస్థాయిని అందుకున్నది. క్రమ క్రమంగా తల్లి నానాటికీ దిగజారి పోతూంటే ఇందిర నిస్సహాయురాలుగా ఉండిపోవ లసి వచ్చేది. జర్మనీలోపలిప్రాంతంలో గల ఆ మారుమూల - ఏకాకిగా తల్లిని కని పెట్టుకుని వుండే ఆమెకు ఊరట కలిగించేవారెవరూ ఉండేవారు కాదు. వేదనా భరిత మయిన ఆరోజులలో అలహాబాదులోని చిన్ననాటిస్నేహితుడు ఫిరోజ్ గాంధీ ఒక్కడే

ఆమెకి తోడుగా ఉండేవాడు. ఫిరోజ్ అప్పట్లో లండన్‌లోని స్కూల్ ఆఫ్ ఎకన మిక్సులో చదువుతూండేవాడు. అయినా అక్కడ చదువు వదులుకుని 'కమల అత్తయ్య'ని కనిపెట్టుకుని వుండేందుకు బహుదూరం రైలు ప్రయాణం చేసి బేడెన్ వైలర్ చేరు కున్నాడు. కమలకి ఆ కుర్రాడంటే చాలా ఇష్టం. నెహ్రూ కుటుంబంతో సన్నిహిత సంబంధం ఉండే దతనికి. అతను జాతీయోద్యమానికి కూడా దీక్షాబద్ధుడై ఉండేవాడు. డెహ్రాడూన్‌లోని జైలులో శిక్షను అనుభవిస్తున్న జాతీయనాయకుడు జవహర్‌లాల్ నెహ్రూ సతీమణికి యూరప్‌లోని శానిటోరియంలో సేవచేయడం స్వాతంత్ర్యోద్య మానికి దోహదం చేసినట్లేనని రాజకీయ చైతన్యం గల ఫిరోజ్ భావించేవాడు. అంతే కాక ఇందిరానెహ్రూ అని పిలవబడే ఆ సుందరికి తోడుగా ఉండడం అతనికి ఎంతో ఆనందదాయక మయింది.

డాక్టర్లు ఎంత కష్టపడినా, ఇందిరా, ఫిరోజ్‌లు ఎంత సేవ చేసినా కమల పరి స్థితి నానాటికీ దిగజారిపోతున్నది. ఆగస్టు నాటికి తల్లి పరిస్థితి చూస్తే ఇందిరకి భయంవేసి, తండ్రికి టెలిగ్రాం ఇచ్చింది. కాని అది ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం ద్వారా జైలులో వున్న తండ్రికి చేరడానికి కొంత కాలం పట్టింది. చివరికి సెప్టెంబరు 4 వ తేదీన (ఖైదీగాఉన్న) జవహర్‌లాల్ నెహ్రూ బాకీవున్న అయిదు మాసాల శిక్ష తాత్కాలికంగా రద్దుచేసినట్లు తెలియబరిచారు. భార్యఆరోగ్యం మరీ అధ్వాన్నంగా ఉన్నందువల్ల ఆయన జర్మనీకి వెంటనే విమానంలో వెళ్లేందుకు వీలుగా ఈ చర్య తీసుకున్నట్లు వివరించారు. విమానంలో యూరప్‌కి వెళుతున్నప్పుడు భార్య ఎలా ఉందో అనే ఆందోళన ఒక వంకా, జబ్బుతో ఉన్న తల్లికి ఎక్కడో పరాయిస్థలంలో ఒంటరిగా సేవచేస్తూన్న కుమార్తె ఎలా ఉందో అనే ఆదుర్దా మరొకవంకా వేధించ సాగాయి.

జవహర్‌లాల్ కమలను చేరుకునేసరికి ఆయనను చూడగానే ఆమె నేత్రాలు ఆరిపోయే దీపంమోస్తరుగా చివరిసారి ప్రజ్వలించాయి. ఇన్ని నెలలుగా ఒంటరి తనాన్ని అనుభవిస్తున్న ఇందిరకి తండ్రిని చూడగానే ప్రాణం లేచివచ్చింది. చిట్ట చివరికి ఆ కుటుంబ సభ్యులు—తండ్రి, తల్లి, కూతురు కలుసుకున్నారు. వీరితోపాటు ఈ కుటుంబం పట్ల శ్రద్ధాభక్తులుగల ఫిరోజ్ కూడా ఉన్నాడు.

జవహర్‌లాల్ కమల ప్రక్కని కూర్చుని, రక్తహీనంగా, పూచపుల్లలా వున్న చేతిని పట్టుకుని ఆమె ప్రాణాన్ని ఎలాగయినా కాపాడడానికి ప్రయత్నించ వలసిం దిగా డాక్టర్లను అర్థిస్తూనే, మరోవంక ప్రపంచంలో ప్రజల ఆరోగ్యం దిగజారి పోతు న్నందుకు మనోవ్యథ చెందుతూండేవాడు. "యూరప్‌లో కల్లోలాలు బయలు దేరు తున్నాయి. యుద్ధభయం ఆవరించింది. ఆర్థిక ప్రతిష్టంభనలు ఎదురవుతున్నాయి...." డాక్టర్లు తమకు చేతనయినదంతా చేస్తున్నారు. ఆమెలో ఎంత మనోనిబ్బరం వున్నా రోగి ఊపిరితిత్తులు చికిత్సకి లొంగడంలేదు. "అబిసీనియాపై దండయాత్ర జరిగింది.

అక్కడి ప్రజలపై బాంబులు వేశారు. విభిన్న సామ్రాజ్య తత్వాలమధ్య సంఘర్షణ చెలరేగుతోంది. ఒకరి నొకరు బెదిరించు కుంటున్నారు.'' కమల ఆత్మ, మృత్యువుతో పోరాటం సాగిస్తూనే వున్నా, ముఖసౌందర్యం వసివాడ లేదు. "సామ్రాజ్య దేశాలలో కల్లా గొప్పదయిన ఇంగ్లండు నానాజాతి సమితి సూత్రాలకీ, శాంతి స్థాపనకీ కట్టుబడి వున్నామని శాంతిప్రవచనాలు పలుకుతూనే, తన పాలనలోని ప్రజలపైన దారుణ దమననీతిని ప్రయోగించి బాంబులు కురిపిస్తోంది.''

పాత సంవత్సరం గతించి నూతన సంవత్సరం మొదలయింది. కాని ఇటు కమల ఆరోగ్యం విషయంలో గానీ, అటు ప్రపంచ పరిస్థితిలో గాని మార్పులేదు. బేడెన్‌వైలర్ శానిటోరియం నుంచి కమలను స్విట్జర్లాండ్‌లోని లౌజేన్ శానిటోరియంకి మార్చారు. 1936 వ సంవత్సరం ఫిబ్రవరి 16 వ తేదీన స్పెయిన్‌లో జరిగిన ఎన్నికలలో సాంఘిక విప్లవానికి కట్టుబడిన, అభ్యుదయ భావాలు గల ప్రభుత్వం పదవీ స్వీకారం చేసింది. జవహర్‌లాల్ ఈ వార్తను రేడియోలో విన్నాడు. అనేక వారాల అనంతరం, ఇందిరకి, తండ్రిముఖంలో ఆశాజ్యోతి కనిపించింది. భయంకరంగా దిగజారి పోతూన్న కమల ఆరోగ్యస్థితిలో కూడా తాత్కాలికంగా కొంత నిలకడ కనిపించింది. కాని ఈ ఆశ కేవలం మెరుపువలె క్షణికమైనదే. హిట్లర్ తనసైన్యాలను రైన్‌లాండ్‌లోనికి తరలిస్తున్నాడనీ, ముస్సోలినీదళాలు అడ్డిస్ అబాబా ద్వారాలను భేదిస్తున్నాయనీ, ఈ నియంత లిద్దరూ స్పెయిన్‌లోని ఫాసిస్టులకి మద్దతునిచ్చి, అక్కడ కొత్తగా ఏర్పడిన రిపబ్లికన్ ప్రభుత్వంపై తిరుగుబాటును ప్రోత్సహిస్తున్నారనీ వార్తలు వెంట వెంటనే వినబడుతూ వచ్చాయి.

ఫిబ్రవరి 28 వ తేదీన కమల మరణించింది. భర్త, కుమార్తె ఆమె మంచం దగ్గరే వున్నారు. ఇందిర తన జీవితంలో రెండవసారిగా మృత్యుదేవత వికట కృత్యాన్ని ప్రత్యక్షంగా చూసింది. ప్రప్రథమంగా తాత. ఇప్పుడు తల్లి. దుఃఖ వివశయై, ఎర్రవారిన నేత్రాలతో ఆమె తండ్రిని అంటి పెట్టుకుని కూర్చునేది. తన జీవితంలో చివరికి మిగిలిన ఆధారం ఆయనే అని ఆమెభావం.

* * *

1936-37 సంవత్సరంలో యూరప్ అనేక భావాలతో, ఆశయాలతో, సిద్ధాంతాలతో సంక్షుభితమై వుండేది. ఈ సుడిగుండానికి కేంద్రం బ్రిటన్. లండన్, ఆక్స్‌ఫర్డు, కేంబ్రిడ్జిలలో చదువుకునే భారతీయ విద్యార్థులు సిద్ధాంతపరమయిన వైజ్ఞానిక సంక్షోభానికి గురిఅవుతూండేవారు. తత్ఫలితంగా వారి ఆలోచనా విధానాలు, భావాలు, తీవ్ర పరిణామాలకి లోనవుతూండేవి. గాంధీ మహాత్ముడు, జవహర్‌లాల్ నెహ్రూల నాయకత్వంలో సాగుతూన్న భారత జాతీయోద్యమం వారిని అవివరకే ప్రభావితులను చేసింది. ముఖ్యంగా నెహ్రూ యౌవనోద్వేగం, ఆధునికభావాలూ వారిపై బాగా పని చేశాయి. ప్రపంచంలోని యువజను లందరినీ ఆవేశిస్తూన్న 'పరిణామదశ' వారినీ

ఆవరించింది. నాజీలూ, ఫాసిస్టులూ రెచ్చగొట్టిన హింసాద్వేషభావాలను ఎదుర్కొని పోరాడడానికి యూరప్‌లోనూ, అమెరికాలోనూ గాక ఆసియా, ఆఫ్రికాలలో కూడా స్వేచ్ఛాస్వాతంత్ర్యభావాలు గలవారందరూ నడుం కట్టారు. పరపీడన, దమననీతి, స్వలాభపరాయణత్వం ఎక్కడ ఏ రూపంలో ఉన్నా పూర్తిగా నిర్మూలించేయాలి అన్న నూతన దృక్పథంతో వలసనిర్మూలనోద్యమం ప్రపంచవ్యాప్తంగా చెల రేగుతోంది.

ఆక్స్‌ఫర్డులో విద్యార్థులు ఉద్వేగపూరితులయిన శాంతి వాదుల ప్రభావంలో తాము మరెన్నడూ రాజరికరక్షణకు పోరాడబోవడం లేదని ప్రకటించారు. లండన్ లోని School of Economics విద్యార్థులు ఫాసిజంను ఎదుర్కోవడానికి యునైటెడ్ ఫ్రంటు ఏర్పాటు చేసుకున్నారు. దీనిలో మార్క్సిస్టులూ, అభ్యుదయవాదులూ అయిన తదితరులూ ఏకమయినారు. ఈ స్కూలులో చదివే భారతీయ విద్యార్థులలో ఫిరోజ్ గాంధీ ఒకడు. ఇతను జవహర్‌లాల్ నెహ్రూను అనుసరించే యువజనులలో మొదటివాడు. నిజమైన భారత జాతీయవాది. ఫాసిజాన్ని తీవ్రంగా వ్యతిరేకించాలని నమ్మే జవహర్‌లాల్ నెహ్రూ అనుయాయి. అప్పట్లో ఇంగ్లాండులో చదువుతూ ఉండిన భారతీయ విద్యార్థులలో అనేకులు ఆదరిమిలా సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీలలో నాయకులై ఉన్నారు. భూపేష్‌గుప్తా, జ్యోతిబసు, మినూమసానీ, మోహన్ కుమార మంగళం, ఆయన సోదరి పార్వతి, నిఖిల్‌చక్రవర్తి, ఇప్పుడు పార్లమెంటు సభ్యురాలు, నిఖిల్‌భార్య రేణుకారాయ్ అప్పట్లో ఇంగ్లాండులో చదువుతూండేవారే. శత్రువులమధ్య శిబిరాన్ని నెలకొల్పి భారత స్వాతంత్ర్య పోరాటాన్ని సాగిస్తూండిన కృష్ణమీనన్ ఆధ్వర్యంలో గల ఇండియా లీగ్‌తో వీరందరికీ సంబంధం ఉండేది. అంతేకాదు. ఫాసిజంను తెగనాడుతూ స్పెయిన్‌లోని రిపబ్లికన్‌లకి మద్దతుగా ప్రదర్శనలు సాగిస్తూండిన అనేక సంస్థలతో కూడా వీరికి సంబంధం ఉండేది.

లండన్‌లోని ఫెయిర్‌ఫాక్స్‌రోడ్డులో ఉన్న వసతిగృహంలోని పై అంతస్తునందలి చిన్నగదిలో ఇద్దరు భారతీయ విద్యార్థినులు చదువుకునేవారు. వారిలో ఒకరు గుజరాత్‌కు చెందిన శాంతాగాంధీ; రెండవవారు ఇందిరా నెహ్రూ. శాంత లండన్‌లో ఒక కళాశాలలో చదువుకుంటూ ఉండేది; ఇందిర, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చేరేందుకు ప్రవేశ పరీక్షకి చదువుతూండేది. పూనాలోని ప్యూపిల్స్ ఓన్ స్కూల్‌లో చదివిననాటినుంచీ కూడా శాంతా, ఇందిరా స్నేహితులు. వీరిద్దరూ మళ్ళీ లండన్‌లో కలుసుకోగానే ఒకే గది తీసుకుని ఉండాలని నిశ్చయించుకున్నారు.

ఇందిరకి ఇది కొత్త జీవితం. ఆనందభవనంలోని భద్రత, శాంతినికేతన్ లోని రక్షణ ఇక్కడ లేవు. లండన్‌లో విద్యార్థినిగా, ఆమె స్వయంశక్తి పైన ఆధారపడవలసి వచ్చేది. తండ్రి నెల నెలా కొంతడబ్బు పంపించేవాడు. దానిలో ఎక్కువభాగం ఆయన వ్రాసిన పుస్తకాలపై లభించిన రాయల్టి. మోతీలాల్ నెహ్రూ

గడించిన ఆస్తిలో చాలాభాగం జాతీయ ఉద్యమానికి హరించి పోయింది. చివరికి జవహర్‌లాల్‌కి మిగిలింది విశాలమయిన ఆనందభవనం మాత్రమే. దానిలో ఒకప్పుడు ఉండిన, అందమయిన సామగ్రి అంతా పోయింది. అందుచేతనే తనకి కూడా విశ్వ విద్యాలయ విద్యను పొందే అవకాశం కలుగజేసినందుకు ఇందిర తండ్రికి ఎంతో కృతజ్ఞతతో వుండేది. ఆనాటి ఉద్వేగభరితమయిన రాజకీయ నాటకరంగంలోనూ, వైజ్ఞానిక చర్చలలోనూ పాల్గొనే అవకాశం లభించినందుకు కూడా తండ్రి పట్ల కృతజ్ఞతతో ఉండేది.

తాము ఇద్దరూ లండన్‌లో గడిపిన ఏడాదిలోనూ ఇందిర అత్యంత ఉత్సాహాన్ని ప్రదర్శించిన సన్నివేశాలు అనేకం శాంతాగాంధీకి జ్ఞాపకం. స్పెయిన్ సహాయక సంఘంవారు ఏర్పాటుచేసిన అనేక నృత్య ప్రదర్శనాలలో శాంత పాల్గొనేది. ఇందిర ఉపన్యాసాలిచ్చేదమో, కరపత్రాలూ, టికెట్లూ అమ్మడమో చేసేది. ఒక ప్రదర్శనంలో ఇందిర హస్తకంకణాన్ని విరాళంగా ఇచ్చింది. దానిని వేలం వేయగా అయిదు పౌన్లు లభించాయి. పాషనేరియా లండన్ వస్తోందని తెలియగానే ఇందిరా, శాంతా స్పెయిన్ దేశపు ఆ విప్లవకారిణిని ఒక్కసారి సందర్శించేందుకుగాను గంటలతరబడి వానలో నిరీక్షిస్తూ ఉండిపోయినారు. వారిద్దరూకూడా ఇండియాలీగ్ తరఫునా, స్పెయిన్ సహాయక సంఘం తరఫునా, ఆదరిమిలా చైనా సహాయక సంఘం తరఫునా స్వచ్ఛంద సేవకులుగా పనిచేసేవారు. స్వాతంత్ర్య సాధనకి సాగుతూన్న జాతీయ పోరాటమూ, ఫాసిజాన్ని నిర్మూలించేందుకు సాగుతూన్న అంతర్జాతీయ ఉద్యమమూ ఏకైక లక్ష్య సాధనకి జరుగుతూన్న కృషి అని ఆ పసిమనస్సులకి అనిపించేది. తన కుమార్తెకీ, భారతదేశంలోని యువజనులకందరికీ కూడా జవహర్‌లాల్ నెహ్రూ పెట్టిన భిక్షే ఈ అవగాహన.

ఇందిరా, శాంతా తీవ్ర జాతీయవాదులు; ఫ్యాసిస్టు వ్యతిరేకులూనూ. ఐతే యౌవనంలోవున్న యువతులందరి మోస్తరుగానే వారికి కూడా జీవితం నవవికసిత కుసుమంవలె ఆనందదాయకమయిందిగా భాసించేది. రాజకీయమయిన తొందరలో మిగతాపనులు లేనప్పుడు వారు ఏ సంగీతరూపకానికో, నాటకానికో వెళ్లేవారు. కాని వారు గ్యాలరీలో చివరి సీట్లకి మాత్రమే వెళ్ళడానికి వీలయ్యేది. వసతి గృహంలోని రుచీ పచీ లేని భోజనంతో విసుగెత్తినపుడు ఒక్కొక్కప్పుడు వారికి ఘాటుగా ఖిళ్లీ నమలాలని అనిపిస్తూండేది. కాని, పరిమితంగా లభిస్తూండే డబ్బుతో ఒక్కొక్కసారి ఆ సరదా తీర్చుకోవడానికి కూడా వీలయ్యేదికాదు. ఉష్ణ ప్రదేశాలలో లభించే తమలపాకూ, దానిలో చేర్చే సుగంధ ద్రవ్యాలూ లండన్‌లో అరుదుగా లభ్యమయ్యే విలాస వస్తువులు. కాని ఒక్కచోట మాత్రం ఆరు షిల్లింగులు ఇస్తే ఒకఖిళ్లీ దొరికేది. అందుచేత వారు ఎన్నో తర్జన భర్జనలు చేసుకుని, ముందుగా ఒక పథకం వేసుకుని, ఒకసారి నాటకానికి వెళ్ళడం కూడా మానుకుని వెండి పూతరేకు కప్పిన ఖిళ్లీ ఒకటి కొని

నెమ్మదిగా దానిని నములుతూ ఆ ద్రవంవల్ల లభించే ఆనందాన్ని సాధ్య మయినంత ఎక్కువగా పొందడానికి ప్రయత్నిస్తూండేవారు.

ఒక రోజున ఇందిర బాగా సిగ్గుపడిపోతూ తమతో ఆ రాత్రి సినిమాకి వచ్చిన 'ఒక స్నేహితుడిని' శాంతకు పరిచయం చేసింది. ఆనాడు ఫిరోజ్‌గాంధీని పరిచయం చేసినపుడు ఇందిరలో కనిపించిన ప్రణయోద్వేగం, ఆమె మాటలలో ధ్వనించిన ప్రేమాభిమానాలూ శాంతకి ఇప్పటికీ బాగా జ్ఞాపకం వున్నాయి.

ఇహ ఇక్కడ భారత దేశంలో జవహర్‌లాల్ నెహ్రూ తన దుఃఖాన్ని మరిచి పోవడానికి రాజకీయాలతో ఎక్కువగా ప్రమేయం పెట్టుకునేవాడు. ఒక విధంగా చూస్తే కమల మరణంతో ఆయన వ్యక్తిగత జీవితం ముగిసింది. అప్పటినించీ ఆయన దేశానికీ, జాతిలక్ష్య సాధనకీ అంకితమయాడు. "నా భార్య మరణంతో నా ఐహికయాత్రలో ఒక అధ్యాయం పరిసమాప్త మయింది. నా వ్యక్తి గత జీవితం లోని ఆనందం చాలాభాగం గతించింది. ఆమె ఇక లేదన్న సంగతి గ్రహించడం నాకు సాధ్యపడలేదు. కొత్త పరిస్థితులకి సులభంగా సరిపుచ్చుకోలేకపోయేవాడిని" ఎన్నికలలో పోటీ చేయాలని కాంగ్రెసు నిశ్చయించింది. జవహర్‌లాల్ ఈ ఎన్ని కల ప్రచారానికి ఎన్నడూ కనీవినీ ఎరుగని అపూర్వ మయిన యాత్ర జరిపాడు. విమానం, రైలు, కారు, పడవ, సైకిలు, ఎద్దుబండి, గుఱ్ఱం వంటి వాహనాలు—అన్నిటి పైనా. చివరికి కాలినడకను కూడా. మొత్తం దేశం ఆమూలనించి యీ మూలకి 50,000 మైళ్ళకి పైగా ఆయన ప్రయాణం చేశాడు. "నేను ఈ ఎన్నికల కార్య క్రమంలో పూర్తిగా నిమగ్నుణ్నయిపోయి దేశంలో ఆకొసనించి యీ కొసకి ప్రయాణం చేస్తూ కొంత సంతృప్తిని పొందగలిగాను." అన్నాడు. ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ బ్రహ్మాండమయిన విజయం సాధించింది. చాలా రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రి వర్గాలు పదవీ స్వీకారం చేశాయి. ఇందిర ఈ సంగతి తెలుసుకుని ఎంతో సంతోషించింది. తండ్రి శక్తి సామర్థ్యాలు తెలుసుకుని గర్వించింది. కాని ఆయన యీ హడావిడిలో తనని తలుచుకునేవాడా అని ఆమెకి ఆశ్చర్యం కూడా కలిగేది. ఎన్నికల రోజులలో ఆయనకి ఉత్తరాలు వ్రాయడానికే తీరిక ఉండేది కాదు.

కాని ఇందిర—ఆయనకి ప్రియతమమయిన ప్రియదర్శిని—ఎల్లప్పుడూ మనోవీథులలో ఎగురుతూనే వుండేది. 1938 వ సంవత్సరంలో, అనూహ్యమయిన సందర్భంలో వింతప్రేక్షకులవద్ద, అసాధారణ సన్నివేశంలో ఆమెను గురించి మాట్లాడడం మొదలు పెట్టాడు. సరిహద్దు రాష్ట్రంలోని నిర్జన పర్వత సీమలలో ఎక్కడో ఆ సమావేశం ఏర్పాటయింది. ఆ ప్రదేశం అతి ప్రమాదకరమయింది. ఏ కొండచాటు నించయినా తుపాకి పేలవచ్చు. వ్యక్తులని దాచివేసి డబ్బు గుంజుతున్నారని ఆరోపించబడిన కొండజాతి ప్రజల సమావేశంలో ఆయన ప్రసంగిస్తున్నాడు.

"మనుష్యులను ఎత్తుకుపోవడం ఆయన గర్హించాడు. ఎవరో కొద్దిమంది చేసే అల్లరి పనులవల్ల ధైర్యసాహసోపేత మయిన జాతికంతకీ చెడ్డపేరు ఎలా వస్తుందో ఆయన పేర్కొన్నాడు." పఠాన్లలో బలహీనతలు ఎన్ని ఉన్నా వారిది సాహసోపేత మయిన జాతి అనీ, ఇతరులలో ధైర్య సాహసాలను మెచ్చుకుంటారనీ, మిత్రులపట్ల మైత్రీభావంతోనే వ్యవహరిస్తారనీ ఆయన ఉగ్గడించాడు.

అప్పుడు మోటయిన యుద్ధవీరులు అనేకమంది సమావేశమయిన ఆ సభలో అక్కడి వారందరి హృదయాలనూ కదలించి వేసిన సంగతి ఒకటి ఆయన ప్రస్తావించాడు. "నాకు ఒక కూతురు ఉంది. ఆమెకు 20 ఏండ్లు, ఇప్పుడు దూరదేశంలో—ఇంగ్లండులో—ఉంది ఆమె నా ఏకైక పుత్రిక. నాకు అత్యంత ప్రియమయినది. ఆమెలో ధైర్యమూ, స్వయంసిద్ధీ పెంపొందించడానికి నేను ప్రయత్నించాను. ఏది ఏమయినా భయపడకుండా ఉండడం ఆమెకు నేర్పాను. ఆమె ఈనాడుగనక ఇక్కడ ఉండివుంటే ఎవరితోడూ లేకుండా గిరిజన ప్రాంతాలలోకి వెళ్లి అక్కడి ప్రజలను సందర్శించి వారితో స్నేహం చేసుకో మని నిస్సంకోచంగా పంపివుండేవాడిని. ఆమెలో విశ్వాసంతో, ఆ ప్రజలపై నమ్మకంతో ఆమెను పంపివుండేవాడిని. తమతో మైత్రి నెరపడానికి తమపై పూర్తి విశ్వాసంతో వచ్చిన వారిపట్ల వారు మరోవిధంగా ప్రవర్తించరని నాకు పూర్తి నమ్మకం." ఆ విధంగా ఆయన ఉత్తర అగ్రాన్నించి దక్షిణపు కొన వరకూ గల సర్వ భారతీయులకీ లభించవలసిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను గురించి ప్రసంగించాడు. ఆయన ఉపన్యాసం కాగానే అప్పట్లో ప్రభుత్వంతో పోరాటం సాగిస్తోన్న తెగల వజీరులు కొందరు నెహ్రూ దగ్గరికివచ్చి, ఆయన ఉపన్యాసంలోని అంశాలను కొద్ది పొరపాటుగా అర్థం చేసుకోవడంచేత తమ గృహాలను ఆయన కుమార్తె ఎప్పుడు సందర్శిస్తుందని అడిగారు. ఆమెకి దేశంలో ఎక్కడికి వెళ్ళడానికైనా పూర్తి స్వేచ్ఛ వున్నదని మాట యిచ్చారు. ఆమె తమ అతిథిగా, స్నేహితురాలిగా, మిత్రుని కుమార్తెగా ఎక్కడికయినా వెళ్ళవచ్చుననీ, ఆమె తలపువ్వు వాడనివ్వమనీ వాగ్దానం చేశారు.

తరువాత ఆ యేడు జవహర్‌లాల్ యూరప్ వెళ్లాలని అనుకున్నప్పుడు స్పెయిన్, జెకోస్లవేకియా కూడా సందర్శించాలని సంకల్పించాడు. కాని ఆయనకు ముఖ్యంగా ఆక్స్‌ఫర్డులో చదువుతూన్న తన కూతురిని కలుసుకోవాలని వుద్దేశం.

అప్పట్లో ఆక్స్‌ఫర్డులో ఆమెతో చదువుతూండిన వారొకరు ఆమె "నెమ్మదిగా, బిడియంతో, వినయంగా వుండేదనీ, ఎప్పుడూ తెరవెనుక వుండడానికే ప్రయత్నించేదనీ" చెప్పారు. ఆమె ఎప్పుడూ కూడా చొరవగా ముందుకు వచ్చేదికాదు. ఆమె విద్యార్థి సంఘం—దానినే ఇండియన్ మజ్లీస్ అంటారు—ఏర్పాటుచేసిన వాగ్వాద పోటీలకి హాజరయ్యేది. కాని ఎప్పుడో గాని వాటిల్లో పాల్గొనేది కాదు. మజ్లీస్‌లో

జరిగిన వాగ్వాద సభ ఒకదానిలో "కాంగ్రెసు నాయకులు మరింత విప్లవాత్మకంగా పనిచెయ్యాలి" అన్న అంశంపై చర్చ జరిగింది. అప్పట్లో ఇంగ్లండు సందర్శిస్తున్న ప్రముఖ వామపక్ష యువకులు—షెల్వంకర్, నిఖిల్ చక్రవర్తి, యూసఫ్ మెహరల్లీ— కూడా ఆ చర్చలలో పాల్గొన్నారు. కాంగ్రెసు నాయకులను, చివరికి జవహర్‌లాల్ నెహ్రూని కూడా ఆ చర్చలలో బాగా విమర్శించారు. ఐనా ఇందిర చర్చలో పాల్గొన లేదు. తండ్రినీ, ఆయన పార్టీనీ బలపరచడానికి గానీ, విమర్శించడానికి గానీ ఆమెకు ఆత్మ విశ్వాసం చాలలేదు. కాని వోట్లు తీసుకునేటప్పుడు ప్రతిపాదనకి అనుకూలంగానే ఆమె చేయెత్తింది. ఆమె పైకి చెప్పకపోయినా, అందరికీ తెలిసేటట్లు వ్యవహరించక పోయినా, ఫ్యాసిస్టు వ్యతిరేక ఉద్యమానికి ఆమె కూడా కట్టుబడి వుండేది. ప్రశాంతంగానే ఆమె దానిలో పాల్గొనేది. లండన్‌లో తలదాచుకుంటూన్న జర్మనీదేశపు జ్యూ ఎర్నెస్టుటోలర్‌ను ఆమె కలుసుకుంది. ఆ సమావేశం ఆమె మనోభావాలపై చెరగని ముద్ర వేసింది. "ఆయన కళ్ళలో తీరని ఆవేదన కనిపిస్తుంది. అనేక సంవత్సరాలుగా ఆయన అనుభవించిన దారుణ సంకట పరిస్థితుల ప్రభావం కనిపిస్తూంటుంది."అన్నది. హిట్లర్ జరిపిన దారుణహింసాకాండకి బలిఅయిన వారందరికి ఆయన చిహ్నమని ఆమె భావించేది. టోలర్ దంపతులు కూడా ఈ భారతీయ యువతి చిత్తశుద్ధిని చూసి ముగ్ధులయినారు. ఇందిరతో తమ సమావేశాన్ని గురించి శ్రీమతి క్రిస్టిన్ టోలర్ జవహర్‌లాల్‌కి ఒక లేఖ వ్రాస్తూఅన్నది. "ఆమెను కలుసుకున్నందువల్ల నాకు కలిగిన ఆనందాన్ని తెలియజెప్పేందుకే యీ లేఖ. ఆమె అందమయినదే కాదు, పవిత్రమయినది కూడాను. అందుచేతనే ఆమెను కలుసుకున్న వారికి ఎంతో ఆనందం కలుగుతుంది. గాలికి కదలాడి పోయే చిన్న పుష్పంలాగా నా కామె గోచరించింది. కాని ఆమె వీచే గాలికి భయపడదు." ఆ సమావేశానంతరం టోలర్ దంపతులు అమెరికాకి తరలివెళ్ళిపోయినారు. మరో ఏడాదికి తరువాత తాత్కాలికమయిన నిస్పృహలో, దీర్ఘకాలం అనుభవించిన వేదనల ఫలితంగా అతిసున్నిత భావాలుగల ఆ కవి ఆత్మ హత్య చేసుకున్నాడని విని ఆమె ఎంతో బాధపడింది. ఆ సమయంలో ఆమె శెలవలు గడిపేందుకు సుడేటన్‌లాండ్‌లో ఉంది. హిట్లరు దానిని హస్తగతం చేసుకోవడానికి సరిగ్గా ముందు రోజు లవి. నాజీవందయాత్ర జరగబోతోందన్న భయాందోళనలు అక్కడి ప్రజలలో ఆమెకు స్పష్టంగా కనిపించాయి.

అది జూన్‌నెల. ప్రియమయిన తన తండ్రి రాకకోసం ఆమె ఎదురుచూస్తోంది. ఆ సమయంలో ఆయన మనోభావాలు ఎలా వుండేదీ ఆమెకి తెలుసు. అత్యంత సున్నితమయిన ఆయనహృదయం తీవ్ర సంక్షోభానికి గురిఅయింది. "అన్నిటి నించీ తప్పించుకోవడానికి" కులూలోయలోని ఖాశీ గ్రామానికి వెళ్ళి విశ్రాంతి తీసుకుంటున్న జవహర్‌లాల్ ఆమెకు వ్రాస్తూ—

"హఠాత్తుగా తీవ్ర సంచలనం కలిగి విశ్చేష్టుడి నయ్యాను. హిట్లరు ఆస్ట్రియా మీదికి దండెత్తుతున్నాడు. వియన్నాలోని సుందరోద్యానవనాలలో

ఆ నరపశువుల పదతాడనాలు నాకు వినిపిస్తున్నాయి. ఇన్నాళ్ళుగా మనం అం దరం భయపడుతూన్న ప్రపంచ నాశనానికి ఇది నాందీయా? సంగ్రామం మొద లయిందా? ఖాళీ గ్రామమూ, ఇక్కడి మంచూ, పర్వతాలూ-ఏవీ నన్ను ఆకట్ట లేకపోతున్నాయి. నా శరీరమూ, మనస్సూ కూడా ఆందోళనాభరితమై ఉన్నాయి. ఖాళీలో కూడా నాకు శాంతి లభించడం లేదు.''

అన్నారు.

యూరపు వెడుతూ, జవహర్‌లాల్, దారిలో సూయజ్ వద్ద ఆగి, ఈజిప్టులోని వాఫ్డ్ పార్టీ నాయకుడు నహాస్ పాషాను కలుసుకున్నాడు. అరబ్బీ జాతీయ ఉద్యమ నాయకునితో ఆయన సమావేశం కావడం అదే ప్రథమం. ఉభయుల లక్ష్యాలలోనూ గోచరించే ఏకత్వం ఆయన కెంతో ఆశ్చర్యం కలిగించింది. ఆయన మార్సెయిల్సులో దిగాడు. కాని తనకోసం నిరీక్షిస్తూన్న ఇందిరను కలుసుకోకుండానే, జవహర్‌లాల్, ముందుగా బార్సిలోనాలోని రక్షక దళాలను సందర్శించడానికి విమానంలో వెళ్లాడు. అక్కడ ఉన్న అంతర్జాతీయ దళాలకి అభినందనలు తెలియజేశాడు. అక్కడనించి వచ్చాకనే ఇందూని కలుసుకోవడానికి ఆయనకి వీలు చిక్కింది. రెండేళ్ళ తరువాత తండ్రీ కూతుళ్ళు ఆప్యాయంగా కలుసుకోవడం అదే. కాని వ్యక్తిగత విషయాలూ, కుటుంబ వ్యవహారాలూ మాట్లాడు కోవడానికి వారికి తీరికలేదు. స్పెయిన్‌లో తన అనుభవాలను ఆయన ఏకరువు పెట్టేవాడు. అంతర్జాతీయ దళాన్ని గురించి 'ఇందు'కు చెప్పాడు. ఇది సైన్యాల్లో కన్నింటిలోకీ వింతయింది. వృత్తి రీత్యా సైనికులయిన వారెవరూ దీనిలో లేరు. దీనిలో ఎక్కువభాగం కవులు, రచయితలు, మేధావులు, స్వప్న సీమలలో విహరించే భావుకులున్నూ. ప్రపంచం అన్ని ప్రాంతాలనించీ తమ స్వప్నాలను ఫలింపజేసుకోవడానికి వచ్చి పోరాటం సాగిస్తోన్న విభిన్నవ్యక్తుల సము దాయమే ఈ అంతర్జాతీయదళం. ఆయన యూరప్‌లో అయిదు నెలలున్నాడు. కాని ఎప్పుడూ తిరుగుతూనే ఉండేవాడు. సభలకీ, సమావేశాలకీ వెళుతూండడం, ఉపన్యాసా లివ్వడం చేస్తూండేవాడు. ఎక్కువ కాలాన్ని లండన్, పారిస్, జినీవా లలో గడిపేవాడు. నాజీల ఒత్తిడికి గురిఅవుతున్న జెకొస్లవేకియా వెళ్ళాడు. ''ఉన్నత నైతిక ప్రమాణాలను పాటించవలసినచోట మిత్రద్రోహం చేయడానికి ఎంత కుత్సితంగా వ్యవహరించవలసి వస్తుందో ఆయన కళ్లారా చూశాడు.'' తన కూతురితో ఎక్కువసేపు గడపలేక పోయినందుకు ఆయన నిరాశచెందేవాడు. కాని ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమానికి గల ప్రాముఖ్యం ఆయనను ఎక్కువగా ఆకట్టుకునేది. అందు చేతనే చివరికి తాను భారతదేశానికి బయలుదేరేటప్పుడు తనతోపాటు వచ్చి కొంత కాలం వుండి చదువుకి ఆక్స్‌ఫర్డు వెళ్ళవచ్చునని సూచించాడు.

తిరిగి వస్తూ వారు ఈజిప్టులో ఆగారు. వాఫ్డు పార్టీ నాయకులు జవహర్‌లాల్ నెహ్రూకీ, ఆయన కుమార్తెకీ హృదయ పూర్వకమయిన స్వాగతం ఇచ్చారు. ఇది

సహజమే. భారత, అరబ్ జాతీయుల సమిష్టి ధ్యేయాన్ని సాధించడానికే పూను కున్నారు కాబట్టి వారిమధ్య మైత్రీభావం సహజం. కాని నెహ్రూ, నహాస్ పాషాల మధ్య జరిగిన సమావేశం వింత పుకార్లకి కారణమయింది. ఈ సమావేశంలో ఇంది రని నహాస్‌పాషా కుమారుని కిచ్చి పెళ్లి చేయాలని బేరాలు జరిగినట్లు ఊహాగానాలు వెలువడ్డాయి. నిరాధారమయిన యీ పుకార్లను విని వారందరూ నవ్వుకుని ఉంటారు. కారణం—నహాస్ పాషాకి కొడుకే లేడు.

ఆమె మూడు నెలలు ఇంటివద్ద గడిపింది. కాని తండ్రి మళ్ళీ రాజకీయాలలో తలమునకలై ఒక చోటినుంచి మరొకచోటుకి ప్రయాణం చేస్తూఉండేవాడు. ఎప్పుడో గాని—జబ్బుతోఉన్న తల్లివద్ద కొద్దిరోజులపాటు—ఆనందభవనంలో గడపడానికి వీల య్యేది కాదు. ఆ వృద్ధురాలికి తానింక ఆట్టే రోజులు బ్రతకనని అనిపించేది. అందు చేత ఇందిర తనవద్ద ఉన్నందుకు ఆమె ఎంతో సంతోషించింది.

ఒకరోజున ఆమె తన చిన్ననాటి ఆటవస్తువులూ, పుస్తకాలూ తిరగేస్తూండగా తనకి 21 ఏండ్లు నిండినట్లు ఇందిరకి హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. తొమ్మిదేళ్ళ క్రితం స్వరాజ్ భవనంలోని ఖద్దరు టోపీధారులు చెప్పిన మాటలుకూడా ఆమెకి జ్ఞాపకం వచ్చాయి. ఆమె కాంగ్రెసు ప్రధానకార్యస్థానానికి వెళ్ళి, ప్రవేశ పత్రాన్ని ఇమ్మని డబాయించింది. "నా కిప్పుడు 21 ఏండ్లు" అని ప్రకటించి చివరికి భారత జాతీయ కాంగ్రెసులో సభ్యత్వాన్ని పొందింది.

* * *

1939 వ సంవత్సరం ఏప్రెల్ నెలలో ఇందిర మళ్ళీ ఆక్స్‌ఫర్డులోని సమ్మర్ విల్లీ కళాశాలకి వెళ్లింది. కాని విద్యారంగంలోని ప్రశాంతతకు నాజీలూ, ఫాసిస్టుల దురంతాలు గొడ్డలి పెట్టుగా పరిణమించాయి. ఛాంబర్‌లేన్ 'ఛత్రాన్ని' ధరించి ఎంత పాటుబడినా ప్రపంచం తప్పనిసరిగా సంగ్రామాభిముఖంగానే పయనించ సాగింది. ధైర్య సాహసాలు మూర్తీభవించిన వృద్ధ పితామహి మరణించినట్లు ఇంటివద్ద నించి వర్తమానం అందింది. తన బాల్యంతో గల మరో అనుబంధం తెగిపోయిందని ఇందిర ఎంతో బాధపడింది. ఆగస్టు నెలలో తాను చైనాకు వెడుతున్నానని తండ్రి వ్రాశాడు. జపాన్‌వారు సాగిస్తున్న దండయాత్రను ప్రతిఘటించడంలో భారత జాతీ యులు చైనా ప్రజలకి పూర్తి మద్దతు నిస్తున్నారని తెలియజెప్పడానికే తాను ఈ ప్రయాణం చేస్తున్నట్లు ఆయన తెలిపాడు. కాని ఆయన వెంటనే తిరుగుముఖం పట్ట వలసి వచ్చింది. కారణం—హిట్లర్ సైన్యాలు నెమ్మదిగా పోలెండు ఆక్రమించు కోవడమే. ద్వితీయ ప్రపంచసంగ్రామం దారుణంగా మొదలయింది.

* * *

ఉత్తుత్తి యుద్ధం చివరికి వాస్తవ సంగ్రామంగా పరిణమించింది. తత్సహజమయిన ఘోరాలెన్నో జరిగిపోతున్నాయి—బ్లాకౌట్‌లు, వైమానిక దాడులను హెచ్చరించే సైరన్లూ, ఆ తరువాత నిజంగా వైమానికదాడులూనూ! ఫాసిస్టు వ్యతిరేక భావాలు గల ఇందిర దారుణ సంగ్రామాన్ని తెచ్చిపెట్టిన నాజీలను అసహ్యించుకోకుండా ఉండలేకపోయింది. ఎన్ని దారుణాలూ, అత్యాచారాలూ జరిగినా లెక్కచేయక ధైర్యంగా పోరాడుతున్న బ్రిటిష్ ప్రజల ధైర్యాన్నీ, మనోనిబ్బరాన్నీ మెచ్చుకోకుండా ఉండలేక పోయింది. వారు ఏ స్వాతంత్ర్య ప్రజాస్వామిక సూత్రాలకోసం పోరాడుతున్నామని చెప్పుకుంటున్నారో వాటిని భారతీయులకు నిరాకరించిన సంగతిని కూడా ఆమె మరిచిపోలేక పోయేది. భారతదేశం సాగిస్తున్న పోరాటంలో త్వరలోనే మరో దశ ఆరంభం కాబోతోందని ఆమెకు తెలుసు. ఆ దశ మొదలైంది కూడాను. అదే వ్యక్తిసత్యాగ్రహం. వినోబాభావే తరువాత రెండో వాలంటీరుగా జవహర్‌లాల్ అరెస్టయినాడు. మళ్ళీ ఆయన జైలుకి వెళ్ళాడు. ఈసారి యుద్ధసమయం కావడంతో ఉత్తరాలను సెన్సార్ చేస్తేనే గాని పంపేవారుకాదు. దీనికితోడు ఉత్తరాలు వెళ్ళడంలో జాప్యం ఎటూ ఉండనే వుండేది. వీటన్నిటి మూలంగా తండ్రి వద్దనించి ఉత్తరాలు క్రమంగా వస్తాయని ఆమె ఆశించలేక పోయింది. ఆమె మనస్సులో ఒకే ఒకభావం వేధిస్తూండేది. "నేను వెళ్లాలి, వెళ్లాలి, వెళ్ళి తీరాలి" అని. ఎంతలేదన్నా తానుకూడా ఇప్పుడు కాంగ్రెసులో పూర్తి సభ్యురాలేకదా! సత్యాగ్రహం చేసి అరెస్టయ్యే హక్కు తనకి మాత్రం లేదా?

యుద్ధం అనడంతో ఎన్నో ఇక్కట్లూ, చిక్కులూనూ. బాగా దృఢకాయులైన వారు మాత్రమే ఈ ఇబ్బందులన్నిటినీ సహించి ఆరోగ్యాన్ని కాపాడుకో గలుగుతారు. రేషన్ బాగా పరిమితంగా లభిస్తూండేది. పోషకాహారాలు దొరికేవి కావు. ఎముకలు కొరికే చలికాలంలో కూడా ఉష్ణాన్ని కలుగజేసే సదుపాయాలు లభ్యమయ్యేవి కావు. భయప్రమాదాల ఉద్రిక్తత నిరంతరాయంగా వేధిస్తూండేది. ఎప్పుడు విమానాలు దాడి చేస్తాయోనని భయం ఆవేశిస్తూండేది. రాత్రిళ్లు పెద్ద శబ్దం చేసుకుంటూ రాకెట్లు దూసుకు పోతూండేవి. అసలే అంతంత మాత్రంగా ఉన్న ఇందిర ఆరోగ్యం దెబ్బ తింది. ఇందిరకి ఊపిరితిత్తులలో మంట (Pleurisy-ప్లూరసీ) బయలుదేరింది. తండ్రి సూచనను అనుసరించి ఆమెను స్విట్జర్లాండులోని శానిటోరియంకి వెంటనే తీసుకు వెళ్లారు. స్విట్జర్లాండులోని ఆల్ప్స్ పర్వతాలపైన గల ఆహ్లాదకర వాతావరణంలో ఆమె ఆరోగ్యం బాగుపడింది. పరస్పరం సంగ్రామం సాగిస్తున్న దేశాలమధ్య గల తటస్థమయిన స్విట్జర్లాండు యుద్ధాన్నించి తప్పించుకో గలిగిన వారికి స్వర్గం. అంతే కాదు. అక్కడినించి బయటికి తప్పించుకు పోవడం కూడా కష్టమే. ఆమె విమానంలో భారతదేశం వెళ్ళే వీలుంది. ఆమె మేనత్త కృష్ణాహతీసింగ్‌కి ఈ సంగతి తెలియగానే ఆమె అన్నగారికి వ్రాస్తూ, యుద్ధకాలంలో విమాన ప్రయాణంలో గల ప్రమాదాలను గురించి హెచ్చరించింది. దానికి ఆయన ఇచ్చిన సమాధానం—"స్వదేశానికి

తిరిగి రావాలని ఇందూ నిశ్చయించినందుకు నాకు సంతోషంగా వుంది. ఎన్నో ప్రమాదాలు, ఇబ్బందులు ఉన్నమాట నిజమే. కాని ఒంటరిగా దురవస్థను అనుభవించడం కంటె వాటిని ఎదుర్కోవడం మంచిది. ఆమె తిరిగి రావాలని అనుకుంటే ఆ ప్రకారం చేసి పరిణామాలను ఎదుర్కోవడమే మంచిది." కాని ఇందిర చివరికి విమానంలో రావడానికి వీలు లేకపోయింది. ఆమె స్టీమరులోనే, దీర్ఘప్రయాణంచేసి యింటికి చేరుకోవలసి వచ్చింది. ఎల్లప్పుడూ ఆరాధిస్తూండే ఫిరోజ్ సహాయంతో ఇందిర స్టీమరెక్కి, సూయజ్ కాలువ త్రవ్వక పూర్వం లండన్‌నించి బొంబాయికి ప్రయాణంచేసే సుదీర్ఘమయిన సముద్ర మార్గంలో, గుడ్‌హోప్ అగ్రాన్ని చుట్టి, స్వదేశం చేరుకుంది. అదే ఓడలో ప్రయాణం చేసిన మరో భారతీయుడు భూపేష్‌గుప్తా. ఆయనకి ఇంగ్లండులో చదువు పూర్తయింది. ఈ ముగ్గురు యువజనులూకూడా మూడు విభిన్న తత్వాలు గలవారు. ఎవరి భవితవ్యం వారిది. చివరికి వీరు ముగ్గురూ కూడా భారత రాజకీయాలలో, పరస్పరం విరుద్ధమే అయినా, విశిష్టమయిన పాత్ర వహించగలిగారు. కాని ఆనాడు—1941 వ సంవత్సరపు క్లిష్ట తరుణంలో అక్షరాలా "ఒకే నౌకలో" ప్రయాణం చేశారు.

జర్మన్ జలాంతర్గాములను తప్పించుకుంటూ, అనేక ప్రమాదాలకు లోనవుతూ, ఆ ఓడ కొన్నాళ్ళు పూర్తిగా ఆగిపోతూ, ముందుకు సాగిపోతూ చివరికి దక్షిణాఫ్రికాలోని రేవులో దీర్ఘకాలంపాటు ఆగిపోవలసి వచ్చింది. కేప్‌టౌన్‌లో ఒక రోజంతానూ, డర్బాన్‌లో ఒకవారం అంతానూ ఆగిపోవలసివచ్చింది. అక్కడి భారతీయ సంతతి వారు జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తెకి అతిసంతోషంగా స్వాగతం పలికారు. కాని ఆమె ఉపన్యాసం ఒకటి విన్న తరువాత "ఆ భారతజాతీయులే నన్ను పూర్తిగా బహిష్కరించారు" అని ఇందిరే అన్నది. అది ఎలా జరిగిందో తెలుసుకోవడం చాలా ముఖ్యం. ఎందుచేతనంటే ఇందిరా నెహ్రూ రాజకీయ రంగంలో ప్రవేశించడం అదే ప్రథమం. అదీగాక ఇతరుల ప్రోత్సాహంగానీ, సహాయంగానీ లేకుండానే ఈ రాజకీయరంగ ప్రవేశం జరగడం దానిలోని ప్రత్యేకత.

ఇందిరకి అప్పటికి బహిరంగ సమావేశాలలో ఉపన్యాసాలు ఇవ్వడం సిగ్గుగానే ఉండేది. తనకి సన్మానం ఇచ్చేందుకు ఏర్పాటుచేసిన ఆతిథ్య సభలో ప్రసంగించమని వారు కోరినప్పుడు మర్యాదగానే ఆమె నిరాకరించింది. "సరిగ్గా రెండు నిమిషాలు మాట్లాడండి'' అని వారు అడిగినా ఆమె అంగీకరించలేదు. "నేను మాట్లాడలేను, మాట్లాడను" అని చెప్పింది. "కనీసం, మీరు లేచి నిలబడి 'Thank you' అని అనండి'' అని వారు మళ్ళీ అభ్యర్థించారు. అప్పటికీ కూడా ఆమె తన మౌన ముద్రను వదలలేదు.

కాని సమావేశానికి ముందుగా ఫిరోజ్, భూపేష్‌లతో ఆమె నగరం అంతా పర్యటించి, రంగు జాతులవారికోసమని ఏర్పాటు చేసిన వెలివాడలలో గల దుర్భర

పరిస్థితులను స్వయంగా పరిశీలించింది. అక్కడ హేయమయిన జాతి వెలివిధానం ఆమెకు ప్రత్యక్షమయింది. అక్కడి ఆ దుర్భర పరిస్థితులు ఆమెకు తీవ్రమయిన వ్యథను కలుగజేసి ఉత్తేజితురాలిని చేశాయి. ఆతిథ్యసభకి చేరుకునేసరికి ఆమెలో ఆగ్రహావేశాలు కట్టలు తెంచుకుని బయటపడడానికి ఉంకిస్తున్నాయి. సమావేశం అధ్యక్షుడు సంప్రదాయానుసారంగా పూలమాలలు వేసి స్వాగతోపన్యాసం ఇచ్చి ఇందిరా నెహ్రూ ఉపన్యసింపజాలరని ప్రకటించాడు..........కాని ఇందిర అప్పటి కప్పుడే లేచి నిలబడి, మాట్లాడతానని పట్టు బట్టింది.

ఆమె తన అభిప్రాయాలను నిష్కర్షగా చెప్పింది. పరిణామాలను వారికే వదలివేసింది. కాని అక్కడ సమావేశమయిన వర్తకులూ, వ్యాపారులూ ప్రభుత్వోద్యోగులతో కూడిన భారత జాతీయులలోని మర్యాదస్థులందరూ ఈ ఉపన్యాసం విని నిశ్చేష్టితులయ్యారు. ఇందిర తన ఉపన్యాసంలో జాతి వెలివిధానాన్ని నిష్కర్షగా తెగనాడింది. దక్షిణాఫ్రికాలోని శ్వేతజాతులవారు రంగు జాతులవారి పట్ల సాగిస్తూన్న దమన విధానాన్ని యూదులపట్ల హిట్లరు సాగిస్తూన్న హింసాకాండతో పోల్చి విమర్శించింది. ఆఫ్రికా ఆఫ్రికన్ ప్రజల హక్కనీ, చివరికి ఏనాటికయినా వారే ఆ ఖండంపై యజమానులై తీరుతారనీ ప్రకటించింది. దురహంకారి అయిన శ్వేతజాతీయులు మూటా ముల్లే కట్టుకుని వెళ్ళిపోక తప్పదని ఉద్ఘాటించింది. శ్వేతజాతీయుల దాక్షిణ్యాలకోసం ప్రాకులాడుతూ ఆఫ్రికన్ ప్రజలకి దూర దూరంగా తిరుగుతూన్న భారతీయుల సేవాతత్వాన్ని కూడా ఆమె గర్హించింది. "ఆ తరువాత మేము ఇంకా మరికొన్ని రోజులు అక్కడే ఉన్నా కూడా మాకు సభలలో పాల్గొనడానికి ఆహ్వానాలు రాలేదు" అని ఇందిర చెప్పింది.

డర్బాన్‌లో ఇచ్చిన యీ ఉపన్యాసం ఆమెలో రాజకీయ చైతన్యానికి ఒక మలుపు. బిడియస్థురాలయిన ఇరవై రెండేళ్ళ ఆ యువతి, తగినంతగా ఉత్తేజితురాలయి నప్పుడు ఘాటుగా, సుదీర్ఘమయిన ఉపన్యాస మివ్వగలదని రుజువయిం దానాడు. ఇదే ఆమె ప్రవర్తనకి కీలకం.

సహజంగా ఆమె బిడియస్థురాలూ, ఒంటరితనాన్ని కాంక్షించేదే అయినా ఆది నించీ పొందిన శిక్షణవల్ల ఏ పరిస్థితుల నయినాసరే వ్యక్తిత్వానికి సహజమయిన పూర్తి శక్తిసామర్థ్యాలతో ఎదుర్కోగలదని కూడా రుజువైంది. ఆనాడు ఆమె అనుకోకుండా తన శక్తిసామర్థ్యాలను గుర్తించ గలిగింది. అప్పటినించి ఏ సభలో నయినాసరే ఉపన్యసించడానికి ఆమె వెనకాడేది కాదు. ముఖ్యమయినదీ, చెప్పదగినదీ ఏమయినా ఉన్నప్పుడు ఆమె నిస్సంకోచంగా చెప్పివేసేది.

# 9

# చెరసాలలో 'హనీమూన్'

ఇప్పటికీ
ప్రణయానికి గల ధైర్య సాహసాలను చూసి, నేను విస్మయం చెందుతాను.
—ప్రాచీన సంస్కృతశ్లోకం

1941 వ సంవత్సరం మార్చి నెలలో ప్రముఖ ఫ్రెంచి శాస్త్రవేత్త మదాం క్యూరీ కుమార్తె అయిన పత్రికా రచయిత్రి ఈవ్ క్యూరీ అలహాబాదు వచ్చింది. జన సమ్మర్దంగల ఆ రైలు స్టేషనులో కలకత్తా మెయిల్ ఆగగానే జవహర్‌లాల్ నెహ్రూ ప్లాట్‌ఫారం మీద గబగబా ముందుకు వచ్చి హృదయపూర్వకంగా స్వాగతం చెప్పాడు. "మేము అదివరకే ఎన్నోసార్లు కలుసుకున్నంత అప్యాయతతో ఆయన పలకరించాడు" అంటుంది ఈవ్ క్యూరీ.

ఆ ఫ్రెంచి యువతికి జవహర్‌లాల్ "జానపదగాథలలోని అందమయిన రాకుమారుడిలా కనిపించాడు.........ఆకర్షణీయ మయిన ముఖం. నవ్వించే వైఖరి. ఆ ముఖభంగిమలు ఝంఝూమారుతం వీచినప్పటి వియత్తలంవలె త్వరత్వరగా మారిపోతూవచ్చాయి." ఆమెను ఆయన ఆనందభవనం తీసుకు వెళ్లాడు. అక్కడ కారు దిగగానే ఇంటినిండా అనేకమంది కనిపించారు. "చిన్నపిల్లలు, అతిథులు, కుటుంబ సభ్యులు, సేవకులు—క్రిందిభాగంలో అంతా మంచి కోలాహలంగా ఉంది, కిటికీలు, తలుపులూ అన్నీ తెరిచి ఉన్నాయి, ప్రత్యేకమయిన వేడుక యేదయినా వుందా అని అడుగుదామనుకుంటూండగానే ఈవ్ క్యూరీని మొదటి అంతస్తులో ఆమెకు కేటాయించిన గదికి తీసుకువెళ్లారు.

ఆమె "చన్నీళ్ళ స్నానంచేసి శుభ్రమయిన దుస్తులు ధరించి మిగతా కుటుంబం వారినీ, అక్కడగల అతిథులనీ కలుసుకునేందుకు క్రిందికిదిగింది." ఆమెను విజయలక్ష్మీ పండిట్‌కి ("చక్కగా దువ్విన నెరసినజుట్టుతో ఎంతో అందంగా వుండేదామె"),

పండితుడయిన ఆమె భర్త ఆర్. యస్. పండిట్‌కీ, సరోజినీ నాయుడికీ ("అసాధారణ మేధావిని ఆమె. మంచి చమత్కారంగా మాట్లాడుతుంది.........భారత జాతీయ జీవనంలో ఆమెకూడా ఒక ప్రముఖురాలే"), ఇందిరా నెహ్రూకూ ("నెహ్రూ కుమార్తె. అర్భకాకారి అయినా అందమయినదే. సన్నగా, తెల్లగా, ఆలోచనా ధీన మనస్కురాలుగా గోచరించే శాస్త్రీయ ముఖభంగిమ ఆమెది. ఆమె ఏగ్రీసులోనో జన్మించిందేమో అనిపిస్తుంది") పరిచయం చేశారు. మరునాడే ఇందిర వివాహమని నెహ్రూ ఆమెకు తెలిపాడు. జవహర్‌లాల్ నెహ్రూ యింటిలో అంతమంది అతిథులూ, వారిపిల్లలూ ఎందుకు ఉన్నారో ఆ ఫ్రెంచివనితకి అప్పటికి అర్థ మయింది.

కాబోయే పెండ్లి కుమార్తెను అభినందించి, "పెండ్లి కుమారుడు కాగలిగిన అదృష్ట వంతుడు ఎవరు?" అని అడిగింది. "ఇందిరవరుడు ఫిరోజ్‌గాంధీని" ఆమెకు పరిచయం చేశాడు. "ఇతను ఒక పార్సీ యువకుడు. ఇతను గాంధీకి చుట్టంకాదు." అటువంటి మంచి సమయంలో తాను అక్కడికి రాగలిగినందుకు ఈవ్‌క్యూరీ ఎంతో సంతోషించింది. కొన్ని వారాలక్రితమే విడుదలయిన జవహర్‌లాల్ నెహ్రూను కలుసుకుని రాజకీయ విషయాలపై గోష్ఠి జరపడానికి మాత్రమే ఆమె భారతదేశం వచ్చింది. కాని వివాహంకూడా దానితో కలిసివచ్చింది. ఈ వివాహం ఉత్తేజ కర మయినదే గాక వివాదాస్పదమయినదని కూడా ఆమె గ్రహించింది.

* * *

1941 లో భారత దేశంలో పెండ్లి కుమార్తెలలో ఇందిరా నెహ్రూ తలమానిక మని చెప్పవచ్చు. నెహ్రూ అందం, నెహ్రూ కుటుంబ ప్రతిష్ఠ, నెహ్రూ సాహసగాథలూ అన్నీ కలిపి ఆ ఉత్తమవంశసంజాతపట్ల ఆసక్తిని శతాధికం చేసే—అగ్రశ్రేణి సినిమాతారలుకూడా అసూయ పడగలిగిన - లాలిత్యం ఆమెది. నెహ్రూ భారతదేశానికి మకుటం లేని మహారాజు. ఇందిర ఆయన కుమార్తె. ఇదిచాలు, ఆనాటి వేలాది యువతి హృదయాలను—ముఖ్యంగా జాతీయోద్యమంలో పాల్గొంటూ, రాజకీయ చైతన్యంగల యువతులను ఉద్రూత లూగించడానికి.

అందుచేతనే ఇందిర వివాహం కేవలం ఇద్దరు ప్రేమికులు నిర్ణయించుకునే వ్యక్తిగతవ్యవహారంగా పరిగణించడానికి వీలులేకపోయింది. నైతిక విషయాల లోనూ, ఇతర వ్యవహారాలలోనూ కూడా తమ నాయకులనూ, వారి కుటుంబాలనూ ఆదర్శంగా పెట్టుకునే దేశంలో ఇందిర ఎన్నికలో నెహ్రూ కుటుంబ ప్రతిష్ఠే కాక జాతీ యోద్యమ ప్రతిష్ఠ కూడా మిళితమై వుంది.

ఇందిర తన వరుణ్ణి ఎన్నుకొని, తనకు సంబంధించినంతవరకూ అతి ముఖ్యు డనుకొనే ఒకే ఒక వ్యక్తికి ఆ సంగతి తెలియజేసింది. ఫిరోజ్ హిందూమతస్థుడు కాకపోవటంచేత ఒక పార్సీని ఆమె పెండ్లి చేసుకోవడం యిష్టంలేక జవహర్‌లాల్

నెహ్రూ కుమార్తె నిర్ణయాన్ని వ్యతిరేకించి, ఆ సంబంధం వదులుకోమని నచ్చజెప్ప డానికి ప్రయత్నించాడని ఒక గాథ ప్రచారంలో వుండేది. కాని అది నిజంకాదు.

అటువంటి హేతువాది తన కుమార్తె స్వేచ్ఛకి అవరోధం ఎన్నడూ కల్పిం చడు. కాని ఇందిర అతనిని వరుణ్ణిగా ఎన్నుకోవడంలో ఆయనకి లోపల్లోపల అంత యిష్టం లేనిమాట నిజమే. కారణం వీరిరువురి సంప్రదాయాలలోనూ, తత్వాల లోనూ అంతరం ఎక్కువనే ఆయన భయం. బహుశా ఆమె తొందరపాటులో ఈ నిర్ణయానికి వచ్చిందని, మరోసారి ఆలోచించడం మంచిదని అనుకున్నాడు. కాని ఆమె తన నిర్ణయానికి తిరుగు లేదని స్పష్టంచేసినప్పుడు జవహర్‌లాల్ ఆ వధూవరు లకు తన సమ్మతిని తెలియజేసి శుభాశీస్సులను అందజేయడమేకాదు—పెండ్లి వేడుక లలో ఎంతో ఉత్సాహంతో, సంతోషంతో పాల్గొన్నాడు. మనస్ఫూర్తిగా ఆయన 'కన్యాదానం' చేశాడు.

కుటుంబంలోని మిగతావారు మాత్రం ఇందిర నిర్ణయాన్ని అంతగా ఆమో దించలేక పోయారు. "జాతి యావత్తూ కూడా మా వివాహాన్ని ప్రతిఘటించింది". అని ఇందిర ఒకసారన్నది. వేలాది ఛాందసులూ, తమ సంప్రదాయాలను కాపాడు తున్నామని చెప్పుకునే మత సంరక్షకులూ ఉత్తరాలూ, టెలిగ్రాంలూ పంపేవారు; ఇటువంటి మత సాంకర్యం చేయరాదని నెహ్రూకుటుంబాన్ని హెచ్చరించారు. కులాంతర, మతాంతర వివాహాలు చట్టసమ్మతమే అయినా 1941 నాటికి భారత దేశంలో బహు అరుదుగా జరిగేవి. ఇందిరకీ, ఆమె తండ్రికీ కూడా బెదిరిస్తూ, ఒక్కొక్కప్పుడు తిడుతూ, ఉత్తరాలు ధారావాహికంగా వచ్చిపడేవి ఆనందభవనంలో. అభ్యుదయభావాలుగల విశాలహృదయుల వద్దనుంచి కొన్ని ప్రోత్సాహకరమయిన ఉత్తరాలు కూడా వచ్చేవి.

"వివాహానంతరం ప్రజాభిప్రాయం ఎలా వుంది?"

అని ఒకరు ఆమెను అడగ్గా,

"విశాలహృదయం గలవారు ఇది మంచిదనే అభిప్రాయపడ్డారు. ఇట్టి మతాం తర వివాహాలు ఎక్కువగా జరగాలని వారి ఆకాంక్ష. మతోన్మాదుల వర్గంవారు మాత్రం తమ అభ్యంతరాలను వదులుకోలేరు" అని జవాబిచ్చింది ఆమె.

తనను కలుసుకున్న ఆ వ్యక్తికి ఇందిర నెహ్రూకుటుంబంలో జరిగిన మతాం తర, కులాంతర వివాహాలను గురించి జ్ఞాపకం చేసింది — ఆమె దగ్గర బంధువు బి. కె. నెహ్రూ ఒక హంగేరీ బాలికను పెండ్లియాడాడు. ఆమెకు అక్కచెల్లెండ్ర వరుస అయ్యే మరో యిద్దరు ముస్లింలను పెండ్లియాడారు. "వారిలో ఒకడు ఇప్పుడు పాకిస్తాన్ దేశస్థుడు."

ఈ విషయమై గాంధీజీ వైఖరి ఏమిటని నేనడిగాను. తన దృఢనిశ్చయాన్ని తెలిపినప్పుడు మహాత్ముడు మనఃపూర్వకంగా ఆశీర్వదించాడని ఆమె చెప్పింది. పెద్ద వేడుకలు, ఆడంబరాలు లేకుండా వివాహం సూక్ష్మంగా జరిగిపోవాలని ఇందిర, ఫిరోజ్‌లు కోరారు. కాని వీరి వివాహం విషయమై ప్రజలలో ఇంత వివాదం చెల రేగింది కాబట్టి ఇది బహిరంగంగా, అతిథులందరి సమక్షంలో జరగడమే మంచిదని మహాత్ముడు సూచించాడు. అలాంటప్పుడు జవహర్‌లాల్ స్వయంగా కన్యాదానం చేశాడా, లేదా అన్న విషయంలో ఎవరికీ సందేహం ఉండదు.

* * *

ఇందిర అన్ని విధాలాకూడా మిగతా భారతీయ బాలికల మోస్తరుగానే ఎంతో సిగ్గుపడింది. కాని నూతన వధువు సహజంగా ఉత్సాహ, ఉద్వేగాలకు లోనయింది. వివాహాన్ని స్వయంగా చూసిన ఈవ్ క్యూరీ పెండ్లి సన్నాహాలలో ఒక సంఘటనను ఇలా అభివర్ణించింది :

"పెండ్లి కుమార్తెకు ఒక వర్తకుడు తట్టెడు గాజులు తీసుకు వచ్చాడు. అవి ఇంద్ర ధనుస్సులోని రంగులన్నిటిలోనూ మెరుస్తున్నాయి. ఇందిర ఎంతో శ్రమపడి తనకు నచ్చిన గాజులు ఏరుకుంది. తన చీరలకి నప్పే రంగులు ఎన్నుకుంది. 'గాజులు కాబట్టి ఇవి త్వరగా పగిలి పోతూంటాయి. కాని బాగా చవుకగనుక మళ్ళీ వేసుకోవచ్చు. ఒక్కొక్క చేతికి ఏకంగా 10, 12 గాజులు వేసుకుంటే మంచి తమాషాగా ఉంటుంది.'"

ఇక వివాహాన్ని గురించి ఇందిర మేనత్త కృష్ణహతీసింగ్ తన ఆత్మకథలో అత్యంత ఆసక్తికరంగా అభివర్ణించింది. "వసంతం. ఆవేళ చక్కని ఎండ వచ్చింది. ప్రకృతి కళకళలాడుతోంది. అనేకమంది మిత్రులూ, దగ్గర బంధువులూ వధువుగదిలో చేరి ఆమెను ఎగతాళి చేస్తున్నారు. ఆమెను పెండ్లికూతురు దుస్తులతో అలంకరించేటప్పుడు చూడాలని ఆ యీడు బాలికల కందరికీ సహజంగా సర్దాగా వుంటుంది. కన్యాదాత జైలులో ఉండగా వడికిన సన్నని ప్రత్తినూలుతో ఆ గులాబీ రంగు మధుపర్కం నేశారు. దానికి చుట్టూ వెండి జరీపూల అంచు ఉంది.

"ఆమె కపోలాలు సిగ్గుతో రాగరంజితము లయాయి. ప్రశాంతంగా ఉన్నట్లు నటిస్తున్నా ఆమె కొద్దిగా ఉద్వేగానికి లోనయింది. అనేక మంది ఆమెను పరివేష్టించి వున్నారు. వందలకొలది కానుకలు ఆ గదిలోకి వచ్చి పడుతున్నాయి ......ఆమె సన్నగా, గాలిలో తేలిపోతున్నట్లు, అపూర్వ సౌంద ర్యంతో తేజరిల్లుతోంది. ఆమె నవ్వుతూ, చుట్టూ ఉన్నవారితో సరదాగా మాట్లాడుతోంది. కాని అప్పుడప్పుడు ఆమె విసీల నయనాలు విషాదచ్ఛాయ లతో మరింత నల్ల నవుతూండేవి. ఆ సంతోష సమయంలో ఆమె ఆనంద

జ్యోతిని ఆచ్ఛాదించే విషాద మేఘాలు ఏమయివుంటాయి? చిన్న వయసు లోనే గతించిన తల్లిమీది బెంగా....తండ్రికి సర్వస్వం అయిన తాను ఆయ నను వదలి వెళ్ళవలసి వస్తుందన్న ఆలోచనా? తను వెళ్ళి పోవడంతో ఆయన ఇదివర కెన్నడూ ఎరగనంత ఒంటరి తనాన్ని అనుభవించవలసి వస్తుంది."

ముహూర్తం సమీపించగానే జవహర్‌లాల్ ఆమెను పెండ్లి పందిరిలోకి తీసుకు వెళ్లాడు. వివాహం బహు క్లుప్తంగా, నిరాడంబరంగా జరిగిపోయింది. వధూ వరులు ఒకరి ప్రక్కన ఒకరు ఆసీనులయారు. వారికెదురుగా కన్యాదాత కూర్చు న్నాడు. ఆయన ప్రక్క వధువు తల్లికోసం ఉద్దేశించిన స్థానం ఖాళీగా ఉంది. ఆ ఖాళీ స్థానం జీవితంలో విషాదరహితమయిన ఆనందం లేదని గుర్తు చేస్తోంది, వధువుకు.

మనస్సులు కలిపిన వివాహమది. ఇద్దరు ప్రేమికుల కలయిక. చిన్ననాటి నుండి ఒకరి నొకరు బాగా తెలిసికొన్న నూతన దంపతులు వారు. ఫిరోజ్, ఇందిర దంపతులకి అనేక విషయాలలో సామ్యం ఉంది. అనేక సందర్భాలలో వారు చేదోడు వాదోడుగా పనిచేశారు. చక్కని పుస్తకాలు చదువుకునేవారు. చక్కని గానాన్ని ఆనందించేవారు. ఉభయులకూ కూడా ఆధునికభావాలు కలవారు. మూఢ విశ్వా సాలూ, వాదస్తాలూ లేవు. ఇద్దరూ కూడా జాతీయ ఉద్యమానికి అంకితులయినవారే. వారు పరస్పరం ప్రేమించుకోవడమే కాదు. ఉభయులకూ కూడా జవహర్‌లాల్ నెహ్రూ పై ప్రేమ మిక్కుటం. ఇందిరకు ఆయన కేవలం తండ్రి మాత్రమే. కాని ఫిరోజ్‌కు మాత్రం తన ఆశయాలన్నీ మూర్తీభవించిన నాయకుడూ, ఆరాధ్యదైవమూనూ.

కాశ్మీరులో మనోహ్లాద కరమయిన వసంత సమయం అది. ప్రణయయాత్రకు విచ్చేసిన నూతన వధూవరులకు ఆ వనాలలోని వికసిత కుసుమాలు స్వాగతం పలికాయి. నూతన దంపతులందరి వలెనే వారూ అపారమయిన ఆనందానుభూతిని పొందేవారు. కాని అంతటి ఆనందంలో కూడా వారు ఆనందభవన్‌లోని ఒంటరి జీవిని విస్మరించ లేక పోయేవారు. దేశం సాగించే తుదిపోరాటానికి, కుతకుత ఉడికించే తీవ్రాతపంలో శ్రమించే జవహర్‌లాల్ వారికి గుర్తు వచ్చేవాడు.

గుల్మార్గునించి వా రిద్దరూ సంతకాలు చేసి ఒక టెలిగ్రాం పంపారు. "ఇక్కడి నించి చల్లగాలి కొంత మీకు పంపాలనిపిస్తోంది." వారి ఆప్యాయత ఆయనను కద లించివేసి వుంటుంది. కాని ఆయన తనకు సహజమయిన సున్నిత హాస్య ధోరణిలో వెంటనే తిరిగి టెలిగ్రాం ఇస్తూ "చాలా Thanks. కాని అక్కడ మామిడి పండ్లు ఏమీ లేవా?" అన్నారు.

* * *

బహు స్వల్పకాలమే వారు ఈ ప్రణయ యాత్ర సాగించ గలిగారు. కొద్ది రోజులకే వారు లక్నో చేరుకుని అక్కడ కాపరం పెట్టారు. ఫిరోజ్ గాంధీ 'నేషనల్

హెరాల్డు' దిన పత్రిక మేనేజరుగా ఉండేవారు. ఈ పత్రిక సంపాదకుడు శ్రీ చలపతి రావు "లండన్‌నించి అప్పుడే కొత్తగా దిగడంచేత, అప్పట్లో, ఫిరోజ్ సోవియట్ యూనియన్‌తో సహా అనేక అంశాలపైన నూతనోత్సాహంతో పెల్లుబుకుతూండే వాడు" అని అంటారు. భార్యాభర్త లిద్దరూ కూడా కాంగ్రెస్ కార్యకర్తలుగా ఉండే వారు. ఆ సంస్థకు నవచైతన్యాన్ని కూర్చే తీవ్రవాదులయిన యువజనులు దినదినాభి వృద్ధి చెందుతూండేవారు. ఈ నూతన దంపతులుకూడా వారిలో చేరారు. పత్రికలో యజమానిగా కాక ఫిరోజ్ ఇష్టాగోష్ఠులతో, ఉత్సాహం గల సహచరుడుగా పని చేస్తూండేవాడు. ఇహ ఇందిర కాంగ్రెసులో మహిళావిభాగాన్నీ, ఇంకా అనేక సంఘ సంక్షేమసంస్థలనూ ఏర్పాటు చేయడంలో నిమగ్నురాలై వుండేది. ఆమె చక్కని గృహిణిగా కూడా పేరు తెచ్చుకుంది. అంత మరీ పెద్దదీ, చిన్నదీ గాని తమ ఇంటిని నిరాడంబరంగా, ఆహ్లాదకరంగా అలంకరించింది. క్రమేణా వారి గృహం తీవ్రరాజకీయ వాదులయిన యువజనులకూ, అభ్యుదయభావాలు గల మేధావులకూ నిలయంగా భాసించింది. ఇందిరవలె కాక, ఫిరోజు, బోళామనిషి. తన స్నేహితులతో కేరింతాలు కొడుతూ ఇష్టాగోష్ఠిగా గడిపేవాడు. ఇందిరకు, ఆనందభవనంలో, ఈ రకం జీవితం ఎక్కువగా అలవాటు లేదు. ఒక్కొక్కప్పు డామెకు ఈ పద్ధతి అంతగా నచ్చేది కూడా కాదు.

ఇందిరను కలుసుకోవడానికి కూడా అనేక తరహాల మహిళలు వస్తూండేవారు. ఉపాధ్యాయినులూ, మహిళాకళాశాల విద్యార్థినులూ, కాంగ్రెసులోని మహిళా కార్యకర్తలూ, స్వచ్ఛంద సేవికలూ, పరిసర గ్రామాలనించి కర్షక వనితలూకూడా ఆమె వద్దకు వచ్చేవారు. తమ ఇబ్బందులూ, సమస్యలూ చెప్పుకుంటూ ఉండేవారు. జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె కయితే మాత్రం వారి సమస్యలన్నీ పరిష్కరించడం సాధ్య మవుతుందా? కాని ఆమె వారి గోడంతా శ్రద్ధగా వినేది. వారికి సహాయం చేయలేక పోయినా, ఆమె, సానుభూతితో ఏదో ఒక సలహా యిచ్చి పంపుతూండేది. కాని కొందరు చాదస్తులు తరుచుగా వచ్చి ఆమెను వేధిస్తూండేవారు. వారిలో రాణి అనే ఆమె ఒకతె.

ప్రతిరోజూ ఆవిడ ఒకే టైముకువచ్చి, ఊహాజనిత మయిన ఇక్కట్లను వెళ్ళబోసుకుని ఇందిరను విసిగిస్తూ వుండేది. ఈవిడవల్ల పడే బాధలను గురించి ఇందిర ఒక స్నేహితుడికి వ్రాస్తూ ఇలా అన్నది:

"ఆమె రైలులాగా రోజూ సరిగ్గా వేళకు వస్తూండేది. ఈ మధ్య రైళ్లు కూడా సరిగ్గా సమయానికి వస్తూనే ఉన్నాయి గదా!"

* * *

చరిత్రాత్మక మయిన 'క్విట్ ఇండియా' తీర్మానాన్ని ఆమోదించిన బొంబాయి కాంగ్రెస్ సమావేశానికి ఇందిర, ఫిరోజు కూడా హాజరయారు. దేశాన్ని విడిచిపెట్ట

డానికి ఇష్టంలేని బ్రిటిష్ వారివద్దనించి బలవంతంగా దేశస్వాతంత్ర్యాన్ని సాధిం చేందుకు నిక్కచ్చియైన చర్యలు తీసుకోవాలని వాదిస్తూ వచ్చిన తీవ్రవాదులకూ, యువ జనులకూ అది విజయమని చెప్పవచ్చు. 1942 వ సంవత్సరం ఆగష్టు 8 వ తేదీన ఆ తీర్మానాన్ని ఆమోదించారు. సమావేశంలో పాల్గొన్న నాయకులు స్వరాష్ట్రాలకు తిరిగి వెళ్ళి ఉద్యమాన్ని ప్రారంభించే లోగా కాంగ్రెసులోని అగ్రనాయకు లందరినీ అరెస్టు చేశారు. తన మేనత్తతో ఉండిన ఇందిర, తండ్రిని అరెస్టు చేయడానికి ఇంకా తెల్లారనైనా తెల్లారకుండా 5 గంటలకే వచ్చిన పోలీసులతో వెళ్ళడానికి వీలుగా తండ్రికి కావలసిన వస్తువులన్నీ సమకూర్చడంలో తోడ్పడింది. ఆ మరునాడే ఆమె అలహాబాదుకు రైలు ఎక్కింది.

ఆమె ఆనందభవన్‌కు చేరుకునేటప్పటికి రాత్రి బాగా పొద్దుపోయింది. మరు నాడు ప్రొద్దునే పోలీసులు ఆమె మేనత్త విజయలక్ష్మీ పండిట్‌ను అరెస్టు చేయడానికి వచ్చారు. మళ్ళీ వెనకటి చెడ్డరోజులు వచ్చాయా అనిపించింది. ఇట్లాంటి సందర్భా లలో అరెస్టు చేయడానికి పోలీసులు సూర్యోదయం కాకుండానే ఊడి పడుతూంటారు. ఎన్నోసార్లు తండ్రిని అరెస్టు చేసినపుడు ఆయనకు వీడ్కోలు చెప్పేందుకు తనను నిద్రలోనించి లేపిన సందర్భాలు అనేకం ఆమెకు జ్ఞాపకం వచ్చాయి, కాని అప్పుడు ఆమె నిస్సహాయురాలయిన పసిపిల్ల. పోలీసులను ప్రతిఘటిస్తూ తన బొమ్మలచేత మాత్రమే విన్యాసాలు జరిపించ గలిగేది.

కాని ఈనాడు ఆమె పెద్ద దయింది. ఆమెకి ఇప్పుడు బాధ్యతలు తెలుసు. కాంగ్రెస్ సంస్థలో సభ్యురాలుగా నమోదయింది. ఈనాడు ఆమె జైలుకి వెళ్ళ దలచుకుంటే ఎవరడ్డగలరు? ఆమె మేనత్తను తీసుకుని పోలీసుకారు వెళ్ళిపోయిన తరువాత ఆనందభవనంలో ఇందిర, ఆమె మేనత్త కూతుళ్ల ముగ్గురు మాత్రమే మిగి లారు. ఇక మిగిలిన వారిలో ఆనందభవనానికి పెద్ద తానేనని ఇందిర ఆకస్మికంగా గ్రహించింది.

* * *

ఫిరోజు ఎక్కడ, ఎలా ఉన్నాడోనని ఇందిరకు దిగులుపట్టుకుంది. ఆమె లక్నో వచ్చినప్పటినించి కొన్ని రోజులుగా అతను కనపడలేదు. యువకులైన మిగతా కాంగ్రెసువాదుల మోస్తరుగా అతనికి కూడా పోలీసులకు లొంగిపోవడం గిట్టదు. 'క్విట్ ఇండియా' ఉద్యమంలో ముఖ్యప్రచారకుడు కావడంచేత అతనిని అరెస్టు చేయ వలసిందిగా వారంటు వెళ్లింది. కాని అతను ప్రచ్ఛన్నంగా, ఎవరికీ కనపడకుండా తప్పించుకు తిరుగుతున్నాడు. పోలీసులు వంతులవారీగా, రాత్రింబవళ్ళూ వారింటిపై కన్నువేసి ఉంచారు.

ఒకరోజున క్రైస్తవ కళాశాల విద్యార్థులు తమ కళాశాల ఆవరణలో జాతీయ పతాకాన్ని ఆవిష్కరించాలని తీర్మానించుకున్నారు. ఆ సమావేశానికి ఇందిరను

పిలిచారు. అరెస్టుకావడానికి సిద్ధపడే ఆమె అక్కడికి వెళ్ళింది. కాని ఆమె అక్కడికి చేరుకునేసరికి పోలీసులు విద్యార్థులను నిర్దాక్షిణ్యంగా బాదుతూండడం చూసి 'నిశ్చేష్ట' అయింది. పతాకాన్ని ఎగురవేస్తున్న కుర్రవాడికి బాగా గట్టిదెబ్బలు తగిలాయి. అతను క్రింద పడిపోయాడు. రక్తం కారుతోంది. మోకాళ్ళమీద తుపాకీ మడమల దెబ్బలు తగిలేవేళకు అతను ఇంకా జాతీయ పతాకం గల వెదురుకర్రను పట్టుకునే ఉన్నాడు. పతాకం క్రిందపడింది. కాని పోలీసుల పదతాడనానికి గురి అయ్యే లోపలే ఇందిర ముందుకు పరుగెత్తి దానిని ఎత్తిపట్టుకుంది.

జవహర్‌లాల్ నెహ్రూకుమార్తె వచ్చి జాతీయపతాకాన్ని ఎత్తి పట్టుకునేసరికి విద్యార్థులలో మళ్లీ ఉత్సాహం ఉరకలు వేసింది. వారు ఆమె చుట్టూ చేరి 'ఝండా ఊంచా రహే హమారా" అనే గీతాన్ని గొంతెత్తి పాడడం సాగించారు. అప్పుడు ప్రప్రథమంగా ఇందిరకు వీపుమీద లాఠీదెబ్బ తగిలింది. శరీరం బాధతో సుళ్లతిరిగింది. అయినా ఆమె పతాకాన్ని విడువలేదు. ఒకనాడు తన తండ్రికూడా ఇదేవిధంగా లాఠీ దెబ్బలు తిన్నసంగతి ఆమెకు జ్ఞాపకం వచ్చింది. అశ్వికదళం వారి గుర్రాలు ఆయనను తొక్కుకుంటూ పోయాయిగూడా. తండ్రివలె తానుకూడా ఈ దెబ్బలను భరించగలదా?

ఆ తరువాత మరోదెబ్బ తగిలింది. లాఠీ విసరడం ఆమె చూసింది. చేతుల మీద కొట్టాలని జరిగిన యత్నం అది. కాని జెండాను పైకెత్తి ఆమె దానిని ఒడుపుగా తప్పించుకుంది. కాని లాఠీవచ్చి ముంజేతికి తగిలింది. జెండాకర్ర వదిలేపినంత పనయింది. కాని ఆమె పళ్ళు బిగబట్టి అలాగే నిలబడింది. ఆ సమయంలో ఆమెకు నాయనమ్మ జ్ఞాపకం వచ్చింది. పిట్టవలె ఎంతో సున్నితమయిన మనిషే అయినా స్వరూపహతప్పి రక్తంకారుతూ నేలమీద పడిపోయేవరకూకూడా ఆమె దెబ్బలుతింటూనే ఉన్నసంగతి ఇందిరకు గుర్తువచ్చింది. "నేను కూడా ఒక నెహ్రూనే. నేను విల పించను. పతాకాన్ని అసలే విడువను" అని ఆమె హృదయం మూగగా ఆక్రోశిం చింది. బలమయిన ఒక్క తోపుతో ఆమె దభీమని నేలపైపడింది. తలెత్తి చూసే సరికి చాపకట్టుగా బడ్డ తన శరీరాన్ని, ఉద్దేశ పూర్వకంగా, మేకులుకొట్టిన పెద్ద బూట్లతో తొక్కుకుంటూ పోలీసులు సాగిపోతున్నారు.

24 ఏండ్లక్రితం జరిగిన ఈ సంఘటనను జ్ఞాపకంచేసి, "అప్పుడు మీకేమని పించిం" దని అడిగాను. దానికి ఇందిర ఇచ్చిన సమాధానం ఇది :

"నాకు బాగా బాధ అనిపించింది. కాని అదయినా యింటికి వచ్చాకనే. ఆ క్షణంలోమాత్రం ఒక్క కోపంమాత్రమే కలిగింది-విపరీతమయిన కోపం, పట్టరానంత ఆగ్రహం, కఠినహృదయులయిన పోలీసులపట్ల అసహ్యం మాత్రమే నన్ను ఆవే శించాయి. చిన్నప్పటినించీ కూడా పోలీసులంటే నాకు హేయభావమే. బ్రిటిష్ రాజ్యంలోని సైన్యానికి వారు ప్రతీకలు అని నా భావం. ఇంటికి చేరుకునేసరికి ఒళ్ళంతా

దెబ్బలుతగిలి ఆమె ఎంతో అలసటతో ఉంది. అయినా తండ్రి, తల్లి, నాయనమ్మ మో స్తరుగా తానుకూడా పరీక్షకి నిలువగలిగాను గదా అని ఎంతో గర్వంగా కూడా ఉంది ఆమెకు. ఆరాత్రి ఫిరోజు ఆమెను చూచేందుకు రహస్యంగా వచ్చి "ప్రదర్శన ఎలా సాగిం" దని అడిగాడు.

"ఆ, ఏదో కొద్ది గలాటా జరిగింది. కాని చివరకు అంతా బాగానే జరిగింది. మేము పతాకాన్ని ఎగరవేశాం" అని పరిస్థితి తీవ్రతను తనకు సహజమయిన ధోరణిలో తగ్గించి చెప్పింది.

మరి కొన్నాళ్ళకు ఇందిర ఒక బహిరంగ సమావేశం జరపాలని నిశ్చయించింది. ఫిరోజ్ అప్పటికింకా ప్రచ్ఛన్నంగానే ఉంటున్నాడు. తన తండ్రినిగురించీ, ఇతర నాయకులనుగురించీ వార్తలు ఆమెకు చేరాయి. వాటిని ప్రజలకు తెలియజెప్పాలని ఆమె ఆకాంక్ష. ఆ వార్తలు దండోరా వేసో, పోస్టర్లు అతికించో తెలియజెప్పేవి కావు. అందుచేత జైలులోలేని కాంగ్రెసు కార్యకర్తలను ఆంతరంగికంగా సమావేశ పరిచి బహిరంగసమావేశం ఎక్కడ, ఏసమయంలో జరిగేదీ తెలియజెప్పవలసిందిగా కోరడం జరిగింది. బహిరంగ సమావేశాలు జరపకూడదన్న నిషేధం అక్కడ అమలులో ఉంది. ఈ ఆంక్షను ప్రప్రథమంగా ఉల్లంఘించినది ఇందిరే. ఆ ఉపన్యాసం వినడానికి చాలామంది గుమిగూడారు. ఆమె ఉపన్యాసం మొదలుపెట్టేసరికి సభాసదులను బ్రిటిష్ సైనికులు చుట్టుముట్టారు. జనంమీద తుపాకులు గురిపెట్టారు. ఒక తుపాకి ఉపన్యసిస్తున్న ఇందిరకు సరిగ్గా మూడు అంగుళాల దూరంలోనే గురిపెట్టబడింది. తుపాకీ గొట్టంలోకి చూస్తూనే, ఆమె, స్వాతంత్ర్య పోరాటాన్నిగురించీ, చిట్ట చివరకు దేశభక్తులనే విజయం ఎలా వరించేదీ వివరించింది.

ఆమె ఐదు నిముషాలయినా మాట్లాడిందోలేదో యువకుడయిన బ్రిటిష్ సైనికుడొకడు "మాటలు చాలించు. లేకపోతే పేల్చవలసి వస్తుంది" అని ఖంగారుగా మొరిగాడు. 'పేల్చడం' అన్న మాట అతడు ఉచ్చరించాడో లేదో, జనంలోనించి ఒకరు మెరుపులాగా ఎగిరివచ్చి ఆ సైనికుడిమీద పడ్డాడు. అతనే ఫిరోజ్. ఇందిర ఏర్పాటు చేసిన సమావేశాన్ని చెడగొట్టడానికి సాయుధబలాలను పంపారని తెలిసి ఫిరోజ్ మొండిగా తన ప్రచ్ఛన్నత్వాన్ని వదలి బయటపడ్డాడు. అది ఉద్వేగపూరితమయిన సుఖాంతనాటకం. అయితే అది యథార్థ నాటకం. అక్కడ నిలబడ్డవారు ఫిరోజ్ - ఇందిర. ఆగ్రహంతో పోలీసులను ఎదిరించి నిలిచారు. సైనికుల తుపాకులకు, పోలీసుల లాఠీలకు ఎదురొడ్డి నిలిచారు. ఒక సైనికుడు ముందుకువచ్చి ఇందిరచేయిపట్టుకుని అక్కడే సిద్ధంగా ఉన్న పోలీసు వానులోకి ఈడ్చుకు పోబోయినాడు. కాని సరిగ్గా అదేసమయంలో జనంకూడా ఆమెను పట్టుకుని వెనక్కు లాగేశారు. ఇందిరకు ఈ పరిస్థితేమీ బాగాలేదు. పోలీసులూ, సైనికులూ ఒకప్రక్కకూ, జనం మరోప్రక్కకూ

ఆమెను లాగుతున్నారు. ఆమె బట్టలు చిరిగిపోయినాయి. ఈ 'టగ్ ఆఫ్ వార్'లో తన చేతులూ, కాళ్లూ ఊడివస్తాయేమోననికూడా ఆమె భయపడింది.

ఈ గలాటాలో ఆమెకు కొన్ని గాయాలు తగిలాయి. బట్టలు చిరిగిపోయినాయి. మరుక్షణంలోనే తమ ఇద్దరినీ పోలీసుల వాన్లలోకి గెంటినట్లు ఆమెకు జ్ఞాపకం. సుమారు వందమందిని అరెస్టు చేశారు. వారిలో ఫిరోజు, ఇందిరా కూడా ఉన్నారు. ఎన్నో రోజుల తరువాత వారు మళ్లీ కలుసుకున్నారు. కాని అదికూడా కొన్ని క్షణాలపాటే.

మిగతా మగవాళ్ళతోబాటు ఫిరోజునుకూడా నైనీజైలుకి తీసుకువెళ్లారు. ఇందిరనూ, మరో ఐదుగురు బాలికలనూ ప్రక్కనేవున్న ఆడవాళ్ళజైలులో ఉంచారు. వారిద్దరికీ మధ్య పెద్ద అడ్డుగోడ. అయినా అంతటి సన్నిహితత్వం వా రెన్నడూ అనుభవించలేదు. జైలు కటకటాల వెనక వారి ఆత్మలు ప్రణయయాత్రలు చేశాయి.

* * * *

ఖైదీల నందరినీ బంధించే వేళ దాటి అరగంట మాత్రమే అయింది. మహిళా ఖైదీలు ఇంకా నిద్రపోలేదు. గుంపులు గుంపులుగా చేరి మాట్లాడుకుంటున్నారు. అప్పుడు బయటి ద్వారాన్ని గట్టిగా బాదిన చప్పుడయింది. జైలువార్డెను ముందుకు వచ్చి 'ఇదిగో శ్రీమతి ఇందిర' అని ప్రకటించింది. విజయలక్ష్మి పండిట్ ఆ బారక్ లోనే వుంది. ఇప్పుడు ఇందిరకు స్వాగతం చెప్పడం ఆమె వంతయింది. "మా బారక్‌లో సంచలనం బాగా ఎక్కువయింది. ఇందును ఇక్కడ ఉంచి మిగతావారిని ఎదుటి బారక్‌లో ఉంచారు. మేము త్వరగానే సర్దుకున్నాము గాని వారుమాత్రం ఇంకా ఉద్వేగంతో చాలా సేపటిదాకా మాట్లాడుతూనే ఉన్నారు."

"మీ నాన్నను గురించిన సమాచారం ఏమయినా తెలిసిందా?" అని శ్రీమతి పండిట్ ఇందిరను అడిగింది. కాని అటువంటి దేమీలేదు. వారిని అరెస్టుచేసి నెలాళ్ళయినా కూడా కాంగ్రెసు నాయకులందరినీ అహమ్మద్ నగర్ కోటలో నిర్బంధించి వుంచినట్లు ప్రకటించడానికి ప్రభుత్వం ఇచ్చగించలేదు.

మరో కొద్దిరోజులకే శ్రీమతి పండిట్ పెద్దకూతురు లేఖకూడా వారిని జైలులో కలుసుకుంది.

విజయలక్ష్మీపండిట్ జైలులో ఉండగా వ్రాసిన దినచర్యలో కొన్ని భాగాలు:-

సెప్టెంబరు 13, 1942:- ఇక్కడి ఆడపిల్లలందరూ చదువుకోవడానికి పెద్ద ప్రయత్నం చేస్తున్నారు. లేఖకి ఫ్రెంచిభాష నేర్చుకోవడంలో ఇందు సహాయపడతా నంటుంది.

సెప్టెంబరు 19, 1942:-రంజిత్ (పండిట్) ఈ ఉదయం 6 గంటలకు ఆనంద భవన్‌లో అరెస్టయినాడు. ఆయన బొంబాయినించి మొన్నరాత్రే తిరిగివచ్చాడు.

ఫిరోజ్‌కి ఒక ఏడాది కఠిన శిక్ష, 200 రూపాయల జరిమానా విధించారు.

సెప్టెంబరు 23, 1942 :-ఇందుకు ఒంట్లో బాగాలేదు. క్రితం రాత్రి ఆమెను బయట పడుకోవడానికి అనుమతించారు. అయినా ఆమెకు రాత్రంతా నిద్ర లేనేలేదు.

సెప్టెంబరు, 24, 1942 :-ఈ రాత్రి ఆమెకు బాగానే నిద్ర పట్టింది. ఆమె లోపలే పడుకుంది. చల్లగా ఉండడంచేత నిద్ర బాగానే పట్టింది.

సెప్టెంబరు 26, 1942 :-ఇందుకి ఆరోగ్యంగా లేకపోవడం చేత ఆమెను విడుదల చేయవలసిందిగా జైలు అధికారులు సిఫార్సు చేశారని తెలిసింది. ఆమెకి ఉష్ణం తగ్గడం లేదు.

అక్టోబరు 5, 1942 :-నిన్నరాత్రి భలే హడావిడి......గోధుమ వన్నెతో, సన్నగా ఉండే విషనాగు ఒకటి........

అక్టోబరు 22, 1942 :-ఇందిరను చూసేందుకు సివిల్ సర్జను వచ్చాడు. ఆమె ఆరోగ్యాన్ని పరీక్షించి తమకు నివేదించవలసిందిగా ప్రభుత్వం ఆయనను పంపింది.

నవంబరు, 20, 1942 :-నిన్న ఇందిర 25 వ పుట్టిన రోజు. 15 రోజుల కొకసారి ఫిరోజుతో జరిపే సమావేశానికి ఆమె వెళ్ళివచ్చింది. ఆఫీసునించి వచ్చేసరికి ఆమె సంతోషంగా కనపడింది.

నవంబరు 27, 1942 :-ఈ బారక్‌లో మే ముండేప్రాంతాన్ని బాలికలు అలంకరిస్తున్నారు. ఒక్కొక్కదానికీ ఒక్కొక్క పేరు పెట్టారు. ఇందూ తన విభాగానికి "చింబోరాజో" అని నామకరణం చేసింది....ఇందుకూ, లేఖకూ కూడా మంచి భావనా పటిమ ఉంది. సాయంకాలం పూట ఎప్పుడోగాని మందకొడిగా వుండటం లేదు. 'మెహితాబెల్' అని ఇందు పేరుపెట్టిన జైలులోని పిల్లి నాలుగు పిల్లలను పెట్టింది. ఇందూ, లేఖా బాగా హడావిడిగా ఉన్నారు...... అందరినీ మళ్ళీ గదులలో బంధించాక ఇందూ, లేఖా చెరో పాత్ర ధరించి నాటకాలు చదివారు. నేను ప్రేక్షకురాలిని. అది అంతా తమాషాగా వుంది.

ఇందిర మాత్రం జైలులో తనకు కలిగిన అభిప్రాయాలను ఎక్కడా వ్రాయ లేదు. కాని ఆమె మేనత్త డైరీని చదివితే-తరుచుగా ఆమె అనారోగ్యంగా ఉంటూన్నా కఠినమయిన జైలు జీవితాన్ని ఎంతో సంతోషంగా సహించేదని, తన భావనా పటిమతో, హాస్యధోరణితో అక్కడి జీవితం విసుగు అనిపించకుండా చేస్తూండేదని

విదితమవుతూంది. జైలులోని ఆమె అనుభవాలను చెప్పవలసిందిగా ఇందిరను ఒకరు అడిగినప్పుడు—

"జైలుకు వెళ్లాలని నేను ఎన్నడో తీర్మానించుకున్నాను. అలా వెళ్ళక పోతే ఏదో వెలితి ఏర్పడి ఉండేది. అరెస్టు అయినందుకు నా కెంతో సంతోషంగా ఉంది. జైలులో ఉండగా నే నేదో పోగొట్టుకొన్నాననే భావం కలగకుండా ఉండడం కోసం నా మనస్సును పూర్తిగా బంధించాలని నా ప్రయత్నం.

"జైలులో నించి బయటికి వచ్చాక నా భావోద్వేగాన్నీ, మేధా సంపత్తినీ పూర్తిగా అరికట్టినట్లు హఠాత్తుగా తెలుసుకో గలిగాను. జైలులో ఉండగా కాలం వెళ్ళదీయడానికి లఘుజీవనం గడిపానని విదితమయింది. కరుడు కట్టిన నా భావాలు తిరిగి యథారీతిని ప్రసరించేందుకు కొంత కాలం పట్టింది. విచలితురాలిని కాకుండా నూతన పరిస్థితులను ఎదుర్కోవడానికి కొంత వ్యవధి కావలసి వచ్చింది........"

ఇక జవహర్‌లాల్ తన ఖైదులో ఇందిరను గురించే ఆలోచిస్తూండేవాడు. ఆమె విదేశాలలోనే ఉండిపోవడం చేత మామిడి పళ్ళు తినడానికి వీలు పడింది కాదని ఆయనకు జ్ఞాపకం వచ్చింది. అవి మామిడి పండ్ల రోజులు. అందుచేత జైలులో ఉన్న ఇందిరకు ఒక గంపతో మామిడిపళ్లు పంపమని స్నేహితు లొకరికి వ్రాశాడు. కాని ఇందిర ఆ మామిడిపళ్ళే ఎరగదు. జైలు సూపరింటెండెంటు ఆమె వద్దకు వచ్చి తియ్యని పళ్ళు తెప్పించినందుకు ఆమెకు కృతజ్ఞత తెలిపినప్పుడే తెలిసింది మామిడిపళ్ళు వచ్చాయని. వాటిని ఆయనా, జైలు సిబ్బందీ ఖాళీచేశారన్న మాట! ఇందిర ఇప్పుడు అంటుంది:

"మాకు ఒక చిన్న ముక్క ఇవ్వాలన్న ఇంగితజ్ఞానం కూడా ఆయనకు లేక పోయింది." అని.

జైలులోని ఆమె అనుభవాలలో ఆసక్తికరమయిన అంశాలు ఇంకా మరి కొన్ని ఉన్నాయి. ఆ రోజులలో ఖైదీలను, సమాజంలో వారికి గల హోదాను బట్టి, ఏ, బీ, సీ - తరగతులుగా వర్గీకరిస్తూండే వారు. కాని ఏకారణం చేతనో ఇందిర కార్డు పైన 'యక్స్' అని గుర్తుపెట్టారు. ఆమెకు వసతులేవీ కల్పించకూడదని దీని భావం అన్నట్లు వ్యాఖ్యానం తెలిపారు జైలు అధికారులు. తండ్రి ఉత్తరాలు కూడా ఆమెకు బట్వాడా చేసేవారు కాదు. ఆమెను అతి 'ప్రమాదకరమయిన' ఖైదీగా పరిగణించి, హత్యలువంటి తీవ్రమయిన నేరాలకుగాను ఆజన్మకారాగారవాసం అనుభవించే మిగతా స్త్రీలు ఉండే ఆవరణలోనే ఉంచేవారు. వీరికి ఇష్టాగోష్ఠిగా చదువు నేర్పుతూ ఇందిర ఎక్కువసేపు గడిపేది. వారిలో రెండు నెల లయినా నిండని పసి

గుడ్డు గల ఒక యువతి కూడా ఉండేది. ఆమెకు తన బిడ్డ సంరక్షణకూడా తెలియదు, పాపం. ఇందిర ఆ తల్లికి చదువు చెప్పడమే గాక బిడ్డ సంరక్షణకూడా చూసేది. న్యాయ శాస్త్ర రీత్యా ఆ బిడ్డను పెంచుకోవాలని కూడా ఆమె అనుకుంది, కాని అది మరీ భారం అవుతుందని మేనత్త ఒప్పుకోలేదు. కాని ఇందిరకు మాత్రం తాను చేసిన సహాయం ఫలించినందుకు అంత తృప్తి కలిగింది. ఎందుచేత నంటే, ఆ యువతి జైలునించి విడుదలయినాక పరీక్షలు ప్యాసయి ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయి నిగా పని చేస్తున్నట్లు మరికొన్ని సంవత్సరాలకు ఇందిరకు తెలిసింది.

1943 మే 13 వ తేదీన—అరెస్టయిన 9 నెలలకి—మేనత్తతోపాటు ఇందిర కూడా విడుదలయింది. వారు రాకపోకల విషయంలో కొన్ని నిర్బంధాలకు లోబడి ఉండవలసిందని దరిమిలా వారి కొక ఉత్తరువు అందజేయబడింది. కాని ఆ విధంగా మాట యివ్వడానికి ఇద్దరూ కూడా నిరాకరించారు. మరో వారానికే శ్రీమతి పండిట్‌ను మళ్ళీ అరెస్టుచేసి తిరిగి నైనీ జైలుకు తీసుక వెళ్లారు. కాని జ్వరంతోటీ, పడిశెం, దగ్గుతోటీ బాధపడుతున్న ఇందిరకు మాత్రం వారంటు రాలేదు.

మళ్ళీ ఆమె ఆనందభవనంలో ఒంటరి దయింది—తండ్రి అహమ్మద్ నగర్ లోనూ, మొగుడూ, మేనత్తా నైనీలోనూ, బందీలై ఉన్నారు. ఈనాడు మాత్రం ఆమెకు ఒంటరితనం అనిపించలేదు. జైలు యాత్ర ధర్మమా అని దేశ ప్రజానీకం అందరితోటీ ఒక రకమయిన తాదాత్మ్యభావం ఆమెలో ప్రగాఢంగా పాతుకొంది.

# 10

# రక్తసిక్త వసంతం

స్వాతంత్ర్య ఫల సంచయ సమయం
రుధిర స్నాతయై వచ్చింది.

—అలీ సర్దార్ జాఫ్రీ

ప్రశ్న: మీ జీవితంలో చిరస్మరణీయమయిన తరుణం 1947 ఆగస్టు 14 వ తేదీ గతించి ఆగస్టు 15 ప్రవేశించిన అర్ధరాత్రేనని నా విశ్వాసం. మీ తండ్రి గారు స్వతంత్ర మయిన నవభారతంలో పార్లమెంటులో మొదటి ప్రసంగం చేసిన తరుణం అది.

శ్రీమతి గాంధి: నిజమే. నేనెంతో ఉత్తేజితురాలనయినాను. ఎంతో గర్వం కలిగింది. ఆనందాన్ని పట్టలేనేమో అనిపించింది.

ప్రశ్న: భారతీయురాలు గానా, లేక కుమార్తె గానా?

శ్రీమతి గాంధి: నిజంచెప్పాలంటే అది ఒక మిశ్రమభావం. ఈ ద్వైవిధీ భావాన్ని నేను విడదీయలేను. కాని ఎక్కువగా భారతీయంగా నేమో అనుకుంటాను. స్వాతంత్ర్యపోరాటంలో నేను కూడా పాల్గొనడం చేత ఆ ఇక్కట్లు సార్థక మయినా యన్న ఆనంద మేమో.........

ఇందిరే కాదు. యావత్తు జాతే ఆనాడు బహుభావ సమ్మిళిత మయిన ఉత్తేజంతో పొంగిపోయింది. ఆనందం, చరితార్థత, స్వాతంత్ర్య పోరాటం ఫలించిందన్న చైతన్యం, నవశకానికి నాంది ప్రస్తావన జరిగిందన్న ఆనందం మేళవించాయి. కాని, ఆ ఆనందం అట్టే రోజులు నిలవలేదు. దేశ విభజనవల్ల స్వతంత్రం లభించడం అందుకు కారణం. దేశ విభజనే ఇటు భారతదేశంలోనూ, అటు కొత్తగా ఆవిర్భవించిన పాకిస్థాన్ లోనూ హేయమైన, దౌర్జన్య పూరితమయిన అమానుషకల్లోలాలకి దారితీసింది.

పశ్చిమ పాకిస్తాన్‌నించి వచ్చిన కాందిశీకుల వెల్లువ ఢిల్లీ చేరుకోగానే ఆ హింసా జాడ్యం రాజధానీనగరానికి కూడా వ్యాపించింది. శతాబ్దులుగా ఢిల్లీలో ప్రముఖ పాత్ర వహిస్తూ, అక్కడి జీవనంలో అంతర్భాగం అయిపోయిన ముస్లిములకు తర తరాలుగా జీవిస్తూ వచ్చిన స్వగృహాలలోనే భద్రత లోపించింది. అల్ప సంఖ్యాక వర్గం వారిపై దోపిడీలు, గృహదహనాలు, హింసాకాండ విజృంభించడంతో రాజధానీ నగరంలో శాంతిని పునరుద్ధరించడానికీ, భారత ప్రజాస్వామిక వ్యవస్థకు మూలమయిన లౌకిక రాజ్య ప్రతిపత్తిని పరిరక్షించడానికీ తగిన చర్యలు తీసుకోవలసి వచ్చింది. దృఢ విశ్వాసం, దూరదృష్టి గల స్త్రీపురుషులు హింసాద్వేషభావాలను అరికట్టేందుకు ముందు కురికి, ఇతరులను కూ డాసమీకరించసాగారు. గాంధీ మహాత్ముని ఆత్మ ఈ హింసాకాండతో తపించిపోయింది. ప్రార్థనాసమావేశాలలో రోజూ ఉద్బోధలు చేస్తూ ఆయన భారత, పాకిస్తాన్ దేశాలలోని ప్రజలలో మానవత్వాన్నీ, వివేకాన్నీ పునఃప్రతిష్ఠించడానికి పాటుబడేవాడు. ఈ సమావేశాలను ఆకాశవాణి రోజూ ప్రసారం చేస్తూండేది.

ఒక వంక గాంధీజీ లక్షలాది ప్రజలలో హృదయపరివర్తనాన్ని తేవడానికి పాటుబడుతూంటే మరొకవంక జవహర్‌లాల్ నెహ్రూ రోజూ, తన ప్రాణాన్నయినా లెక్కచేయక, అల్ప సంఖ్యాకులను రక్షించేందుకూ, రాజధానీ నగరంలో శాంతిని పునరుద్ధరించేందుకూ ముందంజ వేస్తూండేవాడు. ఎక్కడయినా అల్లర్లు బయల్దేరాయని తెలియగానే నిరాయుధుడై, వెంట ఎవరూ లేకుండానే, ఒక్కడూ సాయుధులైన అల్లరి మూకలలోకి జొరబడేవాడు. తా నేమయిపోతానో అని కూడా ఆలోచించుకునే వాడే కాదు. ఒకసారి దౌర్జన్య పూరితమయిన ఒక గుంపులో జొరబడి ఒకరిచేతులో గల కత్తిని ఊడలాక్కున్నాడు. ఇందిర భర్తతోనూ, తన ఇద్దరు పిల్లలతోనూ తండ్రి వద్దే ఉండేది. తండ్రి ఏమయి పోతాడో నని సహజంగా ఆమెకు ఆదుర్దాగా ఉండేది.

కాని ఆమె జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె!

వ్యక్తిగత భావోద్వేగాలు దేశంపట్ల గల విధినిర్వహణకు ప్రతి బంధకం కాకూడదని ఆమె నేర్చిన విద్య. కాగా తన మానసిక ఆందోళన తగ్గడానికి ఒకే ఒక మార్గం—తానుకూడా తండ్రితో బాటు రంగంలోకి దిగడమే.

స్వాతంత్ర్య సిద్ధి కలిగిన ఆందోళనా భరితమయిన ఆ రోజులలో తొలి భారత ప్రధాని యార్కురోడ్డులో గల 17 వ నంబరు బంగళాలో ఉంటూండేవాడు. అంత చిన్నదీ, మరీ పెద్దదీ కాని ఆ బంగళాలో మూడే పడక గదులు ఉండేవి. వాటిలో రెండింటిని కాందిశీకులకు ఇచ్చేశాడు ఆయన. ఇంటిముందు గల పచ్చిక మైదానంలో శిబిరాలువేసి మరికొందరికి వసతి కలుగజేశాడు. పశ్చిమ పంజాబునించి ఇళ్లూ వాకిళ్ళూ వదలివచ్చిన హిందువులకూ, శిఖులకూ, ఢిల్లీలోని తమ స్వగృహాలనించి తరిమివేయబడిన ముస్లిములకూ కూడా ఆశ్రయం లభించే ఏకైకస్థలం ప్రధానినివాసమే.

ఆనాటి అనిశ్చిత పరిస్థితులలో-దోపిడీలూ, గృహదహనాలూ, అల్లర్లూ జరుగుతున్న పరిస్థితులలో ప్రధాని యింటిలోని వారికి సహితమూ చాలినంతగా ఆహార పదార్థాలు లభ్యంకావడం గగనమైపోయేది. అని ఇందిర ఉన్నవాటినే బహు జాగ్రత్తగా సర్దుతూ తమ కుటుంబం వారికే కాక దురదృష్ట వంతులయిన ఆ అతిథులకు కూడా భోజనం సమకూర్చేది. "ముష్టెత్తో, అప్పుతెచ్చో, లేదా దొంగిలించో" భోజనపదార్థాలు సేకరించ వలసి వచ్చేది. అలాగయినా చివరికి ఒక రోజున కొట్టుగదిలో సరుకులు అన్నీ నిండు కున్నాయని వంటవారు ప్రకటించారు. కాని ఇందిరకు ఎట్టి పరిస్థితులయినా ఎదుర్కొనే చాకచక్యమూ, ఊహా లేకపోలేదు. తమ యింటికి అనతిదూరంలోనే ఒక మేకల మంద మేస్తూండడం గమనించిందామె. బహుశా ఎవరూ పట్టించుకోకుండా వదిలేసి వుంటారు వాటిని. తన భర్త ఫిరోజునూ, నెహ్రూ కుటుంబానికి చిరకాలమిత్రుడూ, ఖాన్ అబ్దుల్ గఫూర్‌ఖాన్ సహచరుడూ అయిన మహమ్మద్ యూనస్‌నూ పిలిచి కనీసం రెండు మేకలనయినా పట్టుకు రమ్మని కోరింది. ఫిరోజుకుగానీ, యూనస్‌కు గానీ మేకలను దొంగిలించడంలో అనుభవం లేదు. ఐనా వారు తమకు అప్పగించిన పనిని ఎలాగో సాధించుకు వచ్చారు. నెహ్రూ గృహంలో ఉన్న నిర్వాసులకు ఆనాడు పస్తుండ వలసిన బాధ ఆ విధంగా తప్పిపోయింది.

ఆ అల్లకల్లోలంలో భీతాహం రాజ్యం ఏలేది. అనాలోచితమయిన హింసాకాండ అంటు వ్యాధిలాగా వ్యాపించేది. కొందరు ప్రజలు వ్యక్తిగతంగా తమకు జరిగిన హింసవల్ల వివేచనా శక్తిని కోల్పోయి, నిర్హేతుకంగా, తదనంతర పరిణామాలను ఆలోచించుకోకుండా, ఉద్దేశ పూర్వకంగానూ, అనుద్దేశ పూర్వకంగానూ కూడా హింసాకాండకు పూనుకుంటూండేవారు. పోలీసులు ఇతరత్రా ఎంతో హడావుడిగా తిరుగుతూండడంచేత ప్రధాని యింటి దగ్గర బహు కొద్దిమంది మాత్రమే కాపలా ఉండేవారు. ఒక రోజున అనుమానించదగినట్లు కనపడే వ్యక్తి ఒకరు స్నానాల గదిలో దాక్కొని ఉండగా ఇందిర పట్టుకొనడంతో పెద్ద గందరగోళం బయలు దేరింది. అతనివద్ద ఉన్న చాకును ఇందిర లాగేసుకుని అతనిని బయటికి ఈడ్చి పోలీసులకు వప్పగించింది. ఈ సంఘటన తరువాత కూడా తొణకకుండా ఉన్న వ్యక్తి ఇందిర ఒక్కతే.

* * * *

అల్లర్లను యుద్ధతీవ్రతగా పరిగణించి, వెంట వెంటనే చర్యలు తీసుకునేందుకు వీలుగా పాత ఢిల్లీలోని టౌనుహాలులో ఒక "కంట్రోలురూము" ఏర్పాటు చేశారు. నగరంలోని వివిధ ప్రాంతాలలో పరిస్థితిని గురించిన సమాచారం అంతా ఇక్కడికి అందేది. అల్లర్లు జరుగుతున్న ప్రాంతాలకు సైన్యాన్నీ, పోలీసులనూ పంపేందుకు ఉత్తరువులు కూడా ఇక్కడినించే వెళ్ళేవి. కల్లోలితమయిన రాజధాని నగరంలో ప్రశాంతతను పునరుద్ధరించడానికి సైన్యమూ, పోలీసులను మించి వాళ్ళకతీతమయిన

చర్యలు కూడా అవసరమని గాంధీజీ, జవహర్ లాల్ నెహ్రూ గ్రహించారు. హింసా కాండను అరికట్టడమే కాదు, ప్రజలలో హింసా ప్రవృత్తినే రూపుమాపాలి. ఇప్పుడు కావలసినది నిర్భయంగా సంచరించ గలిగిన వలంటీర్లు. వీరు దౌర్జన్య పూరితులయిన ప్రజలను ఎదిరించి నిలబడడానికి భయపడకూడదు. వారితో వాదించి నచ్చజెప్పి వారిని శాంతచిత్తులను చేయగలిగి ఉండాలి. దీనితోబాటు, మరొకవంక, భయాందోళిత మనస్కులై ప్రాణాలను గుప్పిట్లో పెట్టుకుని వున్న అల్పసంఖ్యాక వర్గాలవారికి అభయమూ ఇవ్వగలిగి ఉండాలి.

అనేకమంది కాంగ్రెసు వాదులూ, మత ప్రాధాన్యం లేని లౌకిక రాజ్య సిద్ధాంతం ప్రాతిపదికగా పనిచేసే ఇతర పార్టీల సభ్యులూ, అసలు ఏపార్టీకీ చెందని వారూ కూడా ఇందుకుగాను ముందుకు వచ్చి సహాయదళంగా ఏర్పడ్డారు. వీరుకూడా కంట్రోలు రూము అధీనంలోనే పనిచేసేందుకు సిద్ధమయ్యారు. ఈ దళంలో చాలామంది మహిళలు. ఇది అనుకోని దేమీ కాదు. కారణం అల్లర్లలో మహిళలు కూడా పాల్గొంటున్నారని మహాత్మునికి తెలియవచ్చింది. అందుచేతనే మహిళలు ఈ సహాయ దళంలో ఉండవలసిన అగత్యం ఏర్పడింది.

మహిళా స్వచ్ఛంద సేవికలలో కాంగ్రెసు యువతి సుభద్ర ఒకరు. (ఈమె ఇప్పుడు కాంగ్రెసు పార్లమెంటు సభ్యురాలు-శ్రీమతి సుభద్రా జోషి) ఒక రోజు ఆమె గాంధీమహాత్ముని వద్దకు వెళ్ళి, తమ వాడలో నివసించే ముస్లింలను ఎలా భయ పెడుతున్నదీ వివరించింది. ఆవేళ గాంధీజీ మౌనం పాటించేరోజు. అందుచేత ఆయన తన సమాధానాన్ని వ్రాసి చూపించాడు. "నీవంటి ఒక యువతి ద్వారా ఇటు వంటి ఫిర్యాదులు వినడం కంటె 'ముస్లింలను రక్షించడంలో సుభద్ర ప్రాణాలు కోల్పోయింది' అని వింటే ఎంతో సంతోషించేవాణ్ణి. హిందూ స్త్రీలూ, పురుషులూ ధైర్య సాహసాలతో తమ జీవితాలను బలిదానం చేసినప్పుడే ఈ పోరాటం తుదముట్టు తుంది." కనీసం సుభద్ర అయినా గాంధీ మహాత్ముడు వేసిన ఆ చురకను ఈ నాటికీ గుర్తుంచుకుని ఆయన చూపించిన మార్గాన్ని అనుష్ఠిస్తోంది.

ఈ మహిళా స్వచ్ఛందసేవికలలో బేగం అనిస్ కిద్వాయ్ మరొకరు. ఆమె రఫీ అహ్మద్ కిద్వాయ్ తమ్ముని భార్య. ఉత్తర ప్రదేశ్‌లో జరిగిన మతకలహాలలో ఆమె భర్త మరణించాడు. ఆమె గాంధీ మహాత్ముని వద్దకు వెళ్లినపుడు తనవలె వేదనల పాలయిన తోడి కాందిశీకులకు సేవచేస్తూ వివిధ మతాల వారిమధ్య శాంతి నెల కొల్పడానికి పాటుబడడం ద్వారా దుఃఖోపశమనం పొందమని సలహా ఇచ్చాడు. అప్పుడు ఆమె కూడా ఈ దళంలో చేరింది. దౌర్జన్య పూరితమయిన మతోన్మాదాన్ని అరికట్టడానికి ప్రాణాలను కూడా లెక్కచేయక నిరంతరం శ్రమించే మహిళల వర్గంలో ఆమె కూడా చేరింది.

ఢిల్లీలో అల్లర్లు ప్రారంభ మయిన మొట్టమొదటి రోజునే ఇందిర మిగతా పనులన్నీ విడిచిపెట్టి ఆ దుస్సహ అమానుష హింసాకాండను ప్రతిఘటించే ఉద్యమంలో చేరాలని సంకల్పించింది. తన తండ్రి మోస్తరుగానే ఆమె కూడా ఇందు మూలంగా హిందూ, ముస్లిం సమైక్యత మాత్రమే దెబ్బతినడంలేదనీ, భారత రిపబ్లిక్‌కు పునాది అయిన మత ప్రాధాన్య రహిత లౌకిక రాజ్య వ్యవస్థకే ముప్పువాటిల్లిందనీ గ్రహించింది. హేతువాది అయిన తన తండ్రి ఆధ్వర్యంలో ఆమె పొందిన శిక్షణ, గడచిన విద్య అటువంటిది. కొత్తగా ఏర్పడిన సరిహద్దుకు ఇరుప్రక్కలా మతం పేరిట జరుగుతున్న అత్యాచారాలు ఆమె సహించలేక పోయింది. దేశానికి కేంద్రస్థాన మయిన ఢిల్లీలోనే దారుణహింసాకాండ విలయతాండవం చేస్తూంటే దీనిని ఎలాగో అలాగ అరికట్టాలని ఆమె మహా ఆందోళన చెందింది. కాని, రెండు కారణాలవల్ల, ఆమె కొద్ది రోజులపాటు వెనకాడవలసి వచ్చింది. అసలే వేదనల పాలవుతున్న తండ్రికి ఆరోజులలోని సంఘటనలు శారీరకంగా, మానసికంగా వ్యథాహేతువు లయినాయి. ఆయన ఆరోగ్యాన్నీ, క్షేమాన్నీ కనిపెడుతూ ఎవరో ఒకరు నిరంతరం అనుసరించవలసి వచ్చేది.

జవహర్‌లాల్‌కు, ఎక్కడయినా కల్లోలాలు జరిగినట్లు తెలియగానే, ఎవరూ తోడులేకుండానే అక్కడికి పరుగెత్తే ప్రమాదకరమయిన అలవాటు ఉంది. అలాటి సమయంలో ఆయనను అడ్డుకునే సాహసం ఎవరికీ ఉండేది కాదు. గాంధీ మహాత్ముని మోస్తరుగానే ఆయన కూడా తను ప్రాణప్రదంగా భావించే ఆశయాలు బుగ్గిపాలయిపోతున్నప్పుడు ప్రాణాలను ఆవంత కూడా లెక్కచేసేవాడు కాదు. కాని ఇందిర రెప్ప వేయకుండా అనుక్షణమూ కనిపెట్టిఉండి అటువంటి సమయాలలో ఆయన ఒంటరిగా వెళ్ళకుండా జాగ్రత్తపడేది. అంగరక్షకులను కొంత దూరంగానే, అయినా పరిస్థితి విషమించినప్పుడు వెంటనే ఆదుకో గలిగినంత దగ్గరలో ఉండి అనుసరించేటట్లు జాగ్రత్తపడేది. ఇక ఆమెను కార్యరంగంలోకి దిగకుండా నివారించిన మరొక కారణం - రెండవ కుమారుడు సంజయ్ ఏడాదిలోపు పసిగుడ్డు కావడం. ఈ పసిపిల్లవాడిని ఎప్పుడూ కనిపెట్టి ఉండవలసి వచ్చేది. రెండవ కొడుకు పుట్టాక ఆమె ఆరోగ్యం కూడా దెబ్బతిని ఆమె మరీ రక్తహీనంగా కూడా తయారయింది.

ఒకనాడు సంజయ్‌ను ఎత్తుకుని గాంధీజీని చూడ్డానికి వెళ్ళింది. మహాత్మునికి ఇందును చూస్తే ఎప్పుడూ ఆనందమే. ఈ పసిపిల్లవాడిని చూసి ఆయన మరీ సంబరపడిపోయాడు. ఆమె అక్కడ కూర్చుని ఆయన తనతోటీ, ఇతరులతోటీ చెప్పేమాటలు వింటోంది. ఇంతసేపూ సంజయ్ గాంధీజీ ఒడిలోనే ఉన్నాడు. ఎర్రని కాలివేళ్ళతో ఆయనను తంతూన్నాడు. ఇనపఫ్రేముకల పాతకళ్ళజోడు అందుకోవడానికి తంటాలు పడుతున్నాడు. గాంధీజీ ఇచ్చిన నారింజపండుతో కొంతసేపు ఆడుకున్నాడు.

ఇందూ మహాత్ముని కుటుంబంలోని ఒక సభ్యురాలుగానే మసలుతూఉంటుంది. కనుకనే ఆమె బాపూజీని చూడ్డానికి వెళ్ళినప్పుడు మర్యాదలేవీ జరపరు. ఒక్కొక్కప్పుడు ఆయన ఆమెతో ప్రత్యక్షంగా మాట్లాడడు కూడాను. ఆమె గంటలతరబడి ఆయన సమక్షంలో ఆసీనురాలై, ఆయన చెప్పే ప్రతిమాటా తననిగురించే అన్నంత శ్రద్ధతో వింటూ ఉంటుంది. వాస్తవానికి ఆయన సమక్షంలో ఉన్న ప్రతివారూ అదే శ్రద్ధాసక్తులతో వింటూంటారు.

ఇందిర అక్కడ ఉండగా సుభద్ర, ఇంకా మరికొందరు కాంగ్రెసు మహిళా కార్యకర్తలూ వెళ్ళి కాందిశీకులవాడలలో చేస్తూన్న కృషిని నివేదిస్తున్నారు. ఆయన పితృవాత్సల్యంతో, మందలించే ధోరణిలో, కొంత వ్యంగ్యంగా "మీరు కాందిశీకుల శిబిరాలకు సంఘసేవ చేయడానికి వెడతారు. కాని మీరు అక్కడి ప్రజలపై ఎట్టి పలుకు బడినీ సంపాదించలేకపోతున్నారు. దీనికి కారణం మీరు మంచి ఫాషనుగా కుట్టిన సిల్కు దుస్తులతో వెడుతూ, వారికి చేతితో వడికిన నూలుగుడ్డలు కట్టుకోమని సలహాలివ్వడమే. పాపము! ఆ దురదృష్టవంతులు దరిద్రంతో అలమటిస్తున్నారు. వారికి మీ సలహాలనవసరం. మీరు నలుగురూ మాటలు చెప్పడంకాకుండా ఆచరణరీత్యా ఇతరులకు మార్గదర్శకంగా వ్యవహరించాలి...."

ఇందిర మహాత్మునికేసి చూసింది. ఆయన ప్రయత్నపూర్వకంగా తన చూపులను తప్పించుకుంటున్నట్లు కనిపించింది. సుభద్రకాకుండా మరో ఇద్దరు స్త్రీలేకదా అక్కడ ఉన్నది? అంటే మొత్తం ముగ్గురే ఉండగా 'మీరు నలుగురూ' అన్నాడేమిటి?

ఆ తరువాత వారు వెళ్ళిపోయినారు. ప్రార్థనా సమావేశంలో చేసే ఉపన్యాసాన్ని తన మనమరాలుకు డిక్టేషను చెపుతున్నాడు. ఇందిర ఆ మాటలను వింది—
"ఈనాడు ఢిల్లీలో మౌలానా ఆజాద్‌తోసహా ఎంత ఉన్నతపదవిలో ఉన్న ముస్లిములకయినాసరే భద్రతలేదు. ఏక్షణాన్నో కత్తిపోటుకో, తుపాకీగుండుకో, బాంబుకో ఎరకావచ్చు. భారతదేశంలో దేశభక్తుణ్ణి అని చెప్పుకోదగిన వారెవరూ సహించి ఊరుకోలేని పరిస్థితి ఇది...."

మరునాడే ఇందిర తన పిల్లలను కనిపెట్టుకుని ఉండేందుకు మరొకరిని నియమించి, తానుకూడా సహాయదళంలో చేరుతున్నట్లు, కంట్రోలు రూముకు వెళ్ళి చెప్పుకుంది.

ఆమె ప్రశాంతమయిన ఆవేశంతో పనిచేసింది కాందిశీకులవాడలకు వెళ్ళేది. నిరాశ్రయులయిన ఆ దురదృష్టవంతులను ఓదార్చుతూ మాట్లాడేది. వారిగోడు శ్రద్ధగా వినేది. తనతండ్రి పలుకుబడితో వారికి పునరావాసం కల్పించేందుకూ, తిండీ, బట్టా సమకూర్చేందుకూ ఏర్పాట్లుచేసేది. హఠాత్తుగా ఆమె రంగంలోకి ఉరికేసరికి స్థానిక

అధికారులు విస్తుపోయారు. కాందిశీకులకు పారిశుధ్యసౌకర్యాలు, మంచినీటి సరఫరా, విద్యుత్ సరఫరా ఏర్పాట్లూ చేయమని మునిసిపల్ అధికారులను వేధించేది. పాత నగరంలో జనసమ్మర్దం ఎక్కువగాఉండే 'మొహల్లా'లలో, ప్రాణాలు అరిచేతిలో పెట్టుకుని కాలంగడుపుతూన్న ముస్లింకుటుంబాలవద్దకు వెళ్ళేది. నగరంలో ముస్లింలు నివసించే ఏ ప్రాంతంలో నయినా సరే, ప్రమాదం సంభవించే అవకాశం ఉన్నదని తెలిసిన క్షణంలో ఆమె ఎటువంటి తోడూ, రక్షణా లేకుండానే జీపులో అక్కడికి హుటాహుటి పరుగెత్తేది. ఇరుకుసందులలోనూ, గొందులలోనూ పోతూఉండేది. నిర్భయత్వమే ఆమె ఆయుధం. ఆమె కనబడేసరికి దౌర్జన్యపూరితులయిన అల్లరిమూకలుకూడా దారి ఇచ్చేవారు. గాంధీమహాత్ముడు శాంతి, మతసామరస్యం నెలకొల్పేందుకు నిరాహారదీక్ష పూనుతున్నాడని తెలిసినా మిగతావారి మోస్తరుగా ఆయనను ఆ సంకల్పంనించి విరమింపజేయడానికి తొందరపడలేదు. దానికి బదులు, దౌర్జన్యాన్ని అరికట్టే సంగ్రామంలో తానూ పాల్గొంటున్నట్లు కంట్రోలురూముకు వెళ్ళి నివేదించింది. మహాత్ముని ప్రాణరక్షణకు అది ఒక్కటే మార్గమని ఆమెకు తెలుసు.

జనసామాన్యం వాస్తవ జీవన స్థితిగతులను ఇందిర స్వయంగా తెలుసుకోవడం అదే ప్రథమం. వారి జీవితం ఎలా ఉంటుందో, ఎలాంటి బాధలు పడుతూంటారో ఆమె ఇప్పుడు చూసింది. దేశవిభజన, కొట్లాటలు, ఉన్నచోటు వదిలిపెట్టి రావడం వంటి వాటివల్ల వారు ఎటువంటి దుర్భరయాతనలకు లోనయ్యేదీ గ్రహించింది. వారి జీవితంపట్ల అవగాహనవల్ల ఆమెలో వినయము, కారుణ్యము వృద్ధిచెందాయి. తాను కనబరచిన మైత్రీభావంపట్ల వారు వ్యక్తంచేసే కృతజ్ఞతాభావం ఆమెను కదలించివేసేది. పశ్చిమ పంజాబునించి తరలివచ్చి శిబిరాలలో జీవనంగడుపుతూన్న హిందువులకూ, సిక్కులకూ, ఇటు నిరంతర ప్రాణభయంతో మొహల్లాలలో జీవించే పేద ముస్లిములకూ కూడా తమ యోగక్షేమాలను విచారించడానికి జవహర్‌లాల్‌నెహ్రూ కుమార్తె రావడం ఆశించని గౌరవం. ఆమెకు వినోదం కలిగించాలనీ, తమ పేద కుటీరాలలో లభ్యమయ్యే ఏ స్వల్పపదార్థాన్నయినా ఆమెకివ్వాలనీ ఆరాటపడేవారు. తాము చేసుకున్న మోటురకం మిఠాయో, రెండు బిస్కట్లో, (కాందిశీకుల శిబిరాలలో పంచదార దొరకదు కాబట్టి) ఉప్పువేసిన టీయో ఇచ్చి ఆమెను సత్కరించాలని చూసేవారు. ఇందిర మామూలుగా టీ తాగదు. కాని వారు ఉప్పువేసి బాగా మరగబెట్టిన డికాక్షన్, మకిలిగా ఉండి బీటలువారిన కప్పులలో పోసి ఇచ్చినప్పుడు కాదనలేకపోయేది. ఆమె అలాగే తాగేది. ఆ పేదప్రజలు ఎక్కడ నొచ్చుకుంటారో అని వాటి రుచిని మెచ్చుకునేది కూడా.

అప్పుడప్పుడు ఆమె నిర్భయత్వమూ, నెహ్రూ నామోచ్చారణలోగల మంత్రశక్తీ కూడా అలివితప్పిన అల్లరిమూకలను శాంతింపజేయలేకపోయేవి. ఒకరోజున పరిస్థితి మరీ ఉద్రిక్తంగా ఉంది. చివరికి ఆమె జీపుడ్రైవరు కూడా పారిపోయాడు.

ఆమె ఒక్కతే ఒంటరిగా మిగిలింది. పాకిస్తాన్‌లో మళ్లీ హింసాకాండ మొదలయి నట్లు వార్తలువచ్చాయి. దానితో ఇక్కడగల కాందిశీకులలో ప్రతీకారవాంఛ ఉవ్వెత్తుగా లేచింది. వారు ఒక పేద ముస్లింకుటుంబం నివసించే ఇంటిని చుట్టుముట్టి ఆ ఇంటిని ఖాళీచేయించాలని పట్టుబట్టారు. కాని ఇందిరకు తెలుసు—అంతటి ఆవేశంలో ఉన్న జనం కేవలం వారిని ఇంట్లోనించి వెళ్ళగొట్టడంతో ఊరుకోరనీ, ఆకస్మికంగా హింసాకాండ మొదలుకావచ్చుననీను. ఆవేళ ఆమెను కూడా తిట్టిపోయడం మొదలు పెట్టారు. ఎవరేమనుకుంటున్నా సరేనని, లెక్కచేయక, ఆమె ముందుకుసాగిపోయింది. అయిష్టంగానే జనం ఆమెకు కొద్దిగా దారియిచ్చారు. కాని ఇంకా గొణుగుతూ తిట్టు కుంటూనే ఉన్నారు. హఠాత్తుగా ఒక మోటుహస్తం ఆమె తలపై కప్పుకున్న దుప్పటిని లాగి చించివేసింది. ఆమెపై వారికిగల ఆగ్రహానికి చిహ్నంగానే వారు ఆవిధంగా అవమానించారు. కాని ఆమె దానిని లెక్కచేయలేదు. అక్కడ నిలబడి అందుకు నిరసన తెలపడంగానీ, ఆ పని చేసినవారితో వాదించడంకానీ పెట్టుకోలేదు. తిన్నగా ఆ ఇంట్లోకి వెళ్లింది. ఆ ముస్లిం కుటుంబంవారు ప్రాణభీతితో గడగడ లాడి పోతున్నారు. "నాతో రండి, మిమ్మల్నెవరూ ఏమీచేయలేరు" అని అంది.

నిజమే, ఎవరూ ఏం చేయలేకపోయినారు. అంతటి సాహసం ఎవరికీ లేదు. ఆమె వారిని వెంటబెట్టుకుని తన జీప్‌వద్దకు వచ్చింది. అప్పటికి డ్రైవరు తిరిగి వచ్చాడు. వారిని జీపులో ఎక్కించుకుని తన తండ్రి నివాసంవద్దకు తీసుకువచ్చింది. అక్కడ వారికి తిండిపెట్టి ఆశ్రయమిచ్చింది.

చిట్టచివరికి, ఎలాగయితేనేం, గాంధేయమార్గంలో శాంతిసామరస్యాలు ప్రబోధించే ఇందిరవంటి అనేకమంది కార్యకర్తల కృషిఫలితంగా హింసాకాండ అరికట్ట బడింది. వివిధ మతాల నాయకులూ మతసామరస్యాన్ని వర్ధిల్లజేస్తామని గాంధీమహాత్మునికి వ్రాతమూలకంగా వాగ్దానంచేశారు. జాతియావత్తూ ఆనందాంబుధిలో తేలియాడింది. మహాత్ముడు తలపెట్టిన కఠోరనిరాహారదీక్ష ముగిసింది. అమూల్యమయిన ఆ మహనీయుని ప్రాణం రక్షించబడింది.

మౌలానా ఆజాద్ నారింజరసం నింపిన గ్లాసు మహాత్మునికి అందిస్తుండగా ఆ చరిత్రాత్మకఘట్టాన్ని ఫోటోతీయడానికి కెమెరాలు క్లిక్‌మంటున్నాయి. ఇందిర తండ్రికేసి చూపింది. ఆయనముఖంలో తీవ్రమయిన ఆవేదన తగ్గిన సూచనలు కని పించాయి. కాని బుద్ధిహీనమైన అమానుషహింసాకాండను ఆపుచేయడానికి అమూల్యమయిన ప్రాణాన్ని పణంగా ఒడ్డవలసివచ్చింది గదా అన్న వేదనాఛాయలు ప్రస్ఫుట మయినాయి.

ఆ తరువాత కొన్నిరోజులదాకా ప్రతివారూకూడా పెద్ద బరువు దిగిపోయినట్లు భావించారు. మరణశిక్ష పడినవానికి దానిని రద్దుచేసినంత ఆనందం కలిగింది. ఇందిర

తన మేనత్త కృష్ణతోనూ, మేనత్తకూతురు తారాపండిట్, పద్మజానాయుడులతోనూ కలిసి మహాత్మునివద్దకు వెళ్లింది. ఆయన కులాసాగా మాట్లాడుతూండడం వారికి ఆనంద దాయకమయింది. నెహ్రూ వంశీయులయిన ఆ బాలికలనూ, సరోజినీనాయుడు కుమార్తెనూ చూపి ఆయన నవ్వుతూ స్వాగతం పలికాడు. "ఓహో! ఈ రాకుమార్తెలంతా నన్ను చూడడానికే వచ్చినట్టుందే?" అన్నాడు. ఈ ఛలోక్తికి అందరూ నవ్వారు. నౌఖాలిలోని రైతులు ధరించే టోపీ పెట్టుకుని ఆయన ఎండలో కూర్చుని ఉన్నాడు. ఆ బాలికలను చూపి "ఈ టోపీ పెట్టుకుంటే నేను అందంగా లేనూ?" అని అడిగాడు. అందరూ మళ్లీ నవ్వారు. ఇందిరనూ, ఆమెతండ్రినీగురించీ, భర్తనూ పిల్లలను గురించీ, ఆమె అతిథులు—నెహ్రూ నివాసంలో కాలంగడపుతూన్న కాందిశీకులను గురించీ అడిగి తెలుసుకున్నాడు. తనపట్ల ఎంతో అపేక్షతో తన యోగక్షేమం విచారణచేసే ఆ పితృసమునిపట్ల ఆమెలో అపేక్ష పెల్లుబికింది. ఆయన వారిని చూపి, "అమ్మాయిలూ, ఇక మీరు వెళ్ళాలి, లేకపోతే బయట కనిపెట్టుకునిఉన్న జనం మిమ్మల్ని తిట్టుకుంటారు...." అన్నాడు. వారు నవ్వుకుంటూ, శెలవుతీసుకుని వెళ్లారు.

అదే బాపూజీ కడసారి దర్శనమని ఇందిరకు ఆనాడు తెలియదు. సరిగ్గా మరో రెండురోజులకే ఆయన హంతకుని తుపాకీగుండు కెరయై భగవన్నామోచ్చారణచేస్తూ శాశ్వతంగా కన్నుమూశాడు!

# 11

## పితృపథానుయాయి...

భగవంతుడు పృథ్విపై నీకు ప్రసాదించిన జన్మ చిరకాలం నిలిచేందుకు నీ తల్లి దండ్రులను గౌరవించు.

—ఓల్డ్ టెస్ట్‌మెంట్

చిన్నపిల్లలు, మొదట, తమ తల్లి దండ్రులను ప్రేమిస్తారు. పెద్దవారయ్యాక వారి ప్రవర్తనావ్ని పరీక్షిస్తారు. ఒక్కొకప్పుడు వారిని మన్నిస్తారు.

—ఆస్కార్ వైల్డ్

జవహర్‌లాల్ నెహ్రూకు కూతురుకాక కొడుకే పుట్టిఉంటే ఏమయ్యేది? అమెరికన్ విలేఖరి ఒకరు ఇదేప్రశ్న ఇందిరను అడిగాడు. కొడుకే అయిఉంటే తండ్రికి సహచరుడుగా ఉండి చివరకు ఆయనకు వారసుడు కావడంతో ఇబ్బందులు ఇంతగా ఉండేవి కావుగదా అని ప్రశ్నించాడు. దీనికి ఇందిర అపారమయిన లోకజ్ఞానంతో జవాబిచ్చింది: "బహుశా ఇంతకంటే ఎక్కువ యిబ్బందులే కలిగేవేమో! ఎందుచేతనంటే, కొడుకేఉంటే తండ్రిని ఎల్లప్పుడూ అంటిపెట్టుకుని ఉండేవాడుకాదు. తన జీవనానికి ఏదో ఒక వృత్తిని చేపట్టి, తండ్రిమీద ఆధారపడకుండా, జీవించవలసి వచ్చేది" అని జవాబిచ్చింది ఆమె.

నేను ఆమెతో జరిపిన సుదీర్ఘమయిన గోష్ఠిలో, ఆమెకే పూర్తి స్వేచ్ఛ ఉండినట్లయితే ఎట్టి జీవనాన్ని వాంఛించేదో చెప్పమని అడిగాను. ఈ ప్రశ్న ఆమె కెంతో అసక్తిని కలిగించి తమాషాగా తోచిఉండాలి. ఐతే ఆమె బహుశ్రద్ధగానే వివిధ అవకాశాలనూ చర్చించింది. ఆమెకుగల బహుళమయిన అభిరుచులు అభివ్యక్తమయాయి. "నేను రచయిత్రిగా ఉండేదాన్ని" అని చెప్పి, వెంటనే సర్దుకుని, "చరిత్రలోనూ, బహుశా నాకు అంతకంటే ఆసక్తికరమయిన మానవపరిణామశాస్త్రంలోనూ పరిశోధన

చేసేదాన్ని. గిరిజనులన్నా, వారి జానపదకళలూ, సంగీతమూ అన్నా నాకెంతో ఇష్టం. వీలచిక్కినప్పుడలా నేను గిరిజనులు నివసించే ప్రాంతాలకు వెళుతూండేదాన్ని. వారితో కలిసి మెలిసి హాయిగా గడిపేదాన్ని అనే చెప్పాలి." అంతటితో ఆగక ఆమె కండ్లు చికిలించి "నాలో ఆదిమవాసుల తత్వం ఇంకనూ ఉండి ఉండవచ్చు. ఏది ఏమయినా నేను మానవ పరిణామశాస్త్రజ్ఞురాలుగా కృషిచేస్తూండేదాన్ని." ఆమె నిజంగా మానవ పరిణామశాస్త్రజ్ఞురాలు కాలేకపోయింది. ఈవిషయంపై ఆమెకుగల ఆసక్తిమూలంగా ఆమె తన తండ్రికి సూచించి ఏటా గిరిజనులు తమ ప్రత్యేకమయిన దుస్తులలో జానపద నృత్య ప్రదర్శన లిచ్చే ఏర్పాటు చేయగలిగింది. దానిఫలితంగానే ఇప్పుడు ఏటా రాజధానీనగరంలో రిపబ్లిక్ దినోత్సవాల వేడుకల సందర్భంగా విశిష్టమయిన చక్కని నృత్యప్రదర్శనలు ఏర్పాటవుతున్నాయి. రాజకీయ జీవితానికి బదులుగా ఆమె కోరుకుని ఉండే జీవనం ఒక్క మానవ పరిణామశాస్త్రజ్ఞురాలుగానే కాదు. "సుఖజీవనం గడపా లనుకుంటే నేను గృహాలంకరణ నిపుణురాలుగా పనిచేసిఉండేదాన్ని. ఈ విషయం నాకెంతో యిష్టం" అన్నదామె. ఆమె ఇప్పుడుంటున్న ఇంటిని చూసినా, తీన్‌మూర్తి గృహాన్ని, తండ్రిఉండగా, అలంకరించిన విధానాన్ని పరికించినా ఆమెకున్న మంచి అభిరుచులూ, గృహాలంకరణలో ఆమెకుగల ప్రతిభ విదితమవుతాయి. అంతటితో ఆగలేదు ఆమె. "నేను నాట్యకత్తెను అయ్యేదాన్ని — శాంతినికేతన్‌లో ఉండగా మణిపురి నృత్యం నేర్చుకున్నానుగా! గురుదేవుడు నన్ను దేశవ్యాప్తంగా పర్యటించే నాట్యబృందంలో చేరమని కోరారు కూడాను" అని చెప్పి నన్నామె ఆశ్చర్యాం బుధిలో ముంచింది.

ఐతే ఎవరూ కాలాన్ని వెనక్కితిప్పి ఇందిర ఏ వృత్తిని స్వీకరించి ఉండేదో నిర్ణయించజాలరు. కాని ఒక్క సంగతిమాత్రం సువిదితం. ఆమె కేవలం అలం కారప్రాయంగా, ఇల్లు దిద్దుకునే గృహిణిగా, లేదా వన్నెల విసనకర్రగా ఉండేది కాదు; ఉండజాలదు అన్న సంగతి సుస్పష్టం. చిత్తశుద్ధితో ప్రయోజనాత్మకంగా జీవనం గడపాలన్న ఆకాంక్ష గల వ్యక్తిత్వం ఆమెది. అందుచేతనే ఆమెలోని యీ చైతన్యం ఏదో ఒక సృజనాత్మకమయిన మార్గంలో బహిర్గతమై ఉండేది.

1947 లో జవహర్‌లాల్‌నెహ్రూ న్యూఢిల్లీలో మొదట్లో యార్క్‌రోడ్డులోని బంగళాలోనూ, తరువాత ఒకానొకప్పుడు భారతదేశంలోని బ్రిటిష్ సైన్యాధిపతి నివా సంగా ఉండిన సువిశాలమయిన తీన్‌మూర్తిభవనంలోనూ స్థిరపడిపోయినప్పుడు అటు తండ్రిగానీ, ఇటు ఆమెగానీ తండ్రితోనే శాశ్వతంగా ఉండిపోవాలన్న నిర్దిష్ట మయిన నిర్ణయానికి రాలేదు. మొదట్లో అది కేవలం తాత్కాలికమయిన ఏర్పాటేనని అనుకున్నారు. జవహర్‌లాల్‌నెహ్రూకు విపరీతమయిన శ్రమ, ఉద్రిక్తత కలిగించిన రోజులవి. ఆ సమయంలో 'నా' అన్నవారు ఎవరో ఒకరు కూడా ఉండవలసిన అగత్యం ఏర్పడింది. (ఐతే ఎవరిని అడగడానికీ ఆయనకు అభిమానం అడువచ్చేది.)

ఆయన భౌతిక అవసరాలు తీర్చడానికే కాదు—అవికూడా ముఖ్యమే ననుకోండి—దాదాపు 60 ఏండ్ల వయస్సులో, అతిసున్నిత మన స్తత్వంగల భార్యావిహీనుడు—అనేక సమస్యలతో సతమతమవుతూ రోజుకు 18 గంటలు పనిచేయవలసివచ్చే వ్యక్తికి ఎప్పుడు తినాలో, ఎప్పుడు విశ్రాంతి తీసుకోవాలో తెలియజెప్పేవారు అవసరమే, కాదనను. కాని అంతకన్నా ముఖ్యమయిన సంగతి ఆయనకు 'రక్షణ' కల్పించడం. ఆయనను హత్యచేయదలిచినవారినించే కాదు రక్షించవలసింది: నూతన అధికార కేంద్రమైన ఢిల్లీకి వెళ్లి ఆయనను ముసురుకునే స్వలాభపరాయణులూ, అవకాశవాదులూ, వాచాలురనించి ఆయనను కాపాడవలసిన అగత్యం కూడా ఏర్పడింది. ఏ ఆంతరంగిక కార్యదర్శీ, ప్రత్యేక ఉద్యోగీ, గృహనిర్వాహకురాలు కూడా అప్రతిహతుడు, అతిసున్నితమయిన మృదుస్వభావుడూ అయిన జవహర్‌లాల్‌నెహ్రూను అదుపులోపెట్టి నడిపించగలరనుకోవడం అపోహే అవుతుంది. ఆయనను సరిగ్గా అర్థంచేసుకుని, ప్రేమించి, దానికి ప్రతిగా ఆయన అభిమానాన్నీ, గౌరవాన్నీ పొందగలిగినవారే ఈవిధిని నిర్వర్తించగలరు. అటువంటివ్యక్తి ఒక్కరే ఒకరు ఉన్నారు—ఆయనకూతురు ఇందిర.

క్రమక్రమంగా, మనఃపూర్వకంగా అనుకోకుండానే ఇందిర తండ్రికి విడదీయరాని బంధమయిపోయింది. వచ్చిన అతిథులను ఆదరించే గృహ నిర్వాహకురాలుగా, ఇంటి యజమానురాలుగా, అవాంఛనీయమయిన వ్యక్తులను దూరంగా ఉంచే సంరక్షకురాలుగానే కాకుండా నెమ్మదిగానే అయినా నిర్మొహమాటంగా తన చర్యలను విమర్శించేందుకు కూడా ఆయనకు ఇందిర ఎంతో అవసరమయింది. ఆయన చేసిన నిర్ణయాలు ఆమెకు నచ్చనప్పుడు ఆసంగతిని ముఖంమీద నిష్కర్షగా చెప్పగలిగిన వ్యక్తి ఆమె ఒక్కతే. ఆమె విశాలదృక్పథంగల విజ్ఞానవంతురాలు గనుక ఆమె అభిప్రాయాలను ఆయన మన్నించేవాడు. వ్యక్తిగతంగా ఆమెకు తనపై కక్షలేదన్న సంగతి ఆయనకు తెలుసు కాబట్టి ఆమె అభిప్రాయాలకు మరింత విలువలభించేది. అసమర్థత, దగా, మోసం జవహర్‌లాల్ నెహ్రూలో అసహనాన్ని రేకెత్తించేవి. వాటిని సహించలేక ఆయన మండిపడేటప్పుడు తండ్రిని శాంతింప జేసేది ఇందిరే. కనుకనే సుఖంగా సంసారం చేసుకుంటూ ఇద్దరు బిడ్డలతల్లి అయిన ఆమె తన జీవితంలో ఆనందంగా గడపవలసిన పద్దెనిమిది సంవత్సరాలు తండ్రికి సేవచేస్తూ ఆయనకు తోడు నీడగా గడపవలసి వచ్చింది. వ్యక్తిగతంగా ఆమె తన జీవితాన్ని తండ్రికోసం త్యాగం చేసిందనే చెప్పాలి. తన వ్యక్తిత్వాన్నీ, తన అహంకారాన్నీ, స్వసుఖాన్నీ కూడా త్యాగంచేసి జవహర్‌లాల్ నెహ్రూకు సేవచేస్తూ గడిపింది. కేవలం ఆయన తన తండ్రి అనే కాదు, ఆయన ప్రవచించే సిద్ధాంతాలు భారతజాతికి ఆశాజ్యోతులన్న దృఢ విశ్వాసంతోనే ఆమె అంతటి త్యాగం చేయగలిగింది. కాని యీ త్యాగం ఆమెకు ఒక సవాలు, అవకాశంకూడాను. చారిత్రకంగా తనపైబడిన బాధ్యతలను నిర్వర్తించగలిగిన శక్తిసామర్థ్యాలు తనకు ఉన్నాయని నిరూపించుకోడానికి

అది సవాలు. జాతీయ పునర్నిర్మాణంలోనూ, అంతర్జాతీయ సహకారంలోనూ అంత ర్హితమైఉన్న బ్రహ్మాండమయిన సమస్యలనూ, విధానాలనూ, వ్యక్తులనూ పరిశీలించి అవగాహన చేసుకుని జీర్ణించు కోవడానికి అది ఒక అవకాశం కూడా.

ప్రపంచం—ముఖ్యంగా ఆఫ్రికా ఆసియా ఖండాలలో నవప్రపంచం—భారత దేశానికి వచ్చింది-కాదు, జవహర్‌లాల్ నెహ్రూ ముంగిటిలో అడుగిడింది. సుందర మందహాసవదనంతో ఇందిర స్వాగతం పలికింది. 1949 జనవరి నెలలో ఆసియా దేశాల మహాసభ న్యూఢిల్లీలో జరిగింది. 19 దేశాలు ఈ మహాసభకు హాజరైనాయి. ఇండోనేషియాపై డచ్చివారు జరుపుతూ ఉండిన 'పోలీసు చర్య' కు నిరసన సూచ కంగా ఆ మహాసభ జరిగింది. కొత్తగా స్వతంత్రం పొందుతూన్న ప్రాచ్య దేశాల నాయకులను కలుసుకుని వారి సమస్యలను తరచి చూడడం ఇందిరకు తొలి అనుభవం. అంతే కాదు. ప్రపంచంలోని అనేకదేశాలవారు జవహర్‌లాల్ నెహ్రూను ఆహ్వానిం చారు. ఇందిర ఆయనతోపాటే ఉండేది. 1948 అక్టోబరులోనే కామన్వెల్తు ప్రధా నుల మహాసభకు హాజరయిన తండ్రిని ఇందిర అనుసరించింది. తండ్రితో ఆమె జరి పిన పర్యటనలలో చిరస్మరణీయమయినది ఆఅనుభవం - 1948 నవంబరు 3 వ తేదీన పారిస్‌లో యునైటెడ్ నేషన్సు సర్వసభ్యమండలి సమావేశంలో ఆయన ప్రసంగం చేస్తుండగా చూడడం. "ప్రపంచ రంగంపై ప్రముఖపాత్ర వహించడానికి అదే నాంది....ఆయన నవఆసియా వాణిగా అగుపించాడు" అని అభివర్ణించిన ఆనాటి ప్రసంగాన్ని ఇందిర సగర్వంగా, హర్ష పులకితాంగియై ఆలకించింది.

1949 లో నెహ్రూ అధికార హోదాలో అమెరికాలో పర్యటించాడు. ఈ 'అమెరికా దర్శన' యాత్రలో ఇందిరకూడా తండ్రిని అనుసరించింది. ఆమె అమెరికా వెళ్ళడం అదే ప్రథమం. కాని లాంచన ప్రాయంగా జరిగిన సమా వేశాలన్నింటిలోనూ ఆమె వెనకగానే ఉండిపోయేది. ప్రధానమంత్రి ప్రక్క స్థానాన్ని అప్పట్లో వాషింగ్‌టన్‌లో భారత రాయబారిగా ఉండిన శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ఆక్రమించేది. ఆనాడు నాలుగు వారాలపాటు ఇవతలి సముద్ర తీరంనించి అవతలి తీరంవరకూ గల విశాలదేశంలో 10,000 మైళ్ళ దూరంమేర వారు జరిపిన పర్యటనను నివేదించిన పత్రికా విలేఖరుల కథనాలను ఒక్కసారి తిరగవేస్తే, ఎవరూ కూడా, బహువినయంగా, నిరాడంబరంగా, మౌనంగా ఆయనను అనుసరించే ఇందిరలో భావి భారత ప్రధానిని గుర్తించలేదని తెలుస్తుంది.

అమెరికన్ పత్రికలలో జవహర్‌లాల్ నెహ్రూ పర్యటనను గురించి వేలకొద్దీ 'కాలం' లు అచ్చయినాయి. కాని వాటిలో ఇందిర పేరు బహు అరుదుగా మాత్రమే కనిపిస్తుంది.

"నెహ్రూను అనుసరించే బృందంలో రాయబారి శ్రీమతి వి. యల్. పండిట్, శ్రీమతి ఇందిరా గాంధీ, సర్ జీ. యస్. బాజ్‌పాయ్, ఇంకా ఇతరులూ ఉన్నారు...."

ఇందిర తండ్రిని అనుసరించే బృందంలో వెనకనే ఉండిపోయినా అమెరికా లోని స్థితిగతులను ఆమె జాగ్రత్తగా, సునిశితంగా పరిశీలిస్తూ ఉండేది. తన మిత్రులకు వ్రాసిన ఉత్తరాలలో దౌత్య మర్యాదలనుకూడా విస్మరించి తన అభిప్రాయా లను స్పష్టంగా వెల్లడించింది. "అమెరికావారు ప్రేమపాత్రులు. ఇతరులను గురించి తెలుసుకోవాలని ఎంతో ఆత్రంగా ఉంటారు." తండ్రి ఉపన్యాసాలను ప్రస్తావించి ఆమె "నాన్న చేసిన ప్రసంగాలు అమెరికావాడికి బాగా నచ్చాయి." అధికారరీత్యా ఏర్పాటయిన ఈ పర్యటనలో వారు "రోజా రంగు కళ్ళ అద్దాలలోనించి అమెరికాను తిలకించారు." అయినా "అక్కడ గల అపారసంపద, విలాసజీవనము కళ్లారా చూస్తేనేగాని నమ్మలేము." అమెరికావారు చూపే విపరీతమయిన అతిథి మర్యాదవల్ల తాను "బలిసిన గువ్వపిట్టలాగా" తయారవుతున్నానని ఆమె ఫిర్యాదు చేసుకుంది.

కాని యథార్థానికి ఈ పర్యటన వల్ల ఆమెఆరోగ్యం కొంత బాగుపడినా తాను చేసుకున్న యీ వర్ణన మాత్రం అతిశయోక్తే. న్యూయార్కులో ఆకాశాన్నంటే భవ నాలు ఆమెకు నచ్చలేదు. అవి అసహ్యంగా ఉన్నటు అనిపించాయి. కాని రాత్రి పూట న్యూయార్కు నగరసౌందర్యం ఆమెకు చూడ ముచ్చటయింది. వాల్డార్ఫ్ ఆస్టోరియా హోటలులో వారు ఉన్నప్పుడు జీగురు ఆతికించిన కవర్లు పిప్పరమెంట్ల వాసన వేస్తూండడం ఎంతో తమాషాగా అనిపించింది. కాని రేడియోలో ప్రకటనలను ఆమె తీవ్రంగా అసహ్యించుకునేది. తన స్నేహితురాలికి వ్రాస్తూ, అంతర్జాతీయ వ్యవ హారాలను గురించి మంచిపట్టులో నివేదిస్తూ, మధ్యలో కార్యక్రమానికి అంతరాయం కలిగించి, "ప్రపంచం కష్టనష్టాలకు తావలమయినది. కాని మీరు దిగులుపడకండి. 75 డాలరు చెల్లిస్తే మీకు అంత్యక్రియలు అద్భుతంగా జరుపగలం" అని ప్రకటిస్తూం టారు అని పేర్కొన్నది.

* * *

స్వదేశానికి తిరిగి వచ్చాక దేశం ఎదుర్కోవలసి వస్తూన్న ఆంతరంగిక సమస్యలతో తండ్రి వీరోచితంగా పోరాడుతూఉంటే ఇందిర తండ్రిని కనిపెట్టి ఉండ వలసి వచ్చింది. పాకిస్తాన్‌లోని కొండజాతులవారు కాశ్మీరుపై దండెత్తినప్పటి నించీ పాకిస్తాన్‌తో సంబంధాలు అంతకంతకూ ప్రమాదకరస్థాయికి దిగజారసాగాయి. 1950 వ సంవత్సరం ఏప్రెల్ నెలలో జరిగిన నెహ్రూ-లియాకత్ ఒప్పందం ఉభయ దేశాలమధ్యా సంబంధాలు సంగ్రామానికి - అంతకంటే భయంకరమయిన మతకల్లో లాలకు దిగజారకుండా మాత్రమే నివారించ గలిగింది. కాంగ్రెసు పార్టీలో వామ

దక్షిణ వర్గాలమధ్య అంతరం తీవ్రతర మయింది. అనేకసార్లు జవహర్‌లాల్ తుది చర్యగా కార్యనిర్వాహక వర్గంలోనించి రాజీనామా చేయవలసి వచ్చేది. కాని ప్రతి సారీ కూడా ఆయనకు ఎలాగో నచ్చజెప్పి, తిరిగి కార్యవర్గంలో ఛేర్చేవారు. ముఖ్య మయిన దేశవ్యవహారాలలోనూ, వైదేశిక విషయాలలోనూ కూడా ప్రధానమంత్రి నెహ్రూకూ, ఉపప్రధాని పటేల్‌కూ అభిప్రాయభేదాలు ఉన్నాయని నిరంతరంగా ఊహా గానాలు సాగుతూనే ఉండేవి. అయినా 75 వ యేట సర్దార్ పటేల్ అస్తమయం జవ హర్‌లాల్‌కు వ్యక్తిగతమయిన ఆఘాతమే. సిద్ధాంత పరంగానూ, స్వాభావికంగానూ ఇరువురిలోనూ ఎన్నో విభేదాలు ఉండినా దేశ స్వాతంత్ర్య పోరాటంలోని విషమ ఘడియలలో అనేక సంవత్సరాలపాటు వారు అత్యంతసన్నిహితంగా పనిచేశారు.

ఇందిరకు తన తండ్రి భావాలను గ్రహించగలిగిన పరిజ్ఞానం క్రమేణా అల వడింది. ఆయనకు దిగులు పుట్టించే విషయా లేమిటో, ఉత్తేజాన్ని కలిగించే అంశా లేమిటో ఆమె ఊహించగలదు. ఆయనకు నూతనోత్సాహోత్తేజాలను కలిగించే అం శం ప్రణాళికలు-స్తబ్ధుగా ఉండిపోయిన గ్రామీణ ఆర్థికవ్యవస్థను మార్చివేసే బృహత్ పథకాలు. ఆయనతోపాటు ఆమె భాక్రానంగల్, దామోదర్‌లోయప్రాజెక్టు, ఒరిస్సాలోని హీరాకుడ్ డామ్ సందర్శించింది. వీటిని ఆయన "భావితరాలవారి ఆల యాలు" అని అభివర్ణించడం విన్నది. ఆమెకూడా దేశాన్ని పారిశ్రామికం చేయ గలిగిన ఉక్కు కర్మాగారాలు, విద్యుదుత్పాదక యంత్రాలతో కూడిన పంచవర్ష ప్రణాళికలంటే నూతనోత్సాహంతో ఉరకలు వేసేది.

1952 లో జరిగిన సార్వత్రిక ఎన్నికలు జవహర్‌లాల్ నెహ్రూకు విపరీత మయిన శ్రమకారణ మయినాయి. ఆయన పట్ల శ్రద్ధాభక్తులుగల ఇందిరకు ఆందో ళన కారణ మయినాయి. ఎన్నికలంటే మళ్లీ అనంత ప్రయాణం-విమానం మీదనే కాదు, దుమ్ముతో నిండిన మట్టి రోడ్లపై కారులో ప్రయాణం-అసంఖ్యాకమై గందర గోళం చేస్తూండే మహాజన సమూహంలో రోజుకు ఏడజను ఉపన్యాసాలో ఇవ్వ డం. "కాంగ్రెసువారి ఎన్నికల ప్రచారం ఒకే ఒక వ్యక్తిపై ఆధారపడింది. ఆ వ్యక్తి నెహ్రూ. ఆయనే సిబ్బందిప్రధానాధికారి, కార్యరంగంలో సేనాధిపతి, కాంగ్రెసు విధానాలను వ్యక్తీకరించే వక్త, పదాతి సైనికుడు-సర్వమూ ఆయనే." నెహ్రూ పరిస్థితి ఇలా ఉంటే ఇక ఆయనకు విశ్వసనీయమయిన సహాయకురాలూ, ఆంతరంగిక ఉద్యోగీ, పౌర సంబంధ విషయాలు చూసే అధికారీ-అన్నీ ఇందిరే. ఆయనకు విపరీతమైన అలసట కలగకుండా రక్షించడమే కాదు, పార్లమెంటు స్థానా లకూ, పార్టీ తరఫున 'టిక్కెట్టు'ను అర్థించే అభ్యర్థుల బాగోగులను గురించి సల హాలు ఇవ్వవలసినదీ కూడా ఆమెయే.

ఇంతకు ముందొకసారి ఉత్తర ప్రదేశ్ రాష్ట్ర శాసనసభకు నిలబడవలసిందిగా రాష్ట్ర కాంగ్రెసు అధినేతలు అడిగారు-కాదు, ఆజ్ఞాపించారు, అయినా ఆమె నిరాక

రించింది. తండ్రి ఆమెను నిరుత్సాహ పరచనూ లేదు, ప్రోత్సహించనూ లేదు. నిర్ణయాధికారాన్ని పూర్తిగా ఆమెకే వదిలి వేశారు. మళ్ళీ ఎన్నికలు సమీపిస్తూండ డంతో 1951 లో ఆమెను మళ్ళీ కాంగ్రెసు అభ్యర్థిగా-ఈసారి పార్లమెంటుకు పోటీ చేయవలసిందిగా అర్థించారు. మళ్ళీ ఆమె నిరాకరించింది. ఆమె పార్లమెంటులో ప్రవేశించడానికి సిద్ధంగా లేదు. కాని అప్పటి కప్పుడే ఆమె రాజకీయాలలో తలమున కలై ఉంది. కాంగ్రెసు మహిళా కార్యకర్తగా ఆమె అనేక సంఘాలలో సభ్యు రాలు. అంతేకాదు. ఆమె అనేక సంఘసంక్షేమ సంస్థలు నిర్వహించేది. వివిధ రాష్ట్రాలలోని కాంగ్రెసు నాయకులూ ఆమెతండ్రిని కలుసుకునే ముందు ఆమెను ముందుగా సంప్రదించేవారు. వివాదాస్పద మయిన సమస్యలపై ఆమె నిష్కర్షగా వెలిబుచ్చే అభిప్రాయాలనూ, చక్కని ఆమె నిర్ణయాలనూ చాలామందిమన్నించేవారు. కాంగ్రెసు రాజకీయాలలో ఎప్పుడో ఒకప్పుడు ప్రముఖస్థానం వహించి తీరుతుందని వారు అనుకునేవారు. కాని 'ఆమె ఎంత ఉన్నతపదవిని అధిష్ఠించగలదు' అన్న విషయం మాత్రం వారూ ఊహించలేక పోయారు.

* * *

నెహ్రూ కుటుంబంవారు ప్రపంచ నాయకులతో జరిపే సంభాషణలు కొనసాగు తూనే ఉండేవి. అనేకదేశాల నించి ప్రముఖవ్యక్తులు తీన్‌మూర్తి భవనానికి వచ్చే వారు. 1952 లో రూజ్‌వెల్టు సతీమణి వచ్చి కొన్నాళ్ళు గడిపింది. ఆమెకు ఇందిర పట్ల ప్రత్యేకాభిమానం ఏర్పడింది. ఆ మరుసటి సంవత్సరమే రాణీ రెండవ ఎలిజ బెత్ పట్టాభిషేక మహోత్సవానికి ఇందిర తండ్రితోబాటు వెళ్ళింది. రాణికూడా నెహ్రూ కుమార్తె ఆకర్షణకు లోనయింది.

రాణిని కలుసుకోవడం కంటేనూ ఆసక్తికరమయిన సంగతి విన్‌స్టన్ చర్చిల్‌తో జరిపిన సమావేశం. పట్టాభిషేక మహోత్సవం సందర్భంగా జరిగిన ఒక సభలో ఆ ముసలాయన—భారతదేశాన్ని గురించి ఒకప్పుడు అసహ్యకరమయిన కఠినోక్తులు పలికిన ఆ పెద్ద మనిషి—ఇందిర ప్రక్కనే తాను కూర్చున్న సంగతి గమనించాడు. సర్ విన్‌స్టన్ తనకేసి తిరిగి "బహు కొద్ది కాలంక్రితమే పరస్పరం ద్వేషించుకుంటూ ఉండిన మనం ఈ నాడు మిత్రులుగా కబుర్లు చెప్పుకోవడం వింతగా లేదూ?" అని అడిగాడు. ఇందిర మర్యాదగా జవాబు చెబుతూ—

"కాని మేము మిమ్మల్ని ద్వేషించలేదు, సర్ విన్‌స్టన్!" అని అన్నది. "కాని నేను ద్వేషించాను, నేను ద్వేషించాను'' అని ఆయన జవాబు. "కాని ఎందుకు అలా చేశానో నాకు తెలియదు'' అన్నాడాయన. అదే సమయంలో చర్చిల్ తన తండ్రిని గురించి మాట్లాడుతూ "ద్వేషాన్నీ, భీతినీ జయించిన మనిషాయన'' అని అభివర్ణించినట్లు ఆమె చెప్పింది.

తండ్రి నేరుగా స్వదేశానికి తిరిగి వచ్చాడు. కాని ఇందిర మాత్రం మాస్కో మీదుగా తిరిగి వచ్చింది. ఆమెకు అది ఆటవిడుపు. కాని మరో సంవత్సరం తరువాత తండ్రి రష్యా పర్యటనకు ముందుగా వెళ్ళి సన్నాహాలు చేసినట్లయింది, ఇందువల్ల.

స్టాలిన్ శకం అప్పుడే పరిసమాప్తి చెందింది. క్రెమ్లిన్‌తో కరుడుగట్టిన అంతర్జాతీయ సంబంధాలు అప్పుడప్పుడే కొద్దిగా కరగడం మొదలుపెట్టాయి. అప్పట్లో అక్కడ భారత రాయబారిగా ఉండిన కె. పి. ఎస్. మీనన్ భారత-సోవియట్ దేశాల మధ్య మరింత సన్నిహిత సంబంధాలు స్థాపించేందుకు పునాదులు వేస్తున్నారు. ఇది 1953 జూన్ నాటి మాట.

ఆటవిడుపు ధోరణిలో ఉన్న ఇందిర రాయబారి మీనన్‌తోనూ, ఆయన సతీమణితోనూ కలిసి జార్జియా వెళ్ళింది. టిబిలిసీలోని మనోహర దృశ్యాలు ఆమెను ముగ్ధురాలిని చేశాయి. రాత్రి తెల్లవార్లూ మేల్కొని ఉండి నగరంలోని దీపాలను చూస్తూ ఉండిపోయింది. రాత్రిపూట టిబిలిసీలోని దృశ్యం మత్తు కలిగించిందనీ, రాత్రంతా నిద్రపట్టక తెల్లవారు ఝామున మూడింటివరకూ మేలుకునే ఉన్నాననీ మరునాటి ప్రొద్దున్న మీనన్ దంపతులకి తెలియజేసింది. "నేను సారాయి మత్తులో పడను. ఇతర విషయాలు నాకు మత్తు కలిగిస్తాయి" అన్నదామె.

తాష్కెంటులో ఆమె, సోవియట్ పాలన నెలకొన్న అనంతరం, ఒకప్పుడు వెనకబడి ఉండే ప్రాంతాలు ఎంత ఆశ్చర్యకరంగా అభివృద్ధి చెందినదీ గమనించగలిగింది. సమర్‌కండ్‌లో చీరలు ధరించిన భారతీయవనితలు అనేకమందిని ఆకర్షించారు. కాని ఈ యువతి కూడా భారత దేశాన్నించి వచ్చిందన్న సంగతిని వారెవరూ ఊహించలేక పోయారన్నారు.

> ఇందిర ఎక్కడినించి వచ్చి ఉంటుంది? అని ఉజ్బెక్కులు ఆశ్చర్యపోయినారు. ఆమె కూడా చీరే కట్టుకున్నా ఎంతో తెల్లగా, అందంగా ఉందేది. జుట్టు కత్తిరించి పొట్టిగా ఉంది. ముఖ లక్షణాలు కూడా సునిశితంగా ఉన్నాయి. ఆమె ప్రపంచంలో ఎక్కడినించి అయినా వచ్చి ఉండవచ్చు. ఎవరికీ చెంది ఉండక పోవచ్చు కూడాను.

సోవియట్ యూనియన్‌లోని అనేకమంది రష్యన్లూ, తదితరులూకూడా జవహర్‌లాల్ నెహ్రూ కూతురు సౌందర్యాన్ని మెచ్చుకున్నారు. కె. పి. ఎస్. మీనన్ కూడా ఆమె సౌందర్యాన్ని ఘనంగా ఉగ్గడిస్తూ—

> "ఇందిర సౌందర్యం వ్యక్తిగతంగా విశిష్టమయినది, విశ్వజనీనమయినది కూడాను. ఆమెసౌందర్య ఆకర్షణను గురించి ఆమెకు తెలియక పోవడంలో ఒక అందం ఉంది."

సోవియట్ యూనియన్ వెళ్ళివచ్చినంతమాత్రంచేత ఇందిరలో కమ్యూనిజం పట్ల విశ్వాసం ఏర్పడలేదు. కాని సోవియట్ ప్రజలూ, స్టాలిన్ అనంతరం అధికారంలోకి వచ్చిన నాయకులూ కూడా యుద్ధాన్ని వాంఛించడం లేదనీ, అక్కడ విప్లవం వచ్చిన 35 ఏండ్లలో బ్రహ్మాండమయిన అభ్యుదయాన్ని సాధించగలిగారనీ ఆమెలో నమ్మకం ఏర్పడింది. మార్గ మధ్యంలో ఆమెకు ప్రతిచోటా కూడా హృదయపూర్వకమయిన ఆదరాభిమానాలు లభించాయి. భారతదేశంపట్ల అపారమయిన సౌహార్దభావం ఆమెకు గోచరించింది. అందుచేతనే స్వదేశానికి తిరిగి వచ్చాక తండ్రితో చెప్పింది—

"అధికార హోదాలో ఎప్పుడు సోవియట్ యూనియన్‌ పర్యటించాలని అనుకున్నా ఆయనకు మనఃపూర్వకమయిన స్వాగతం లభించి తీరుతుంది" అని.

ఇందిర సోవియట్ యూనియన్‌ను ప్రప్రథమంగా సందర్శించినప్పుడూ, ఆ దరిమిలా పర్యటించినప్పుడూ కూడా ఆమెను కలుసుకున్నవారికీ, దూరాన్నుంచి చూచినవారికీ, ఆమెమాటలు విన్నవారికీ ఎటువంటి భావాలు కలిగి వుంటాయి? వారి భావాలు ఏ తీరుగా ఉన్నా అవి సద్భావాలే అయివుండాలి. ఎందుకంటే డజన్లకొలది సోవియట్ ప్రజలు తమ పిల్లలకు ఆమెపేరు పెట్టుకున్నారు. ఈనాడు సోవియట్ యూనియన్‌లో చిన్న ఇందిరలు అనేక మంది ఉన్నారు. వారిలో కొంతమందికి అప్పుడే పదమూడేళ్ళు నిండాయి.

*　　　　*　　　　*

1954 వ సంవత్సరంలో ఆసియా అత్యంతప్రాధాన్యం వహించింది. ఆయేడు జూన్‌నెలలో చైనాప్రధాని చౌఎన్‌లై భారతదేశం వచ్చినప్పుడు నెహ్రూతో ఆయన జరిపిన సమాలోచనల అనంతరం వెలువడిన సంయుక్త ప్రకటనలో శాంతి సూత్రాలు అయిదింటిని—పంచశీలను పొందుపరిచారు. అదే సంవత్సరం అక్టోబరు నెలలో ఇందిర తన తండ్రివెంట చైనా వెళ్లింది. అక్కడ జరుగుతున్న ఆశ్చర్యకరమయిన ఆర్థిక ప్రగతిసూచనలు ఆమెపై ప్రగాఢమయిన ముద్రలువేశాయి—ఆమె తండ్రిమీద వలెనే. కాని వ్యక్తిగతంగా ఆమెకుమాత్రం చైనావారి ఉద్దేశ్యాల విషయంలో కొన్ని అనుమానాలూ, భయసందేహాలూ ఉండిపోయాయి. ఆ సంవత్సరాంతంలో భారతదేశం వచ్చిన మరో ప్రముఖవ్యక్తి యుగోస్లావియా ప్రెసిడెంట్ టిటో. ఆయనకు ఆతిథ్యం ఇవ్వడంలో ఇందిర తండ్రికి బాసటగా నిలిచింది. నెహ్రూ టిటోలు ముఖ్యమయిన సమాలోచనలు జరిపినప్పుడు ఇందిరకూడా అక్కడే ఉంది. అప్పటినించీ ఆమెతండ్రి జరిపే అంతర్జాతీయ సమాలోచనలకు హాజరవుతూండేది—వారికి అవసరమయినప్పుడు కాఫీలు సప్లయిచేయించడంమాత్రమేకాదు, వారి చర్చలు శ్రద్ధగా వింటూ, గమనిస్తూ, వాటిలో లీనమవుతూ, ఒక్కొక్కప్పుడు వాటికి పరోక్షంగా తోడ్పడుతూ నా... నలలో పాల్గొనేది. ప్రపంచ రాజనీతివేత్తలలో టిటో (తరువాత నాజర్

కూడా) నెహ్రూకు వ్యక్తిగతంగా అత్యంత సన్నిహితుడయాడు. టిటో నెహ్రూకు జోహారులర్పిస్తూ "ఆయనకు ప్రకృతిసౌందర్యంపట్లగల అభిమానాన్నీ, ఆయన మానవతా భావాన్నీ, తన కుటుంబంపట్ల ఆయనకు గల శ్రద్ధాసక్తులనూ" ప్రత్యేకంగా పేర్కొన్నాడు. భారతదేశంలో జరిగిన ఒక ముఖ్య రాజకీయ సంఘటనకు టిటో సాక్షీభూతుడయ్యాడు. 1955 వ సంవత్సరం జనవరినెలలో ఆవడిలో జరిగిన కాంగ్రెసుమహాసభకి ఆయన హాజరయినాడు. ఆ సమావేశంలోనే భారతదేశంలో అభ్యుదయ సాధనకు "సోషలిస్టుపద్ధతి సమాజాన్ని" మూలంగా పేర్కొనే తీర్మానాన్ని ఆమోదించడం జరిగింది. కాంగ్రెసులోని యువతరంవారికీ, తీవ్రవాదులకూ అది అత్యంత ప్రధానమయిన తరుణం. సోషలిజం స్థాపించడానికి కాంగ్రెస్ ఏనాటి కయినా కట్టుబడకపోతుందా అని ఎంతకాలంగానో ఆందోళన సాగిస్తూ అందుకు కృషిచేస్తూ వచ్చిన ఈ తీవ్రవాదులకు అది విజయం. ఆ విధంగా ఆశించినవారిలో ఇందిరకూడా ఉన్నదనడంలో సందేహంలేదు.

1955 లో ఇందిరాగాంధీ కాంగ్రెసు కార్యవర్గంలో సభ్యురాలుగా ఎన్నిక కావడంతో రాజకీయంగా ఆమెవ్యక్తిత్వాన్ని గుర్తించినట్లయింది. అప్పటినించి కాంగ్రెసు వ్యవహారాలలో ఆమెగా ఆమెకు పలుకుబడి ఏర్పడింది. అంతవరకూ 'ఛాయ'గా ఉంటూఉండిన ఆమెకు రాజకీయంగా వ్యక్తిత్వం ఏర్పడింది. కార్యవర్గంలో ఆమె కేవలం అలంకారప్రాయమైన సభ్యురాలుమాత్రమేకాదు. పార్టీ కార్యకర్తలు గ్రామాలలోకి వెళ్లి అక్కడి ప్రజలతో సన్నిహితమయిన సంబంధం ఏర్పరచుకోవాలన్న ఉద్యమాన్ని ప్రారంభించి ఇందిర తన ఎన్నికను సార్థకంచేసుకుంది.

కాంగ్రెసురాజకీయాలతో ప్రమేయం ఏర్పడినంతమాత్రంచేత ఆమె అంతర్జాతీయ వ్యవహారాలలో ఆసక్తిని కోలుపోలేదు. 1955 లో జరిగిన బాండుంగ్ మహాసభకు ఆమెకూడా వెళ్లింది. ఆసియా, ఆఫ్రికా దేశాలు ఒకేచోట సమావేశంకావడానికి తోడ్పడిన ఆ మహాసభ నెహ్రూ సాధించిన విజయాలకు మకుటాయమానమయినది. నెహ్రూ పరివారంలో ఆ మహాసభకు వెళ్లిన వైదేశిక వ్యవహారాల మంత్రిత్వశాఖ ఉన్నతోద్యోగి ఒకరు, బాండుంగ్‌లో ఆమె కేవలం ఒక పరిశీలకురాలుగామాత్రం కాక సమాలోచనలు అన్నిటిలోనూ చురుకుగా పాల్గొన్నదని ధ్రువపరిచాడు. మిగతా ప్రతినిధు లందరివలెనే ఆమెకూడా ఎంతో శ్రద్ధగా చర్చలలో పాల్గొన్నది. మిగతా ప్రతినిధివర్గాలను తండ్రితోపాటేగాక తనంత తానుగా కూడా కలుసుకున్నది. అంతర్జాతీయ వ్యవహారాలలో ఆమెకుగల పరిజ్ఞానానికి, చిక్కుసమస్యలను చాకచక్యంతో పరిష్కరించగలిగిన నైపుణ్యానికి ఆసియా ఆఫ్రికా దేశాల రాజనీతివేత్తలు చాలామంది ముగ్ధులయారు. ఆమె అంతర్జాతీయ వ్యవహార పరిజ్ఞానానికి బాండుంగ్ మహాసభలో పట్టభద్రత్వం సిద్ధించిందని చెప్పవచ్చు. ఇక తండ్రితో ఈజిప్టు, జెకోస్లవేకియా, సోవియట్ యూనియన్, పోలెండు, ఆస్ట్రియా, యుగోస్లావియా, యునైటెడ్ కింగ్డం

లలో జరిపిన పర్యటనతో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సును పూర్తిచేసినట్లయింది. ఈ పర్యటనలు కేవలం సుందరదృశ్యాలనూ, నూతన స్థలాలనూ దర్శించేందుకు ఉద్దేశించిన పర్యటనలు కావు—ఆమెకు దర్శనీయస్థలాలను చూసేందుకు ఎప్పుడోగాని తీరిక చిక్కేదికాదు. ప్రతిదేశంలోనూ ఆయాదేశాల అధినేతలతో జరిగే అత్యంత సున్నితమయిన రాయబారాలలోనూ, ముఖ్యసమాలోచనలలోనూ తండ్రిని అనుసరించే ఉంటూండేది. స్వదేశానికి తిరిగి వచ్చాక ఇందిర అవిచ్ఛిన్నంగావచ్చి తండ్రిని సందర్శించి పోతూండే ప్రముఖులకు అతిథిసత్కారాలు చేయవలసివచ్చింది. 1955 డిసెంబరునెలలో ఒక్క 15 రోజులలో మాస్కోనించి కృశ్చేవ్, బుల్గానిన్‌లూ, మస్కానించి సావూద్ రాజూ వచ్చారు. ఇందిర ప్రగాఢంగా విశ్వసించిన అలీనసిద్ధాంతంవల్ల ఆతిథ్యం ఇచ్చే గృహస్థుగా కొత్తసమస్యలు ఉత్పన్నమవుతూండేవి. 'తీన్‌మూర్తి' భవనానికి విచ్చేసే వివిధ తరహాల వ్యక్తుల స్వభావాలనూ, అభిరుచులనూ ఊహించి తదనుగుణంగా నడుచుకోవడం ఆమెకు దుర్ఘటమవుతూండేది.

ఆదిలో తండ్రిఛాయగా, తరువాత ఆయన సలహాదారుగా, చివరికి తాను స్వయంగా ప్రజాజీవితంలో నిర్విరామంగా పాల్గొనడం, తరుచూ విదేశీ పర్యటనలు జరపడమూ ఇందిర వ్యక్తిగతజీవితంలో గణనీయమయిన మార్పులకు కారణమయాయి. ఆమెకు స్వతంత్రమైన సాంఘికజీవనానికి అవకాశమే లేదు. కారణం-ఎల్లప్పుడూ ప్రజాకార్యకలాపాలలో నిమగ్నురాలు కావడం, తండ్రి ఆలనా పాలనా చూడడం జరుగుతూ ఉండేది. కాంగ్రెసు కార్యవర్గంలో సభ్యత్వమే కాక భారత సేవక్‌సమాజ్, మహిళామహాసభ, కేంద్ర సాంఘికసంక్షేమమండలివంటి అనేక సంక్షేమమహిళాసంస్థలలో పాల్గొంటూఉండేది. కమలానెహ్రూ స్మారక చికిత్సాలయానికి ఆమె ఒక ధర్మకర్త. 'నేషనల్ హెరాల్డు' దినపత్రిక నిర్వాహకమండలిలో ఆమె కూడా ఒక సభ్యురాలు. భారతదేశంలో అందరికంటె ఎక్కువ కష్టపడి పనిచేసేవ్యక్తి జవహర్‌లాల్‌నెహ్రూ అని తరచుగా వింటూంటాం. అలాంటప్పుడు భారతదేశంలోని మహిళలలో అత్యంత శ్రమపడేది ఇందిరేనని నిరాఘాటంగా చెప్పవచ్చు.

ఇందిరకు ఒకప్పుడు సినిమాలపైన ఆసక్తి విపరీతంగా ఉండేదని నెహ్రూ కుటుంబ మిత్రుడొకడు చెప్పాడు. కాని ఇప్పు డామె ఎన్నడో కాని సినిమాకు వెళ్ళలేకపోతోంది. అదిహాగా తండ్రీ, ఆయన కార్యదర్శీ పైళ్ళు పుచ్చుకుని ఆఫీసుగదిలో ప్రవేశించాక చివరి ప్రదర్శనానికి మాత్రమే వెళ్ళడానికి వీలయ్యేది. ఆమెకు పెద్ద విందులంటే ఇష్టంలేదు. కాని అప్పుడప్పుడు కొద్దిమంది స్నేహితులతో గడపడానికి ఇచ్ఛగించేది. ఏడాదికి ఒకటి రెండు సార్లు, ఎప్పుడో, తండ్రి తనని విడిచి ఒక్కడూ ఇతర నగరాలకు వెళ్లినప్పుడు ఆమె ఒకరిద్దరు స్నేహితులను పిలిచి "మనం మోతీమహల్‌కు వెడదాం, పిల్లలను విందుకు తీసుకెళ్లాలనుకుంటున్నాను" అనేది.

కొన్నేళ్లు ఫిరోజ్ తనభార్యతో ప్రధానమంత్రి ఇంట్లోనే ఉండేవాడు. జవహర్‌లాల్ ఆయనను ఎంతో అపేక్షగా చూసుకునేవాడు. కాని స్వతంత్ర భావాలు, ఆత్మగౌరవమూ కల ఫిరోజ్ వంటి యువకుడికి మామగారింట్లో శాశ్వతంగా ఇల్లరికం ఉండిపోవడానికి ఇష్టంఉండదు. ఇందిర తండ్రిని విడిచిపెట్టలేదనీ, అలా విడిచిపెట్ట కూడదనీ కూడా బహూశా ఆయనకు తెలిసేఉంటుంది. ఫిరోజ్ అటువంటి సూచన చేయలేడుకూడాను. ఎవరూ ఉద్దేశ్యపూర్వకంగా కలిపించిన పరిస్థితికాదది. కోరుకున్నది అంతకంటేనూ కాదు. నిస్వార్థబుద్ధితో ఒక మహత్తర ప్రయోజనానికి అంకితుడై పోయిన-ప్రేమపాత్రుడై ఏకాకియైన ఆ మహనీయునిపట్ల వారికి గల భక్తిశ్రద్ధలే ఆ పరిస్థితిని కల్పించాయి.

ఫిరోజ్‌గాంధీ తెలివితేటలూ, నిజాయితీ గల యువకుడు. అతని రాజకీయ జీవితానికి ప్రధానమంత్రితోగల బాంధవ్యం ఎన్నడూ దోహదకారి కాలేదు. కాగా కొంత వరకు ప్రతిబంధకం అయింది. అత్యంత సున్నితభావాలు గల ఫిరోజు మామగారి పదవిని అల్లుడుగా ఉపయోగించుకుంటున్నాడు అనే భావం కలగకుండా చేయడానికి విపరీతమయిన జాగ్రత్త తీసుకునేవాడు. ప్రముఖనాయకులు నెహ్రూను చూడ్డానికి వచ్చినప్పుడు ఫిరోజ్ ప్రత్యేకంగా తప్పుకుని తిరిగేవాడు. మామగారితో ఉండగా ఫోటోలు కూడా తీయనిచ్చేవాడు కాదు. ఆ మహానాయకునితో సాన్నిహిత్యాన్ని ప్రకటించుకుంటున్నాడని ఎవరయినా అనుమానిస్తున్నారేమోనని అతని భయం.

భార్య. ఆమె తండ్రితో ఉండిపోవలసి వచ్చిన యీ పరిస్థితి అతనికి ఎంతో మనోవ్యథ కలిగించి ఉండాలి.

అతనికి భార్య అంటే ప్రేమే. మామగారిని కూడా ప్రేమించి, గౌరవించేవాడు. ఆయనను రాజకీయాలలో తన గురువుగా భావించుకునేవాడు. అయితే గౌరవమూ, ఆత్మాభిమానమూ పట్ల మక్కువ ఎక్కువ. అందుచేతనే పార్లమెంటు సభ్యుడుగా ఎన్నిక కాగానే మిగతా సభ్యులందరి మోస్తరుగానే తనకు కూడా అధికార రీత్యా కేటాయించిన ఇంట్లోకి మారిపోయినాడు. అక్కడ ఆయన తన మిత్రులను తీవ్రవాదులయిన (జింజరుగ్రూపు) రాజకీయ సహచరులను కలుసుకునే వాడు. అక్కడే ఆయన స్వలాభపరాయణులను బయటపెట్టే పార్లమెంటు సభ్యుడుగా ఖ్యాతి నార్జించాడు. ప్రజాశ్రేయస్సుకు సంబంధించిన ఏ సమస్యను గురించి అయినాసరే స్వేచ్ఛగా, నిర్భయంగా మాట్లాడగల వ్యక్తిగా పేరు పొందాడు. దేశంలోని అత్యంత ప్రబలమయిన ఉన్నతాధికారంలోగల వ్యక్తులనైనా సరే ఎదుర్కొని వారి బండారం బయటపెట్టడంలో ఆయన వెనుకాడేవాడు కాదు.

ఆయన వేరుగా ఉంటున్నంత మాత్రం చేత భార్యతో పూర్తిగా తెగతెంపులు చేసుకున్నాడని కాదు. ఫిరోజ్ ఆత్మ గౌరవానికీ, స్వతంత్ర రాజకీయ ప్రవృత్తికీ

భంగం కలుగకుండా చేసుకున్న ఏర్పాటు మాత్రమే ఇది. ఇందిరకు తన విధి నిర్వ హణలో విరామం లభించినప్పుడు వారు అటు ఫిరోజ్ నివాసంలోనో, ఇటు తీన్ మూర్తి భవనంలోనో అప్పుడప్పుడు కలుసుకుంటూ ఉండేవారు. పిల్లలు బోర్డింగ్ స్కూలులో చదువుతూండే వారు. వారు సెలవలకు వచ్చినప్పుడు తల్లిదండ్రులు ఇద్దరూ కలిసివెళ్ళి తీసుకొని వచ్చేవారు. అది అత్యుత్తమ మయిన దాంపత్యజీవనం కాకపోవచ్చు. కాని వారుభయులూకూడా బహు హుందాగా ఆ బాధను అనుభవించే వారు. అందుకు కారణాలు పూర్తిగా నిస్స్వార్థ మయినవి.

ఫిరోజ్ గాంధీ ఎల్లప్పుడూ కాంగ్రెసువాదే కాని ఆయన సోషలిజంలో వాస్తవ మయిన నమ్మకం కల కాంగ్రెసువాది. ఆ లక్ష్య సాధనకు కృషిచేస్తూ అందుకు పోరాటం సాగించటానికి కూడా సిద్ధపడిన వ్యక్తి. త్వరలోనే ఆయన పార్లమెంటులో మంచి వక్తగా పేరు పొందాడు. సాధారణంగా ప్రభుత్వంలోని లోపాలను బయట పెట్టే వ్యవహారం ప్రతిపక్షాలకే వదిలివేస్తూంటారు. కాంగ్రెసు పార్టీకి చెందిన పార్ల మెంటు సభ్యులకు పార్టీ అధినాయకులను సవాలుచేసే సాహసం తక్కువ. కాని దీనికి ఫిరోజ్ అపవాదం. 1957 లో ఆయన పెద్ద సంచలనం కలుగజేశాడు. 1½ కోట్ల రూపాయలకు సంబంధించిన, సందేహాస్పదమయిన ఒక లావాదేవీని మంజూరు చేసినం దుకు ఆర్థిక మంత్రిత్వ శాఖపై ఆయన పార్లమెంటు సభలో లంచగొండి తనాన్ని గురించి అభియోగం చేశాడు.

కలకత్తాలోని మార్వాడీ వాయిదా వ్యాపారస్థుడు హరిదాస్ ముంద్రా అధీనంలో గల ఆరు సంస్థలకు చెందిన షేర్లకు గాను జీవిత భీమాసంస్థ నించి ఈ సొమ్ము చెల్లించటం జరిగింది. వాటి బజారు విలువ విషయంలో సందేహం ఏర్పడింది. ఫిరోజ్ ఈ వ్యవహారాన్ని కూలంకషంగా పరిశీలించి సంగతి సందర్భాలను సమ గ్రంగా క్రోడీకరించి బహు కట్టుదిట్టంగా వాదించాడు. దానితో ఈ వ్యవహారాన్ని గురించి బహిరంగంగా విచారణ జరిపించ వలసిందే నని స్పష్టంగా కనపడుతోందని ప్రధానమంత్రికి కూడా నమ్మకం కుదిరింది. ఈ న్యాయ విచారణను న్యాయమూర్తి యం. సి. చాగ్లాకు (ప్రస్తుత విదేశాంగ మంత్రికి) ఒప్పగించారు. బహిరంగంగా జరిగిన ఈ విచారణకు అనేకమంది హాజరయారు. చాగ్లా సంఘం సమర్పించిన నివే దిక ఫిరోజ్ గాంధీ చేసిన అభియోగాలు చాలావరకు నిజమేనని అంగీకరించింది. తన అధికారుల చర్యలకు ఆర్థిక మంత్రి రాజ్యాంగరీత్యా బద్ధుడై ఉండాలి కాబట్టి అప్పటి ఆర్థికమంత్రి రాజీనామా ఇవ్వవలసి వచ్చింది. అవినీతి నిర్మూలనకు కంకణం కట్టు కున్న ఆ యువకునికి అది పెద్ద విజయం.

* * *

ఇది ఇలాఉండగా ఇందిర నిర్విరామ మయిన తండ్రి ప్రజాజీవనంతో ఇతోధి కంగా ప్రమేయం పెట్టుకుంది. ప్రపంచంలోని ప్రముఖ వ్యక్తులందరూ ఒకరి తరువాత

ఒకరుగా 'తీన్‌మూర్తి' భవనాన్ని సందర్శించ సాగారు. 1957 మొదటి మూడు మాసాలలోనే దలైలామా, పంచన్ లామాలతో సహా చౌఎన్‌లై, సిరియా అధ్యక్షుడు షుక్రీ అల్ కువాట్లీ, సోవియట్ యూనియన్‌కు చెందిన మార్షల్ ఝుకోవ్ విచ్చేశారు. అంతర్జాతీయంగా స్పర్థలూ, సమాలోచనలూ నెలల తరబడిగా, ఏండ్ల తరబడిగా సాగుతూనే ఉన్నాయి. సిరియా, స్కాండినేవియా దేశాలూ, హాలెండు, జపాన్‌లలో మళ్ళీ విదేశీ పర్యటనలు జరిగాయి. ప్రతిసారీ ప్రయాణ సన్నాహాలు చేసుకోవడం, వచ్చాక మళ్ళీ తిరిగి సర్దుకోవడం ఇందిరకు విసుగెత్తి పోయింది. విదేశీ పర్యటన అంటే ఎంతో అలసట కలిగించే కార్యక్రమం. కాని ఈ పర్యటనలు ఎంత విజ్ఞాన దాయకమయినవి! (వాటిని పునశ్చరణ చేసుకున్నప్పుడు ఆమెకు ఈ భావం కలిగి మనస్సంతా కృతజ్ఞతతో నిండి పోయేది.)

ఒకనాడు లేఖావళి రూపంలో 'ప్రపంచ దర్శనం' చేయించాడు. ఈ నాడు చరిత్రాత్మక మయిన సన్నివేశాలను గమనించే అవకాశాలు కలుగజేశాడు. అందుకే ఆ కృతజ్ఞత.

ప్రధాన మంత్రి నివాసంలో అంతర్జాతీయ ప్రముఖులకు స్వాగత మివ్వడంలో ఇందిర అలహాబాదు జిల్లాలోని ఫూల్‌పూర్ సబ్ డివిజన్‌లోని గ్రామీణులను విస్మరించలేదు. అది తన తండ్రి నియోజకవర్గం. 1959 ఫిబ్రవరిలో రైలుమీద అలహాబాదు వెళ్ళి ఆ నియోజక వర్గంలో ఒకవారం రోజులు పదయాత్ర జరిపింది. అక్కడ "పండిట్" మూర్తివలెనే "ఇందిరాజీ" కూడా సర్వులకూ సుపరిచితం. ఆ గ్రామాలలో తిరిగేటప్పుడు ఆమెకు కొద్దిగా అభ్యుదయ సూచనలు-అంత కంటే ఎక్కువగా దారిద్ర్య స్తబ్ధతా చిహ్నాలు గోచరించాయి. అందరికీ తిండి, బట్ట, వసతి, విద్య, సంస్కృతి లభింపజేయడానికి ఎంతకాలం పడుతుందోనని ఆమె ఆశ్చర్య పోతూ ఉండేది. ఇవన్నీ వారి కెవరు సమకూర్చగలరా అని ఆలోచించేది.

ఆసమయంలోనే వార్తాహరుడు ఒక టెలిగ్రాం తెచ్చాడు. ఆమెను భారత కాంగ్రెసుకు అధ్యక్షురాలిగా ఏకగ్రీవంగా ఎన్నుకున్నారన్న వర్తమానం అది. ఇది అనుకోని సంఘటన కావడంతో ఆ మారుమూలప్రాంతంలో తన కా సమాచారం అందినందుకు ఆమెకు కొంత చికాకు కలిగింది. తండ్రిని సంప్రదించడానికి కూడా వీలు లేక పోయింది. కాని ఆయనను సంప్రదించాలా? ఆయనను అడిగితే ఏమి చెప్తాడో ఆమెకు తెలుసు.-"తగిన నిర్ణయం తీసుకోగలిగిన ఈడు వచ్చింది నీకు" అని ఉండేవాడు.

తండ్రి లాహోరు కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహించేటప్పటికి ఆయనకు తనకంటె ఒక ఏడాది తక్కువ వయస్సే నన్న సంగతి ఆమెకు జ్ఞాపకం వచ్చింది. వెంటనే తాను కాంగ్రెసు అధ్యక్షపదవిని అంగీకరిస్తున్నట్లు తెలుపుతూ టెలిగ్రాం పంపింది.

# 12

# పాటించవలసిన వాగ్దానాలు

భగవంతుని కంఠధ్వని నుండి
జనించిన దారుణపుత్రీ!
ఓ విహిత ధర్మమా!

—వర్డ్స్ వర్త్

భారతజాతీయకాంగ్రెసు అధ్యక్ష పదవిని అలంకరించిన మహిళలలో ఇందిరా గాంధి నాలుగవది. ఆమెకు పూర్వం 1917 లో అనీబిసెంట్, 1925 లో సరోజినీ నాయుడు, 1933 లో నెల్లీసేన్ గుప్తా ఆ పదవిని అధిష్ఠించారు. ఇక నెహ్రూ కుటుంబంలో కాంగ్రెసు అధ్యక్ష పీఠాన్ని అలంకరించిన వారిలో ఆమె మూడవది. 1919, 1928 వ సంవత్సరాలలో పండిట్ మోతీలాల్ జాతీయ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉండేవాడు. ఇక జవహర్‌లాల్ కాంగ్రెసు పార్టీకి అధ్యక్షుడుగా ఎన్ని తడవలు ఎన్నికయినాడో, ఎన్ని సార్లు వరుసగా ఎన్నికయినాడో ఆయనకే జ్ఞాపకం ఉంటివుండదు.

కాంగ్రెసు అధ్యక్ష పీఠాన్ని అధిష్ఠించిన మిగతా ముగ్గురు మహిళలూ గౌరవ మన్ననలు అందుకోదగినంత వయస్సు వచ్చాకనే ఆ పదవికి ఎన్నిక అయ్యారు. కాని ఇందిర కాంగ్రెసు అధ్యక్షురాలయ్యేసరికి 42 ఏండ్లే. కాంగ్రెసు సంస్థ వర్గాలుగా చీలిపోయే ప్రమాదం ఏర్పడిన తరుణంలో దానిని సంఘటితపరిచి ఆమె సమర్థంగా నిర్వహించగలదా? లక్ష్య సాధనలో, కార్యాచరణలో ఐక్యత లోపించింది. కాంగ్రెసు ప్రతిష్ఠ బహు క్షీణదశలో ఉంది. ప్రతి రాష్ట్ర సంఘంలోనూ, స్థానిక సంఘంలోనూ కూడా చీలికలు ఏర్పడ్డాయి. భాషాపరమయిన వివాదాలలో కాంగ్రెసు వాదులు పరస్పరం విరుద్ధ వైఖరులు అనుసరిస్తున్నారు. గత ఎన్నికల్లో (1957) ఒక రాష్ట్రంలో-కేరళలో—కాంగ్రెసు పార్టీకి మెజారిటీ లభించలేదు. కమ్యూనిస్టులు ఎక్కువమంది ఎన్నికయినారు. తరువాతి ఎన్నికలలో మరికొన్ని రాష్ట్రాలలో కూడా ఓటమి చెందవచ్చు. అట్టి పరిస్థితులలో కాంగ్రెసు అధ్యక్ష పదవికి ఆమె ఎన్నిక కావడం ఒక సవాలేకాదు, అది శిక్షే, అప్పట్లో అధ్యక్ష పదవిని వహించే వారు

ధరించవలసింది గౌరవ ప్రదమయిన కుసుమమాల కాదు-కంటకమయ కిరీటము. కాంగ్రెసు అధ్యక్షురాలుగా జరిపిన మొట్టమొదటి పత్రికా విలేఖరుల గోష్ఠిలో-ఒక్కయేడాదిపాటు తానుండే పదవీకాలంలో కాంగ్రెసువిధానాలను ప్రభుత్వంచేత అమలు జరిపించడం సాధ్యం కావని వాపోయింది.

"ప్రజలు ఎంతో తొందరపడుతున్నారు. మనం కాలయాపన చేయడానికి వీల్లేదు. ప్రజలలో అభ్యుదయం గోచరిస్తున్నంత వేగంగా కాంగ్రెసు పురోగమించ లేదనే నాబాధ'' అన్నదామె.

ఇందిర మాంత్రికురాలు కాదు. ఆమె పదవిలో ఉన్న ఒక్క ఏడాదిలోనూ, కాంగ్రెసు సంస్థలోని లోపాలను సవరించలేక పోయింది. కాని ఆమె చేయ గలిగిన దంతా చేసింది. కనీసం ఆమె వర్గ విభేదాలకూ, భాషాపరమయిన వివాదాలకూ అతీతంగా ఉండగలిగింది. కాంగ్రెసునాయకత్వంలో కూలంకషమయిన మార్పులు చేయడానికి యత్నించింది. తన కార్యవర్గంలో యువజనులకు స్థానం ఇచ్చింది. తన స్వతంత్ర భావాలకు చిహ్నంగానే అయిఉంటుంది, బహుశా-కార్యవర్గంలో చేర్చని వృద్ధుల జాబితాలో తన తండ్రి పేరుకూడా ఉంచె. అయితే ప్రధాన మంత్రిగా కార్యవర్గ సమావేశాలకు ఆయనను ఎప్పుడూ ఆహ్వానిస్తూనే ఉండేవారు.

ఆమె కాంగ్రెసు అధ్యక్షురాలుగా ఎంతో సమర్థంగా, శ్రద్ధగా పనిచేసేదని అఖిల భారత కాంగ్రెసు సంఘ కార్యాలయోద్యోగి ఒకరు అన్నారు. ఆమె పూర్వులవలె పార్టీ వ్యవస్థకు సంబంధించిన సమస్యలను పరిశీలించి అవగాహన చేసుకునేందుకు కొంత సమయాన్ని వినియోగించేది. ఫైళ్లను జాగ్రత్తగా చూసేది. ఉత్తరాలకు జవాబులు వ్రాయించేది. ఆమెకు ఇంటివద్ద ఇదివరకే ఇద్దరు కార్యదర్శులు ఉన్నారు. కాంగ్రెసు ప్రధాన కార్యస్థానంలో ఇప్పుడు ఆమెకు మరో ఇద్దరుకూడా ఉన్నారు. ఆమె దేశం అంతా పర్యటించింది. కాంగ్రెస్ పార్టీ ఏర్పాటుచేసిన బ్రహ్మాండమయిన బహిరంగ సభలలో ఉపన్యాసంచేసింది. చిట్ట చివరికి ఎలాగయితేనేం 'సభాపిరికి తనాన్ని' వదలిపెట్టి ధారాళంగా, సంభాషణ శైలిలో, తండ్రి మోస్తరుగా మాట్లాడడం అలవాటు చేసుకుంది. కాని ఆయనంతగా విషయేతర అంశాలను ప్రస్తావించేదికాదు. ఇంకా ఉపన్యాసాలు మరింత సూటిగా ఉండేవి. కాని ఆమె ప్రసంగాలు ఆయనంత ప్రగాఢ మయినవిగా ఉండేవి కావు. సంఘసమావేశాలకు ఆమె అధ్యక్షత వహించినప్పుడు క్లుప్తంగా, సూటిగా మాట్లాడవలసిందిగా పట్టు బట్టేది. నాయకులలోనూ, మిగతా కార్యకర్తలలోనూ కూడా దొంక తిరుగుడుగా, సుదీర్ఘ ప్రసంగాలు చేసే వక్తలను మర్యాదగానే అదుపులో పెట్టేది.

* * *

ఇందిరాగాంధీ కాంగ్రెసు అధ్యక్షురాలయ్యేసరికి కేరళలో తప్ప మిగతా రాష్ట్రాలన్నింటిలోనూ కాంగ్రెసు మంత్రివర్గాలే ఉండేవి. కేరళలో మాత్రం ఒక్కొక్క

స్థానానికి అనేక పార్టీలు పోటీచేయడంతో ఆ రాష్ట్ర శాసన సభలో మిగతా అందరి కంటె కమ్యూనిస్టు పార్టీకే ఎక్కువ స్థానాలు లభించాయి. అయినా వారికి మొత్తం స్థానాలలో సగానికి తక్కువే లభించాయి. ఐనప్పటికీ వారు వామపక్షభావాలుగల స్వతంత్రుల తోడ్పాటుతో మంత్రి వర్గం ఏర్పాటు చేశారు. చాలా మంది కాంగ్రెసు వారికి ఇది తలకొట్టేసినంత అవమానంగా తోచింది. దేశ వ్యాప్తంగా కాంగ్రెసు పార్టీ సర్వాధికారం చెలాయిస్తూ ఉండే ఒక్క కేరళలో మాత్రం ఇందుకు ప్రతి బంధకం ఏర్పడడం వారికి తీవ్రమయిన అవమానంగా తోచింది. ఎన్నికలలో ఏదో విధంగా తంటాలుపడి తమ్ము ఓడించడమే-అది ఏ పార్టీ అయినాసరే-తమకు పరాభవంగా వారు భావించారు. కేరళలో కమ్యూనిస్టులు అధికారంలోకి రావడం విశిష్టమైన చారిత్రక సంఘటన అనీ, కమ్యూనిస్టు ఛాందసతత్వంలో పరిపూర్ణ పరిణామం వచ్చే అవకాశం ఏర్పడిందనీ వారు గ్రహించలేక పోయినారు. కేరళ ప్రజలు కమ్యూనిస్టులకు ఓటు వేయడం ద్వారా తమ మౌలికమయిన స్థానిక సమస్యలను పరిష్కరించడంలో కాంగ్రెసు మంత్రివర్గాలు విఫలమయినాయని అభిశంసన తెలపడమే కాదు-ప్రపంచ వ్యాప్తంగా తీవ్ర పరిణామాలు దారితీయగలిగిన నూతన అవకాశాన్ని నెలకొల్పారు. ప్రజాస్వామిక విధానంలో భారతదేశంలోని ఒక చిన్న రాష్ట్రంలో మామూలు పద్ధతిలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని నెలకొల్పి దానివి మన నివ్వగలిగినట్లయితే - ప్రజలు తమకు ఇచ్చవచ్చిన ప్రభుత్వాన్ని ఎన్నుకునే హక్కుగల ఇంగ్లండు, అమెరికా, కెనడా, స్వీడన్‌వంటి దేశాలలోనో, ఆమాటకు చెప్పొస్తే మరెక్కడగానీ ఎందుకు ఇలాగే జరుగకూడదు? కేరళరాష్ట్రంలోని పరిస్థితిలోగల తీవ్రపరిణామాలను పూర్తిగా అర్థంచేసుకోగలిగిన వ్యక్తి ఒక్కడు దేశంలో లేకపోలేదు. ఆయనే జవహర్ లాల్ నెహ్రూ.

కమ్యూనిస్టు మంత్రి వర్గం అక్కడ నెలకొన్న తరువాత కొన్ని నెలలకే ఆయన నాతో మాట్లాడుతూ ఈ పరిణామాన్ని తాను హర్షిస్తున్నానని చెప్పాడు. ప్రజాస్వామిక సంస్థలపట్ల భారతీయ కమ్యూనిస్టుల వైఖరిలోనూ, చివరకు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ విధానాలలోనూ పునరాలోచన జరగడానికి ఇది దారితీయగలదని చెప్పాడు. ఇప్పుడు పార్లమెంటరీ ప్రజాస్వామిక విధానాలద్వారా సోషలిజం సాధించవచ్చునని వారు అంగీకరించక తప్పదు.

కాని కమ్యూనిస్టు మంత్రివర్గం అధికారంలోకి వచ్చిన మొట్టమొదటి రోజునే కేరళలోని కాంగ్రెసువారు ఆ మంత్రివర్గాన్ని కూలద్రోయాలని కృతనిశ్చయు లయినట్లు తోచింది. కమ్యూనిస్టు మంత్రివర్గం ఏర్పడిన మూడు రోజులకే కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి రాష్ట్రంలో అరాచకం, అశాంతి ఏర్పడ్డాయని గోల ప్రారంభించాడు. కేరళలో కట్టు దిట్టమయిన వ్యవస్థ కలిగి, మంచి పలుకుబడి, నోరు గల కేథలిక్కులు నూతన మంత్రి వర్గంపై దండెత్తడానికి కంకణం కట్టారు. దురదృష్టవశాత్తూ

కమ్యూనిస్టులుకూడా వారు పన్నిన వలలో పడ్డారు. బాగా ముఖ్యమయిన భూసంస్క-
రణలవంటి శాసనాలను ఆమోదించి అమలు జరపకమునుపే, విద్యా సంస్కరణలను
గురించిన అగత్యాన్ని జనసామాన్యం గ్రహించగలిగిన పరిజ్ఞానం అలవడకమునుపే
విద్యా సంస్కరణల బిల్లును వారు తెచ్చారు. వారికి పాలనా వ్యవహారాలలో అంతగా
అనుభవం లేకపోవచ్చు, వారిలో సహనము, సమయజ్ఞత లోపించి ఉండవచ్చు అని
నిష్పాక్షిక మయిన వ్యక్తులు చెప్పినదానిని బట్టిచూస్తే అంతకు పూర్వం కాంగ్రెసు
మంత్రి వర్గాల హయాంలో కంటె మేలయిన పరిపాలననే వారు సమకూర్చ గలిగారని
కనబడుతుంది.

ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కు సంపాదకుడుగా ఉండిన డి. ఆర్. మంకేకర్—
ఈయన కమ్యూనిస్టులకు ఏ విధంగానూ మిత్రుడు కాడు—కేరళలో కాంగ్రెసు వారిని
గురించి చెప్పింది ఇది: "కార్యకర్తలలో క్రమశిక్షణ లేకపోవడం, ప్రజాజీవనంలో
అనుసరించవలసిన నీతి నియమాలు పాటించక పోవడంవల్ల వోటర్ల దృష్టిలో కాం
గ్రెసు ప్రతిష్ఠ బాగా దెబ్బతిన్నది. దీనికి ప్రతిగా కమ్యూనిస్టులలో కనిపించిన క్రమ
శిక్షణ, కర్తవ్యపాలనదీక్ష వారు గమనించకుండా ఉండలేకపోయినారు" కాకలు
తీరిన కాంగ్రెసువాదీ, అఖిల భారత కాంగ్రెసు సంఘం మాజీ ఉద్యోగీ, ప్రస్తుతం
'సోషలిస్టు కాంగ్రెసువాది' అనే పత్రిక సంపాదకుడూ అయిన హెచ్. డి. మాలవ్యా
కేరళలో కమ్యూనిస్టులు అధికారంలో ఉన్నప్పుడు పర్యటించివచ్చి "కేరళలో 18
మాసాల కమ్యూనిస్టు పాలనపై తీర్పు" అనే శీర్షికను ఒక వ్యాసం వ్రాశారు.
దానిలో ఆయన—

> "కేరళలో అతి ముఖ్యమయిన, అభ్యుదయకర పరిణామాలకు నాందీ ప్రస్తావన జరుగుతోంది. సేద్యం చేసుకునే రైతులను పొలాలలోనించి తొలగించడాన్ని నిషేధించడం (జన్మికర్కారంకు స్వస్తి చెప్పడం). వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు నిర్ణయించడం, వ్యవసాయ సంబంధాల బిల్లులో ఉద్దేశించిన మౌలికమయిన మార్పులూ-మొదలయినవి కేరళలో సాంఘిక, ఆర్థిక పరిణామ వాతావరణాన్ని కలుగజేశాయి. దళిత వర్గాలవారు తలెత్తి తిరుగ గలుగుతున్నారు. కమ్యూనిస్టు మంత్రివర్గం తీసుకునే ప్రతీచర్యవల్లా రోజు రోజుకూ వారు - బహు నెమ్మదిగా అయినా - సమాజంలోని అన్ని వర్గాల వారినీ తమవంకకు తిప్పుకో గలుగుతున్నారు. కేరళరాష్ట్ర భవితవ్యం తమచేతులలో లేదనీ, ప్రభుత్వ కబంధహస్తాలు తమ చెప్పుచేతల్లో లేవనీ కేరళ రాష్ట్ర చరిత్రలో ప్రప్రథమంగా అభివృద్ధి నిరోధకశక్తులకు తెలిసిపోయింది..."

కాని కాంగ్రెసువాది అయిన హెచ్. డి. మాలవ్యా ఈ నివేదిక వ్రాసిన తరు
వాత ఆరు నెలల లోపునే కేరళలో కమ్యూనిస్టులను అధికారంనించి తొలగించడం

జరిగింది. రాష్ట్రపతి పాలన నెలకొన్నది. కొత్తగా ఎన్నికలు జరిపారు. ఆ ఎన్నికలలో కమ్యూనిస్టులకు 1957 లో వచ్చినదానికంటె ఎక్కువ వోట్లు లభించాయి. 1957 ఎన్నికలలో 35% వోట్లు వస్తే ఈ ఎన్నికలలో వారికి 43% లభించాయి. కాని కాంగ్రెసువారు బహు తెలివిగా ఇతర పార్టీలతో కుదుర్చుకున్న ఎన్నికల పొత్తు మూలంగా ముగ్గురేసి అభ్యర్థులమధ్య పోటీ జరగకుండా నివారించ గలిగారు. ఈ పొత్తులు కుదుర్చుకోవడంలో మౌలిక సూత్రాలను కూడా విస్మరించి మత ప్రాధాన్యం గల పార్టీలతో చేతులు కలిపారు. వీరందరికీ కమ్యూనిస్టులను ఓడించడం ఒక్కటే ధ్యేయం. ఫలితంగా రాష్ట్ర శాసనసభలో కమ్యూనిస్టులబలం 60 నించి 29 కి తగ్గింది. దామాషా ప్రాతినిధ్య పద్ధతిని భారత రాజ్యాంగం ఆమోదించి ఉంటే కమ్యూనిస్టులు మరోసారి అధికారంలోకి వచ్చి ఉండేవారు. కాని జరిగింది వేరు. ప్రజా సోషలిస్టు ముస్లింలీగు తోడ్పాటుతో కాంగ్రెసు మంత్రివర్గాన్ని ప్రతిష్ఠించారు. అటువంటి మతోన్మాదంగల పార్టీతో చేతులు కలిపి నెలకొల్పిన ప్రభుత్వం ఇందిరా గాంధీవంటి కాంగ్రెసు అధ్యక్షురాలికి గర్వ కారణం కాదు. ఈ సమస్యపై తన అభిప్రాయాన్ని జవహర్‌లాల్ నెహ్రూ బహిరంగంగా ప్రకటించక పోయినా ఇందు కాయన అంతగా సంతోషించలేదనడానికి కారణాలు ఉన్నాయి.

ఆ ఎన్నికలు జరిగిన 7 ఏండ్లకు నేనొకసారి ఇందిరను కలుసుకుని, "కేరళలో కమ్యూనిస్టు మంత్రి వర్గాన్ని తొలగించి రాష్ట్రపతి పాలన నెలకొల్పవలసిందిగా ఏ పరిస్థితులను ఆధారంగా చేసుకొని కాంగ్రెసు అధ్యక్షురాలుగా మీరు సిఫార్సు చేశారు" అని అడిగాను. వారిని తొలగించమని తాను సిఫార్సు చేయలేదనీ, కాని అక్కడ నెలకొన్న కమ్యూనిస్టు మంత్రి వర్గంపై తీవ్రమైన ఆందోళనలు సాగుతున్న పరిస్థితుల దృష్ట్యా తిరిగి కొత్తగా ఎన్నికలు జరిపించి ప్రజాభిప్రాయాన్ని స్పష్టంగా వెల్లడించే అవకాశం ఇవ్వాలని తాను భావించాననీ జవాబిచ్చింది.

ఇక ముస్లిం లీగ్‌వంటి మతం ప్రాతిపదికగాగల పార్టీలతో కాంగ్రెసు పొత్తు కలపడాన్ని గురించి ఒక అమెరికన్ విలేఖరితో ఆమె ఇలా అన్నదని చెప్పుకుంటారు : "కేరళలో మిగతా పార్టీలకంటె ముస్లింలీగ్ మతోన్మాద పక్షమేమీ కాదు. కేరళలోని పార్టీలన్నీ నాయర్లో, నెస్టోరియన్లో, నంబూద్రీలో, మరో కులంవారో ఏర్పాటు చేసినవే. పేర్లను పూర్తిగా మరిచిపోవాలని అనుకుంటే తప్ప మనం అక్కడ మతం ప్రాతిపదికగాగల పార్టీలతో వ్యవహరించక తప్పదు." కొత్త ఎన్నికలలో కూడా కమ్యూనిస్టులకే శాసనసభలో మెజారిటీ లభించి ఉంటే ఆమె అభిప్రాయం ఎలాఉండేదో చెప్పమని నేనామెను అడిగాను. దానికి ఆమె వెంటనే "దానిని వోటర్ల నిర్ణయంగా నేను శిరసావహించి ఉండేదాన్ని" అని జవాబిచ్చింది.

కేరళ వ్యవహారాలలో ఇందిర జోక్యం చేసుకోవడం ఎంతవరకు వివేకం? అన్న అంశంపై సందేహాలు ఉండవచ్చు; ఉన్నయ్ కూడా. కాని ఆ వ్యవహారం

రాజకీయంగా ఆమె స్థిర చిత్తాన్ని వ్యక్తీకరించింది అనడంలో సందేహం లేదు. ఒక మార్గం అనుసరించడం మంచిదని ఆమెకు నమ్మకం కుదిరినప్పుడు ఆమె దానిని వెనకా ముందూ చూడకుండా అమలుజరిపింది. కేరళ వ్యవహారంలో తానెన్నడూ తన తండ్రిని సంప్రదించలేదని ఆమె అంటున్నది. ఇది ఆశ్చర్యమే కావచ్చు, కాని బాగా నమ్మదగినదే. ఎందుచేతనంటే నిజంగా ఆమె ఆయనను సంప్రదించే ఉంటే ఆయన వ్యతిరేకమయిన సలహా ఇచ్చి ఉండేవాడని కొందరివాదం. వివేకమయినది కానీ, కాకపోనీ అది ఆమె స్వయంగా చేసిన నిర్ణయం. అట్టి నిర్ణయం తీసుకుని దానికి కట్టుబడి ఉండగల ధైర్యం ఆమెకు ఉంది.

మరో వ్యవహారంలో ఆమె జోక్యం చేసుకుని నిర్ణయం చేయించిన విధానం ప్రజాభిప్రాయానుగుణ మయినది. అప్పట్లో బొంబాయి రాష్ట్రం (మహారాష్ట్ర, గుజరాత్) ద్విభాషా రాష్ట్రంగా ఉండేది. రాజ్యాంగం ఆమోదించిన భాషారాష్ట్రాల సూత్రం ప్రాతిపదికగా మహారాష్ట్రను ఏకభాషారాష్ట్రంగా రూపొందించాలనీ, గుజరాత్‌ను ప్రత్యేకరాష్ట్రంగా చేయాలనీ మహా శక్తివంతమైన ప్రజా ఉద్యమం అక్కడ బయలుదేరింది. ప్రజల ఉద్వేగాలను రెచ్చగొట్టడం జరిగింది. దౌర్జన్య పూరితమయిన ప్రదర్శనలూ, అల్లర్లూ బయలుదేరాయి. కొందరు అనుభవజ్ఞులైన కాంగ్రెసు నాయకులు, ఒకప్పుడు జవహర్‌లాల్ నెహ్రూతో సహా, దేశాన్ని ఇక చీలనీయరాదని ప్రతిఘటించారు. భాషా సూత్రాన్ని చివరిదాకా అతిగా వర్తింపజేస్తే విచ్ఛిన్నకరధోరణులు ప్రబలుతాయని వారి భయం. కాని కాంగ్రెసు ప్రభుత్వం ద్విభాషా బొంబాయి రాష్ట్రానికి కట్టుబడి ఉండడంవల్ల ప్రజాదరణను కోల్పోతోందని అభ్యుదయ నిరోధక శక్తులూ, మతభాషాసంకుచిత వర్గాలూ ఈ పరిస్థితిని స్వప్రయోజనానికి వినియోగించుకోడానికి సిద్ధంగా ఉన్నాయని ఇందిర గ్రహించింది. ద్విభాషా రాష్ట్రాన్ని విడగొట్టడం తప్పనిసరేకాక వాంఛనీయం కూడానని ఎప్పుడయితే గ్రహించిందో అప్పుడామె తన ప్రతిపాదనను కాంగ్రెసుచేత ఆమోదింప జేయడానికి తగు చర్యలు తీసుకోవడంలో ఎంతమాత్రమూ కాలయాపన చేయలేదు. ఫలితంగా గుజరాత్, మహారాష్ట్రలు ఏర్పడ్డాయి. ప్రతి పక్షాలవారు కొంతవరకు నిరాయుధులైనారు.

* * *

ప్రజలు తమ నాయకుల బాహిరస్వరూపాన్ని మాత్రమే తిలకిస్తారు. బహిరంగ సమావేశాలలో వారిని చూస్తుంటారు. వారి ఉపన్యాసాలు వింటారు. కాని వారి ఆంతరంగిక స్వరూపాన్ని దర్శించే అవకాశం బహుఅరుదు. వారి ఆంతరంగిక స్వరూపం వేరనీ, వ్యక్తిగత సమస్యలకూ, ఆందోళనలకూ, మానవసహజంగా వారు కూడా లోనవుతుంటారనీ గ్రహించడం సకృత్తు.

ఫిరోజ్, ఇందిర ఇద్దరూ కూడా తమ తమ కార్యరంగాలలో నిర్విరామంగా కృషిచేస్తూండేవారు.పార్లమెంటులో తనఅభిప్రాయాలను నిర్భయంగా,తీవ్రంగా వ్యక్తం

చేసే సభ్యుడుగా ఆయనా, అటు కాంగ్రెసు అధ్యక్షురాలుగా, ఇటు తండ్రికి సంరక్షకురాలుగా, అంతరంగికురాలుగా ఆమె నిర్విరామజీవితాన్ని గడిపేవారు. ఆరోజులలోనే ఫిరోజుకు మొదటిసారిగా గుండెపోటు వచ్చింది. ఆయన ఎంతో ఆరోగ్యంగా, చైతన్యవంతంగా, ఉత్సాహంగా కనపడేవాడు. ఆయనకు హృద్రోగం ఉన్నదని గానీ, అది తీవ్రమయిన వ్యాధిగా పరిణమిస్తుందని గానీ ఎవ్వరూ అనుమానించలేక పోయినారు. ఈ వార్త తెలియగానే ఇందిర హుటాహుటి ఆయన వద్దకు పరుగెత్తింది. ఆయన నెమ్మదిమీద కోలుకునేవరకూ ఆమె రాత్రింబవళ్ళూ విపరీతమయిన ఆందోళన చెందింది. డాక్టర్లు ఒప్పుకున్నాక ఆయననూ, పిల్లల నిద్దరినీ విశ్రాంతికోసం కాశ్మీరుకు తీసుకువెళ్ళింది. అక్కడి ఆరోగ్యకరమయిన వాతావరణమూ, ఆయన సంకల్పబలమూ, త్వరగా కోలుకునేందుకు తోడ్పడ్డాయి. ఆయన త్వరితంగా ఆరోగ్యవంతుడు కావడానికి తన కుటుంబంతో పునస్సమాగమం కూడా దోహదమయింది. అనేక సంవత్సరాలు రాజకీయాలలో తలమునకలయిన ఆ దంపతులకు అది ద్వితీయ ప్రణయయాత్రగా భాసించింది.

విధినిర్వహణ భారం వారి భుజస్కంధాలపై ఉండడంచేత వారు తిరిగి మైదాన ప్రాంతాలకు వచ్చి వెనకటి జీవనంలో నిమగ్నులయ్యారు. అదే సమయంలో అంతర్జాతీయ రంగంలో దుశ్శకునాలు ఎన్నో పొడసూపాయి. దలైలామా భారత దేశానికి పారిపోయి రావడంతో చైనా-భారతదేశాల సంబంధాలలో నూతన అధ్యాయం మొదలయింది. చైనా అంతకంతకూ శత్రుత్వాన్ని వహించి బెదరింపులకు దిగడం మొదలు పెట్టింది అతి సున్నితమయిన జవహర్‌లాల్ మనస్సు ఇందువల్ల ఎంతో క్షోభించింది. కాంగ్రెసు అధ్యక్ష పదవిని మరోసారి అధిష్ఠించవలసిందిగా పదే పదే వచ్చిన విజ్ఞాపనలను ఇందిర త్రోసి పుచ్చింది. ఆ సంవత్సరాంతంలో ఆమె పదవీవిరమణ చేసింది. కాంగ్రెసు బహిరంగ సమావేశానికి ఒక్కసారికూడా అధ్యక్షత వహించకుండా, అధ్యక్షపీఠాన్నుంచి, లాంఛనప్రాయంగానైనా, ప్రసంగాన్ని చదవకుండానే, పదవిని విరమించిన మొట్టమొదటి కాంగ్రెసు అధ్యక్షురాలు ఆమె. తండ్రి బహు సంకట పరిస్థితిలో ఉన్నాడనీ, అప్పుడు తన అవసరం ఆయనకు ఎంతగానో ఉన్నదనీ కూతురుగా గ్రహించగలిగింది. అటు ఫిరోజు తన ఆరోగ్యాన్ని లెక్కచేయకుండా అత్యంత శ్రమతో కూడిన పార్లమెంటరీ కార్యకలాపాలను యథాప్రకారం చేపట్టాడు.

1960 వ సంవత్సరం సెప్టెంబరు నెలలో ఆయనకు రెండోసారి గుండెపోటు వచ్చినప్పుడు ఆందోళితమనస్కయైన ఇందిర ఆయన ప్రక్కనే ఉండి సేవచేసింది. అందుబాటులో ఉన్న అత్యంత సమర్థులయిన డాక్టర్లను నియమించి గృహిణిగా రాత్రింబవళ్ళూ సేవచేసింది. కాని ఈ సారి గుండెపోటు బాగా తీవ్రంగా రావడంతో తాను నమ్మిన దానికోసం దీక్షాసక్తితో పనిచేసే ఆ యువకుడు తట్టుకోలేక పోయి

నాడు. ఇందిర దుఃఖవివశురా లయింది. అనేక రోజులు, వారాలు ఆమె పూర్తిగా విభ్రాంతిలో మునిగి పోయింది. ఒక స్నేహితురాలికి వ్రాస్తూ—

"సర్వమూ కోల్పోయినట్లుగా ఉంది. నిరాశానిస్పృహలతో, అంతరంగికంగా మృతజీవితం గడుపుతున్నాను" అని తన మనోభావాలను వెళ్ళబోసుకుంది. ఎప్పుడూ జనసమూహాలలో, వారి దృక్కుల మధ్య జీవితం గడిపే ఆ ప్రజాహితజీవి అనుభవించే విషాదకరమయిన ఒంటరితనం అప్పుడు పరాకాష్ఠ నందుకుంది.

మరణించిన వ్యక్తి సామాన్యుడు కాడు. అత్యంత చైతన్యవంతమయిన దేశంలో బాగా వృద్ధిలోకి రావలసిన యువకుడయిన రాజకీయవాది ఆయన. ఎన్నో ఉన్నత పదవులకు ఆయనను నియమించే ఆలోచన ఉన్నట్లు వినపడుతూండేవి. రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ వంటివారే ఆయనకు జోహారులు అర్పిస్తూ—

"ఇటీవలి కాలంలో - ముఖ్యంగా మరణించే ముందు - ఫిరోజ్ గాంధీ పార్లమెంటులో మహాశక్తివంతుడయిన సభ్యుడుగా ఉండేవాడు. ఏ విషయాన్ని తీసుకున్నా దానిని గురించి ఎంతో కష్టపడి శ్రమించి అనిపించుకునే వాడు. అటువంటివాడు అంత చిన్న వయస్సులో గతించడం దురదృష్టం. పని కాలాలపాటు జీవించివుంటే నిజంగా ఎంతో ప్రముఖస్థానాన్ని అలంకరించి ఉండేవాడు" అన్నారు.

'నేషనల్ హెరాల్డు' దినపత్రిక సంపాదకుడు యం. చలపతిరావు అనేక సంవత్సరాలపాటు ఫిరోజ్‌తో పరిచయం ఉండి కలిసి పని చేసిన అనుభవంతో ఆయనను గురించి ఇలా అన్నాడు :

"ప్రపంచంలో అందరికీ విదితమై, పేరు ప్రతిష్ఠలు తెచ్చిపెట్టిన ఆయనలోని గుణసంపదను నేను ఏనాడో గ్రహించి గౌరవించేవాణ్ని. ఈ గ్రహింపు మరొకదానికి దారితీసింది. ఆయనలోని పట్టుదల, ధైర్యం, అందమయిన ఆకర్షణ గ్రహించిన మొదటివ్యక్తి ఇందిర. అతని విషయంలో ఆమె ఒక నిర్ణయానికి రావడంలో పొరపాటేమీ చేయలేదు. ఒక బ్రహ్మాండమయిన వ్యక్తిగా రూపొందదగిన ఫిరోజ్ చివరివాకా తన వ్యక్తిత్వాన్ని పూర్తిగా ప్రపంచానికి తెలియనీయకుండా దాచిపెట్టుకుంటూనే వచ్చాడు". కొన్ని సంవత్సరాల తరువాత, ఇందిరకూడా, తన జీవితంపైన విశిష్ట మయిన ప్రభావాన్ని ప్రసరింపజేసిన కొద్దిమంది మహావ్యక్తులలో తన భర్తకూడా ఒకరని నాతో అన్నది.

* * *

చిన్నతనంలోనే వైధవ్యం ప్రాప్తించిన ఆమెకు ఎక్కువగా, మరీ ఎక్కువగా, అంతకంటేనూ ఎక్కువగా, శ్రమించి పనిచేయడంకంటే ఊరట పొందేందుకు మార్గాంతరం ఏముంది? పార్టీ అభ్యర్థులను ఎన్నికచేసే కాంగ్రెసు కేంద్ర ఎన్నికల

సంఘానికి ఆమె సభ్యురాలుగా ఎన్నికయింది. కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డులో కూడా ఆమె సభ్యురాలు. ఈ హోదాలలో ఆమె కష్టించి, శ్రద్ధతో పనిచేసింది. మరునటి సంవత్సరం ఆమె మళ్ళీ తండ్రి ననుసరించి వెళ్ళి అమెరికాలో 10 రోజులు పర్యటించింది. యవ్వనదశలో (1949 లో) పర్యటించిననాటి ఉత్సాహం ఇప్పుడామెలో ద్విగుణమయింది.

అనేక సంవత్సరాల తరువాత 1962 లో మరొకసారి మతకల్లోలాలు బయలుదేరాయి. ఈసారి అవి జబల్‌పూరులో జరిగాయి. గమనార్హమయిన సంగతి ఏమిటంటే కాంగ్రెసు నాయకులందరిలోకీ ఇందిరే ముందుగా తనంతట తానుగా అక్కడికి ఉరికింది. మతోన్మాదులు కల్పించిన కలుషిత వాతావరణాన్ని పరిశుద్ధంచేసి భయాందోళితులయిన ముస్లిం అల్పసంఖ్యాకవర్గంవారికి రక్షణ కల్పించేందుకే ఆమె అక్కడికి పరుగెత్తింది. జబల్‌పూరుకు చెందిన వృద్ధుడొకడు తాము అత్యంత భీతావహులై ప్రాణభయంతో కొట్టుమిట్టాడుతున్న సమయంలో "స్వర్గాన్నించి దిగివచ్చిన కారుణ్యమూర్తి"వలె ఇందిర సిరాయిధురాలై అవతరించి, తమకు రక్షణ కలుగజేసిందని నాకు వివరించి చెప్పారు.

పార్లమెంటు సభ్యురాండ్రు శ్రీమతి సుభద్రాజోషి, బేగం అనీస్ కిద్వాయ్ కూడా జబల్‌పూరుకు హుటాహుటి వెళ్లారు. అక్కడికి చేరుకున్నాక వారికి ఇందిర అంత క్రితమే వచ్చినట్లు తెలిసింది. భీతావహులయిన అల్ప సంఖ్యాక వర్గంవారికి హామీయిచ్చి స్థానిక పోలీసుల హృదయాలలో దైవభీతి, పాపభీతి కలుగజేసి, పరిస్థితిని తండ్రికి నివేదించేందుకు అప్పుడే తిరిగి వెళ్లిందని కూడా వారు తెలుసుకున్నారు. ఆమె తిరిగి వెళ్ళేముందు అక్కడి ప్రజలతో "మీరు మళ్ళీ ఏదయినా కొత్త ప్రమాదం ఎదురైతే నాకు కబురంపండి" అని చెప్పి ఆమె వెళ్ళినట్లుకూడా తెలిపింది.

ఆ తరువాత అనేక నెలలవరకూ జబల్‌పూరులోని ప్రజల యోగక్షేమాలు ఎప్పటి కప్పుడు తెలుసుకుంటూనే ఉండేది. అక్కడినించి ఆమెకు ఉత్తరాలు వస్తూండేవి. ఆమె జవాబిస్తూండేది. ఆ అమానుష మయిన క్రూరహింసాకాండను ఇందిరకు నివేదించిన ముస్లిం విద్యార్థిని ఒకరు మతోన్మాదులు తన్ను బెదిరిస్తున్నట్లు ఇందిరకు వ్రాసింది. ఆమెకు అవసరమయిన రక్షణ అంతా కల్పించవలసిందిగా కోరుతూ ఇందిర తక్షణమే స్థానిక అధికారులకు వ్రాసింది.

అక్కడి స్థితిగతులను గురించి కుమార్తె చెప్పగా విన్నప్పుడు జవహర్‌లాల్ నెహ్రూ బాగా దిగులుపడి పోయాడు. మత ప్రాధాన్య రహితమయిన భారతదేశాన్ని గురించి తాను కన్న కలల ఫలితం ఇదేనా? ఇంతకంటేనూ ఆయనకు విభ్రాంతి కలిగించిన మరొక సన్నివేశం — అనేక సంవత్సరాలుగా కవ్వింపుధోరణిలో బెదిరిస్తూ వచ్చిన చైనీయులు భారతదేశంపై దండెత్తడం. ఆయనను అంతగా బాధించిన

సంగతి: భారత భూభాగంపై జరిగిన దాడి కామన్‌ఆదిలో కొంత పరాజయం చెందినా చివరకు మన సైన్యాలు తిప్పి కొడతాయని ఆయనకు తెలుసు: చైనావారి నమ్మక ద్రోహం, మిత్రద్రోహం గుండెలో కత్తి పోటుగా పరిణమించాయి. కొన్ని రోజుల్లోనే ఆయన బాగా వృద్ధుడయినట్లు కనిపించింది. ఆయన లోని అప్రతిహతమయిన సంకల్పబలాన్ని కూడగట్టుకుని ఈ సవాలును ఎదుర్కొన్నా, వెనకటి ఆశాభావం, ఉత్సాహం జవహర్‌లో మాపుమాసిపోయాయి.

ఇందిరకు సహజంగా తండ్రిని గూర్చిన ఆదుర్దా ఎక్కువయింది. కాని ఆయన మాత్రం జాతీయరక్షణకు ప్రజలను సమీకరించే సమస్యపట్ల ఎక్కువ శ్రద్ధ వహించ వలసిందిగా ఆమెను హెచ్చరిస్తూనేఉండేవారు. ఆమె అగ్రశ్రేణికి వెళ్లి, అక్కడి జవాన్లకు సుఖసంతోషాలకూ శ్రేయస్సుకూ తగిన ఏర్పాట్లు చేసింది. పౌరరక్షణ సమితి అధ్యక్షురాలుగా ప్రజలలో మనోనిబ్బరం సడలనివ్వకుండా ఆమె నిర్విరామంగా పాటుబడింది.

పోరాటం యుద్ధవిరమణకు దారితీసింది. ప్రధానమయిన దురాక్రమణ వెల్లువ తిరోగమించింది. అయినా జవహర్‌లాల్ ఆత్మబలానికి తగిలిన గాయాలు మాన లేదు 1964 వ సంవత్సరం జనవరినెలలో జరిగిన భువనేశ్వర్ కాంగ్రెసు సమావేశంలో ఆయన హఠాత్తుగా అస్వస్థులయినారు. ఇందిర ఆయనకు నాలుగు నెలల పాటు సేవచేసింది. నెమ్మదిగా మందలించి డాక్టర్లు చెప్పినట్లు నడుచుకునేటట్లు చేసేది. పరిణామాలను ఎప్పటికప్పుడు ఆయనకు నివేదిస్తూండేది. మే నెలనాటికి ఆయన గట్టు రోజులందంచి బయట పడ్డట్టే కనిపించారు. ఆఫీసు కాగితాలూ, ఫైళ్ళు చూసుకోవడం కూడా మొదలుపెట్టారు. మే 26 వ తేదీ రాత్రి బకాయి ఉండిపోయిన పనంతా పూర్తిచేసి, "పనంతా పూర్తయి పోయిందనుకుంటాను" అని చెప్పి పడుకున్నాడు. ఉదయం ఆయన మళ్లీ వివశుడై పడిపోయినారు. మళ్ళీ స్పృహరానే లేదు. తనను ఎప్పుడూ అంటిపెట్టుకుని ఉండే కూతురి సమక్షంలో ఆయన కన్నుమూశారు. ఆయన వ్రాసుకునే బల్లపైన, ఉత్తరాలు వ్రాసుకునే పాడ్‌పై రాబర్టు ఫ్రాస్టు పద్యం ఒకటి గిలికిఉంది:

> "ఈ కీకారణ్యాలు దట్టమై అందంగా కనిపిస్తున్నాయి.
> కాని నేను అన్నమాట నిలబెట్టుకోవాలి.
> విశ్రాంతి తీసుకునేముందు ఎన్నోమైళ్ళు పయనించాల్సి వుంది"

ఆయన మరణానికి దుఃఖవివశురాలు కాకపోతే ఆమెలో మానవత్వం లోపించిందనుకోవచ్చు. ఆమె శోకమూర్తియై, గంటల తరబడి ఆయన ప్రక్కన ఆసీనురాలై, శూన్య దృక్కులతో, క్రమంగా మృత్యుచ్ఛాయలు ఆవరిస్తున్న తన ప్రియతమ మయిన తండ్రి ముఖాన్ని చూస్తూ ఉండిపోయింది. ఆ ఇంటిలోని మిగతా

అందరివలెనే, దేశంలోని అనేకమంది ప్రజలవలెనే ఆమెకూడా రాత్రంతా శవజాగరం చేసింది.

భారత జాతికీ, ఇందిరకూ కూడా నెహ్రూలా కరవయిన ప్రథమ దివసం అది. సూర్యోదయం కాగానే ఆమె కూర్చున్న చోటునించి లేచి క్రిందికి వెళ్లింది. 24 గంటలుగా ఆమెకు తిండిలేదు. అప్పుడూ ఆమె ఏమీ తిననేలేదు. కాని ప్రధాన మంత్రి ఇంట్లోని సిబ్బంది అందరికీ ప్రాతఃకాల భోజనం తయారు చేయవలసిందిగా వంటవారిని ఆజ్ఞాపించింది. గడ్డాలు చేసుకుని, శుభ్రంగా స్నానాలుచేసి భోజనంచేసి శుభ్రమయిన దుస్తులు వేసుకుని అంత్యక్రియలకు తయారు కావలసిందిగా ఆమె వారిని ఆదేశించింది. "తన తుది ప్రయాణంలో మీరందరూ ఈలాగ అసహ్య కరమయిన ఆకృతులతో అనుసరించడం నాన్నకు ఇష్టం ఉండదని మీకు తెలుసుగా" అన్నది.

హఠాత్తుగా ఆమెభుజస్కంధాలపై నూతన బాధ్యతలు పడ్డట్టు కనిపించింది. ఎన్నో "మైళ్ళు" ప్రయాణంచేసి, ఆయన "దట్టమయిన సుందరకీకారణ్యాలలో" చిర విశ్రాంతి తీసుకుంటున్నాడని, ఆయన ఇచ్చిన మాటకు కట్టుబడి ఉండవలసిన విధి తనపై ఉన్నదని ఆమెకు తెలుసు!

# 13

## శిక్షణా కాలం

> మనది సర్వసత్తాక ప్రజాస్వామిక వ్యవస్థ. దేనికైనా ప్రజలను బోధించాలి గాని, నిర్బంధించ కూడదు. విద్యద్వారాను, బోధనల ద్వారాను వారి దృక్పథాలలో మార్పులు తీసుకొని రావాలి.
>
> —ఇందిరా గాంధీ

ఢిల్లీలోని 'సోషలిస్టు కాంగ్రెసువాది' అనే పత్రిక వెలువరించిన "సోషలిజం సాధనకు నెహ్రూ మార్గం" అనే ప్రత్యేకసంచికకు ఇందిరాగాంధీ 1965 మే 27 వ తేదీన ఒక సందేశం పంపింది:

> "ఒక ఏడాదిక్రితం ఆయన మనల్ని విడిచి వెళ్లారు. కాని ఆయన ఆత్మ మనలోనే ఉంది. మనలను ఉత్తేజపరుస్తూ ఇకముందుకూడా ఉంటుంది కూడాను. మనం వేసే తప్పటడుగులను సరిదిద్దుతూ, మనకు చేయూత నిస్తూ మనలోనూ, మన ప్రజానీకంలోనూ విశ్వాసం పెంపొందించుకోవడంలో తోడ్పడుతూనే ఉంటుంది. ఆయన పవిత్ర సంస్మరణకు అర్హులం కావడానికి ప్రయత్నిద్దాం. భారతదేశాన్ని పరిణతి చెందిన దేశంగా, అభ్యుదయ దేశంగా తీర్చి దిద్దాలన్న ఆయన కలలు యథార్థం చేసే బ్రహ్మాండమైన కృషికి మనం అంకితుల మవుదాము."

ఆయన స్మృతి మాత్రమే మనకు మిగిలిం దింక. కాని ఆ స్మృతి కోట్లాది హృదయాలలో నిత్యనూతనమై భాసిస్తూనే ఉంటుంది. జవహర్‌లాల్ నెహ్రూ ప్రవచించిన సూత్రాలు భారతదేశంలో ఇంకా చెలామణిగానే ఉన్నాయి. ఆయన వారసులు స్వరూపాన్ని కించపరచేందుకు ఆ మహాపురుషుని వ్యక్తిత్వాన్ని ఇంకనూ వినియోగిస్తూనే ఉన్నారు. లాల్‌బహదూర్ శాస్త్రి—సరళ, వినయ, సద్భావ మూర్తి యయిన 'శాస్త్రీజీ'—ఇంకా 'పూర్తివ్యక్తి' త్వాన్ని పొందలేదు. తాష్కెంటుకు

ప్రయాణమై శాంతి సాధనలో తన ప్రాణాలను అర్పించిన నాటికి ఆ వ్యక్తిత్వం మహోన్నత పర్వతశృంగ సదృశమై దీపించింది.

భారత ప్రభుత్వ మంత్రివర్గంలో నెహ్రూ వంశీయు లొకరు ఉన్నారు. ఆమె ఇందిరాగాంధీ-రేడియో, సమాచారశాఖమంత్రి. తండ్రి మరణించిన వెంటనే ఆమె మంత్రివర్గంలో చేరలేదు. ఆమె ఆ పదవిని మరి కొన్నాళ్ళకు చేపట్టింది. మంత్రి వర్గంలో ఆమెది నాలుగవస్థానం. ఆ పదవి ఆమెకు పరిపూర్ణమయిన సంతృప్తి నిచ్చింది.

ఇదికూడా ఆమె పొందిన శిక్షణలో ఒక భాగమే. సమాచారమంత్రిత్వశాఖ అంతగా ముఖ్యంగాని శాఖలలో ఒకటి. దేశవ్యవహారాల మంత్రివలె పోలీసులపై అధికారంకాని, ఆర్థిక మంత్రివలె సొమ్ము మంజూరు చేసే అధికారం కానీ ఈ మంత్రికి ఉండవు. లైసెన్సులూ, పర్మిట్లూ వాణిజ్య మంత్రిత్వశాఖవారు జారీ చేస్తారు. ప్రపంచంలో ఎక్కడికి వెళ్ళాలన్నా వైదేశిక వ్యవహారాల శాఖవారి అను మతి కావాలి. కాని ఇందిరకు రేడియో—సమాచార మంత్రిత్వ శాఖలో. పనిచేసుకో వడానికి అనువయిన అనుకూల వాతావరణం గోచరించింది. ఆమె విచక్షణాత్మ కంగా సినిమాలను చూసి ఆనందించగలదు. కళాత్మకమయిన పౌరాణికచిత్రాలపట్ల ఆమెకు అభిరుచి మెండు. ఫిలిమ్ సొసైటీ ఉద్యమంతో కొన్నిసంవత్సరాలు ఆమెకు సన్నిహిత సంబంధం ఉండేది. మొదట్లో ఆ సంఘం అధ్యక్షురాలుగానూ, దరిమిలా సత్యజిత్‌రాయ్ అధ్యక్షుడుగా ఉన్నప్పుడు దానికి ఉపాధ్యక్షురాలుగానూ ఉండేది. కళాత్మకమయిన చిత్రాలను ప్రజలు ఆనందించ గలిగే విధంగా వారికి అభిరుచి కలుగ జేయవలసిన అవసరాన్ని ఆమె గుర్తించడమే ఈ విధంగా ఫిలిమ్ సొసైటీతో సంబం ధం పెట్టుకోవడానికి కారణం. మంత్రిగా ఆమె తనకు గల కళాభిరుచితో, విశాల దృక్పథంతో తన మంత్రిత్వశాఖ నిర్వర్తించే సినిమా, నాటక, సంగీత, నృత్య ప్రసార కార్యకలాపాలను మరింపుకటి సవ్యమయిన మార్గంలో నడిపించే అవకాశం ఏర్పడింది. ఫిలింసెన్సార్ విషయంలో ఆమెకు "స్వేచ్ఛా చిత్రాలు" రావాలని కోరే వారికంటేనూ కూడా విశాలమయిన దృక్పథం ఉంది. ఫిలిం సెన్సార్ విషయాల మండలి విపరీతమయిన నైతిక దృక్పథాన్నీ, నిక్కచ్చియైన నిబంధనలనూ పాటించ కుండా ఆమె కొంతవరకూ ఉదారవైఖరినే అవలంబింపజేసింది. ఈ విధానాన్ని అమలు జరిపేందుకు కళాభివృద్ధి సాధనగా సినిమాను తీర్చి దిద్దడంలో అనుభవమూ, పరిజ్ఞానం గల స్త్రీపురుషులను ఈ సెన్సార్ విషయాల మండలిలో సభ్యులుగా నియ మించాలని ఆమె సిఫార్సు చేసింది. ఆమె సూచించిన వారిలో ఫిలింసొసైటీ ఉద్య మంతోసంబంధం గల ప్రముఖ కార్యకర్తలు కూడా చాలామంది ఉన్నారు.

ప్రజలకు విజ్ఞాన వినోదాలను సమకూర్చే సాధనంగా టెలివిజన్‌ను ఉపయో గించేందుకు చక్కని అవకాశాలు ఉన్నట్లు ఆమె గ్రహించింది. భారతదేశంలో టెలి

విజను కార్యక్రమాలు ఒక క్రమమయిన పద్ధతిలో ప్రసారం చేయించడానికి ఆమె అత్యధిక ప్రాధాన్యం ఇచ్చింది. ఆమె అనుమతితోనే న్యూఢిల్లీలోని టెలివిజను కేంద్రంవారు కుటుంబనియంత్రణ పథకం మేరకు సంతాననిరోధక విధానాలను అనుసరించడం ఎలాగో గ్రామీణ మహిళలకు తెలియజెప్పే విజ్ఞానాత్మక రూపకాన్ని ప్రసారం చేశారు. సంగతి సందర్భాలను నిష్కర్షగా తెలియజెప్పే సాహసోపేత మయిన కార్యక్రమం అది.

మంత్రిగా ఆమె తన వద్దకు వచ్చిన ప్రతి ఫైలునూ ఒక పద్ధతి ప్రకారం, అతి శ్రద్ధతో పరిశీలించేదని సమాచార మంత్రిత్వ శాఖ ఉన్నతోద్యోగి ఒకరు నాతో అన్నారు. కాగితాలపైన మార్జిన్లలో ఆమె వ్రాసే అంశాలు (తన పరిశీలనలోకి వచ్చిన విషయాలపట్ల ఆమె తనకు గల అత్యాశ్చర్యకరమయిన పరిజ్ఞానాన్ని వ్యక్తం చేసేది) మెప్పుదలను సూచించేవిగానో, విమర్శనాత్మకమయినవిగానో ఉంటూండేవి. ఎవరయినా ఒక ఉద్యోగి చక్కని "నోట్" తయారుచేశాడని ఆమెకు అనిపించి నప్పుడు ఆ ప్రక్కనే గిలికే తన వ్యాఖ్యల ద్వారా తన సంతృప్తిని వ్యక్తం చేయ డంలో ఎన్నడూ వెనకాడేది కాదు. సచివాలయ సిబ్బంది విషయంలో ఆమె ఎంతో సాధుస్వభావంతో ప్రవర్తించేది. కాని రాత్రి పొద్దుపోయిందాకా పని చేయిస్తూం డేది. ఉద్యోగుల అభిప్రాయాలూ, సలహాలపట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరిచేది. కాని చివరికి తనకు తోచిన నిర్ణయాలను మాత్రమే చేస్తూండేది. తండ్రిమోస్తరుగానే ఆమె కూడా ఫైళ్ళను ఎన్నడూ ముదిగపెట్టేది కాదు. రోజూ సాయంత్రం ఆఫీసు నించి ఇంటికి వెళ్లేముందు ఆవేళటి పనంతా పూర్తి చేయడానికి ప్రయత్నించేది.

తనకు పంపిన ఫైళ్ళను ఎంత చురుకుగా చూసి పంపేదో ఆ మంత్రిత్వశాఖ లోని ఉద్యోగి ఒకరు నాకు చెప్పారు "మిగతా మంత్రులు రోజుల కొలదీ పేర బెట్టే ఫైళ్లను ఆమె నిమిషాలమీద చూసి తన అభిప్రాయాలను వ్రాసి తిరిగి పంపేది. అనేక కాగితాలతో కూడిన ఒక ఫైలును ఆమెకు మధ్యాహ్నం సరిగ్గా 12 గంటలకు పంపాము. 12-10 గం. కల్లా ఆమె దానినంతా చదివి సెక్రెటరీకి కబురంపింది. 12-20 కల్లా విషయాన్ని సమగ్రంగా చర్చించి ఒక నిర్ణయానికి వచ్చింది." కేవలం ఫైళ్ళను తిప్పి పంపడంతోనే ఆమెఆసక్తి అంతరించేది కాదు. చేసిన నిర్ణయాలను సరిగ్గా అమలు జరిపారా లేదా అని పరిశీలించుకోవలసిన అగత్యాన్ని కూడా ఆమె గుర్తించింది. తన మంత్రిత్వ శాఖకు సంబంధించిన కార్య కలాపాలలో రాజకీయ మయిన దురభిమానాలకు గానీ, ఒత్తిళ్ళకు గానీ లోనయ్యేదికాదు. టెలివిజన్ కేంద్రాన్ని నెలకొల్పవలసివచ్చినప్పుడు అటు పశ్చిమ జర్మనీ, ఇటు తూర్పు జర్మ నీలనించి అవసరమయిన పరికరాలను తెప్పించడానికి ఆమె సంతోషంతో సమ్మ తించింది. శక్తివంతమయిన ప్రసార యంత్రం అవసరమని తోచినప్పుడు దానిని రష్యాలో కొనడానికి ఆమె వెనకాడలేదు. తన మంత్రిత్వ శాఖ మంజూరు చేయ

పలపిన వార్తా పత్రికల కాగితం కోటాల విషయంలో రాజకీయ భావాలకూ, ప్రత్యేక అభిమానాలకూ తావివ్వేవి కావు. ఏ పత్రికకు ఎంత సర్క్యులేషన్ ఉందో పరిశీలిం చేందుకు ఆ మంత్రిత్వశాఖవారు పంపిన బృందం తన పత్రికకు విరుద్ధంగా నివే దించిందన్న కారణంచేత, తన న్యూస్ ప్రింట్ కోటా విపరీతంగా తగ్గించి వేసినట్లు బెంగాల్‌కు చెందిన, పలుకుబడిగల రాజకీయ నాయకుడికి తెలిసింది. రాజకీయంగా తమపైన ఎక్కడ ఒత్తిడివస్తుందోనన్న భయంతో, నిర్ణయాలు తీసుకునేందుకు వెన కాడే ఉద్యోగులకు ఇందిర అభయమిచ్చింది. రాజకీయ మయిన ఒత్తిడికి లోనై, సరియయిన నిర్ణయాన్ని దేనినీ కూడా మార్చడం జరగదని ఆమె వారికి హామీ ఇచ్చింది.

సమాచార మంత్రి అయిన కొన్ని నెలలకే ముఖ్యమయిన అంతర్జాతీయ యాత్ర జరపవలసి వచ్చింది. క్రుశ్చేవ్‌స్థానే కోసిగిన్, బ్రెజ్నేవ్‌లు అధికారంలోకి వచ్చిన వెంటనే మాస్కోకు ఆహ్వానింపబడిన మొదటి భారత ప్రభుత్వ మంత్రి ఆమె. నూతన సోవియట్ ప్రభుత్వం పీకింగ్ వంక మొగ్గడంవల్ల భారత దేశంపట్ల గల మైత్రీ భావం తగ్గుతుందేమోనని న్యూఢిల్లీలో భయసందేహాలు కలుగుతున్న తరుణం అది. మాస్కోనించి ఢిల్లీకి తిరిగి వచ్చాక ఆమె ప్రధాన మంత్రికీ, పత్రికల వారికీ నివేదిస్తూ సోవియట్-భారత దేశాలమధ్య మైత్రి పలచబడుతుందేమోనన్న అనుమా నాలు నిరాధారమయినవని ఉద్ఘాటించింది. సోవియట్ నాయకులతోనూ, బ్రిటిష్, ఫ్రెంచి, యుగోస్లావ్ రాజనీతి వేత్తలతోనూ జరిపిన మంతనాలవల్ల "జాతీయ, అంత ర్జాతీయ సంబంధాలలోనూ, భారత చైనా దేశాలపట్ల సోవియట్ వైఖరిలోనూ మార్పు రా"దని ఆమెకు నమ్మకం కలిగింది.

ఆమె మాస్కోయాత్రలో సాధించిన గణనీయమయిన విజయం భారతదేశా నికి రష్యా ఇక ముందుకూడా ఆర్థిక, సైనిక సహాయాలు అందజేస్తూనే ఉంటుందని సోవియట్ ప్రభుత్వంనించి నిర్దిష్టమయిన హామీలు పొందగలగడం. "ఆమెను ఆహ్వా నించి మాస్కోలో హృదయ పూర్వకమయిన స్వాగతం ఇవ్వడం ద్వారా సోవియట్ నాయకులు భారతదేశంపట్ల తమ మైత్రీభావాన్ని పునరుద్ఘాటించారు" అని 'లింక్' పత్రిక వ్రాసింది. తండ్రి మరణానంతరం ఆమె స్వతంత్రంగా జరిపిన మొట్టమొదటి విదేశీ యాత్ర దౌత్యనీతివేత్త్రిగా ఆమెకుగల నైపుణ్యాన్ని ఋజువుచేసింది. ఈ యాత్ర ప్రాముఖ్యాన్ని పేర్కొంటూ 'లింక్' పత్రిక ఇలా వ్రాసింది :

"శ్రీమతి ఇందిరాగాంధీ విదేశీయాత్రవల్ల ఒక్క సంగతి రుజువైంది. భారత ప్రభుత్వంలో ఆమెకు స్థానం ఇవ్వడంవల్ల అంతర్జాతీయంగా దేశప్రతిష్ఠ పెరుగుతుం దని, జవహర్‌లాల్ నెహ్రూ అనుసరిస్తూ ఉండిన జాతీయవిధానాలు కొనసాగగలవన్న హామీ లభించినట్లు భావిస్తారని ధృవపడింది."

మరోకొన్ని వారాలకే ఆమె అవతలి ప్రపంచాన్ని సందర్శించింది. న్యూయార్కులో నెహ్రూ స్మారక ప్రదర్శనానికి ప్రారంభోత్సవం జరిపింది. తండ్రివలె ఆమె కూడా ఉభయ ప్రపంచాలలోనూ ఎంతో ఆత్మీయతతో మెలగ గలిగింది. ఆమెకు సంబంధించినంతవరకు "ఇనుపతెర" ఎన్నడూ లేనేలేదు.

1965 జనవరిలో భారత ప్రభుత్వం అంతర్జాతీయ చలన చిత్రోత్సవాన్ని ఏర్పాటుచేసినప్పుడు ఇందిరాగాంధీ రేడియో - సమాచారశాఖమంత్రిగా యథోచితంగా ప్రవర్తించడమేగాక ప్రత్యేక ఆసక్తితో పనిచేసింది. ఉత్సవానికి సంబంధించిన ప్రతి విషయంలోనూ పూర్తిబాధ్యత వహించింది. స్వీకరించి ప్రదర్శించిన చిత్రాల కళాత్మక దృక్పథం విషయంలో నైతేనేమి, బహుమతి నిర్ణయంలో ఉన్నత ప్రమాణాలను పాటించడంలో నైతేనేమి, ప్రపంచంలో అనేక దేశాలనించి వచ్చిన ప్రతినిధులు, సదస్యులు, న్యాయనిర్ణేతలకు ఆతిథ్యం ఇవ్వడంలో నైతేనేమి ఆమె ఎంతో శ్రద్ధ వహించింది. కళాత్మక చలన చిత్రాలపట్ల ఆమె ప్రదర్శించిన అనూహ్యమయిన ఆసక్తిని గమనించి ఆమె కలుసుకున్న విదేశీ అతిథులందరూ ఎంతో ముగ్ధులయినారు, అంతర్జాతీయ ఖ్యాతిగలిగి ప్రముఖ చలన చిత్ర విమర్శకుడయిన బహుమతి నిర్ణేత ఒకరు నాతో ఇలా అన్నారు :

"కానీస్, వెనిస్, కార్లోవీ వారీ, మాస్కో, బెర్లిన్ నగరాలలో జరిగిన చలన చిత్రోత్సవాలలో నే ననేకమంది మంత్రులను కలుసుకున్నాను. కాని అంతర్జాతీయ చలన చిత్రాలను గురించి కొంతయినా తెలిసిన మంత్రిని ప్రథమంగా చూపింది శ్రీమతి గాంధీలోనే. ఆమె రోజెలినీ, ఇంగ్‌మర్ బెర్గమాన్‌లలోని బాగోగులను నాతో చర్చించింది.

రేడియో-సమాచారశాఖమంత్రిగా ఆమె కార్య కలాపాలూ, ఆసక్తీ కేవలం చలన చిత్రాలకు మాత్రమే పరిమితం కాలేదు. ఆకాశవాణిని "నూతన దృక్పథం"తో తీర్చి దిద్దడానికికూడా ఆమె తుల్యమయిన ఆసక్తితో పాటుబడింది. ఉద్యోగుల జోక్యం సాధ్య మయినంతవరకు తగ్గించి దానిని స్వతంత్రమయిన సాంస్కృతిక సంస్థగా పనిచేయనివ్వాలని ఆమె ఆరాటపడింది. రేడియో, టెలివిజన్లను అభివృద్ధి పరిచేందుకు 100 కోట్ల రూపాయలు ఖర్చయ్యే బృహత్ ప్రణాళికను తలపెట్టినది ఆమే.

మంత్రి వర్గంలోనూ, కాంగ్రెసు కార్యవర్గంలోనూ సభ్యురాలుగా నిర్వర్తించవలసిన బాధ్యతలే కాక రాజకీయ సాంఘిక కార్య కలాపాలలోకూడా ఆమె యథా

పూర్వంగా ప్రత్యేకాసక్తి తీసుకునేది. ఇన్నాళ్లూ ఆమె వివిధ సాంఘిక సంక్షేమ సంస్థలలో చురుకుగా పాల్గొంటూనే ఉండేది. ఇప్పుడామె "సంఘసేవ" అన్న అంశంపై సంఘసేవకురాలుగా తన అనుభవసారాన్ని క్రోడీకరిస్తూ భారతదేశంలో సంఘ సంక్షేమకార్య క్రమాలలోని చిక్కులను వివరిస్తూ చక్కని వివరణ వ్రాసింది.

"మనం వివిధ భాషలు మాట్లాడేవారితో, అనేక ఆచారాలు పాటించే వారితో వ్యవహరించవలసివస్తుంది. వెనకబడిన వర్గాలకూ, గిరిజనులకూ ఎదురయ్యే సమస్యలను ఎదుర్కోవలసి ఉంటుంది. ప్రతిచోటా దారిద్ర్యమూ, నిరక్షరాస్యతా, మూఢ విశ్వాసాలూ మనకు పెద్ద అడ్డుగోడలుగా ఎదురౌతూంటాయి. ప్రభుత్వం చేపట్టే కార్యక్రమాలు బాగా విస్తరిస్తున్నమాట వాస్తవమే. మనం ఆశించిన తీరులో క్రమమయిన పద్ధతిలో అవి అమలు జరుగక పోవచ్చు. తరుచుగా తగిన పరిజ్ఞానమూ, ప్రత్యేకసానుభూతీ లేనివారి అధీనంలో వీటిని ఉంచడం జరుగుతోంది.... అనేక శాసనాలు చేశారు. కాని అవి అమలు జరుగుతున్నాయని మనం గుండెమీద చేయివేసుకుని చెప్పగలమా? 1929 లోనే శారదా చట్టం ఆమోదించబడినప్పటికీ గ్రామాలలో బాల్య వివాహాలు ఇప్పటికీ జరుగుతూనే ఉన్నాయి."

మంత్రి అయిన వారెవరూ ఇంత నిర్మోహమాటంగా తమ భావాలను ప్రకటించడం అరుదు. కాని ఇందిరాగాంధీ మాత్రం తాను మిగతా మంత్రులవంటి దానిని కాదని ఇదివరకే రుజువు చేసుకుంది.

పాకిస్తాననించి వచ్చిన సాయుధదుండగీండ్లు కాశ్మీరులో అత్యాచారాలు సాగిస్తున్నారన్నవార్త తెలియగానే ఇందిర విమానంలో శ్రీనగర్ వెళ్ళింది. అనేక బహిరంగ సభలలో ఉపన్యసించి, అక్కడ రక్షణ కార్యకలాపాలలో నిమగ్నులయిన జవాన్లతో మాట్లాడింది. ఈ దుండగీండ్ల అత్యాచారాలు 50 రోజులపాటు సాగిన సంగ్రామానికి దారితీసినప్పుడు ఆమె అనేకసార్లు యుద్ధరంగానికికూడా వెళ్ళింది. అధికారహోదాలో తప్పితే స్త్రీల నెవ్వరినీ సాధారణంగా అగ్రశ్రేణికి వెళ్ళనివ్వరు. భయం అనేది ఆమె ఎరగదు. సమాచార మంత్రిగా ఆమె జనుల మనస్సులలోనూ, హృదయాలలోనూ సంగ్రామం సాగించవలసి వచ్చింది. పరిపాలనా యంత్రాంగంలో ఉండే జాప్యాన్నీ, పరిపాటినీ అతిక్రమించి ఆమె విషమపరిస్థితులలో శాంతి పరిరక్షణ కర్తవ్యాన్ని ప్రజలకు బోధించేందుకు అత్యంత సమర్థులయిన వారిని సమీకరించింది. ఈ ఉద్యమం సందర్భంగా ఆమె చేసిన నినాదాలలో అత్యుత్తమ మయినదీ, సమర్థ

మయినదీ "మనం భారతీయులం. మనలో చీలికలు తెచ్చే అవకాశం ఎవరికీ యివ్వకండి'' అనేదని చెపుతారు.

తర్వాత యుద్ధ విరమణ, ఆవెంటనే తాష్కెంటుకు ప్రయాణమయిన లాల్ బహదూర్ శాస్త్రికి మిగతా మంత్రులతోపాటు ఇందిరకూడా వీడ్కోలు ఇవ్వడం జరిగాయి. ఆయనను సజీవంగా చూడడం అదే కడసారని ఆమె అనుకోలేదు.

సమాచార మంత్రిగా. తాష్కెంటు ఒప్పందంపై సంతకాలయిన వార్త ముందుగా ఆమెకే చేరింది. లాల్ బహదూర్‌శాస్త్రి మరణవార్త కూడా ఆమెకే ముందుగా తెలిపింది. తన తండ్రి మిత్రుడు. చిన్ననాటినించీ తనకుకూడా మిత్రుడే. ఆనంద భవనానికి పని తొందరలలో వచ్చేవారందరిలోనూ ఆయనొక్కడే, జవహర్‌లాల్ కూతురితో ఆట్లాడడానికి వెనకాడేవాడు కాదు. అలాంటివాడు ఇక లేడు. కాని తా నంత తీవ్రాఘాతానికి గురియయిన ఆ తరుణంలో శాస్త్రీజీమరణం తన భవితవ్యంపైఅంతటి ప్రభావం కలిగి ఉంటుందని ఆమె ఎన్నడూ ఊహించలేదు. మరోకొన్ని రోజులకే తాను భారతప్రధాని పదవిని చేపట్టవలసివస్తుందని ఆమె భావించలేక పోయింది.

# 14

## రాజ్యాభిషేకం : కంటకకిరీటధారణం

ఈ రోజుల్లో ఏ వ్యక్తికైనా విధించగల కఠినతమమైన శిక్ష ఏమిటంటే,
అతణ్ని అధికార పీఠంమీద ఆసీనుణ్ని చేయడమే !

—జవహర్‌లాల్ నెహ్రూ

పాతఢిల్లీలో చరిత్రప్రసిద్ధిగాంచిన విక్రయ కేంద్రం చాందినీ చౌక్‌లో నానా హంగామాగానూ ఉంది. తగులబడుతూన్న దుకాణాలనించి వెలువడే పొగ చుట్టలు చుట్టలుగా వియత్తలాన్ని ఆవరించింది. సాయంకాలం, బాగా పెందలకడనే కర్ఫ్యూ విధించినట్లు ప్రకటించారు. ఆ ప్రాంతంలోని ఆఫీసులలోనూ, షాపులలోనూ పని చేసే సిబ్బంది హడావుడిగా బయటపడి అందుబాటులో ఉన్న రవాణాసాధనాలు వేటిపైనేనాసరే కర్ఫ్యూ విధించిన ప్రాంతంనించి, అది అమలులోకి వచ్చేలోగా, పారిపోవాలని ప్రయత్నిస్తున్నారు.

ఈ పుస్తక రచనకు కావలసిన సమాచారాన్ని సేకరించేందుకు నే నాసమయంలో ఢిల్లీలో ఉండటం తటస్థించింది. పంజాబీసుబా ఏర్పాటు విషయమై ప్రభుత్వం చేసిన ప్రకటన ఫలితంగా ఈ అల్లర్లు మొదలయినాయని నాకు తెలియవచ్చింది. పత్రికా విలేఖరులకు సహజమయిన కుతూహలంతో నేను అల్లర్లుజరిగే ప్రాంతానికి వెళ్ళాను. నా టాక్సీని జనసంఘ్‌కి చెందిన కొందరు బాలురు చుట్టు ముట్టారు. టాక్సీ డ్రైవరు ఒకసిక్కు అని గుర్తించగానే పంజాబీరాష్ట్రానికీ, సిక్కులకూ విరుద్ధమయిన నినాదాలు చేయడం మొదలుపెట్టారు. దూషణ తిరస్కారాలతో కూడిన బెదిరింపు మాటలు వినిపించాయి. ఆ ముసలి సర్దారుకు బాడుగ ఇచ్చేసి, వాగ్రూపమైన దూషణ క్రియారూపంలో హింసాకాండగా పరిణమించకమునుపే వెళ్ళిపొమ్మని చెప్పాను.

చాందినీచౌక్ కేంద్ర ప్రాంతానికి నడిచి వెళ్ళాను. అక్కడి గురుద్వారాలో అనేకమంది సిక్కులు తలదాచుకున్నారు. గురుద్వారాకు ప్రక్కనే పాతఢిల్లీకి ప్రధాన

మయిన పోలీసుస్టేషను-"కొత్వాలీ" ఉంది. నేను వెనక ఒక ఢిల్లీ దిన పత్రికకు జూని యర్ విలేఖరిగాఉన్న రోజులలో వార్తాసేకరణ కోసం రోజూ ఒకసారి అక్కడికి "బీటు'' తిరిగేవాణ్ణి. కొత్వాలీకి సరిగ్గా 20 గజాలు కూడా లేదు-ఒక దుకాణాన్ని దోపిడీచేసి తగులబెట్టారు. దానికి అవతలివైపున ఒక రెస్టోరెంట్ ఉంది. పాతికేళ్ళ క్రితం నే నిక్కడే సుగంధ ద్రవ్యాలు వేసిన లస్సీ తాగేవాణ్ని. ఇప్పు డా రెస్టోరెంటు చిందరవందరగా ఉంది. పోలీసులు బాష్పవాయు ప్రయోగం చేశారు. దాని ఫలి తంగా భారత దేశంలోని వాస్తవమయిన కొట్లాట ఎలా ఉంటుందో చూడాలని వచ్చిన ఇద్దరు అమెరికన్ విద్యార్థినులను వారి హోస్టలుకు ఎవరో కూడా ఉండి తీసుకెడు తున్నారు. వారి కళ్ళనుంచి అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి. కొందరు యువకులు—బహుశా కళాశాలలకూ, పాఠశాలలకూ చెందిన విద్యార్థులు అనుకుంటాను — ఒక క్రమంలో, ఇంచుమించు లయబద్ధంగా, సిక్కుల యాజమాన్యంలో ఉన్నట్లు భావించ బడే దుకాణాలపైన రాళ్ళు విసురుతున్నారు. కాని "అదుగో పోలీసులు" అన్నమాట వినపడగానే ఎక్కడి వా రక్కడ చెల్లాచెదరై పోయినారు.

ముందుగా ఒక జీపూ, దానివెనక రేడియేటరుపైన మంత్రిజెండా ఎగురు తూండగా ఒక కారూ కొత్వాలీ దగ్గరకు వచ్చి ఆగాయి. ఆ వచ్చిన వారు విద్యాచరణ్ శుక్లా. ఆయన దేశవ్యవహారాల ఉపమంత్రి. యువకుడూ, ఉత్సాహ వంతుడూనూ. సమ్మెదారులపట్ల పక్షపాతంతో వ్యవహరించారన్న అనుమానం కలిగిన పోలీసు అధికారులపైన తక్షణమే చర్యలు తీసుకున్నాడు. అప్పుడు గురుద్వారా మెట్ల వద్దకు వెళ్లి, దానిలో ప్రాణరక్షణ చేసుకుంటూన్న సిక్కులకు అభయమిచ్చాడు. నగరంలోని ఇతర ప్రాంతాలనించి వాన్లలోనూ, లారీలలోనూ చాలామంది పోలీసులు వచ్చారు. దానితో పరిస్థితి ఇంచుమించు అదుపులోకి వచ్చినట్లే కనబడింది. నేను తిరిగివెళ్లిపోవాలని తీర్మానించుకుని నా మకాం వద్దకు వెళ్లేందుకు ఒక టాక్సీని కుదుర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. రోడ్డు ప్రక్క కాలిబాటకోసం నిర్మించిన గట్టుపై నిలబడి వచ్చేపోయే టాక్సీలను ఆపేందుకు విఫల ప్రయత్నాలు చేస్తూన్నాను. నావలెనే ఇంటికి వెళ్ళేందుకు బస్సయినా, స్కూటరయినా దొరుకుతుందేమో నని ప్రయత్నిస్తున్న కొంతమంది సాగించే సంభాషణ నాకు వినబడింది.

''కఠినమయిన చర్య తీసుకోవలసిన ఈ తరుణంలో మనకు ఒకస్త్రీ ప్రధానికావ డం ఎంత దురదృష్టం" అన్నాడొకాయన.

పేపరు చదువుతూన్న ఒక యువకుడు తలెత్తి చూసి-"ఆమె స్త్రీయే కావచ్చు, కాని ఆమె జవహర్‌లాల్ నెహ్రూ కూతురు అన్న సంగతి మరిచిపోకండి'' అని సమా ధానం ఇచ్చాడు.

"ఆడదాడదే. ఎవరికూతు రయినా కానీ" అని జోక్యం చేసుకుంటూ, మూడో వ్యక్తి—"ఇలాంటి సమయంలో పండిట్ జీ మోస్తరుగా ఆమె చాందినీ చౌక్కు రావడానికి సాహసించగలదా?" దీనికి ఎవరూ సమాధానం ఇవ్వలేదు, బహుశా ప్రతి వారిలోనూ అదే సందేహం ఉండి ఉండవచ్చు.

సుఖాంతమయిన నాటకంలో మోస్తరుగా ఆ క్షణంలో అంతపనీ జరగలేదు కాని మరో 15 నిమిషాలలోగా అందరినీ ఆశ్చర్య చకితుల్నిచేసే ఆ సంఘటన జరగనే జరిగింది. మేమందరమూ అక్కడే నిలబడి ఏదో ఒక రవాణా సాధనంకోసం ఇంకా ప్రయత్నిస్తూనే వున్నాము.

ముందుగా ఒక మోటారు సైకిలు పెద్ద కూతవేస్తూ మాముందునించి మెరుపులా దూసుకుపోయింది, ఆ తరువాత మరోకారు. చివరికి కిటికీలన్నీ మూసివేసిన కారు కొత్వాలీవైపు పరుగెత్తింది. ఆ సంధ్య చీకట్లో తెల్లని దుస్తులు ధరించిన ఆకారం ఒకటి దానిలో మసక మసకగా కనిపించింది.

"ఎవరామె?" అని అడిగారు ఎవరో.

"మనప్రధాని—ఇందిరా గాంధీ. నీవు గుర్తించలేదా?" అని సమాధానం. అప్పుడా గుంపులోని వారందరి నోళ్లూ కట్టుబడ్డాయి. నేను ఎలాగో ఒక టాక్సీని ఆపి, కర్ఫ్యూ మొదలయ్యేలోగా మకాంచేరుకున్నాను. ఆవేళ కొట్లాటలు జరిగిన చాందినీ చౌక్కు ఆమెవెళ్ళేనాటికి ఇందిరాగాంధీ ప్రధానమంత్రి అయి సరిగ్గా రెండు నెలలే అయింది. కాని ఆమె ఎదుర్కోవలసిన సమస్యలు అన్నాళ్ళవరకూ కూడా ఆగనే లేదు. . . .1966 జనవరి 25 వ తేదీన దినపత్రికలన్నీ భారతదేశపు ప్రథమ మహిళా ప్రధాని పదవీప్రమాణస్వీకారం చేస్తున్న చిత్రాలను మొదటిపేజీలలో ముద్రించాయి. దానితోబాటే ఆమె ఎదుర్కోవలసిన సవాలును ప్రస్ఫుటం చేసే నివేదికలు కూడా ప్రచురించాయి. ఆమె ఆనాటి వార్తలను ఒక్కసారి సింహావలోకనం చేస్తే చాలు, తనకు కఠిన వరకం విధింపబడిందని గ్రహించడానికి.

తిరువనంతపురం (కేరళ) :—అన్ని రాజకీయ పార్టీలూ, కార్మిక సంఘాలూ జనవరి 28 వ తేదీన ఒకరోజు కేరళబంద్ ఉద్యమం జరపాలని తలపెట్టాయి. కేరళరాష్ట్ర ప్రజలకు చాలీ చాలని బియ్యం రేషన్ ఇస్తున్నందుకు నిరసన సూచకంగానే ఈ బంద్ ఉద్యమం.

భోపాల్ :—వర్షాలు వరుసగా కొన్నాళ్ళనించి పడకపోవడంవల్ల రేవాజిల్లాలో దాదాపు పస్తులుండవలసిన పరిస్థితి ఏర్పడుతోంది.

కలకత్తా :—కలకత్తాలో కిరసనాయిలు ధర కొన్ని వారాలక్రితం ఉన్నధరకు దాదాపు 12 రెట్లు పెరిగింది. 22 ఔన్సులుగల ఒక సీసా కిరసనాయిలు, కొన్ని రోజులక్రితం 25 పైసలు అమ్మేదల్లా నిన్న మూడురూపాయలు చెప్పారు.

నాగపూర్ :—బియ్యం పంపిణీ విధానం సర్వత్రా ఆందోళనకరంగా ఉంది. బజారులో బాహాటంగా బియ్యం దొరకకపోయినా బ్లాక్ మార్కెటులో కిలో 2½ నించి 3 రూ. లవరకూ చెల్లించేపక్షంలో ఎంత కావలిస్తే అంతా దొరుకుతోంది.

హైదరాబాదు :—తమ కరువు భత్యాన్ని పెంచకపోతే ఆంధ్రప్రభుత్వోద్యోగులు "పనిలోనించి వైదొలుగు తాము" అని బెదిరిస్తున్నారు.

యోట్మల్ (మహారాష్ట్ర) :—ఈ దశాబ్దంలో ఎన్నడూ ఎరుగనంత అనావృష్టి మూలంగాయోట్మల్ జిల్లాలోని 483 గ్రామాలను కరువు ప్రాంతాలుగా ప్రకటించారు.

తాను పదవీ స్వీకారం చేసినరోజు ఉదయం ఈ వార్తలు చదివేసరికి ఇందిరకు తానెదుర్కోవలసి ఉన్న గురుతర సమస్యలముందు తాను నిస్సహాయురాలనని తోచి ఉండవచ్చు. తన తండ్రి 40 వ ఏట కాంగ్రెసు అధ్యక్షుడయినప్పుడు సరోజినీ నాయుడు ఆయనకు వ్రాసిన మాటలు బహుశా ఆమెకు జ్ఞాపకంవచ్చిఉంటాయి :-

"ఇది మీకు పట్టాభిషేకము; శిలువకూడాను. కొన్ని కొన్ని సందర్భాలలో, పరిస్థితులలో, ఈ రెండింటికీ తేడా ఉండదు. వాటి మధ్య అవినాభావ సంబంధం ఉంటుంది……"

కాని ఆమెకు మరోసంగతి కూడా తెలుసు. అది పట్టాభిషేకంకానీ, శిలువవేయడం కానీ తాను పరిస్థితిని ఎదుర్కొని నిలదొక్కుకోవలసి ఉంటుందని కూడా ఆమెకు తెలుసు. ఏదో ఒకటి చేయాలి, అదికూడా బహు తొందరగా చేయాలి. ఈ సమస్యలను పరిష్కరించాలన్న కోరిక, పట్టుదల తనకు ఉన్నాయని ప్రజలకు అర్థమయ్యే తీరులో కనీసపు చర్యలయినా తీసుకోవాలి. అందుచేతనే ఆమె పదవీ ప్రమాణం చేసిన కొన్ని గంటలలోనే కేరళరాష్ట్రానికి అత్యవసరంగా బియ్యాన్ని హుటాహుటి తరలించ వలసిందిగా మద్రాసు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు విజ్ఞాపనలుచేసింది. అక్కడి తరుగుపరిస్థితిని స్వయంగా పరిశీలించి వారికి ఆదుకోవడానికి కేంద్రం శక్తివంచనలేకుండా పాటుబడుతుందని హామీయిచ్చేందుకు కేరళరాష్ట్రానికి తాను విమానంలో వెళ్ళబోతున్నట్లు కూడా ఆవేళే ప్రకటించింది.

నూతన ప్రధానికి దిన దినం నూతనసమస్యలు ఎదురు కాసాగాయి. ఒమర్ ఖయాంకువలె ఆమెకుకూడా "ఈ విషాదకర పరిస్థితులనన్నిటినీ ఒక్కసారి చిందరవందరచేసి వాటిని మళ్లీ తనకు అనుకూలమయిన రీతిలో మలచుకోవాలి" అని అనిపించి ఉండవచ్చు. కాని ఇందు కామె మాంత్రికురాలు కాదు; నియంత ఆంతకంటేమీ కాదు. ఆమె ఒక ప్రజాస్వామిక వ్యవస్థకు ప్రధాని. ఒక తీరులో సాగిపోయే పరిపాలకుల అధీనంలోని ప్రజాస్వామిక మిది. పరిపాలనా యంత్రాంగ నియమ నిబంధనలకు ఆమె కూడా బద్ధురాలు. ఆమె తన మనోభావాలకు అనుగుణమయిన చిహ్నం మాత్రమయిన చర్యలను కొన్నింటిని తీసుకోగలదు. కాని వీటికయినా

ప్రయోజనం లేకపోలేదు. అయితే ఈ సూచనలను అనుసరించి తదనంతర చర్యలు కూడా తీసుకోవలసిన అగత్యం ఉంది.

కనుకనే నాగుల మోస్తరుగా తిరుగుబాటు లేవదీయాలని ప్రయత్నిస్తున్న మిజోల కొండలప్రాంతానికి విమానంలో వెళ్లింది. తిరుగుబాటు దారులపై సైనిక చర్య తీసుకుంటామని కేవలం బెదిరింపులే కాకుండా ఆమె వారికి సహేతుకమయిన వ్యక్తిగత విజ్ఞప్తి చేసింది. ప్రచ్ఛన్న నాగా నాయకులతో జరుగుతున్న సంప్రదింపుల వ్యవహారంలో రెవరెండ్ మైకేల్‌స్కాట్ విషయంలో కూడా ఆమె ఇదేవిధమయిన దృఢవైఖరినీ, మెత్తదనాన్నీ ప్రదర్శించింది. రెవరెండ్‌స్కాట్ నాగుల పట్ల పక్షపాతవైఖరిని అవలంబిస్తున్నాడని చెప్పి ఆయనకు వ్యతిరేకంగా సాగిన ఉద్యమం ఫలితంగా ఆయనను దేశంనించి బహిష్కరిస్తూ ఉత్తరువులు జారీచేసింది. అయినా నాగులతో శాంతిసంభాషణలు నిలుపుచేయాలని కొందరు సాగించిన ఆందోళనకు ఆమె ఎంత మాత్రమూ లొంగలేదు. నాగులు రైళ్ళను పేల్చి వేస్తున్నారు కాబట్టి వారితో సంభాషణలు సాగించరాదని వారివాదం. ఆహార ధాన్యాలను దాచి పెడుతున్నందుకూ, ఆహారకొరతకూ నిరసన సూచకంగా వామపక్ష ప్రతిపక్షాలవారు కలకత్తా నగరంలో సమ్మె చేసి నగరజీవితాన్ని స్తంభింపజేస్తామని బెదిరించినప్పుడు ఆమె వెంటనే అక్కడికి విమానంలో వెళ్లింది. కాని ఆమె మాట్లాడ దలచుకున్న నాయకులను బెంగాల్ ప్రభుత్వం అరెస్టు చేయడంతో ఆమె ప్రయత్నం విఫలమయింది. ఆమె తిరుగుముఖం పట్టవలసి వచ్చింది. గాంధీ, నెహ్రూల సంప్రదాయాన్ని పాటించి ప్రతి పక్షాలవారితో నేరుగా సంభాషణలు జరపకుండా వ్యక్తిగత గౌరవ ప్రతిష్ఠలకు ప్రాముఖ్యం ఇచ్చినందుకు వామపక్షవర్గ పత్రికలు ఆమెను విమర్శించాయి. ఆమె తిరిగివచ్చినా ఏక్షణాన్నయినా బాంబువలె పేలుతుందేమో అన్న భయాన్ని కలిగించే కలకత్తా నగరాన్ని మరిచిపోలేక పోయింది. ఆమె వామపక్ష కమ్యూనిస్టు నాయకులను ఢిల్లీకి ఆహ్వానించింది. అక్కడి పరిస్థితినిగురించి వారు చెప్పేది శ్రద్ధగా వినింది. పరిష్కార మార్గాలను వారితో చర్చించింది. ప్రభుత్వానికీ, కమ్యూనిస్టులకూ మధ్య సంభాషణలు తిరిగి కొనసాగాయి. చివరికి ఆమె అనుసరించే సబబయిన వైఖరికి అనుగుణంగా, వామపక్షాలవారు జరపాలనుకున్న ప్రశాంతమయిన ఊరేగింపుతో జోక్యం చేసుకోవద్దని ఆమె బెంగాలు ప్రభుత్వానికి నచ్చ జెప్ప గలిగింది. బెంగాలులోని ప్రముఖ రచయితలూ, కళాకారులూ నాయకత్వం వహించి నడిపిన అపూర్వమయిన ఆ ఊరేగింపు అతిప్రశాంతంగా సాగిపోయింది. సబబుగా వ్యవహరించేవారిపట్ల ఎదటివారుకూడా సజావుగానే వ్యవహరిస్తారని ఇందువల్ల రుజువయింది. అది ఇందిర స్వతంత్రించి ఏర్పరచుకున్న అభిప్రాయం. ఆహారకొరత సమస్యపై ప్రభుత్వానికీ, ప్రతిపక్షాలకూ మధ్య ఏర్పడిన పరిస్థితి ఎప్పుడు విషమిస్తుందోనన్న ఆందోళన దీనితో కొంత తగ్గింది.

పంజాబును భాషాప్రాతిపదికపై పునర్వ్యవస్థీకరించి పంజాబు మాట్లాడే ప్రజలకు ప్రత్యేకరాష్ట్రం ఏర్పాటు చేయాలని సిక్కులు అనేక సంవత్సరాలుగా ఆందోళన సాగిస్తున్నారు. ఇది నిరంతర వివాదాస్పద సమస్యగా ఉండిపోయింది. ఇందిర ప్రధానమంత్రిగా ఎన్నికయిన వెంటనే ఆమెకు సహజమయిన రాజకీయ వాస్తవిక దృక్పథంతో విధిగా చేయవలసిన నిర్ణయం వాంఛనీయమేనన్న సంగతిని గ్రహించింది. ఆమె పంజాబీ సుబాను బలపరిచింది. కొన్ని వారాలలోనే ప్రభుత్వం పంజాబీ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలన్న నిర్ణయం ప్రకటించింది. సిక్కులలో హేతువాదానికి కట్టుబడినవారు చాలామంది సంతోషించారు. ఐతే మాస్టర్ తారాసింగ్ వంటి తీవ్రవాదులు స్వతంత్ర ప్రతిపత్తి కావాలంటూ వాదించడం మొదలుపెట్టారు. కాని జనసంఘం నాయకత్వంలో మతోద్వేగులయిన హిందువులు ప్రభుత్వ నిర్ణయాన్ని సవాలు చేశారు. వారు అనేక ప్రదర్శనలు ఏర్పాటు చేశారు. కొన్ని అలివి తప్పి దౌర్జన్య పూరితమయినవి. కొన్ని మహాదారుణంగా కూడా పరిణమించాయి. ఢిల్లీకి సమీపంలోని పానిపట్టులో కొందరు అల్లరిమూకలు ముగ్గురు కాంగ్రెసు వాదులను సజీవంగా దహనం చేశారు. స్వాతంత్ర్య పోరాట విప్లవకారు లొకరు మరణించారు కూడాను. రాజధానీ నగరంలో కూడా పాతనగరంలో సిక్కుల దుకాణాలను దోపిడీ చేసి తగులబెట్టడంతో భీతాహం ఏర్పడింది. నూతన ప్రధానికి అది పరీక్షాసమయం.

ఆరోజున, తన రక్షక సిబ్బంది అభ్యంతరాలను కూడా లెక్కచేయక, ఆమె అల్లర్లు జరిగిన ప్రాంతాలలో పర్యటించడమేకాదు; తన మాటలవల్లా, దేశ వ్యవహారాల మంత్రిత్వశాఖ శీఘ్రగతిని తీసుకున్న చర్యలవల్లా 'శాంతికి భంగకరమయిన అల్లర్లు వేటినీ తన ప్రభుత్వం ఎంతమాత్రమూ సహించ'దని రుజువుచేసింది. అల్లర్ల సమయంలో చూసీచూడనట్లు ఊరుకున్నారని అనుమానించదగిన పోలీసు అధికారులను ఉన్నపాళంగా సస్పెండు చేయడమో, దర్యాప్తు జరిగేలోగా బదిలీ చేయడమో జరిగింది. ఆమె జనసంఘం నాయకులను పిలిపించి తీవ్రమయిన హెచ్చరిక చేసింది. 48 గంటలలోగా ఢిల్లీలో పరిస్థితి మళ్ళీ యథాపూర్వస్థితికి వచ్చింది. ఢిల్లీలో 25 సంవత్సరాలుగా వార్తలు సేకరిస్తున్న కాకలుతేరిన విలేఖరి ఒకరు, రాజధానీ నగరంలో జరిగిన అల్లర్లన్నిటిలోకీ బహు స్వల్పవ్యవధిలో అంతమయిన అల్లరి ఇదేనని నాతో అన్నాడు.

ఇందిర ఎదుర్కోవలసిన క్లిష్టమయిన గురుతర సమస్యలు అటువంటివి. ఐతే వాటిలో మరీ అత్యవసరమయిన వాటిని మాత్రమే పరిష్కరించగలిగిన తరుణంలోనే ఇందిర ప్రపంచంలోని నాలుగు ముఖ్య రాజధానీ నగరాలకు ప్రయాణమై వెళ్ళవలసి వచ్చింది. ప్రధానమంత్రిగా పదవీస్వీకారం చేసిన తరువాత జరిగిన ఈ మొదటి పర్యటనను ఆమె పారిస్‌లో మొదలుపెట్టి లండన్, మాస్కోల సందర్శనంతో ముగించింది. కాని ఆమె ప్రధానగమ్యం వాషింగ్‌టన్. ప్రెసిడెంట్ జాన్సన్‌తో

ముఖాముఖీ నిర్మొహమాటంగా సంప్రదింపులు జరపటంవల్ల భారత-అమెరికా దేశాల మధ్య గల సంబంధాలలో వస్తోన్న అపోహలు తొలగిపోగలవని ఆశించడమే అందుకు కారణం. జవహర్‌లాల్ నెహ్రూ భారతదేశానికి రూపొందించిన వైదేశిక విధానంలోని మూలసూత్రాలను అమెరికావారు ఎన్నడూ సరిగ్గా అవగాహన చేసుకోక పోవడంవల్లనే ఈ అపోహలకు ఆస్కారం ఏర్పడుతూ వచ్చింది.

ఈ చర్చలకు భూమికగా అమెరికా ఉపాధ్యక్షుడు హంఫ్రీ భారతదేశం వచ్చినప్పుడు మంతనాలు జరిగాయి. భారతదేశానికి అమెరికా ఇతోధిక సహాయాన్ని అందజేసేందుకు ప్రతిగా వియత్నాంలో అమెరికావారి జోక్యానికి భారత ప్రభుత్వం అంగీకారాన్ని పొందవచ్చునన్న ఆశతోనే ఆయన వచ్చాడు. ఇందుకు చిహ్నమాత్రంగా నయినా, కనీసం ఒక వైద్య బృందాన్ని-మానవ సేవాదృక్పథంతో నైనాసరే-భారత దేశం పంపకపోతుందా అనుకున్నాడాయన. కాని ఇందిరాగాంధి భారత ప్రభుత్వ విధానాన్ని ఖరాఖండీగా, నిష్కర్షగా ప్రకటించడంతో అమెరికా ఉపాధ్యక్షుడు ఆశ్చర్య చకితుడయినాడు. ఆగ్నేయాసియాలో అమెరికా సాయుధబలాల జోక్యానికీ, భారత ప్రభుత్వ విధానానికీ సరిపడదని ఆమె స్పష్టంచేసింది. హంఫ్రీ ఎంతో విచారంతో స్వదేశానికి తిరిగి వెళ్లాడు. కాని ఆయన భారత ప్రభుత్వ విధానంలోని సంగతి సందర్భాలు తెలుసుకుని వివేకవంతుడయినాడు. అమెరికా సందర్శింప బోతున్న ఈ "అమ్మాయి" కాకలుతీరిన రాజకీయవేత్త అని అధ్యక్షుడు జాన్సన్‌కు తెలియజేశాడు. ఆమె విదేశాలకు వెళ్ళటం అదేప్రథమం కాదు. కాని ప్రపంచనాయకులను కలుసుకుని ప్రత్యక్షంగా చర్చలు జరపడం ఆదేప్రథమం. చాలామంది నిరాశావాదులు అగ్రరాజ్య దండకారణ్యంలోని క్రూరమయిన తోడేళ్లవంటి రాజకీయ నాయకులముందు భారత దేశంనుంచి వెళ్ళే ఈ 'మేదకురాలు' తన వివేకాన్ని కోల్పోయితీరుతుందని అనుకున్నారు. కొందరు మిత్రులు భయపడ్డారు. ఎందుచేతనంటే, ఆమె తన ఆత్మరక్షణకు తీసుకువెళ్ళేవి ఆయుధాలు కాదు - శాంతి, అలీన సిద్ధాంతాలు అనే 'ఎండురొట్టెలు' మాత్రమే.

# 15

## ఇందిరకు విందు

జగమంతా నా జన్మభూమియే;
ప్రజలంతా నా ప్రాణమిత్రులే.

—తమిళ కవిత

25ఏండ్ల తరువాత తిరిగి అమెరికాను సందర్శించిన నాకు అక్కడి జనసామాన్యంలో—పురుషులు, స్త్రీలు, పిల్లల్లో కూడా—భారతదేశం అంటే పాములూ, పెద్దపులులూ, మహారాజులూ ఉండే దేశమనీ, ఆ మహారాజులలో ఒకరు భారతదేశానికి చెందిన ఒకే ఒక అంతర్జాతీయ విమాన సర్వీసు నడుపుతున్నారనే ఒక భావం ఇప్పటికీ ఉంది. ఇందిర వాషింగ్టన్ చేరుకోవడానికి ఒక్కరోజు ముందుగా నేను లాస్ ఏంజల్స్ వెళ్ళేసరికి, తమ ప్రెసిడెంట్ అతిథిగా భారత దేశంనించి వస్తున్న వ్యక్తిని గురించి అక్కడి అమెరికన్ ప్రజలకు ఇంచుమించు ఏమీ తెలియదని గ్రహించాను. ఇందుకు నాకు ఏమీ ఆశ్చర్యం కలుగలేదు. శాంతాబర్బారా అనే చిన్న పట్టణంలో ఒక్క రోజున శ్రీమతి ఇందిరాగాంధీని గురించి అనేకమంది అనేక రకాలుగా భావించడం నేను విన్నాను. "శ్రీమతి నెహ్రూ, కుమారి గాంధీ, శ్రీమతి ఇందిర, నెహ్రూ సోదరి, మహాత్మాగాంధీ కుమార్తె," అంటూ పలువురు పలురకాలుగా పేర్కొన్నారు. "ఈమె మీదేశపు రాయబారిగా ఇక్కడ ఇదివరకు పనిచేసింది కదా" అని ఒక వృద్ధురాలు నన్నెంతో ఆదర పూర్వకంగా అడిగింది. ఒక రాష్ట్రంలో మాత్రం ప్రచారం ఉండే పత్రిక యువవిలేఖరి ఒకరు ఆమెను గురించి విశ్వసనీయమయిన సమాచారం గ్రంథాలయంలోగాని, పాత పేపర్ల ఫైళ్లలోగానీ దొరకడం కష్టంగాఉన్నదని నాతో అన్నాడు.

ఆమెనుగురించి కొన్ని వివరాలయినా అందించగలిగిన ఒకే ఒక పుస్తకం వెలెస్ హెంగెన్ వ్రాసిన "నెహ్రూ తరువాత ఎవరు?" అన్నది. దానిలో నెహ్రూ వారసులు కాగలవారిని పేర్కొంటూ ఆ పదవిని అలంకరించడానికి తక్కువ అవకాశాలు గల ఏడుగురు అభ్యర్థులలోనూ ఇందిర ఒకరుగా పేర్కొన్నాడు. ఆమెను

గురించి వ్రాసిన వివరణలో ప్రశంస బొత్తిగా లేదన లేకపోయినా ఆమెకు నెహ్రూ ఛాయగాకంటె ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఆ రచయిత ఇవ్వలేదు. నెహ్రూ మంత్రి వర్గంలో ఇదివరకు సభ్యుడుగా ఉండిన ఒక మంత్రి ఈ అమెరికన్ రచయితతో "ఆమెకు సొంత భావాలు లేవు" అని అన్నాడట. ఇక నెహ్రూ కుటుంబాన్ని బాగా ఎరిగిన పాశ్చాత్య చరిత్రకారుడొకడు "బుర్రలో భావాలేమీ లేని అల్లరిపిల్ల" అని అభివర్ణించాడట.

ఐతే ఆమె రాబోయేముందు, బాగా ప్రచారంలో ఉన్న పత్రికలు ఆమెను గురించి దీర్ఘమయిన వ్యాసాలను ప్రచురించాయి. అయితే ఇవన్నీ ప్రశంసాపూర్వక మయినవని చెప్పడానికి లేదు. ఢిల్లీనించి వ్రాసిన ఒక విలేఖరి సోషలిస్టు శాసన సభ్యు డొకరు పార్లమెంటులో అన్నాడన్న మాటలు కొన్నింటిని ఆమోద పూర్వ కంగా ఉటంకించాడు. "మనుగడకు సౌందర్యం ఒక్కటే ప్రధానం కాదు. 200 సంవత్సరాలలోపునే ఒక రాణి సౌందర్యం ఆమెను 'గల్లు' (గెలెటీన్) నించి తప్పించలేకపోయిందన్న సంగతి చరిత్ర చెపుతోంది." సన్‌టైమ్సు అనే పత్రిక పత్రికా రచయితలకు సహజమయిన వ్యంగ్యధోరణిలో—

"ఇందిరాగాంధీ ప్రతీవిషయమూ తూచి మాట్లాడుతుంది. కనుకనే ఆమెను గురించి గ్రహించడం కష్టం. ఎవరామె? ఆమెలక్ష్యాలేమిటి? ఆమె చిరకాల మిత్రు లకు కూడా అంతుపట్టకుండా ఉంది. ఆమె మందహాసాన్ని ఒకప్పుడు ఆమె యీడుకు తగని సిగ్గుగానూ, బాల్య చాపల్యంగానూ పరిగణించేవారు. కాని యీనాడు దానిని 20 వ శతాబ్దపు భారతీయ 'మోనా లిసా' మందహాసంతో పోలుస్తున్నారు".

కాని ఆమె అమెరికా చేరుకునేముందు అక్కడి వార్తాపత్రికలను శ్రద్ధగా చదివే పాఠకులకు మాత్రం ఆమె అంతుపట్టని "మోనాలిసా" కాదని విదితమయింది. అనేక ముఖ్యమయిన జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై ఇందిరకు కల విస్పష్టమయిన అభిప్రాయాలను, తన జీవితానికీ వ్యక్తిత్వానికీ సంబంధించిన విషయాలనూ ఆ పత్రి కలు ఎరుకపరిచాయి. ఎక్కువ ప్రచారంలో గల మెకాల్‌కి చెందిన పత్రికలో ఆర్నోల్డు మైఖెలిస్ ఇందిరతో జరిపిన సుదీర్ఘమయిన పరిచయం ప్రచురించబడింది. ఆ సమయంలో ఆమెను గురించి ప్రచురించిన వ్యాసాలన్నిటిలోకీ అదే బాగా సమగ్ర మయినదీ, నిష్పాక్షికమయినదీనూ. ఇంచుమించు ఆమె జీవితానికి సంబంధించిన అంశాలు అన్నిటినీ ఆయన ప్రశ్నలద్వారా రాబట్టాడు. ఇక భారత దేశంనించి ప్రశ్నోత్తరాల రూపంలో సేకరించి పంపిన చిన్న చిన్న ఇంటర్వ్యూలు కూడా పత్రి కలలో ప్రచురిత మయినాయి. వానిలో హెర్‌స్ట్ హెడ్‌లైన్ సర్వీస్ సంస్థ తరఫున జాన్‌హారిస్ జరిపిన గోష్ఠికూడా ఒకటి.

ప్ర :—మీ ఎన్నికవల్ల రాజకీయాలలో మహిళలకు ఇతోధిక అవకాశాలు ఏర్పడ్డాయని నమ్ముతున్నారా?

జ :—నేను ప్రధానమంత్రి పదవిని స్వీకరించడం భారతదేశంలో ఎవరికీ ఆశ్చర్యకరంగా లేదు. అనేక సంవత్సరాలుగా ఇక్కడ మహిళలు స్వాతంత్ర్య పోరాటంలో, రాజకీయాలలో, ప్రజాజీవనంలో ప్రముఖ పాత్ర వహిస్తూవచ్చారు. మా దేశంలో మహిళలు ఇంజనీర్లుగా, గవర్నర్లుగా, రాయబారులుగా, న్యాయమూర్తులుగా, దౌత్య వ్యవహర్తలుగా, పరిపాలకులుగా పనిచేస్తున్నారు. అనేక గ్రామ పంచాయితీలలో మహిళలు సభ్యురాండ్రుగా ఉంటున్నారు. కొన్ని పంచాయితీలు పూర్తిగా మహిళా సభ్యురాండ్రతోటే నడుస్తున్నాయి. కాబట్టి నేను ప్రధానమంత్రిని కావడం పాశ్చాత్యదేశాలలో భావించేటంత వింత ఏమీ కాదు. ప్రపంచజనాభాలో స్త్రీలు సగానికి సగం ఉన్నారు. కనుక ప్రతి రంగంలోనూ వారెంతో బ్రహ్మాండమయిన ప్రముఖ పాత్ర వహించవలసి ఉంటుంది. నేను ప్రధానిని అయినా, కాకపోయినా ఈ మౌలిక సత్యాన్ని మాత్రం గ్రహించవలసి ఉంటుంది.

ప్ర :—చైనావారు దాడిచేసే పక్షంలో అమెరికావారు వైమానికరక్షణ కలుగ జేస్తామని చేసిన వాగ్దానం ఇంకా అమలులో ఉన్నట్లే భావిస్తున్నారా?

జ :—ఇది యథార్థ విషయాలతో సంబంధంలేని ప్రశ్న. 1962 నాటికంటే ఎక్కువ సమర్థంగా భారతదేశం యీ నాడు చైనానుండి తనను తాను రక్షించుకో గలదు. మళ్లీ దాడి జరిగేపక్షంలో భారతదేశం తన శక్తినంతనూ వినియోగించి ఆత్మరక్షణ చేసుకుంటుంది. మా శక్తిసామర్థ్యాలను ఋజువు చేసుకోగలమన్న నమ్మకం మాకుంది. ఐతే వైమానిక రక్షణ విషయంలో అమెరికా-భారతదేశాల మధ్య ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ సైనికఒప్పందం ఏమీ లేదు.

ప్ర :—ఒకవంక ప్రచ్ఛన్నయుద్ధం సాగుతూండగా భారతదేశం రష్యా, అమెరికాదేశాలతో సమానంగా సత్సంబంధాలు సాగించగలదా?

జ :—అన్ని దేశాలతోనూ మైత్రీ సంబంధాలు నెలకొల్పుకోవాలనే భారతదేశం ఆకాంక్ష. అమెరికా, రష్యా దేశాలతో అటువంటి సంబంధాలే ఉన్నాయి. గౌరవ ప్రదమయిన షరతులపై చైనాతోకూడా పరిష్కారం కుదుర్చుకోడానికి సిద్ధంగానే ఉన్నాం. కాని భారతదేశంపట్ల చైనా వహిస్తోన్న శత్రుత్వ వైఖరిలో మార్పు వచ్చిన సూచనలేవీ ఇటీవల కనిపించడంలేదు.

మీ కొడుకు లిద్దరూ దూరదేశంలో—ఇంగ్లండులో—ఉంటూవుండడంచేత ఒంటరితనం అనిపించదా అని మరొకవిలేఖరి అడిగాడు. "నాకు ఒంటరి తనాన్ని అనుభవించడానికి వీలేచిక్కదు. కాని నా పనే ఒంటరిపని," అని ఆమె జవాబిచ్చింది.

ఆమె విషయంలో అమెరికా ప్రభుత్వానికీ, అమెరికన్ ప్రజలకూ గల కుతూహలాన్ని ఫిలడెల్ఫియా బులెటిన్ వాషింగ్‌టన్ విలేఖరి పంపిన నివేదికవల్ల స్పష్టమవుతుంది. ఇందిరాగాంధీ రావడానికి సరిగ్గా ముందురోజున :-

వాషింగ్‌టన్ :-విదేశీప్రముఖుల రాకపోకలకు సాధారణంగా బాగా అలవాటు పడిపోయిన ఈ నగరప్రజలు భారత ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ ఆగమనానికి అత్యంత ఉత్కంఠతో నిరీక్షిస్తున్నారు. ఇక్కడికి వచ్చిన ప్రభుత్వాధినేతలలో మొదటి మహిళ యీమెయే. ఆమె ఏలాటిదో, యాభై కోట్ల ప్రజల ప్రతినిధిగా ఆమె ఎలా వ్యవహరిస్తుందో చూడాలని వాషింగ్‌టన్ ఎదురు చూస్తోంది.

* * *

చిట్టచివరకి విలియమ్స్‌బర్గ్‌నించి ఆమె హెలీకాప్టరులో వచ్చి వైట్ హౌస్ (అధ్యక్షభవనం) ముందుగల పచ్చిక మైదానంలో దిగనేడిగింది. వాషింగ్‌టన్ నగరం ఆనాడు సందర్శించినది అంత పొడుగూ, మరీపొట్టీ కాని సుందర మహిళను. భారతదేశపు పట్టుచీరె ధరించిం దామె. తలలో స్వల్పమయిన పలిత కేశకుంజం మొదలుకుని ఎత్తుమడమల పాదరక్షలవరకూ ఆపాదమస్తకమూ ఎంతో శుభ్రంగా కనిపించింది. అందమయిన ఆమె కుమారులిరువురూ కూడా ఆమె వెంటే ఉన్నారు. అధునాతన మహిళగానే కనిపించినా కొడుకు లిద్దరూ హెలీకాప్టరు తాలూకు ప్రొపెల్లర్సుకు దూరంగా తప్పుకున్నారో లేదో-కడగంట కనిపెడుతూండే మాతృవాత్సల్యం ఆమెలో లోపించలేదు. సునిశిత పరిశీలకుడయిన విలేఖరి ఒకడు :-

"వైట్‌హౌస్ పచ్చిక మైదానంలో బారులుతీరి నిలిచిన బలాలముందుగా ప్రెసిడెంట్ జాన్సన్‌ను అనుసరించి వెళ్ళేటప్పుడు ప్రధానమంత్రికి ఉండవలసిన ఆత్మవిశ్వాససూచకములయిన పెద్ద అంగలు వేసుకుంటూ ఆమె ముందుకు సాగిపోవడం వాషింగ్‌టన్ నగరపౌరులు తిలకించారు" అని అభివర్ణించాడు.

ఆ విలేఖరి యాదాలాపంగా పేర్కొన్న ఈ అంశం అమెరికన్ ప్రజలలో ఇందిరాగాంధీ కలుగజేసిన అభిప్రాయాన్ని అభివ్యక్తీకరిస్తోంది. ఆమెను కలుసుకున్న వారిలోనూ, వీధులగుండా కారులో వెడుతున్నప్పుడు చూడగలిగినవారిలోనూ, టెలివిజన్ తెరపై ఆమెను దర్శించిన వారిలోనూ ఇవే భావాలు కలిగాయి. ఆమె అందమయినదీ, విద్యాధికురాలూ, రాజనీతివేత్తలకు కావలసిన స్థితప్రజ్ఞత్వమూ, ఖాతీ, ఆత్మవిశ్వాసమూ కలది. ఉపాధ్యక్షుడు హంఫ్రీ ఆమెను ఆదివరకే "గణనీయమయిన ప్రజ్ఞగల రాజనీతిజ్ఞురాలు" గా వర్ణించాడు. ఆమె భావాలలోనూ, మాటలలోనూ గల సౌకుమార్యానికి ముగ్ధుడయిన ప్రెసిడెంట్ జాన్సన్ విజ్ఞానవంతాలయిన ఆమె మనోభావాలుకూడా విజ్ఞానవంతమయినవనీ, రాజకీయ సమస్యలనూ, పరిస్థితులనూ

పరిష్కరించ గలిగిన శిక్షణ ఆమె అనేక సంవత్సరాలపాటు పొందినదనీ త్వరలోనే గ్రహించ గలిగాడు. ఆమె మర్యాదగా, చక్కగా, మృదువుగా మాట్లాడుతుంది. కాని భారతదేశ విధానాలకు సంబంధించిన మౌలిక సమస్యలలో ఈషణ్మాత్రమూ లొంగే అవకాశం ఇవ్వదు. గాంధీ, టాగూర్‌వంటి మహామహుల చరణసన్నిధిని మెలగి, జవహర్‌లాల్ నెహ్రూవంటి తండ్రి చేతులలో పెరిగిన ఆ బాలిక అమెరికా అధ్యక్షుణ్ణి చూసి బెదిరి లొంగిపోవడ మన్నది జరిగే పనికాదు.

ఏ దేశాలమధ్యనయినా ఉండే సంబంధాలు ఆయా దేశాల రాజకీయ సిద్ధాంతాలూ ఆర్థిక ప్రయోజనాలు ఆధారంగా రూపొందుతూ ఉంటాయి. అంతేకాని దేశాల అధినేతలు వ్యక్తిగతంగా కలుసుకున్నంత మాత్రంచేత తీవ్రమయిన మార్పులు రావు. కాని వ్యక్తిగత దౌత్య సంబంధాలవల్ల ప్రయోజనం లేకపోలేదు.

ఆయా ప్రభుత్వాలు అనుసరించే కర్కశవైఖరి కొంతవరకు మెత్తబడడానికీ, జాతీయ లక్ష్యాలూ, విధానాలను వివరంగా తెలుసుకుని అవగాహన పెంపొందించుకోవడానికీ, విధాన నిర్ణేతలమధ్య వ్యక్తిగతమయిన సంబంధాలు నెలకొల్పుకోవడానికీ, రెండుదేశాల రాజనీతివేత్తలూ దూరంగా ఉండి పరస్పర వాగ్వాదాలలో నిమగ్నం కావడంవల్ల అనవసరంగా ఉత్పన్నమయిన అంతర్జాతీయ స్పర్ధలను తొలగించడానికి దోహదం చేస్తాయి ఈ సమావేశాలు.

అమెరికావారి పలుకుబడికీ, మాటలకూ లోబడి ఆమె వారు చెప్పినట్లల్లా తల ఊపుతుందని భావించిన అమెరికాలోని ఆశావాదులూ, భారతదేశంలోని నిరాశావాదులూ కూడా వేసుకున్న అంచనాలు తలక్రిందు లయినాయి. కాని ఆమె సందర్శనవల్ల అక్కడి విధాన రూపకల్పనకు కారకులయినవారిలో భారతదేశం అనుసరిస్తున్న అలీనవిధానంపట్ల అధికమయిన అవగాహన ఏర్పడింది. వియత్నాంలో అమెరికావారు అనుసరిస్తున్న విధానాలను ఆమె బాహాటంగా నయితే విమర్శించలేదు గాని వాచ్యంగానూ, ధ్వనిసూచకంగానూ కూడా వియత్నాంలోని అమెరికన్ బలాల చర్యలకు ఆమె సమ్మతి తెలపలేదు. ఆతిథ్యం ఇచ్చే గృహస్థుపట్ల మర్యాద భంగం కాని తీరులో ఆమె భారతప్రభుత్వ విధానాలూ, లక్ష్యాలూ బాగా, నిష్కర్షగా తెలియజేసింది. ప్రెసిడెంటు జాన్సన్‌తో ఆమె జరిపిన మంతనాలేవీ బహిర్గతం కాలేదు. కాని ఇందిర ఏయే అంశాలను గురించి మాట్లాడిందో గ్రహించడం కష్టంకాదు. పత్రికల వారికీ, టెలివిజన్ ప్రసారకులకూ ఇచ్చిన అనేక ఇంటర్వ్యూలలో ఆమె వివిధ అంశాలపై తన అభిప్రాయాలను వెల్లడించింది.

పురుషులకు తప్ప ప్రవేశంలేని నేషనల్ ప్రెస్‌క్లబ్ వాషింగ్‌టన్ సమావేశంలో ఆమె ప్రసంగం నూతన సంప్రదాయానికి నాందీప్రస్తావన అయింది. ఆ క్లబ్బు చరిత్రలో ప్రప్రథమంగా ఇందిరాగాంధీ ఆగమనం సందర్భంగా ఏర్పాటయిన విందుకు

మహిళా విలేఖరులను కూడా ఆహ్వానించారు. ఆమె తన ప్రసంగాన్ని ఈ సంఘట నతోనే మొదలుపెట్టింది. "మహిళావిలేఖరులు కూడా ఇక్కడ హాజరయినందుకు నాకు మరీ సంతోషంగా ఉంది." అని ఆమె అనగానే కరతాళధ్వనులు చెలరేగాయి. "మా తండ్రిగారు ఇక్కడ ప్రసంగించినప్పుడు నేను కూడా వచ్చి ఉంటే నన్ను లోపలికి రానిచ్చేవారా అని నా కాశ్చర్యం కలుగుతుంది'' అని కూడా అన్నదామె. "ఈ స్థానిక తగాయిదాపై ఆమె ఛలోక్తి విసరడంతో సదస్యులందరూ ఆమె చేతిలో కీలుబొమ్మలయినారు'' అని వాషింగ్టన్ స్టార్ పత్రిక వ్రాపింది. ఆమె ప్రసంగం తొలిభాగం నెహ్రూవలె భాషాసౌకుమార్యాన్నీ, వేదాంత ప్రగాఢత్వాన్నీ ప్రతిబింబిం చింది'' :-

"ఈవేళ మీతోటీ, మీ ద్వారా అమెరికన్ ప్రజలతోటీ కొంత మాట్లాడ దలిచాను. నేను భారతదేశాన్ని గురించి—ఒక ప్రాచీన దేశాన్ని గురించి— ఒక నవదేశాన్ని గురించి, శీఘ్రగతిన అభివృద్ధి చెందుతూన్న దేశాన్నిగురించి మాట్లాడబోతున్నాను. అనేక శతాబ్దుల అనుభవాలు కరడుగట్టిన భారత దేశాన్ని గురించి మాట్లాడతాను. చరిత్రాత్మక ఘట్టంలో ఉన్న మేము ఆంత రంగిక సంఘర్షణలతో, ఉద్రిక్త పరిస్థితులతో జీవించడం అలవరచుకున్నాం. అభ్యుదయ సూచకమయిన ఇబ్బందులుగా వీటిని మేము పరిగణిస్తాము."

భారతదేశం ఎదుర్కొవలసి వస్తూన్న సమస్యలను అల్పమయినవిగా ఆమె చిత్రించలేదు. అలాగని భారతదేశ ప్రాముఖ్యాన్ని కించపరచనూ లేదు. "ఉత్తర, దక్షిణఅమెరికాలలోని జనాభానంతటినీ మించిన జనాభా కల దేశంతో ప్రపంచ జనాభాలో 1/7వ వంతు ప్రజలతో మీరు వ్యవహరిస్తున్నారు''. అమెరికా వలెనే భారతదేశంకూడా ప్రజాస్వామిక దేశమని ఆమె ఉద్ఘాటించింది.

కాని భారతదేశ లక్ష్యం మాత్రం ప్రజాస్వామిక సోషలిజం అన్న సంగతిని వక్కాణించడానికి ఆమె వెనుకాడలేదు. అలీన సిద్ధాంతాన్నీ, శాంతియుత సహజీవనాన్నీ బహిరంగంగా ఉద్ఘాటించి ప్రచ్ఛన్నయుద్ధ తంత్రజ్ఞులకు తీవ్రమయిన ఆశాభంగం కలుగజేసింది. సోవియట్ యూనియన్‌తోనూ, ఇతర కమ్యూనిస్టు దేశాలతోనూ భారతదేశం మైత్రిని ప్రకటించడం వారికి నిస్పృహ కలిగించింది. ఆ సమావేశం లోనూ, దరిమిలా టెలివిజన్‌లో ప్రసారమయిన గోష్ఠులలోనూకూడా వియత్నాంపై విలేఖరులు వేసిన ప్రశ్నలకు జవాబిస్తూ అమెరికావారి ఇబ్బందులపట్ల ఆమె సాను భూతిని వ్యక్తం చేసింది. కాని వైమానికుల దాడులను తాత్కాలికంగా నిలిపివేయాలని అప్పట్లో చేసిన నిర్ణయాన్ని పొడిగించనందుకు ఆమె విచారాన్ని వ్యక్తం చేసింది.

నేషనల్ ప్రెస్ క్లబ్‌లోనూ, ఎకనమిక్ క్లబ్‌లోనూ ఆమె చదివిన ప్రసంగా లలో కనీసం కొంత భాగమయినా నిపుణులు తయారుచేసినవి కావచ్చు. కాని ఆమె

అసలు వ్యక్తిత్వమూ, ఆత్మవిశ్వాసమూ, రాజకీయ స్థితిగతులపై ఆమెకు గల అవగాహనా టెలివిజన్ కార్యక్రమాలలో ఆమె పాల్గొన్నప్పుడు వ్యక్తమయినాయి. అక్కడ పృచ్ఛకులకు ఎటువంటి ప్రశ్ననయినా అడిగే స్వేచ్ఛ ఉంది. "పత్రికల వారితో సమావేశం'' అనే కార్య క్రమంలో, కొరుకుడుపడని నలుగురు పత్రికల వారితో (వారిలో ఒక మహిళ కూడా ఉంది) జరిపిన గోష్ఠిలో వారి ప్రశ్నలకు, ఆమె, జంకకుండా అంతవిసురుగానూ, సమాధానాలు ఇచ్చింది. ఇది ఆమెకు అత్యంత క్లిష్టతరమయిన అనుభవం కావచ్చు. కాని దాని నామె అతిసహజంగానే ఎదుర్కొన్నది. వారు వేసిన ప్రశ్నలలో కొన్ని మోటుగా కూడా ధ్వనించాయి. అయినా ఆమె ఏమాత్రమూ చలించక తగు సమాధానా లిచ్చింది:

ఫిలిప్ పాటర్ (బాల్టిమోర్ సన్) :—శ్రీమతి గాంధీ: భారతదేశంలోని కాంగ్రెసు పార్టీ అధినేతలు మిమ్మల్ని ప్రధానమంత్రిగా ఎన్నుకోవడానికి మీరు నెహ్రూ గారి కుమార్తె కావడమూ, మహాత్మాగాంధీవల్ల ప్రఖ్యాతి కెక్కిన "గాంధీ" అన్న పదము మీ పేరులో వుండడమే కారణమనీ, రానున్న ఎన్నికలలో మీద్వారా విజయం సాధించవచ్చుననే వా రలా చేశారనీ భావిస్తున్నారు. ఎన్నికలు పూర్తికాగానే మీరు పదవినుంచి విరమించుకునే ఆలోచన ఏమయినా ఉందా?

శ్రీమతి గాంధీ :—నాపనిని సక్రమంగా నిర్వర్తించడం తప్ప నాకు వేరే ఆలోచనలేవీ లేవు.

పాటర్ :—స్త్రీపాలనను భారతీయులు ఏవిధంగా సహిస్తున్నారని నేను మిమ్మల్ని అడగబోవడం లేదు. కాని భారతదేశ ప్రమాణాలనుబట్టి చూస్తే అంతపెద్ద దేశాన్ని పాలించగలిగిన వయస్సు మీకు ఉన్నదనే అనుకుంటున్నారా?

గాంధీ :—యవ్వనం అన్నది దృక్పథాన్నిబట్టే ఉంటుంది. అంటే నాఉద్దేశ్యం మీరు ఇరవయ్యేళ్ళ వాడిని ప్రశ్నిస్తే 40, 48 ఏండ్లవాళ్ళే బాగా వృద్ధులన్నట్లు మాట్లాడతారు. 80 ఏండ్ల వారితో మాట్లాడుతుంటే తానింకా యవ్వనంలోనే ఉన్నట్లు ఆయన భావించుకుంటున్నాడని విదితమవుతుంది. అనుభవాన్నిబట్టిచూస్తే నేను బాగా వృద్ధురాలిననే అనుకుంటాను.

పాటర్ :—ఒకప్పుడు మీ తండ్రిగారిని ఎక్కువగా కలుసుకుంటూండిన కృష్ణమీనన్ మీతోటలో తచ్చాడతాడేగాని మీతో మాట్లాడేందుకు లోపలికి అడుగుపెట్టడని వింటూంటాం. శ్రీ మీనన్‌తో మీకు ఎటువంటి పరిచయం ఉన్నదీ చెబుతారా, దయచేసి?

గాంధీ:—అది ఇదివరలో ఎలాగుండేవో ఇప్పుడూ సరిగ్గా అలాగే ఉన్నది. అంటే సత్పరిచయమని అర్థం. నన్ను చూడకుండా నా తోటలో ఎన్నిసార్లు తచ్చాడేవాడో మాత్రం నే నెరుగను. నేను ప్రధానమంత్రినయినాక రెండు మూడుసార్లు కలుసుకున్నా ననుకుంటాను.

ఆమె జరిపిన గోష్ఠులన్నిటిలోకీ అత్యుత్తమ మయినదీ, అతిస్వేచ్ఛగా సాగినదీ—భారతదేశంలోని మాజీ అమెరికా రాయబారి ప్రొఫెసర్ గాల్‌బ్రెయిత్‌తో టెలివిజన్‌లో ఆమె జరిపిన చర్చ. ఆయనకు భారతదేశం విషయంలో గల పరిజ్ఞానం దృష్ట్యా కేరళ కమ్యూనిస్టులనించి కంగారూ వర్ణ చిత్రాలవరకు, భారత-పాకిస్తాన్ సంబంధాలనించి డీ. యం. కె. (ద్రావిడమున్నేత్ర కజగం) వరకూ కుటుంబ నియంత్రణ, సంతాన నిరోధన విధానాలతోసహా ఎన్నో విషయాలపై ప్రశ్నలు వేశారు. ఆ చర్చ సంగతిసందర్భాలు పూర్తిగా తెలిసిన, స్వతంత్ర భావాలుగల ఇద్దరు వ్యక్తులు ఒకరి భావాలను, అభిప్రాయాలను ఎదటివారు తెలుసుకునేందుకు సాగించిన ఉత్తేజకరమయిన సంభాషణ. సిసలయిన స్నేహపూరిత వాతావరణంలో ఆ చర్చ సాగిపోయింది.

అమెరికాలో ఇందిరాగాంధీ నిర్వర్తించవలసిన విధి కేవలం దౌత్య సంబంధ మయినదే కాదు. అక్కడి ప్రజలతో సత్సంబంధాలు నెలకొల్పడానికికూడా ఉద్దేశించబడింది. ఆమె కేవలం తన వ్యక్తిత్వాన్నే కాక భారతదేశస్వరూపాన్ని కూడా వారికి తెలియజెప్పవలసివచ్చింది. "స్నేహితులను సంపాదించడమూ, ప్రజలపై తన ప్రభావాన్ని ప్రసరింపజేయడమూ" ఎలాగో ఆమెకు తెలుసు—కనీసం డేల్ కార్నగీకి తెలిసినంతగా మాత్రం తప్పకుండా తెలుసు. వాషింగ్‌టన్‌లో భారత రాయబార కార్యాలయంలో పత్రికా విషయాల అధికారి అఖిల్ అహ్మద్ చెప్పినదానినిబట్టి అనేక సంవత్సరాలుగా అమెరికాను సందర్శించిన ప్రముఖు లెవరికీ లభించనంత ప్రచారం ఆమెకు పత్రికలద్వారానూ, టెలివిజన్‌ద్వారానూ లభించింది. ఆమె తండ్రి జరిపిన అనేక యాత్రలలో ఏ ఒక్కదానిలోనూ లభించనంత ప్రచారం ఈమెకు లభించిందంటాడు ఆయన. ఆమె మహిళ కావడమే ఇందుకు కొంత కారణమన్న సంగతి విదితమే. ఆమె రాజకీయ భావాలకు ఎంతప్రాధాన్యం ఇచ్చారో,ఆమెధరించేచీరెలకూ, శిరోజాలను తీర్చిదిద్దుకున్న విధానానికీకూడా అంతే ప్రాముఖ్యం ఇచ్చారు.

ఆమె వచ్చేముందు వాషింగ్‌టన్‌లోని పత్రికలలో "మహిళకాబట్టి వైట్‌హౌస్‌కు ఎదురుగా ఉండే ప్రముఖుల అతిథిగృహం - బ్లయర్ హౌస్-లో ఆమె రాణులకు కేటాయించే భాగంలో దిగుతుందా? లేక ప్రధానమంత్రిగా రాజులకిచ్చే విడిదిలో దిగుతుందా" అనే ఊహాగానాలు చెలరేగాయి. ఆమె విడిదిలో ప్రతిగదిలోనూ తండ్రి జ్ఞాపక చిహ్నంగా ఆమె మెచ్చుకపడే ఎర్ర గులాబీలు ఎన్నెన్ని ఉంచినదీ పెద్ద ప్రచారం సాగిపోయింది. ఈ రకం ఊహాగానాలు సాగించే విలేఖరులకు పెద్ద పండుగ—ప్రెసిడెంట్ జాన్సన్ తన అతిథికి వీడ్కోలు చెప్పేందుకు భారత రాయబార కార్యాలయంలో జరుగుతున్న విందుకు అనుకోకుండా హాజరయిన సంఘటన జరిగిన రోజు. టెక్సాస్ రాష్ట్రీయులకు సహజమయిన ఇష్టాగోష్ఠి ధోరణిలో, ఆయన, పిలవకుండానే విందుకు ఉండిపోయినాడు. అంతేకాదు. అటువంటి విందులలో ధరించవలసిన

లాంఛన ప్రాయమయిన దుస్తులకోసం మళ్ళీ వెనుక్కి వెళ్ళను కూడా లేదు. జెట్ విమానాల యుగంలో వ్యక్తిగత దౌత్యసరళికి ఆయన వీరోచితమయిన ధోరణిని కొత్తగా మేళవించాడు.

వాషింగ్టన్‌లో ఒక పౌర సంబంధ వ్యవహారాల సంస్థ అధిపతి శ్రీ జానకీ గంజూ, భారత ప్రధాని అమెరికా సందర్శనం సందర్భంగా అనుసంధాన కార్యకలాపాలు నిర్వహించాడు. ఇందిరాగాంధీ జరిపిన పర్యటనవల్ల పౌర సంబంధాల సంస్థలకు పదిలక్షల డాలర్లు ఇచ్చినా జరగనంతపని ఇందిరాగాంధీ ఒక్కతే నిర్వర్తించగలిగిందని జానకీ గంజూ అభిప్రాయం. ఇందిరాగాంధీ నేషనల్‌ప్రెస్ క్లబ్‌లో విందు ఆరగించిన తరువాత మరో రెండువారాలకు నేనక్కడే గంజూతో విందుఆరగించాను. నేను కలుసుకున్న ప్రతి సంపాదకుడూ, విలేఖరీ కూడా "మీ అద్భుతమైన, అత్యద్భుతమయిన ప్రధానమంత్రి" అంటూ తెగ పొగిడేశారు. మేము బార్‌వద్ద నిలబడి పిచ్చాపాటీ మాట్లాడుకుంటూఉంటే నిమిషనిమిషానికీ ఎవరో ఒకరు బోర్‌బన్, లేదా రైనింపిన గ్లాసులతో వచ్చి "శ్రీమతి గాంధీకి శుభాకాంక్షలు" అంటూ మాకు అభినందనలు తెలిపేవారు. ఆ మరునాడు. భారత రాయబార కార్యాలయంలో పత్రికా విషయాల అధికారి అయిన అఖిల్ అహమ్మద్ పత్రికలలో ఆమెను గురించి పడిన భాగాలు కత్తిరించి తయారుచేసిన పెద్దఫైలు ఒకటి నాముందు పడేశారు. దానిలో కేవలం వాషింగ్టన్, న్యూయార్కు, చికాగోలనుంచి వెలువడే మరీ ముఖ్యమయిన పత్రికలలోని భాగాలను మాత్రమే చేర్చారు. వాటిల్లో ముఖ్యంగా ఒకదానిని ఆయన నాకు చూపించారు. ఇదివరదాకా భారత ప్రభుత్వ విధానాలలోనూ, భారత దేశపు వ్యక్తులలోనూ ఎప్పుడూ తప్పులు వెదికే ఒక విమర్శకునిలో వచ్చిన మార్పును అది సూచిస్తోంది. 'వాషింగ్టన్ పోస్టు'లో ఎప్పుడూ వ్రాస్తూండే ఉన్నత సంబంధాలూ, పలుకుబడీ గల విలియమ్ ఎస్. వైట్ భారతదేశాన్ని గురించి ఎన్నడూ స్నేహభావంతో వ్రాసేవాడు కాదని ప్రతీతి. ఈయన ప్రెసిడెంట్ జాన్సన్‌కు వ్యక్తిగత మిత్రుడని కూడా చెప్పుకుంటారు. ఆలాటివాడు మరికొందరు విలేఖరులతో ఒకరోజు ఉదయపు భోజనానంతరం ఇందిరను కలుసుకున్న పిదప "ప్రాక్ పశ్చిమాల మేలు కలయిక—బహుజన శ్రేయస్సు" అన్న శీర్షికను తన పత్రికలో వ్రాస్తూ—

"జాన్సన్ పరిపాలనలో ఇంతవరకూ ఏ రాజ్య అధినేతతో జరిపిన సమావేశంలోనూ కూడా భారత ప్రధాని ఇందిరా గాంధీతో ప్రెసిడెంట్ జరిపిన సమాలోచనలవల్ల జరిగిన బహుజన శ్రేయస్సాధన కృషి జరగలేదు…….. క్లుప్తంగా చెప్పాలంటే ఆమె మితవాదిగా, ఆచరణసాధ్యం కాని సిద్ధాంతాలు పట్టుకుని ప్రాకులాడని నాయకురాలుగా ఉంటుందని ఋజువైంది. ఆమె మన చేతులో కీలుబొమ్మకాదనీ, ఐతే మన గొంతుక కోసేరకం కూడా కాదనీ స్పష్టమయింది"

అని మెచ్చుకున్నాడు.

వైట్‌ను తెలిసిన వారికి ఆయన కలంనించి ఇంతటి మధురవాక్కులు వెలువడడం అపురూపమనిపించింది.

'వాషింగ్టన్ స్టార్' పత్రిక భారతప్రధాని "కోరకరాని కొయ్యేగాని స్త్రీత్వం మూర్తీభవించినది" అనీ, 'ఫిలడల్ఫియాబులెటిన్' అమెరికన్ విలేఖరులకు విశిష్టమయిన వచోధోరణిలో- "సెంట్రల్ కాస్టింగ్ (సినీతారలను బుక్ చేసే హాలీవుడ్ సంస్థ) వారు భారతమాత భూమిక నిర్వహించడానికి తీసుకోతగిన వయస్సులేదు (48 సంవత్సరాలు). అంతపొడగరీకాదు (5'-2"). కాని ఇందిరా ప్రియదర్శిని గాంధీని భారతమాత వాస్తవ పుత్రికగా భావించవచ్చు'' అనీ వ్రాశాయి.

భారతదేశపు ఈ యువప్రధాని అక్కడి ప్రజలలో ఆరాధనా భావాన్ని కలుగజేయలేదు కాని వారిలో మైత్రీభావ పూర్వకమయిన అవగాహననూ, సానుభూతినీ కలిగించింది. అమెరికన్ ప్రజలు భారతదేశ వాస్తవిక స్వరూపాన్ని అవగాహన చేసుకునేటట్లు చేయడానికి ఇదే అవసరం.

ఆమెకు దారి పొడుగునా కేవలం పూలబాటలు పరిచారనీ కాదు. అమెరికాలో పత్రికలకు మంచి స్వేచ్ఛఉంది. భారతదేశం అనుసరించే స్వతంత్ర వైదేశిక విధానాన్నీ, సోషలిస్టు సమాజస్థాపన లక్ష్యాలనూ ప్రతీ సంపాదకుడూ జీర్ణించుకుని మెచ్చుకోవడం అన్నది జరిగేపని కాదు. కనుకనే కొన్ని విమర్శలుకూడా వెలువడ్డాయి. అవి బహు పరిమితమయినవే అయినా అమెరికన్ ప్రజల అభిప్రాయాలను కొంతవరకూ వ్యక్తీకరిస్తాయి.

ఆలబామాలోని 'మొబైల్‌ప్రెస్' అనే పత్రిక "నూతన భారతీయనాయకి బిచ్చానికి వచ్చింది'' అనే శీర్షికను ఒక సంపాదకీయం వ్రాస్తూ –

> "తమ సర్వంసహాధికారాన్ని కాపాడుకో దలిచే భారతదేశమూ, నూతన స్వాతంత్ర్యాన్ని పొందే ఇతరదేశాలూ ముందుగా తమ ప్రజలకు తిండిపెట్టడం నేర్చుకుని, అమెరికా సహాయంపైన ఎక్కువగా ఆధారపడడం మానుకోవాలనే మా అభిప్రాయం"

అని వ్రాసింది.

(భారతదేశంలోని వామపక్ష పత్రికలు ఏ మాటయితే అంటున్నాయో సరిగ్గా అదే మాట అమెరికాలోని దక్షిణ వర్గానికి చెందిన వార్తా పత్రిక అనడం వింతగా లేదూ! కాని, అది గణనీయం.)

అంతకంటే కొంత ప్రఖ్యాతిగల 'చికాగో ట్రిబ్యూన్'అనే మరో పత్రిక "కృతజ్ఞత లేని అర్థి'' అనే శీర్షికను, ఇందిర వెళ్ళిపోయిన రోజున, ఒక సంపాదకీయం వ్రాస్తూ —

"శ్రీమతి గాంధీ ఇంకా మన తీరాన్నిదాటనయినా దాటకముందే వియత్నాం పోరాటంలో అమెరికా విధానాన్ని విమర్శించడం ఏ మాత్రమూ మర్యాదగా లేదు. అదీకాక ఆమె ప్రెసిడెంటుతో మాట్లాడిన అనంతరం కొన్ని రోజులకు టెలివిజన్ కార్యక్రమంలో పాల్గొంటూ చేసిన పనే అది.

"ఉత్తర వియత్నాంపై బాంబులు వేయడాన్ని అమెరికా యీ మధ్య తాత్కాలికంగా నిలిపివేసినప్పుడు ఆ విరామాన్ని పొడిగించి ఉండవలసింది అని భారత ప్రధాని అన్నది..........ఆమె తండ్రి స్వర్గీయ జవహర్‌లాల్ నెహ్రూకు వలెనే ఈమెకుకూడా రాజకీయంగా దూరదృష్టి ఉన్నట్లు లేదు........ భారతదేశం అమెరికాకు అడుగులకు మడుగులొత్తుతూతిరగాలని యీ దేశంలో ఎవరూ అనరు. కాని, భారతదేశం సోషలిస్టు విధానాలను విడనాడి మనదేశంలో మోస్తరుగా ప్రైవేటు పెట్టుబడి దారీ వ్యవస్థను అనుసరించడం వల్ల ఆర్థికంగా మంచి ప్రయోజనం ఉంటుందని మాసూచన"

అని అభిప్రాయాలు వ్యక్తం చేసింది.

ఇందిర ఆమెరికానించి లండన్ వెళ్లి అక్కడ బ్రిటిష్ ప్రధాని హెరాల్డు విల్సన్‌తోనూ, మాస్కో వెళ్ళి అక్కడ రష్యన్ ప్రధాని కోసిగిన్‌తోనూ మంతనాలు జరిపి భారతదేశానికి తిరిగి చేరుకుంది. మార్గ మధ్యంలో ఆమె అమెరికన్ వార్తా పత్రికలలో వెలువడిన ఈ రెండు సంపాదకీయాలలోని ధోరణులనూ, నిశితవిమర్శ లనూ ఆలోచించే ఉంటుంది. అవి వినడానికి ఎంత కటువుగా ఉన్నా శ్రీమతి ఇందిరా గాంధీ ఎదుర్కోవలసిన యథార్థ పరిస్థితులలోని వాస్తవికతను చిత్రిస్తున్నాయి. భారతదేశపు భవితవ్యాన్ని తీర్చి దిద్దేందుకు జరగవలసిన కృషికి భారతదేశమే కార్య రంగమనీ, భారతీయులే బాధ్యులనీ, కాకపోతే కాకతాళీయంగా విదేశీమిత్రుల సాను భూతి, మద్దతు లభిస్తే లభించవచ్చుననీ ఆమెకు గుర్తు చేయడానికి ఈ సంపాదకీ యాలు తోడ్పడ్డాయి.

మహాఖ్యాతి వహించిన డీగాల్‌తో జరిపిన సమావేశం ఉత్తేజకరమయినది. జాన్సన్ దంపతులవద్ద టెక్సాస్ ప్రజలకు సముచితమయిన మర్యాద పొందడం ఆహ్లాద కరమే! శాంతి సంస్థాపనకు పాటుపడే భారతదేశపు వాస్తవమిత్రుడు కోసిగిన్‌తో సంభా షించేందుకు మాస్కోలో ఆగడం ప్రయోజనకరమే! పాకిస్తాన్ మీదుగా విమానంలో వెళ్ళేటప్పుడు అయూబ్ ఖాన్‌కు అభినందనలు తెలిపి ప్రత్యభినందనలు పొందడం ఆశా జనకమేకావచ్చు! కాని వీరందరి కంటేనూ ఎక్కువగా ఆమె శ్రద్ధ వహించి ఆలోచించ వలసినది భారత దేశంలోని కుగ్రామాలలో, మట్టి గుడిసెలలో నివసించే భారతీయులను గురించే. ఈ గ్రామీణ ప్రజ కడుపునిండా తిండికోసం, తన గృహిణికి ఒక కొత్త

చీరకోసం, తన కుమారునికి బళ్ళోచదువుకునేందుకు పుస్తకాలకోసం ఎంతో సహనంతో నిరీక్షిస్తున్నారు. ఎప్పుడో కాని గట్టిగా అడగనయినా అడగరు.

ఆమె న్యూఢిల్లీలో తిరిగి అడుగుపెట్టిన రోజునే—ఆవేళ ప్రొద్దున్న వెలువడిన పత్రికలలో తన రాకను తెలిపేవార్తకు ప్రక్కనే మరొక ముఖ్య వార్తనుకూడా ఆమె చదవవలసి వచ్చింది. కేంద్రానికి రాష్ట్రాలనించి అందిన తాజానివేదికలనుబట్టి 1965-66వ సంవత్సరంలో మొదట్లో అంచనాలు వేసుకున్న 76 మిలియన్ టన్నుల ఆహారధాన్యాల కంటె మరోరెండు మిలియన్ల టన్నులు తక్కువ లభిస్తాయని తేలిందనే ఆ వార్త.

దానితో ఆమెకు తెలిసివచ్చింది—తాను స్వదేశానికి తిరిగివచ్చానని. సుఖతర జీవనానికి పోరాటం సాగిస్తూన్న ప్రజల మధ్యనున్నానని, గొప్ప సవాలును ఎదుర్కోవలసి ఉన్నదనీ, ఇదే తనకు గొప్ప అవకాశమనీ.

# 16

## ఇందిర - భారతేందిర

ప్రజలు ఎలా చూస్తారో
స్వర్గంకూడా అలాగే చూస్తుంది.
ప్రజలకు ఏది వినిపిస్తుందో
స్వర్గానికి కూడా అదే వినిపిస్తుంది!

—మెన్సియస్

మాతుంగనించి దాదర్, వోర్లీ, పెద్దర్ రోడ్డు చౌపతీల మీదుగా మలబార్ కొండల పైగల రాజభవన్ వరకూ వెళ్ళే రోడ్డుకు ఇరుప్రక్కలా జనం క్రిక్కిరిసి నిలబడ్డారు, ఒకరిమీద ఒకరు. ఎంతో ఆదుర్దాతో, ఏ క్షణాన్నయినా రావచ్చునన్న ఆకాంక్షతో నిరీక్షిస్తున్నారు. అనేక భాషలు మాట్లాడే ప్రజలు గల ఆ నగరంలో, అక్కడ చేరిన జనం అన్ని భాషలలోనూ మాట్లాడుకుంటున్నారు.

బొంబాయిలోని జనానికి ప్రముఖుల రాకపోకలు అలవాటే. అందుచేత మరీ ముఖ్యమయిన వ్యక్తి అయితేనేతప్ప సాధారణంగా వారిలో సంచలనం కలుగదు. అక్కడజేరిన గుంపులో తాముకూడా చేరేముందు కొందరు ఆవచ్చేదెవరో నిక్కచ్చిగా తేల్చుకుంటున్నారు.

"ఎవరొస్తున్నారు?"

"ఆమె వస్తోంది."

"ఇందిర వస్తోంది."

"ఆమె యీ దారినే వెడుతుందని మీకు నమ్మకంగా తెలుసా?

ఆ మార్గం పొడుగునా యివే ప్రశ్నలూ, జవాబులు మరాఠీలోనూ, హిందీలోనూ, గుజరాతీ, తమిళం, తెలుగు, మళయాళం, కన్నడ భాషలలోనూ, అక్క-

డక్కడ బెంగాలీ, పంజాబీ భాషలలోనూ—ఇక ఇంగ్లీషు భాషలో సరేసరి! వందేసి సార్లయినా పునరావృతం అయి ఉంటాయి ఈ ప్రశ్నలు.

అక్కడ మాట్లాడే జనంలో కొందరు వృద్ధులకు అదేమార్గంలో వెనక ఊరేగుతూ వెళ్లిన భారతీయ నాయకులు జ్ఞాపకం వచ్చారు—లోకమాన్య తిలక్, మహాత్మా గాంధీ, సర్దార్‌పటేల్, మౌలానా ఆజాద్, సుభాస్‌బోస్, జవహర్‌లాల్ నెహ్రూ-చివరికి లాల్ బహదూర్ శాస్త్రి. బొంబాయి నగర ప్రజానీకం గతంలో వివిధ సందర్భాలలో, వీరిలో ప్రతి ఒక్కరికీ, మనఃపూర్వకంగా, కరతాళ ధ్వనులతో స్వాగతం పలికింది. బహు సూక్ష్మమయిన సామూహికవిచక్షణనుకూడా వారు ప్రదర్శించక పోలేదు. బహు కొద్దిమందికి మాత్రమే అందరూ కలిపి స్వాగత మిస్తూంటారు.

"మీరు ఇందిరను చూశారా?"

"ఆ; నిన్న చూశాను."

"ఇందిర బాగా చిన్నదిగా కనపడుతుంది గదూ?"

"ఇందిర సేనాపతి బాపట్‌ను చూడ్డానికి వెళ్ళింది. ఆమె తండ్రి వచ్చినా అలాగే చేసేవాడు."

"ఇందిర ఆమె తండ్రిలాగే ఉంటుంది......చిరునవ్వు అచ్చంగా అలాగే ఉంటుంది."

"ఇందిర తండ్రిలాగే మాట్లాడుతుంది. ఈవేళటి పేపరులో ఆమె ప్రసంగం చదివావా?"

"ఇందిర రేపు చౌపతీలో మాట్లాడుతుందట-నువ్వు వస్తావా?"

గాంధీని ప్రతీవారూ మహాత్ముడనో, గాంధీజీఅనో, తిలక్‌ను లోకమాన్యుడనో, బోస్‌ను సుబాస్ బాబు అనీ, దరిమిలా నేతాజీ అనీ, జవహర్‌లాల్ నెహ్రూను, ఆయనకు యిష్టంలేక పోయినా పండిట్‌జీ అనీ, చివరికి పిట్టమనిషి లాల్‌బహదూర్‌ను కూడా శాస్త్రి అనీ జనం పిలుచుకునే వారు. కాని నూతన ప్రధానిని మాత్రం ఇందిర అనే అంటారు. ఆమె కేవలం ఇందిరే!

భారతదేశపు ముఖ్య నాయకులలో బహుశా ఆమె ఒక్కతే ప్రజలలో ఆరాధనా భావాన్ని కాక అపేక్షను ఉద్దీపింపజేయగలిగింది అనుకుంటాను.

బొంబాయి నగరవీథులలో, దేశంలోని ప్రతి ఇతర నగరమూ, పట్టణమూ గ్రామంలోనూ ఆమె ఆగమనాన్ని ఆతృతతో ఎదురుచూసే ప్రజానీకంలో ఆమెను గురించిన ఏ భావాలు కలుగుతాయ్? ఆమెనించి వారేమి ఆశిస్తారు? వారి ఆశలను ఆమె ఫలింపజేయగలదా? వారు నిరీక్షిస్తున్నారు. ఆమె వారిని చేరుకుంటుందా?

* * *

భారతదేశంలో, విదేశాలలోనూ ఇందిరాగాంధీని గురించి ప్రజలకు వివిధ రకాల భావాలు కలుగుతూ ఉంటాయి. వారి రూపకల్పనలు ఒక్కొక్కసారి అలుక్కు పోతాయి. మహావ్యక్తి కుమార్తెగా, మహిళా విమోచన కారిణిగా, భారతీయవిప్లవ ఫలంగా రాజకీయారణ్యాలలో దారీ తెన్నూ కానని సుకుమార భావాలుగల నాగరిక యువతిగా (కొందరు ప్రత్యర్థులకు) రానున్న సాధారణ ఎన్నికలలో కాంగ్రెసు పార్టీకి ఓట్లు సంపాదించి పెట్టే ప్రయోజనకరమయిన సాధనంగా ఆమె గోచరిస్తూంటుంది. ఒక్కొక్కప్పుడు రెండు మూడు రూపాలు మిళితమై, అస్పష్ట భావన ఏర్పడుతూ ఉంటుంది.

కనుకనే నేనొకసారి ఆమెను అడిగాను కదా—"భారత ప్రధానిగా మీరు ఎన్నిక కావడంలోని ప్రత్యేకతను మీరే ఏతీరుగా వివరించగలరు?' అని.

ఆమె బూటకపు వినయాన్ని అభినయించి తప్పించుకోలేదు. తన ఎన్నికలో ప్రత్యేకత ఏమీ లేదని ఆమె కొట్టి పారేయ లేదు. కాని ఆమె ఎంతో వివేచనతో, తన ఎన్నికలో గల ప్రత్యేకతను తానే అంచనా వేయడం కష్టమనీ, అది యితరులు చేయ వలసిన పని అనీ అన్నది. తన్ను ఈ ఉన్నతపదవిని అలంకరించవలసిందిగా కోర డంలో అంతర్హిత మయిన భావాలు కొన్ని ఉన్నాయని ఆమె ఒప్పుకుంది. "ఒక విధ మయిన అవిచ్ఛిన్నత—విధానాలలోనూ, వహుశా వ్యక్తిత్వంలోనూ కూడా. ఆ అవిచ్ఛి న్నత కొనసాగ గలదన్న ఉద్దేశంతోనే అయి ఉండవచ్చు" అన్నదామె.

"మీ ఎన్నికకు ప్రగాఢమయిన సాంఘిక, సిద్ధాంత పరమయిన పరిణామాలతో సంబంధం ఉన్నదంటే మీరు ఒప్పుకుంటారా? జవహర్‌లాల్ నెహ్రూతో ముడిపడి ఉన్న ఆశయాలూ, విలువలూ సంరక్షించుకుంటూ దేశాభ్యుదయాన్ని సాధించడానికీ, మీ ఎన్నికకూ సంబంధం ఉన్నదని మీ రంగీకరిస్తారా'' అని నేనడిగాను.

విలువలూ, ఆశయాలతో ముడిపెట్టడం సందర్భోచితమేనని ఆమె అంగీక రించింది. ఐతే అవి కేవలం జవహర్‌లాల్ నెహ్రూ వ్యక్తిగత వారసత్వంకాదనీ, అవి భారతీయ ప్రజల ఆశయాలూ, విలువలేననీ ఆమె వక్కాణించింది.

ఈ విలువలూ ఆశయాలూ ఏమిటో ఆమె స్పష్టం చేస్తూ "మన చరిత్రలోనూ, జీవనంలోనూ పాత కొత్తల కలయికవల్లనే అవి ఉద్భవించాయి" అని ఆమె జవాబు. "ఉదాహరణకు మన సహనభావాన్నీ, విశ్వ జనీనతనూ తీసుకుందాం. బహుశా దీనిలో నుంచే శాంతియుత సహజీవనం ఉద్భవించిందేమో! ఇదేవిధంగా సుఖమయ జీవనం. కేవలం ఐహికమేకాక సాంస్కృతిక విజ్ఞాన రంగాలలో కూడా ప్రజలకు హక్కుం దన్న నవచైతన్యాన్ని పరిశీలిద్దాం. సోషలిస్టు పద్ధతి సామాజిక వ్యవస్థా నిర్మా ణానికి మన పూనికకూ మూలం ఇదే. ఈ భావాన్నే మనం విదేశీ విధానానికి కూడా విస్తరింపజేశాం. మనం ఏ శాంతి స్వాతంత్ర్యాలనూ, అభ్యుదయావకాశాలనూ

కోరుకుంటున్నామో, వాటినే ఇతరులకు కూడా లభింప జేయాలన్న భావంపైనే ఇది ఆధారపడి ఉంది."

"మీ ఎన్నికవల్ల కాంగ్రెసు పార్టీకి, ప్రభుత్వానికీ సోషలిజం ప్రవేశపెట్టేందుకు తగినంత ఉత్సాహం చేకూరిందేమో చెబుతారా?" అని ఆఖరిప్రశ్నగా అడిగాను.

అలాగని ఆమె భావిస్తున్నట్లు కనపడలేదు. కాంగ్రెసుపార్టీ సభ్యులు చాలా మందికి సోషలిజం పట్ల ప్రగాఢమయిన అనక్తి లేదని తాను గమనించినట్లు చెప్పడానికి ఆమె సంతోషంగా లేదు. "కొద్దిమంది దానిని ఆశించే మాట వాస్తవమే. అందుకు పాటుపడగల రనడంలో కూడా సందేహంలేదు" అన్నది. అలాంటి వారిలో తన్ను కూడా మెచ్చుకునే ఉంటుంది ఆమె. కాని మొత్తంమీద వారిలో అటువంటి భావాలు లేవని ఆమె ఆందోళన వ్యక్తం చేసింది. ఆనందదాయకం కాని వాస్తవిక పరిస్థితిని ఎదుర్కొనగలిగిన ధైర్యమే ప్రధానమంత్రిగా, ప్రజానాయకురాలుగా ఆమెకు గల పెద్ద అండ. సాధారణంగా వినాదాలూ, కొన్ని పొడిమాటలూ పట్టుకు ప్రాకులాడేవారికి ఈ గుణం లోపిస్తూఉంటుంది.

ఆమె వ్యక్తిత్వంలో ఇంకనూ వ్యక్తమయ్యే సుగుణాలూ, అవగుణాలూ ఏమిటో?

* * *

ఆమెకు పెద్ద అండ అయిన అంశమే బహుశా మహా ప్రతిబంధకంగా కూడా పరిణమించిందనవచ్చు. జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె కావడంవల్ల ఆమెకు ప్రత్యర్థు లెవరికీ లభ్యం కానంతగా భౌతిక మానసిక శక్తులు లభ్యమయినాయి. అందమయిన నెహ్రూ ఆకృతి లభించడమే నిజంగా ఒక అండ. సమైక్య అరబ్ రిపబ్లిక్‌కు చెందిన సంపాదకుడు మహమ్మద్ హన్సేన్ హైకెల్‌తో మాట్లాడుతూ, రాష్ట్రపతి రాధా కృష్ణన్, "భారతదేశం ఎదుర్కొనవలసిన సమస్యలన్నీ అలాఉంచినా ప్రపంచంలోకల్లా అతి సుందరమయిన ప్రధానిని కలిగిఉండే భాగ్యం భారత దేశానికే లభించింది. కనీసం దినపత్రికలలో, తెల్లారి లేచేటప్పటికి, సుందరమయిన చిత్తరువు మాకు కనబడు తూంటుంది" అన్నారాయన.

సుందర వదనంతోబాటు ఆమెకు తండ్రినించి ముఖ్యమయిన గుణాలు ఎన్నో సంక్రమించాయి. ఆధునిక మనస్తత్వం, సహేతుక దృక్పథం, శ్రమించి పనిచేయ గల శక్తి, పరస్పర విరుద్ధ అభిప్రాయాలను విని సర్దుబాటు చేయగల అలవాటు, వీటన్నింటికంటే ముఖ్యంగా సంపూర్ణ ధైర్య సాహసాలూ ఆమెకు అలవడ్డాయి. ధైర్యం అంటే తండ్రీ కూతుళ్ల పర్వతారోహణలో ప్రదర్శించే ధైర్యంవంటిది మాత్రమేకాదు—నైతికబలం. తాను నమ్మిన దానిని ఆచరించగల ధైర్యసాహ సాలు ఆమెకు అబ్బాయి.

ఐతే ఆమె నమ్మేదేమిటి? ఈసంగతే ఆమెనడిగాను. దానికి ఆమె వెంటనే సమాధానం ఇచ్చింది.

మతమా?

"మతం అంటే దేవాలయాలూ, మసీదులూ, పూజా పునస్కారాలూవంటి తంతేనా అంటే-కాదు. ఇవి మానసికంగా, ఆధ్యాత్మికంగా వికలమయిన వారికి ఊత నిచ్చే సాధనాలు మాత్రమే. అవి అవసరమయినవారు వాడుకుంటే నేనేమీ అనుకోను. వ్యక్తిగతంగా నాకు వాటి అవసరం లేదు. నేను హైందవ తత్వాన్ని నమ్ముతాను. అది హేతుబద్ధమయినది కావడం ఇందుకు కారణం. కాని మానవులను చీలదీసే మతోన్మాదాన్ని మాత్రం నేను తీవ్రంగా ప్రతిఘటిస్తాను" అని వివరించారామె.

మూఢ విశ్వాసాలను ఆమె సహించలేదు. ఎందుచేతనంటే ఇవి "స్పష్టమయిన, సహేతుకమయిన ఆలోచనలకు ప్రతిబంధకం."

కాబట్టి, జ్యోతిషమా? కాదు. ఆమె జ్యోతిషాన్నీ, మంత్ర తంత్రాలనూ విశ్వసించదు.

"మీకు సోషలిజంలో నమ్మకం ఉందా?" అని అడిగాను.

"అవును, ఉంది. నేను నమ్ముతాను." అని ఆమె ఏమాత్రమూ తటపటాయించ కుండా జవా బిచ్చింది.—"కాని ఒకమూఢవిశ్వాసంగా మాత్రం కాదు. స్వలాభ పరాయణత్వం ఏ రూపంలో ఉన్నాసరే తుదముట్టించాలని నా నమ్మకం. సోషలిజం ద్వారానే దీనిని సాధించాలనడంలో సందేహం ఏమీలేదు. చాలామంది ప్రజలు ఆర్థి కంగా దుస్థితిలో ఉన్నారు. ఆర్థికంగా ఉచ్ఛస్థితిలో ఉన్నవారు ఈ వెనకబడిన వారిని తమ కర్కశ పాదాలక్రింద రాచివేస్తున్నారు. దీనిని నిలిపివేయాలి. సుఖమయజీవనం అనుభవించడానికి ప్రజలకు గల హక్కులో నాకు నమ్మకం ఎక్కువ. సుఖమయ జీవ నం అంటే కేవలం భౌతికమయినది కాదు. మానసికంగా కూడా. ఆధ్యాత్మికంగా ఎంతో సుసంపన్నమయిన జీవితం గడిపే అదృష్టం నాకు లభించింది. ప్రజలు దారి ద్ర్యాన్ని అనుభవిస్తూ, కళలనూ, సంస్కృతినీ ఆనందించగలిగిన సమర్థత కోల్పోవ డం చూస్తే నాకెంతో బాధగా ఉంటుంది. సర్వులూ జీవితంలోని సున్నితమయిన విలు వలను కూడా గ్రహించి ఆనందించ గలిగిన పరిస్థితులు కల్పించాలని నా అభిలాష" అన్నదామె.

శాసనరీత్యా నైతికజీవనాన్ని నిర్దేశించడంలో ఆమెకు నమ్మకం లేదు. క్రమ శిక్షణ మోస్తరుగానే నైతిక భావాలుకూడా లోపలినించి రావాలేగాని బలవంతంగా రుద్దితే అంవదేవికావు.

ఆమెకింకా వేటిలో నమ్మకం? యువతలో ఆమెకు విశ్వాసం. కేవలం వినా దంగానే కాదు. చిత్తశుద్ధితో. "నేడు యువజనులలో ఎంతో దూరదృష్టి, నవచైత

వ్యమూ, సాధించాలన్న ఆకాంక్షా వెల్లివిరుస్తున్నాయి. వీటిని దేశ శ్రేయస్సుకు వినియోగించుకోవాలి. ప్రతీ కార్యరంగంలోనూ యువజనులకు పూర్తి అవకాశాలివ్వాలి. జాతీయాభ్యుదయ కృషిలో తామూ భాగస్వాముల మనే భావం వారిలో కలుగజేయాలి." ఇవి కేవలం భావన మాత్రంగానే ఉండిపోయే ఉద్దేశ్యాలు కావు. ఆమె అప్పుడే వాటిని ఆచరణలో పెడుతోంది. ఆర్థిక, పారిశ్రామిక, సాంస్కృతికరంగాలలో యువకులయిన వారితో 'రౌండు టేబిల్ సమాలోచనలు' ప్రారంభించింది. "జీవితంలోని అన్ని రంగాలలోనూ బాధ్యతాయుతమయిన పదవులు వహించడంలో యువజనులకు శిక్షణ ఇవ్వాలి" అంటూ ముగించిందామె.

తండ్రి ధర్మమా అని ఆమెకు రాజకీయంగా అతి సమగ్రమయిన శిక్షణ లభించింది. ఉన్నతపదవిని ఆశించే మరేయువతికీ, యువకునికీ కూడా అట్టి శిక్షణ లభించి ఉండదు. స్వాతంత్ర్య పోరాటంలోని ఒడుదుడుకులు ఆమె అనుభవించింది. భారత దేశంలో, విదేశాలలోనూ ఉన్నమహావ్యక్తులతో భుజాలు రాచుకుంటూ తిరిగింది. అంతర్జాతీయ రాజకీయాలలో వచ్చిన ఉద్యమాలను ఆమె పరిశీలించి వాటిలో జీవించింది. ప్రపంచంలోనూ, దేశంలోనూ ఎదురవుతున్న అత్యంత జటిలసమస్యలను తండ్రి ఎదుర్కొని పరిష్కరించడం పద్దెనిమిది సుదీర్ఘ వత్సరాలు కూడా ఉండి గమనించింది. ప్రపంచంలోని ప్రధాన మంత్రులలోనూ, రాష్ట్రపతులలోనూ ఎవరికీ కూడా రాజకీయ రంగంలో ప్రముఖపాత్ర వహించేందుకు ఇంతటి కూలంకషమయిన ఆజన్మ శిక్షణ లభించి ఉండదు. ఈనాడు వెనక్కి తిరిగి చూసుకుంటే ఈ "భారతీయోద్యమ విప్లవ పుత్రి" ఆదినించీ కూడా దేశంలో తండ్రికి చెల్లుబాటయ్యే రాజరికానికి వారసురాలుగా వర్ధిల్లుతూ వచ్చిందా అనిపిస్తుంది. దీని కంతకూ నెహ్రూపేరూ, నెహ్రూ అద్భుత గాథలూ తోడయినాయి. ఆమె జన్మించినపుడు ఆశీర్వదించిన దేవదూతలు తమకు చేతనయినన్ని వరాలను ప్రసాదించారా అనిపిస్తుంది.

* * *

ఆమెకుగల పెద్ద ప్రతిబంధకం కూడా నెహ్రూ వారసత్వం. ఆమె జవహర్‌లాల్ కుమార్తె కావడంలో తప్పనిసరిగా ఆమెను తండ్రితో పోల్చడం జరుగుతూ ఉంటుంది. 49 ఏండ్ల వయస్సులో ఆయన స్వాతంత్ర్యోద్యమంలో అతి చైతన్యవంతమయిన నాయకులుగా ఉండేవారు. ఆనాడు స్వరాజ్యోద్యమం—కొంతవరకు గూఢంగా, కొంత సంస్కరణోద్యమంగా ఉంటూన్న దానిని విప్లవాత్మకమయిన ప్రజోద్యమంగా తీర్చి దిద్దడంలో ఆయనకూడా చరిత్రాత్మకమయిన పాత్రవహించాడు.

రాజకీయాధికారాన్ని "తెల్ల పాలకులనించి గౌరవర్ణ పాలకుల చేతులకి" బదిలీ చేయడానికే కాక సోషలిజం ప్రాతిపదికగా ఆర్థిక సాంఘిక సంబంధాలను పరిపూర్ణంగా శోళనచేసేందుకు ఉద్దేశించిన ప్రజోద్యమం అది. 49 ఏండ్ల వయస్సులో ఆయన భారతదేశంలో నూతన పునరుజ్జీవనోద్యమానికి నాయకత్వం వహించాడు. పూర్తిగా

ఒకతరం భారతీయ మేధావులను వైజ్ఞానిక దృక్పథంతో, హేతుబద్ధమై, మానవతాభావ పూరిత మయిన నైతిక తత్వంతో, ఆర్థిక, రాజకీయ విషయాలపట్ల విప్లవాత్మకమయిన వైఖరితో ఉత్తేజితం చేసివేశాడు. తన తండ్రి ఆదర్శం ఇందిరకు అనుసరణీయము కావాలి-అవుతుంది. ఆమె తరంవారికి ఆయన ఆదర్శం ఉత్తేజకారణం కావాలి. ప్రమాణం కాజాలదు.

నెహ్రూపేరు ఆమెకు మరోవిధంగా కూడా ప్రతిబంధక మయింది. తానూ, తన కుటుంబమూ జమీందారీ ఛాయాలో ధనికవర్గానికి చెందిన వా రన్నభావం తొలగిం చేందుకు జవహర్‌లాల్ జీవితాంతమూ ఎంతో చిత్తశుద్ధితో పాటుబడినప్పటికీ ఆ భావం కొంత మిగిలే పోయింది. నెహ్రూపేరుగల వారందరిపైనా ఆ ప్రభావం కొద్దిగా గోచ రిస్తుంది.

"మేము నెహ్రూ వంశంవారం" అన్న భావం అంతర్గతంగా ఉండిపోయి ధనికవర్గపు భావానికి భిన్నమయిన నూతనవర్గభావం ఒకటి ఆవేశిస్తుంది. ఈ భావంలోకూడా ఆధిక్యం, ఒంటరితనం గోచరిస్తాయి. కాకపోతే ఇది ధనికవర్గభావం కంటె భిన్నమయిన సందర్భాలలోనే.

అమెరికాలో "కెనెడీ వంశీయులం" అంటూ వినిపించే భావానికీ, దీనికీ ఆట్టే తేడా లేదు. కాని భారతదేశంలో కట్టుదిట్టమయిన కుల, వర్గభేదాలు ఉండడంచేత వెనకబడినవారు ఎక్కువగా ఉన్న జనసామాన్యంనించి సాంఘికంగా, ఆధ్యాత్మికంగా వీరి ఒంటరితనం తప్పనిసరి అయింది. మధ్య తరగతికి చెందిన దిగువవర్గంలో శ్రామిక కుటుంబంలో జన్మించి పెరిగినవారికి జనసామాన్య జీవితంతోనూ, సమస్య లతోనూ సహజంగా తాదాత్మ్యం ఏర్పడినట్లు, నెహ్రూవంశంలో జన్మించినవారికి రాదు. వారు ప్రయత్నపూర్వకంగా అందుకు పాటుబడవలసి ఉంటుంది. ఉద్దేశ పూర్వకంగా "పై అంతస్తునించి దిగి" జనసామాన్యంలోకి చొచ్చుకుపోయి వారి సమస్యలను అర్థం చేసుకునేందుకు మానసికంగా కొంత కసరత్తుచేసి, వారి ఇక్క ట్లలో పాలు పంచుకునేందుకు ఉదాత్తచిత్తంతో కృతనిశ్చయులు కావలసివస్తూం టుంది.

మనకు తెలిసినంతవరకు ఇందిరే "ఉన్నతవంశం" లో జన్మించిన కడపటి ప్రధాని కావచ్చు. రానున్న సంవత్సరాలలో కాంగ్రెస్ పార్టీలో, ఇతరపార్టీలలో విధిగా, జవహర్‌లాల్ నెహ్రూవంటి నాయకులు కాక లాల్‌బహదూర్ శాస్త్రి సంప్ర దాయానికి చెందిన నాయకత్వమే రూపొందుతుంది (కమ్యూనిస్టు పార్టీలో ఎస్. ఎ. డాంగే తరువాత మరో బ్రాహ్మణమేధావి నాయకుడవుతాడని అనుకోను). 30, 40 ఏండ్ల క్రితం పరిస్థితి వేరు. జాతీయోద్యమం బూర్జువావర్గానికీ, "ఉన్నతవంశా"లకూ చెందినవారిని తనలోకి లాక్కుంది. వారిలోని ఉత్తమ ప్రతినిధులను కాంగ్రెస్ నాయ కులను చేసింది. ఆర్థిక ప్రయోజనాల వర్గీకరణధర్మమూ అని ఆ వర్గానికి చెందిన చుదు

కయిన యువకులు ఇప్పుడు స్వతంత్ర పార్టీలో చేరుకుంటున్నారు. వారిలో మేద కులూ, పేదవారూ నేలను నమ్ముకుంటున్నారు. కాంగ్రెసు ప్రభుత్వంలో కూడా భావి ప్రధాన మంత్రులు విద్యా వంతులయిన దిగువ మధ్య తరగతికి చెందినవారే కావడానికి అవకాశా లెక్కువ. గుల్జారీలాల్ నందా, యశ్వంతరావ్ చౌహాణ్, లేక జి. యం. సాదిక్ వలె దిగువ, మధ్య తరగతికో, లేదా కామరాజ్, జగ్జీవనరాంల వలె వెనకబడిన శ్రామికవర్గానికో చెందినవారే ప్రధానులు కావచ్చు.

నెహ్రూలోని ఘనత తన బ్రాహ్మణజన్మకూ, ఉన్నత వంశవాతావరణానికీ, జన సామాన్య జీవనానికీ గల అంతరాలకు వారధులు నిర్మించడంలోనే ఉంది. తన భావనా పటిమతో, దళిత వర్గాలపట్ల సానుభూతితో జన సామాన్యం కోసం చేసిన త్యాగాలూ, పడిన కష్టాలతో, వీటన్నిటి కంటేనూ సమాజంలో ఎక్కువ తక్కువ అనే విభేదాలకు కారణమయిన సాంఘిక, ఆర్థిక శక్తులను శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించడంతో ఈ వారధులు నిర్మించగలిగారు. చాలావరకు ఇందిర కూడా జన్మతః వచ్చిన అవకాశాలనూ, సంఘంలోని ఉన్నతస్థానందృష్ట్యా లభించిన ప్రయోజనాలనూ బుద్ధిపూర్వకంగా వదులుకుంటూనే వచ్చింది. కొన్ని విషయాలలో ఆమె తండ్రికంటె కూడా జన సామాన్యానికి సన్నిహితురాలు. ఆమెకు తండ్రిఅంతగా పాశ్చాత్య భావనాధోరణి అలవడలేదు. కారణం బహుశా ఆయన హారో, కేంబ్రిడ్జిల్లో విద్యాభ్యాసంచేస్తే యీమె ముందు పూనాలో, శాంతి నికేతనంలో, చదువుకున్న పిదపనే ఆక్స్ఫర్డు వెళ్ళడం కావచ్చు. కళలలో, మానవ పరిణామశాస్త్రంలో, ఆదిమవాసుల జానపద సంస్కృతిలో ఆమెకు గల ఆసక్తి మూలకంగా సాంఘికంగా, భావనలలో కాకపోయినా మానసికంగా నయినా భారతీయ జనసామాన్య జీవనంతో సన్నిహిత సంబంధం ఏర్ప రచుకుంది. ఆమెకు పైసలు లెక్కించే అవసరం కాని, రేషను షాపులలోనూ, పాల సరఫరా కేంద్రాలవద్దా, నీళ్ళ కొళాయిల వద్దా లక్షలాది భారతీయ మహిళలవలె క్యూలలో నిలబడే అవసరంకాని లేదు. కాని ఇంటి ఖర్చును ఆదాయానికి సరిపుచ్చు కోవడంలో గృహిణులు పడే పాట్లు ఆమెకు తెలియక పోలేదు. ఆమె పరిమిత ఆదా యంగల తన భర్తతో జీవనం గడిపింది. తండ్రివద్ద గృహ నిర్వాహకురాలుగా ప్రధానమంత్రి జీతం (పన్నులన్నీ పోను) జవహర్‌లాల్ నెహ్రూ వితరణ బుద్ధికీ, అతిథిమర్యాదలకూ చాలదని గ్రహించింది.

ఆమెలో ఇప్పటికీ ఉన్నత వంశీకురాలననే భావమూ, సాంఘికంగా ఉచ్ఛ స్థితిలో ఉన్నాననే తత్వమూ-వీటి ఛాయలు ఇంకా ఏమయినా మిగిలిఉన్నా ఆమెకుగల ప్రగాఢ మానవతా భావంవల్ల కమ్ముకుపోతాయి. ఈ మానవతా భావానికి తండ్రి సమకూర్చినసోషలిస్టు దృక్పథమూ, గాంధీ మహాత్ముని ప్రభావంవల్ల అబ్బిన సేవా కాంక్ష వన్నె తెచ్చాయి. ఆమె చొరవగా ముందుకు వచ్చి వెనకబడిన వారి బాధ్య తలనూ, దుస్థితిలో గలవారి సేవాభారాన్నీ వహించిన సందర్భాలు పదే పదే గోచ

రిస్తూంటాయి. విద్యార్థినిగా ఆమె అంటరాని వాని కూతురిని పెంచుకుంది. జైలులో ఒక నేరస్థురాలి బిడ్డను సాకింది. ఎవరూ అడ్డు పెట్టకుండా ఉంటే ఆమెను పెంచుకుని ఉండేది కూడా. ఆతరువాత జమ్మూనించి వికలాంగురాలయిన ఒక కాందిశీక బాలిక వచ్చింది. ఒక ప్రమాదంలో ఆమెకు రెండు కాళ్లూ పోయాయి. సైనిక ఆసుపత్రినించి కృత్రిమ అవయవాలు తెప్పించి ఇస్తానని ఇందిర ఆమెకు వాగ్దానం చేసింది. ఈ వాగ్దానాన్ని నిలబెట్టుకోవడానికి ఆమె అనేక మాసాల పాటు రక్షణ మంత్రిత్వ శాఖవారితో యుద్ధం సాగించింది. దీనిని ఆమె "కాళ్ళకోసం పోరాటం" అని అభివర్ణించింది. సామాన్య పౌరులకు సైనిక ఆసుపత్రులనించి కృత్రిమ అవయవాలు సప్లయి చేయడానికి నిబంధనలు ఒప్పుకోవని సైనిక అధికారుల వాదం. "మేము ఒకరి విషయంలో మినహాయింపు ఇస్తే ఇంక ప్రతివారూ వచ్చి పీటినిమ్మని వేధించడం మొదలు పెడతారు'' అని వారి వాదం. ఈ రకం పాలకతత్వపువాదం ఆమెకు నచ్చలేదు. చివరికి, ఎలాగయితేనేం, ఆమె ఆ నిబంధనలను అతిక్రమించి కాళ్లులేని ఆ బాలికకు కృత్రిమ అవయవాలు సమకూర్చిపెట్టింది. "ఆమె ఇప్పుడు పెళ్లి చేసుకుని పిల్లలతల్లి అయింది'' అని చెప్పి ఆమెకథ సుఖాంతమయినందుకు ఇందిర ఎంతో సంతోషించింది.

ప్రధానమంత్రి దేశంలో నిర్భాగ్యులయిన పిల్లల నందరినీ చేరదీసి వారి శ్రేయస్సుకోసం వ్యక్తిగత బాధ్యత వహించడం సాధ్యం కాదు. కాని ఒక విధంగా చూస్తే ఆమె వారి నందరినీ చేరదీసినట్లే. ఒకనాడు తన వ్యక్తిగత బాధ్యతగా భావించి ఉదారబుద్ధితో సేవచేసినట్లే ఇప్పుడూ ఆమె ప్రభుత్వం సాంఘిక బాధ్యతగా వీరిని స్వీకరించి వృద్ధిలోకి తేవలసింది. ఇటీవల ఒరిస్సాలోని తపుగు ప్రాంతాలకు వెళ్ళినప్పుడు అక్కడి తగిన పోషణలేని పిల్లల దుస్థితి చూసి ఆమె పడిన వ్యథ ప్రధాన మంత్రిగా ఆమె ఈ సమస్యలన్నీ పరిష్కరించాలని గుర్తించినట్లు విదితమవుతుంది. ఐతే వీటిని పరిపాలనా విషయకమయిన చర్యలవల్ల కాక మానవతా పూర్వకమైన కారుణ్య భావంతో పరిష్కరించవలసి ఉంటుంది.

* * *

కారుణ్యం అంటే ప్రజాస్వామికవ్యవస్థలో పౌరులందరికీ ఉండవలసిన గౌరవ ప్రతిష్ఠలకు భంగకరమయినది కాకూడదని ఆమె ఉద్దేశ్యం. ముందుగా నిర్ణయించుకోకపోయినా వందలాది ప్రజలను ఆమె ప్రతి ఉదయమూ కలుసుకుంటూ ఉండడమే ఇందుకు నిదర్శనం.

ముఖ్య మంత్రులూ, కాంగ్రెసు నాయకులూ రోజూ ఉదయం ఈ విధంగా దర్బారు జరపడం, దర్శనమివ్వడం అలవాటు. కాని అనేక సందర్భాలలో ఇది దర్శనాన్ని కోరేవారిని కించపరచి, పరిదేవనంతో ప్రాకులాడేటట్లు చేయడంగా దిగజారిపోతోంది. రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుని ఇంటిలో, ఆయన పూజవించి విభూతి గంధా

క్షతలతో బయటికి వచ్చేసరికి దర్శనార్థులు ఆ మహానుభావునికి సాష్టాంగ పడడం నేను చూశాను. 'తీన్ మూర్తి' భవనంలో, నెహ్రూ ఇంటివదనించి ఆఫీసుకు బయలు దేరేటప్పుడు ప్రధానమంత్రి కార్యదర్శులు విడివిడిగానూ, వర్గాలుగానూ ఆయన దర్శనానికి పంపుతూండే వారు. కాని ఇందిరమాత్రం స్త్రీ సహజమయిన పరిపూర్ణత్వంతో, సౌకుమార్యంతో ఈ ప్రాతఃకాలదర్శన కార్యక్రమాన్ని ప్రజాస్వామిక సంప్రదాయంగా మార్చింది. దీనివల్ల రోజూ ఆమె ప్రజలనూ, వారి సమస్యలనూ వ్యక్తిగతంగా తెలుసుకునే వీలు కలుగుతోంది.

ఆమె ఇంటిముందు, పచ్చిక మైదానంలో వేసిన షామ్యానాలో ఇష్టాగోష్ఠిగా జరిగే యీ రకం దర్బారు ఒక దానికి నేనుకూడా వెళ్లి ఒకగంటసేపు ఉన్నాను. అక్కడ ప్రధానమంత్రిని చూడదలిచిన వారందరికీ కూర్చునేందుకు దాదాపు 200 కుర్చీలు వేశారు. ఎక్కువమంది వస్తే పిల్లలను తివాసీమీద కూర్చోబెడతారు. ప్రొద్దున్న సరిగ్గా 8-45 కు ఆమె వచ్చి వ్యక్తిగతంగా ఒక్కొక్కరినీ కలుసుకుంటూ ఒక గంటసేపు గడుపుతుంది. నేను వెళ్లినరోజు ఉదయం ఎన్నడూ లేనంతమంది జనం ఉన్నారు. ఫ్రాన్సుదేశపు మహిళా పర్యాటకురాలు ఒకరు జవహర్‌లాల్ నెహ్రూ రాసిన పుస్తకం ఒకటి తెచ్చి, దానిమీద సంతకం పెట్టమని కోరింది.

"ఫ్రెంచి భాషలో ఏమయినా రాయండి" అని ఆమె నడిగింది. ఆమె అభ్యర్థనను మన్నించి ఇందిర ఆ పుస్తకం తీసుకుని తన స్వదస్తూరిలో ఒక వాక్యాన్ని వ్రాసి ఇచ్చింది. అక్కడ కొత్తగా పెండ్లయిన నవదంపతులు చాలామంది ఉన్నారు. తమతో కలిసి ఫోటో తీయించుకుని ఆశీస్సులు అందజేయవలసిందిగా వారామెను అర్థించారు. అలాంటి కోరికను త్రోసి పుచ్చడానికే ఎక్కువ సమయం వృథా అవుతుందని ఆమెకు తెలుసు, దానికంటే ఆ దంపతులతో కలిసి నిలబడి ఫోటోగ్రాఫర్ చేత కెమేరాను క్లిక్ మనిపించనివ్వడమే తేలిక. ప్రధానమంత్రి నిధికి ఒక చెక్కును తెచ్చిన అధ్యాపకుల బృందంకూడా తమతో ఫోటోను తీయించుకోవలసిందిగా ఆమెను కోరారు. ప్లాస్టర్‌తో ఆమె తండ్రి (గుండెలవరకూ గల) విగ్రహాన్ని తెచ్చి ఒకశిల్పి బహూకరించాడు. మధ్య ప్రదేశ్‌లోని ఒక గిరిజనబాలిక పూవులు సమర్పించింది. కాంగ్రెసు వాదులు గుంపులుగా వచ్చి ఆమెకు ముకుళిత హస్తాలతో అభినందనలు తెలిపారు. కేవలం ఆమె దర్శనానికి మాత్రమే వచ్చినట్లు చెప్పుకున్నారు. ఢిల్లీలోని ఒక మురికి పేటలో గల పాఠశాల విద్యార్థుల గుంపుతో గ్రూప్ ఫోటో తీయించుకోవడానికి ప్రధాన మంత్రి సిద్ధపడేసరికి వారికి అమితానందం కలిగింది. ఆతరువాత ఎందరో అర్జీదారులు వచ్చారు. వాస్తవమయినవీ, ఊహాకల్పిత మయినవీ ఇబ్బందులు ఏకరువు పెట్టుకున్నారు. ఆమె వాస్తవమయిన ఇబ్బందులూ, అన్యాయాలూ జరిగిన సందర్భాలను శ్రద్ధగా విని, తన పార్లమెంటరీ కార్యదర్శి డాక్టర్ సరోజినీ మహిషీని, వివరాలు రాసుకుని దర్యాప్తు జరిపి తగు చర్యలు తీసుకోవలసిందిగా కోరింది. ఒరిస్సానించి వచ్చిన

నిరుద్యోగియయిన ఉపాధ్యాయు డొకరు తన భార్యచేతి పాత వెండిగాజులు ప్రధాన మంత్రినిధికి ఇవ్వజూపాడు. పస్తుఇన్న వాటిలాగా కనబడే ఆ అధ్యాపకుణ్ణిచూసి ఆమె వాటిని మర్యాద పూర్వకంగానే నిరాకరించి ధన్యవాదాలు తెలిపింది. ఆ పేదవాని ఉద్యోగం ఎందుకు పోయిందో కనుక్కోవలసిందిగా సెక్రెటరీని కోరింది. బహు చతురతతో పని తెములుచ్చుకుంటూ, హడావుడి పడుతున్నట్లు ఎవరికీ తోచనివ్వకుండా, నిర్ణీత సమయంలో, ఆమె, వచ్చిన వారినందరినీ పంపివేసింది. భారతదేశంలోని కోట్లాది ప్రజలు ఆ షామ్యానాలో లేనిమాట వాస్తవమే. కాని ఆనాడామె భారతదేశం లోని ప్రజల, వారి సమస్యల స్వరూపం ఏమిటో మచ్చుగా గ్రహించగలిగింది.

నేను ఈ వాక్యాలు రాస్తూండేసరికి ఇందిరాగాంధీ ప్రధానియై 3 నెలలకుపైగా అయింది. ఆమె మాంత్రికురాలివలె బ్రహ్మాండమయిన పరిణామాలు తేగలదని ఆశిం చినవారిలో అప్పుడే ఆశాభంగం కలుగుతోంది. వారు తమ నిరాశను వ్యక్తం చేయ సాగారు.

“మనం మొరార్జీదేశాయ్‌నే ఎన్నుకున్నా పరిస్థితి యింతకన్నా అధ్వాన్నంగా ఉండేది కాదు” అని ఒక వామపక్షవారపత్రిక తాలూకు ఢిల్లీలోని ప్రత్యేక విలేఖరి నాతో అన్నాడు. ఎరువుల కర్మాగారం ఒప్పందాన్నీ, అమెరికా విద్యానిధి ప్రతిపాద ననూ దృష్టిలో ఉంచుకునే ఆయన యీ మాటన్నాడు బొంబాయిలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశంలో తన పార్టీ సభ్యులే ప్రభుత్వ విధానాలను విశ తంగా విమర్శిస్తూంటే ఆమె ఎంతో శ్రద్ధగా ఆలకించింది. సరిగ్గా సమావేశం ముగిసే ముందు ఆ విమర్శలకు ఘాటుగానే ఆమె సమాధానం ఇచ్చింది. దానిని విన్న ప్రజలకు ఆమెతండ్రి జ్ఞాపకం వచ్చాడు. “ఆమె భంగిమ, భావాలు అభిప్రాయాలూ - అన్నీ అఖిల భారత కాంగ్రెసు సమావేశాలలో నెహ్రూ ప్రాముఖ్యం వహించిన రోజుల నాటి వాతావరణాన్ని పునస్సృష్టి చేశాయి. తండ్రిలోని ఆ ఉత్తేజమూ, తేజస్సూ ఆ సమయంలో ఆమెలో కూడా కనిపించా”యని లాబీవర్గాలవారు వెంటనే అన్నారు. “కాని ఆయనవలె ఆమె ఆత్మరక్షణకు పూనుకోలేము” అని టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక వ్రాసింది.

ఆ సమయంలో ఆమె చేసిన ప్రసంగమూ, దాని ధాటీ ఆమె ప్రధానిగా ఎలా రూపొందుతోందో సూచించాయి. “సోషలిజం, మతప్రాధాన్య రహితమయిన లౌకిక రాజ్య స్థాపనా, అలీన విధానంద్వారా శాంతి స్థాపనా అన్న ప్రాతిపదిక జాతీయ విధా నాలనుంచి తిరోగమించే ప్రసక్తే లేదు” అని ఆమె, తన పదవికి అర్హమయిన పరిపూర్ణ అధికారంతో, ప్రకటించేసరికి జాతీయ లక్ష్యాలను అంతధాటిగా పునరుద్ఘాటించి నందుకు హర్ష సూచకంగా ప్రేక్షకుల కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. ఇప్పు డామెను ఎవరూ దిష్టిబొమ్మ అని గానీ, కాంగ్రెసు నాయకుల చేతిలో కీలుబొమ్మ అని గానీ, జయపూర్ కాంగ్రెసు సమావేశంలో మోస్తరుగా అనడం మానివేశారు. అప్పు

టికి ఆమె ప్రధానమంత్రిగా ఎన్నికై ఎన్నాళ్ళో కాలేదు. అందుచేత, బహుశా, ఇంకా విలదొక్కుకోకపోవడం వల్లనేమో, బహుమెతకగా మాట్లాడింది. కాని బొంబాయి సమావేశం నాటికి ఆమెలో ఆత్మవిశ్వాసం పుంజుకుంది. అప్పటినించీ ఆమెను మరొకరి చేతిలో కీలుబొమ్మ అని ఆరోపించలేరు. అదేవిధంగా ఆమె చేసిన దానికీ, చేయనిదానికీ కూడా విమర్శించకుండా ఉండనూ లేరు.

"ప్రధానమంత్రిగా ఆమె ఎలా రూపొందుతోంది?"—ఉన్నతపదవిలో ఉంటూ, తద్వారా ఆమెను నిత్యమూ కలుసుకుంటూ ఉండే, ఒకానొక పెద్ద పదవిలో గల వ్యక్తిని ఈ ప్రశ్న అడిగాను. "ఈ యువతి రాజకీయ పరిణతినీ, కర్తవ్య దీక్షనూ, ప్రజాభిప్రాయం పట్ల గౌరవమన్ననలనూ ప్రదర్శిస్తోంది" అని ఆయన అన్నాడు.

ముగ్గురు ప్రధాన మంత్రులతోనూ కలిసి పనిచేసిన కేంద్రమంత్రి ఒకరు, పార్ల మెంటుకు సంబంధించినంతవరకు ఆమె—

"స్పష్టంగా, క్లుప్తంగా మాట్లాడుతుందనీ, తాను నమ్మినదాని పట్ల ధైర్యంతో నిర్ణయాలు తీసుకుంటుందనీ, తన భావాలను సూటిగా చెపుతుందనీ; యీ విషయంలో తనకు పూర్వం ఆ పదవి నలంకరించిన ఇద్దరు మహానాయకులనూ మించిపోయింది"

అనీ అన్నాడు.

మంత్రి వర్గంలో విశేష అనుభవం గల మంత్రి ఒకరు సహచరులపట్ల ఆమె వినయమర్యాదలతో ప్రవర్తించే తీరును బాగా మెచ్చుకున్నారు. "నిర్ణయాలను ఆమె బహుత్వరగా తీసుకుంటుంది. మంత్రివర్గ సమావేశాలలో, పరిశీలించ వలసిన విషయాలెన్ని ఉన్నాసరే, బహు స్వల్పకాలంలోనే తెమిల్చివేయగలదు. అంతమాత్రం చేత మంత్రివర్గ సభ్యులకు తమ అభిప్రాయాలు వెల్లడించే అవకాశం లభించదని కాదు. వారు తమ అభిప్రాయాలను నిర్మొహమాటంగా, పూర్తిగా చెప్తారు. కాని యీ తతంగం యావత్తూ అతి సమర్థంగా ఒక క్రమంతో సాగిపోతోంది".

జూనియర్ ఉపమంత్రిగా ఉంటూన్న ఒక యువతి, "ప్రధానమంత్రి అంటే అమితమయిన గౌరవమూ, ఆరాధనాను. ఇందిరతో పనిచేయడం తనకు గొప్ప అవ కాశ"మని నాతో అంది.

"నావంటి యువజనులు అనేకులకు ఆమె ఎన్నో బాధ్యతాయుతమయిన పదవు లిచ్చింది. ఆమెకుగల యీ విశ్వాసానికి అర్హులమనిపించుకునేందుకు కష్టించి పని చేయాలి. అభ్యుదయకరమయిన ఆమె విధానాలను విజయవంతం చేయాలి." ప్రధాన మంత్రి ఇందిరాగాంధీ ఏది సాధించినా, సాధించక పోయినా ప్రభుత్వంలో ఆమె ద్వితీయ శ్రేణిలో యువజన నాయకత్వాన్ని సృష్టించింది. మంత్రివర్గ సభ్యుల సగటు వయస్సు ఇప్పటికీ 59 లేక 60 యేళ్ళు, కాని 40 వ పడిలో ఉన్న ఉపమంత్రులూ, పార్లమెంటరీ కార్యదర్శులూ కొత్తగా ఎంతోమంది నియమితు లయినారు. కొంత

మంది ఇంకా 30వ పడిలోనే ఉన్నారు. వారిలో మహిళలుకూడా ఎక్కువే. ప్రభుత్వంలోనూ, చివరికి కాంగ్రెసులోనూ కూడా యువజనులయిన ఈ ఆశావాదుల ద్వారా నవచైతన్యాన్ని ఇందిర ఉద్దేశపూర్వకంగా ప్రోత్సహిస్తున్నదేమో అనుకుంటాను. ఇదివరదాకా యీ రెండూ కూడా అతిదీర్ఘకాలంపాటు గౌరవనీయులయిన వృద్ధుల ఆధీనంలోనే ఉంటూవచ్చాయి. మంత్రిత్వంలో తరిఫీదు పొందుతూన్న ఈ యువజనులు ప్రధానమంత్రికీ, ఆమె విధానాలకూ పూర్తిగా బద్ధులయినవారు. వచ్చే ఎన్నికల తరువాత ఆమె మళ్ళీ మంత్రి వర్గాన్ని ఏర్పాటుచేసే అవకాశం వచ్చినప్పుడు తాను తెచ్చిన యీ యువజనులకు మంత్రి వర్గంలో ఉన్నత పదవులను కూడా వప్పగించవచ్చునని తోస్తుంది.

ఇందిర ఇంకనూ అభ్యుదయభావాలు గల మేధావులకు తన మంత్రివర్గంలో స్థానం ఇచ్చి ఉండేదనీ, కాని కేవలం రాజకీయవాదులతో కూడిన పార్లమెంటులోని కాంగ్రెసు సభ్యులనించే మంత్రులను ఎన్నుకోవలసి రావడంచేత జాన్ కెనెడీవలెనూ, అంతకు పూర్వం గల రూజవెల్టువలెనూ ఆమె మేధావులకు బాధ్యతాయుతమయిన పదవులను ఇవ్వలేక పోయిందనీ నేను విన్నాను. కాని ఆమెకు సన్నిహితంగా ఉండే అనధికార సలహాదారులలో ఆర్థిక వేత్తలూ, సాంఘిక శాస్త్రజ్ఞులూ, సంపాదకులూ, ఆచార్యులూ, రచయితలూ, కళాకారులూవంటి మేధావులు ఎందరో ఉన్నారు. పార్లమెంటులో పార్టీలోని సభ్యులకంటే కూడా ఆమె భావాలనూ, అభిరుచులనూ అవగాహన చేసుకుని ఆమె భాషను మాట్లాడ గలిగినవారే యీ సలహాదార్లు.

ఆధునికమై, హేతుబద్ధమై, అభ్యుదయ భావాలు, మతప్రమేయం లేని లౌకిక రాజ్య మనస్తత్వం, వైజ్ఞానిక దృక్పథమూ గల ఇందిరాగాంధి వంటి వ్యక్తి ప్రధాన మంత్రి అయింది కాబట్టి దేశం ఒక్క పెద్ద అంగ వేసి ముందుకు పోగలదని ఆశించినవారు, భారతదేశాన్ని అమెరికాకు తాకట్టు పెట్టిందని ఆమెను అప్పుడే నిందించేవారు కూడా ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రధానమంత్రికి గల అవధులను విస్మరిస్తున్నారు.

జవహర్‌లాల్ నెహ్రూ ఒకసారి నే నాయనను విమర్శిస్తూ వ్రాసిన వ్యాసాన్ని ప్రస్తావించాడు. నేను ఆ వ్యాసంలో భారతదేశం స్వతంత్రమయిన తరువాత సోషలిజాన్ని స్థాపించేందుకూ, స్వలాభపరాయణత్వాన్ని తుదముట్టించేందుకూ చేస్తానని చెప్పినదీ, వ్రాసినదీ చేయనందుకు విమర్శించాను. ఈ విమర్శలనే ప్రస్తావించి ఆయన నాతో "మీకున్న వాక్స్వాతంత్ర్యమూ, ఆచరణస్వేచ్ఛా నాకు కూడా ఉంటే బాగుండును.'' అన్నాడు.

తరువాత మరికొంత కాలానికి మరో సందర్భంలో వివరించినట్లుగా దీని అర్థం ప్రధానమంత్రిగా ఆయనకు ప్రజాస్వామిక విధానానికి అనుగుణమయిన

రాజ్యాంగ నిర్బంధాలు అనేకం ఉన్నాయి. తన విధానాలను మంత్రివర్గ సహచరు లకూ, పార్టీ నిర్వాహక వర్గానికీ నచ్చజెప్పి వారిని కూడకట్టుకోవాలి. వారు మళ్ళీ పార్లమెంటులో తమ సహచరుల ఆమోదాన్ని పొందాలి. అంటే చిట్ట చివరకి ప్రతిదీ ప్రజల ఓట్లపైన ఆధారపడి ఉంటుంది.

కాని జవహర్‌లాల్ నెహ్రూ అధికారంలో ఉన్న 18 ఏండ్లలోనూ ప్రధాన మంత్రి పార్టీయంత్రాంగం రూపొందించిన అధికార సాధనం మాత్రమే కాదనీ, మంత్రి వర్గం ఆదేశాలను బట్టీ, పార్లమెంటులోని మెజారిటీనిబట్టీ నడుచుకునే బొమ్మకాదనీ ఆయన రుజువు చేశాడు. జవహర్‌లాల్ నెహ్రూవలె ప్రధాన మంత్రి దేశశ్రేయస్సుకు అంకితుడయిన ద్రష్ట కాగలిగినప్పుడు ఆయన ఒక నాయకుడుగా, ప్రవక్తగా రూపొంది ప్రజల ప్రగాఢ ఆశయాలను తీర్చిదిద్ది వారికి స్థితిగతులుతెలియజెప్పి వారి ఆలోచనలూ, చేతలూ కూడా వారిశ్రేయస్సుకే దోహదమయ్యే రీతిలో మలుచుకోగలుగుతాడు. ఆయన ప్రాథమికంగా చిట్టచివరకు బాధ్యత వహించ వలసినది మంత్రివర్గానికీ కాదు, తన పార్టీకీ కాదు; తన ప్రజలకే. అటువంటి పురుషుడు కానీ, స్త్రీ కానీ (ఎల్లప్పుడూ కాకపోయినా తరుచుగా జవహర్‌లాల్ నెహ్రూవలె) ప్రజలను ముందుకు నడిపించుకు పోగలుగుతారు. ప్రజాస్వామిక విధానంలోని మందకొడితనం, పరిపాలనా యం త్రాంగంలోని ప్రతిబంధకాలూ వానిని నిరోధించలేవు.

ఆయన కుమార్తె ఇందిరాగాంధి కూడా అటువంటి నాయకురాలేనా? చారిత్ర కంగా తండ్రికి లభించిన ఘనతతో ఆమెను పోల్చడానికి అంగీకరించనివారిలో ఆమె మొట్ట మొదటిది. ఆమె అటువంటి నాయకురాలు కాగలదా? అది కొంతవరకు ఆమెపైనే ఆధారపడి ఉంది. ఆమె పట్టుదలపైనా, భావనాపటిమపైనా, సాంఘిక శక్తుల అవగాహనపైనా, తనశ్రద్ధాసక్తులకు లోను కావలసిన కోట్లాది అభాగ్య ప్రజా నీకంపై ఆమెకు గల కారుణ్యభావంపైనా ఆధారపడి ఉంటుంది. బహుశా అంత కంటే ఎక్కువగా భారతప్రజల పైనకూడా ఆధారపడి ఉంది. నాయకుని ఆంతరంగిక వ్యక్తిత్వానికీ, ప్రజలలో ఆయన మెలిగే వ్యక్తిత్వానికీ మధ్యగల సంబంధ బాంధ వ్యాలు సాంఘిక శాస్త్రజ్ఞులు పరిశీలించ వలసిన సంగతి. దురదృష్టవశాత్తూ ఈ అం శంపట్ల ఇంతవరకూ తగినంత శ్రద్ధ కనిపించడంలేదు. "ప్రజలు తమకు అర్హు డయిన నాయకుణ్ణి మాత్రమే పొందగలుగుతారు అన్నది పూర్తి సత్యం కాదు. ప్రజ లకు తమ సమస్యలూ, వాటి పరిష్కారాలూ తెలిసిన పక్షంలో తమ ఆశయాలకూ, ఊహలకూ అనుగుణంగా తమ్ముఉత్తేజపరచగలిగిన నాయకుణ్ణి సృష్టించుకో గలుగుతా రనడం కొంతవరకు యథార్థం కావచ్చు. అందుచేతనే నాయకుడయినవాడు ముందు స్థితిగతులను తెలియజెప్పి వారిని ఉత్తేజపరచవలసిఉంటుంది. అదేవిధంగా ప్రజలు కూడా తమ నాయకుడి భావాలనూ, చేతలనూ ఉత్తేజితుణ్ణి చేయాలి. చారిత్రకంగా ప్రజలకూ, నాయకుడికీ పరస్పర సంబంధం ఉంది. మనస్తత్వ శాస్త్రరీత్యా ఒకరిపై

నౌకరు ఆధారపడాలి. ముఖ్యంగా ప్రజాస్వామిక విధానంలో నాయకులు నిర్దిష్ట మయిన ప్రజాస్వామిక విధానాలద్వారా ప్రజల ఉద్దేశాలను వ్యక్తీకరించ వలసి ఉం టుంది కాబట్టి ఇది మరీ ముఖ్యం. ఇందిర రాజకీయ వ్యక్తిత్వం అభ్యుదయకర శక్తిగా రూపొందటం అన్నది భారత జాతీయజీవనంలో సోషలిస్టు శక్తులు హేతు వాద పూర్వకమై, అభ్యుదయకరమై, సర్వ జనాదరణ పొందగలిగి, మతప్రాధాన్యం లేని వర్గాలు ఉద్భవించి, క్రమంగా పటిష్ఠం కావడం పైననే ఆధారపడి ఉంటుంది. ఇండియా - ఇందిరా—ఈనాడు పరస్పరం ఆశా నిరాశల మధ్య బందీలై ఉన్నారు. ఇండియా, ఇందిర-వారిలో ఇండియాయే ముందు.

రానున్న ఎన్నికల అనంతరం, కేవలం వాదాన్నిబట్టి చూస్తే, ఇందిర ప్రధాన మంత్రిగా తిరిగి ఎన్నిక కాకపోవచ్చు (ఈ అవకాశం బహుతక్కువ). కాని ఇంకా అనేక సంవత్సరాలపాటు భారతీయ రాజకీయాలలో ఆమె గణనీయమయిన ప్రభావాన్ని కలిగి ఉంటుందనడంలో సందేహం లేదు. ఆమెలో నాయకత్వ లక్షణాలు ఎన్నో ఉన్నాయి. ఒకనాడు భారతదేశంలో మెండుగా ఉండిన గౌరవారాధన పూర్వక మయిన నాయకత్వం కాదది. సహేతుకమయిన ప్రజాస్వామిక నాయకత్వం. జవ హర్‌లాల్ నెహ్రూ కుమార్తెగా ప్రజ లామె మాటలను శ్రద్ధగా ఆలకిస్తారు. ఆయన దర్శించిన ఉజ్జ్వలభవితవ్యంతో ఉత్తేజితమై, ఆయన భాషను మాట్లాడుతుంది కనుకనూ ప్రజలకు ఆమెలోగురి. జవహర్‌లాల్ నెహ్రూ పదవీవిరమణ చేస్తానన్నప్పుడల్లా ఆయన అనుసరించే అభ్యుదయ విధానాలతో నిజంగా ఏకీభవించనివారే ముందుగా ఆయనను పదవీవిరమణ చేయవద్దని ప్రతిమాలుకునేవారు. ఒకసారి మంత్రిత్వ బాధ్యతను వదలివేస్తే అభ్యుదయ నిరోధకులనూ, స్వలాభపరాయణులనూ చీల్చి చెండాడే స్వేచ్ఛ ఆయనకు లభిస్తుందని వారిభయం. అదేవిధంగా ఇందిరకూడా ఎప్పు డయినా పదవిలో లేకపోవడం తటస్థించినా ఆమె అభ్యుదయవాదులకు బలమయిన అండగా ఉండితీరుతుంది. కాని పార్టీతరపున ప్రజలను ఆకట్టుకోగల వ్యక్తిగా, అందరినీ కూడకట్టుకు రాగలిగిన సాధనంగా, ఆమె తండ్రి రూపొందించిన విధా నాలకు చిహ్నమాత్రం అనుబంధంగా, చివరికి, ఆమెకు విశిష్టమయిన వ్యక్తిత్వంతో, తమ పార్టీ ఆమెను వదులుకుని మన జాలదని అనేకులు అప్పుడే భావిస్తున్నారు.

* * *

ప్రజలు ఒకరిపై ఒకరు క్రిక్కిరిసి రోడ్డు కిరుప్రక్కలా బారులుతీరి నిలిచి నిరీ క్షిస్తున్నారు—ఇందిర రాకకోసం, తమవద్దకు ఆమె రాకకోసం!

# ఉపసంహారం

ఆమె ఎన్నికయి, దాదాపు ఒక సంవత్సరం గడచిన పిమ్మట—ఈ పుస్తకం ప్రథమముద్రణం వెలువడిన అర్ధసంవత్సరం తరువాత, ఇంకా, ఇందిరాగాంధీకీ, భారతదేశానికీ మధ్య సంబంధబాంధవ్యాలు ఒకప్పుడు ఆశాజనకంగానూ, మరొకప్పుడు నిరాశాపూరితంగానూ సాగిపోతున్నాయి. ఒక మహిళామణి 50 కోట్లమంది ప్రజల భవిష్యత్తును రూపురేఖలు దిద్దుతూండటాన్ని, ప్రపంచమానవాళి, విస్మయంతో తిలకిస్తున్నది.

కొద్ది ఎత్తులోనే అపుగాక—అయినా, గమనార్హమయినవిధంగా, ఇందిర, అంతర్జాతీయ వ్యవహారరంగంలో అడుగిడిందనడానికి ప్రబల నిదర్శనం ఢిల్లీలోజరిగిన త్రైపాక్షిక "అగ్రరాజ్య సమావేశం". ప్రపంచ నాయకులందరిలోనూ, జవహర్‌లాల్ నెహ్రూకు అత్యంత సన్నిహిత మిత్రులైన టిటో, నాసర్ లిద్దరూ ఆయన కుమార్తెను సోదరుని పుత్రికవంటిదన్న సాదరదృష్టితోకాక, సాటిస్థాయిలో సమానురాలుగా భావించి, వ్యవహరించారు. ఆమెకూడా 'తనమాటే నెగ్గాలి'అన్న పట్టుదల ఏదీ చూపకుండానే, తానూ యోచించగల నన్నట్లు వ్యక్తపరిచింది. నెహ్రూజీ విషయంలో కానవచ్చే ఉణికోద్రేకాలకు లోను కాకుండానే, నెహ్రూజీ ధోరణిలో ప్రసంగించా రామె.

"త్రికరణశుద్ధిగా పాటుబడి, శక్తివంచనలేకుండా, రాజనీతిజ్ఞతను ప్రదర్శించి, శాంతిస్థాపనకృషికీ, ప్రపంచ ప్రజలమధ్య సామరస్య సాధనకూ ఎంతో ఘనంగా దోహదంచేసిన జవహర్‌లాల్‌నెహ్రూ నవభారత మహానిర్మాత...." స్మృతికి జోహారు లర్పించినప్పుడు, ప్రెసిడెంట్ టిటో వ్యక్తపరచింది నెహ్రూపట్ల తనకుగల మక్కువను మాత్రమేకాదు; "ఈ గురుతరమైన బాధ్యత ఇప్పుడు శ్రీమతి ఇందిరా

గాంధీపైన ఉన్నది. ఆమెను మేము చిరకాలంగా ఎరుగుదుము. ఆమె పట్ల మాకు గౌరవభావం ఉన్నది. తమ తండ్రిలోని ఉదాత్త లక్షణాలు ఆమెలో చక్కగా మూర్తీభవించాయి." అని ఆయనగారన్నప్పుడు "ఇది కేవలమూ మర్యాదకోసమని ఉద్దేశించిన పొగడ్తమాత్రమేకాదు" అని చెప్పవచ్చును.

భారతప్రధానమంత్రినిగురించి, ప్రెసిడెంట్ నాసర్ వెలిబుచ్చిన భావాలు మరింత గమనార్హమైనవి. విందు సందర్భంలో ప్రసంగిస్తూ, ఆయన, అంతవరకూ ఇందిరను "ఒక గొప్ప తండ్రి కన్న పుత్రికామణి" గానే ఎరుగుదుననీ, అయితే త్రైపాక్షిక సమావేశంలో ఆమెను "సుప్రసిద్ధుడైన ఒక అధ్యాపకునివద్ద తీర్చిదిద్దబడిన శిష్యురాలిగా దర్శించగలిగాను. పరంపరానుగతంగా సంక్రమించడమన్నది ఎంత ప్రగాఢమయిందో, దానిలో ఎంతటిశక్తి ఉన్నదో గ్రహించగలిగాను. 'పరంపరానుగతము' అంటే-కేవలమూ వంశవృద్ధి అనేకాదు, అంతకన్నా ముఖ్యమైనది. ఒకరిమేధస్సును మరొకరు క్షుణ్ణంగా పుచ్చుకోవడం" అనీ అన్నారు. అంతర్జాతీయరంగంలో, ఇందిర, భారతదేశ పేరు చెప్పగానే, సిసలైన ఒకానొక అలీనదేశం మనోనేత్రాలకు కట్టెలాగా చేయడంలో తోడ్పడ్డారనడం నిస్సందేహం. జవహర్‌లాల్ నెహ్రూ వరవడి దిద్ది పోయిన సంప్రదాయాలను చిత్తశుద్ధితో కొనసాగించే వ్యక్తిగా ఆమె స్థిరపడిపోయారనడంలో సందేహమేమీ లేదు.

అయితే స్వదేశంలోనే, ప్రజ్ఞావంతుడైన తనతండ్రిని సైతం, ఒక్కొక్కప్పుడు, ఉక్కిరిబిక్కిరి చేసిన క్లిష్టసమస్యలు ప్రధానమంత్రిని పట్టి పీడిస్తున్నాయి. ఉత్తరప్రదేశ్ బీహార్‌రాష్ట్రాలలోని కొన్ని ప్రాంతాలలో అతి విషాదకరంగా తయారైన ఆహారపదార్థాల కొరత, సువిశాల ప్రాంతాలకు వ్యాపించి తీవ్రరూపందాల్చిన విద్యార్థుల అలజడి, మహారాష్ట్ర, మైసూరు, మద్రాసు, కేరళవంటి భాషాప్రయుక్తరాష్ట్రాలూ, క్రొత్తగా విభజింపబడిన పంజాబ్, కొన్ని కొన్ని ప్రదేశాలు తమకు చెందాలంటే తమకు చెందాలంటూ ఉద్రేకపూరితంగా వాదులాడుకోవడం, గోవధ నిషేధోద్యమ ఫలితంగా ఉత్పన్నమైన క్లిష్టపరిస్థితివంటి సమస్య లెన్నింటినో ఆమె ఎదుర్కోవలసి వచ్చింది. రాగల మూడుమాసాల

కాలంలోనూ, ఆమె, సార్వత్రిక ఎన్నికల సమరంలో, తన పార్టీకి నాయకత్వం వహించవలసి ఉన్నది. ప్రపంచం మొత్తంమీద, బహుళసంఖ్యాకులైన వోటర్లను దృష్టిలో ఉంచుకొని, పదినెలలుగా, తన ప్రభుత్వమే కాక, కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ గల కాంగ్రెస్ ప్రభుత్వాలన్నిటి చర్యలనూ ఆమె సమర్థించవలసి ఉన్నది. వామ, దక్షిణవర్గాలు రెండింటి తాకిడులనుండీ కాంగ్రెస్ సిద్ధాంతాలనూ, విధానాలనూ కాపాడవలసిఉన్నది. నెహ్రూ నిర్దేశించినప్రకారం. ప్రజాస్వామిక సూత్రాలకనుగుణమైన సోషలిజం, మతప్రాధాన్యరహితమైన లౌకిక ప్రజారాజ్యం, అలీనవిధానంద్వారా శాంతిస్థాపనకు కృషి - అనే మూడువిధానాలపట్లా అచంచలమైన విశ్వాసం ఆమెకు ఉన్నది కనుక ఈ మూడు విధానాలలోనే ఇమిడిఉన్న పార్టీ సిద్ధాంతాలనూ, విధానాలనూ కాపాడటంలో, పెద్ద ఇబ్బందులంటూ ఉండకపోవచ్చును. అయితే, మనజాతిధ్యేయాలుగా సర్వత్రా ఆమోదించిన ఈ విధానాలనుండి, కాంగ్రెస్ ప్రభుత్వాలు ప్రక్కకుమళ్ళిన సందర్భాలను ఆమె సమర్థించుకోవడం, లేదా ఆవిధంగా ఎందుకుగాను జరగవలసివచ్చిందో వివరించడం తప్పనిసరి అవుతుంది. నెహ్రూవిషయంలోలాగే, ఇప్పుడు ఇందిరకూడా, పార్టీలో, సిద్ధాంతపరమైన భారాన్నంతా మోయవలసివస్తుంది.

ఎన్నికల సమయంలో, జవహర్‌లాల్ కుమార్తె, ఇందిరాగాంధీ, కాంగ్రెస్‌పార్టీకి అమూల్యమైన సంపద కాగలదని చాలామంది భావిస్తారు. మరికొందరు 'పార్టీకి ఆమె విలువల్లా అంతవరకే' అని అన్యాయంగా విమర్శిస్తారుకూడా. ఆమె నిజమైన వ్యక్తిత్వానికీ, నాయకత్వానికీ, రాగల కొద్ది నెలల కాలమే గీటురాయి కాగలదు. దబ్బు పంచులమీద ఆధారపడి పనిచేసే ప్రజాస్వామిక వ్యవస్థలో సార్వత్రిక ఎన్నికలంటూ వచ్చినప్పుడు, హేయమైనస్పర్థలూ, ఘర్షణలూ, అవకాశం చూసుకొని కుదుర్చుకొనే రాజీలూ తటస్థపడుతూ ఉండే లక్షణాలే। ఆమె వీటికి ఉక్కిరిబిక్కిరి అయిపోతుందా? లేక, తన తండ్రివలెనే, జాతి ఆశయాలకూ, ఆకాంక్షలకూ ప్రబలమైన చిహ్నంగా భాసిస్తుందా? నెహ్రూ—సార్వత్రిక ఎన్నికలు ఎప్పుడువచ్చినా, పోటీని తమ పార్టీ ప్రయోజనాలకోసం ప్రచారం చేసుకోడానికని కాకుండా, జాతిధ్యేయాలనుగురించి, వోటర్లయిన ప్రజలకు ఎరుకపరచేందుకు వినియోగించే

వారు. విద్యార్థులలో చెలరేగిన అశాంతి అనేక బాహ్యరూపాలను దాల్చింది. అయితే ఇందిరాగాంధీ, ఎంతో సానుభూతితో. హేతువాద బద్ధంగా వ్యవహరించడాన్నిబట్టి చూస్తే, దేశవ్యవహారాల మంత్రిత్వ శాఖవారు అధికారదర్పంతో అనుసరించే దమన నీతికిగానీ, రాష్ట్రాలలో పోలీసు ప్రతినిధుల వైఖరికిగానీ ఆమె కట్టుబడి వ్యవహరించడంలేదన్న ఆశ రేకెత్తింది. పార్టీలోని పెద్దలకు గల నైతిక సంబంధమైన చాద స్తాలూ, మొహమాటాలూ ఆమెకు చాలావరకూ లేవు. కొన్ని ప్రయోజ నాలను సాధించేనిమిత్తం కొంత నిష్కర్షగా, వ్యవహరించగల స్తోమ తునుకూడా ఆమె వెల్లడించింది.

తన మంత్రివర్గంలో కొన్ని మార్పులు చేయడానికని, ఆమె పూనుకొన్నప్పుడు, యుక్తిపరులూ, బలవంతులూ అయిన కొన్ని వర్గాల వారు ఆమె సంకల్పానికి విఘాతం కల్పించాలని ప్రయత్నించారు. కొంత వరకూ వారు సఫలురైనట్లే కనిపించారుకూడా. ఈవిధంగా మొట్ట మొదట కొంత వెనక్కు-తీయవలసి వచ్చినా, ఆమె, చివరకు, మంత్రి వర్గంలో మార్పులు చేయగలిగింది. ఆమె ప్రయత్నాలను వ్యతిరేకించిన వారి వ్యూహాన్ని పూర్తిగా అవగాహన చేసుకొని, తుత్తునియలు చేయ లేక పోయినప్పటికీ, తన అభిమతానికి అనుగుణంగానే, మంత్రివర్గంలో మార్పులు చేయగలిగింది. అయితే ఎన్నికల ప్రచారసమయంలో, వారి వారి ఇష్టాయిష్టాలనుబట్టి, కొందరు ఇటూ మరికొందరు అటూ వర్గాలుగా ఏర్పడతారు. మరి అలాంటప్పుడు, కేవలం తన పార్టీకే విజయం చేకూర్చిపెట్టాలి అనే ఆలోచనకు అతీతంగా వ్యవహరించి, జాతి మొత్తానికీ నాయకత్వం వహించగల గురుతరబాధ్యతలను ఆమె స్వీక రించగలదా? జవహర్‌లాల్‌నెహ్రూ ఆ పని చేయగలిగారు. వివేకం లోనూ, ముందుచూపులోనూ, ఇందిర, తండ్రికి తగిన తనయ అని పించుకొంటుందా?

ఎన్నికల పర్యవసానం ఏమైనప్పటికీ—ఇంకా చాలాసంవత్సరాల వరకూ, పరిణామం ఎలాఉంటుందో చెప్పలేకపోయినప్పటికీ, ఉత్తేజకర మైన భారతరాజకీయనాటకరంగంలో, ఇందిరాగాంధి- కాదు కాదు, ఇందిరాప్రియదర్శిని - నెహ్రూ ప్రముఖపాత్రనే వహిస్తూఉండగలదు.

అత్యున్నతమూర్తియైన తనతండ్రి మార్గదర్శకత్వం క్రింద ఆమె ఏవిధంగా చదువుకొని, శిక్షణపొందిందో, "ఘనతను సాధించేందుకు, ఎన్నివిధాలుగా తర్ఫీదు పొందిందో" చిత్రించడమే ఈ గ్రంథ ఆశయం. ఆమె పదవిలో ఉన్నా, లేకపోయినాకూడా, ఆమె పొందిన శిక్షణ, గ్రహించిన అనేకానేక విషయాలు, తండ్రి చాటున ఆమె గడపిన జీవితం—ఇవన్నీ, భారతీయులకేకాక యావత్ప్రపంచ ప్రజలకూ, ఇకముందుకూడా గణనీయమూ, ఆసక్తిదాయకమూ కాగలవు.

## అనుబంధం - I

# * జాతి నుద్దేశించి చేసిన ప్రసంగం

సరిగ్గా ముప్ఫయ్యారేండ్లక్రితం ఇదేరోజున చరిత్రాత్మకమై ఒడలు పులకింపజేసే స్వాతంత్ర్య దీక్షను వహించిన వేలాది గొంతుకలలో నాదీ ఒక్కటి.

౧౯౪౭ వ సంవత్సరంలో ఆ ప్రతిజ్ఞ నెరవేరింది. ప్రజాస్వామికమూ, మతప్రాధాన్య రహితమయిన లౌకికరాజ్యవ్యవస్థా ఆధారంగా, నూతన అభ్యుదయదేశం ఒకటి ఆవిర్భవించిన సంగతి ప్రపంచం గుర్తించింది. జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానిగా ఉన్న పదిహేడేండ్లలోనూ, మత కుల భాషా వైవిధ్యాలతోకూడిన ఈ దేశసమైక్యత వాస్తవమూపం దాల్చింది. ప్రజాస్వామికవ్యవస్థ జన్మించి వేళ్లూనింది. ప్రణాళికాబద్ధమైన ఆర్థికాభ్యుదయం ద్వారా మనప్రజలకు సుఖజీవనం కలుగజేసేందుకు తొలిచర్యలు తీసుకున్నాం. దళితజాతుల విమోచనానికి భారతవాణి సదా అండగా నిలిచి అనేకులకు ధైర్యసాహసాలను కలుగజేసి వారిలో ఆశాజ్యోతిని వెలిగించింది. శాంతిసాధననూ, హేతువాదాన్నీ, వివిధదేశాలమధ్య స్నేహసామరస్యాలనూ పెంపొందించేదిగా ఈ భారతవాణి దేశసరిహద్దులను దాటి సుదీర్ఘ తీరాలకు వినిపించింది.

బహుస్వల్పకాలమే అయినా చిరస్మరణీయమైన సారథ్యం వహించిన శాస్త్రీజీ తన కుచితమైన రీతిన భారతీయ సంప్రదాయాన్ని సుసంపన్నంచేశారు. జాతీయలక్ష్యసాధనకు జాతిలో ఐకమత్యాన్నీ, కృతనిశ్చయాన్నీ పెంపొందించి ఆయన మనలను విడిచివెళ్ళి పోయినారు. నిన్ననే ఆయన చితాభస్మాన్ని పవిత్రనదీజలాలలో నిమజ్జనం చేసుకున్నాం. ఈ మహాపదకు జాతి యావత్తూ దుఃఖమగ్నమయింది. ఆయనతో అనేక సంవత్సరాలు సన్నిహితంగా ఉండి కలిసి పనిచేశాను కాబట్టి ఆయన లేని లోటు నాకు వ్యక్తిగతంగా మరింత వ్యథను కలుగజేస్తోంది.

మనం ఎదుర్కొనవలసిఉన్న గురుతరసమస్యలను నేను వినీతభావంతో ఎదుర్కొనదలిచాను. ఐతే గాంధీజీ, మా తండ్రిగారూ, వదలివెళ్ళిన సంప్రదాయాలు, భారతప్రజానీకంలో నాకు గల అపారవిశ్వాసమూ నాలో నాకు నమ్మకాన్నీ, బలాన్నీ చేకూరుస్తున్నాయి. భారతదేశం తన అప్రతిహతస్వభావాన్ని పదేపదే ప్రదర్శించింది. గతంలోవలెనే ఇటీవలకూడా

* ప్రధానమంత్రిగా 25-1-1966 వ తేదీనాడు రేడియోలో చేసిన తొలి ప్రసంగం.

కొత్త సవాళ్ళను ఎదుర్కోవడంలో నిస్సంకోచమైన ధైర్యాన్నీ, శక్తిసామర్థ్యాలనూ భారత జాతి ప్రదర్శించింది. ఎటువంటి పరీక్షలను, ఇక్కట్లనూకూడా ఎదుర్కోగలిగిన దృఢమైన భారతీయత రూపొందింది.

వచ్చే కొన్నిమాసాలు మనకు గడ్డురోజులు. తక్షణమే పరిష్కరించవలసిన సమస్యలు అసంఖ్యాకంగా ఉన్నాయి. వానలు సరిగ్గా పడక అనేకప్రాంతాలలో అనావృష్టిపరిస్థితులు ఏర్పడ్డాయి. ఇప్పటికీ వర్షాలపైన ఆధారపడే మన వ్యావసాయిక ఉత్పత్తులు బాగా దెబ్బ తిన్నాయి. విదేశాలనుంచి ఆర్థికసహాయమూ, ఎగుమతులవల్ల ఆదాయమూ మనం ఆశించి నంతగా లభించడంలేదు. విదేశీద్రవ్యలోపంవల్ల పారిశ్రామికోత్పత్తి దెబ్బతిన్నది. అనుకో కుండా వచ్చిపడ్డ ఈ ఇబ్బందులను చూసి మనం నిస్పృహ చెందరాదు. విచలితులం అంత కంటేనూ కాకూడదు. వీటిని ధైర్యంగా ఎదుర్కొందాం. చేసిన పొరపాట్లను గ్రహించి గుణపాఠాలను నేర్చుకుందాం. మళ్ళీ అలాటి పొరపాట్లు చేయకుండా జాగ్రత్తపడదాం. మేము తీసుకునే చర్యలను మీకు వివరించి మీ అండదండలు అర్థించేందుకు నేను ఇదేవిధంగా అప్పుడప్పుడూ మాట్లాడదలిచాను.

అన్నిటికంటేనూ ముఖ్యంగా యీ కరువు సంవత్సరంలో మనప్రజలకు ఆహారం సమకూర్చాలి. ఇదే ప్రభుత్వ ప్రథమ కర్తవ్యం. స్వదేశంలో సేకరించిన ధాన్యాలనూ, దిగుమతిచేసుకున్నవాటినీకూడా సక్రమంగా నిర్వహించి న్యాయంగా పంపిణీ జరిగేటట్లు తక్షణమే తగు శ్రద్ధ వహిస్తాం. రేషనింగు ప్రవేశపెట్టడంలోనూ, ధాన్యసేకరణలోనూ, ఆహారధాన్యాల పంపిణీలోనూ మేము తలపెట్టిన చర్యలను అమలుజరపడంలో అన్నివర్గాలూ, రాష్ట్రప్రభుత్వాలూ సహకరించగలవని ఆశిస్తున్నాను. తీవ్రమైన కరువుపరిస్థితులలోఉన్న కేరళవంటి ప్రాంతాలపట్ల ప్రత్యేకశ్రద్ధ వహించడమవుతుంది. తరుగుప్రాంతాలలో తల్లులకు, పిల్లలకు ఆరోగ్యం మరీ దెబ్బతినకుండా వారి పోషకావసరాలు తీర్చేందుకు ప్రత్యేక కృషి చేస్తాం. కనీసపు ఆహారం సమకూర్చే విషయంలో మనం ఎటువంటి ప్రమాదానికీ అవకాశం ఇవ్వకూడదు. కనుకనే తిండిగింజల లోటు భర్తీచేసేందుకు విదేశాలనుంచి చాలినంతగా ఆహారధాన్యాలు దిగుమతిచేయదలిచాం. సానుభూతితో వెంటనే సహాయం అందజేసినందుకు అమెరికావారికి మనం కృతజ్ఞులం.

అధికోత్పత్తివల్లనే ఆహారసమస్యను పరిష్కరించడానికి వీలవుతుంది. రైతులకు ఇందుకు కావలసిన నీరూ, రసాయనిక ఎరువులూ, హెచ్చు దిగుబడి నివ్వగల కొత్తరకం విత్తనాలూ, సాంకేతిక సహకారాలూ, పరపతి సౌకర్యాలూ కలుగజేయడానికి బాగా ఆలోచించి ఒకపథకం తయారుచేశాం. ఏ ఇతర రంగంలోకంటే కూడా వ్యవసాయరంగం లోనే స్వయంశక్తిని సాధించవలసిన అగత్యం మరీ ఎక్కువ. ఇందుకు అధికోత్పత్తి సాధించాలి. దినదినాభివృద్ధిచెందుతున్న విపరీతమైన జనాభాకంతకూ ఆహారం సమకూర్చడానికే కాక ఎగుమతులకుకూడా అధికోత్పత్తి ఎంతో అవసరం. గ్రామప్రజల శక్తిసామర్థ్యాలనూ, తీరికసమయాన్నీ సద్వినియోగంచేసి వారిని నిర్మాణాత్మక కృషిలో నిమగ్నులను చేసేందుకు

మనం చైతన్యవంతమైన మార్గాలను రూపొందించాలి. గ్రామీణ నిర్మాణకార్యక్రమంలో నవచైతన్యాన్ని తెచ్చి గ్రామాలలో పనివారి ఆదాయం వృద్ధిచెందేటట్లు చూడాలి.

ఆర్థికాభ్యుదయానికి మనం రచించుకున్న వ్యూహంలో ప్రభుత్వరంగానికి ప్రముఖ స్థానం ఉంది. ఈ రంగంలో ఆధారపరిశ్రమలు, విద్యుచ్ఛక్తి, రవాణాసౌకర్యాలు వృద్ధిచేయాలని సంకల్పం. నేటి మనపరిస్థితులలో ఇది వాంఛనీయమేకాదు, అవసరంకూడాను. దీనివల్ల ప్రభుత్వరంగంలో కొత్తపథకాలను ప్రవేశపెట్టి నూతనపరిశ్రమలు, ప్రాజెక్టులు నిర్మించి సంస్థలను సమర్థంగా నిర్వహించి ఇతోధికమయిన పెట్టుబడిని సమకూర్చడానికి చాలినంతగా లాభాలను ఆర్జించవలసిన విధి మనపై ఉన్నది. మన ప్రణాళికల స్వరూపస్వభావాలను లోబడి ఆలోచించినప్పుడు ప్రభుత్వ, ప్రైవేటు రంగాలమధ్య సంఘర్షణకు తావేలేదు. మన మిశ్రమ ఆర్థికవ్యవస్థలో ప్రైవేటురంగంకూడా ఎంతో వృద్ధిచెందింది. ప్రభుత్వసహాయాన్ని, చేయూతనూ అందుకుంది. ఇకముందుకూడా దానికి చేయూతనిచ్చి ప్రోత్సహిస్తూనే ఉంటాం.

ఇటీవల జరిగిన సంఘటనలవల్ల సాంకేతికరంగంలోకూడా స్వయంశక్తిని పెంపొందించుకోవడానికి పూర్తి అవకాశాలు అన్వేషించవలసిన ఆగత్యం ఏర్పడింది. మనం విదేశాలనుంచి దిగుమతిచేసుకునే ద్రవ్యాలస్థానే దేశీయమయిన ద్రవ్యాలను వాడుకోవడం ఎలాగ? విదేశాలనుంచి సమకూర్చుకునే సాంకేతికపరిజ్ఞానాన్ని, ఇంజనీరింగు సర్వీసులనూ దేశంలోనే సమకూర్చుకోవడం ఎలాగ అన్న సంగతులు ఆలోచించాలి. కొత్తసంగతులను కనిపెట్టి, ఉన్నవాటిని సరిపుచ్చుకుని, తాత్కాలికపు సర్దుబాట్లు చేసుకుని సాధ్యమయినంత వరకు విదేశీసహాయం అవసరంలేకుండా గడుపుకోవడంపైననే మన అభ్యుదయం ఆధారపడి ఉంది. మనదేశంలోనే మేధావులయిన శాస్త్రజ్ఞులూ, ఇంజనీర్లూ, సాంకేతికులూ ఎందరో ఉన్నారు. మనం వారిని సద్వినియోగం చేసుకోవాలి. తగిన అవకాశాలు ఉన్నట్లయితే తాము కూడా అద్భుతమయిన ఫలితాలను సాధించగలమని మన శాస్త్రజ్ఞులూ, ఇంజనీర్లూ తమ శక్తి సంపదలను ఋజువుచేసుకున్నారు. డాక్టర్ హోమీ భాభా నెలకొల్పిన ఉజ్జ్వల ఆదర్శమే ఇందుకు చక్కని దృష్టాంతం. (ఈయన జనవరి ౨౪, ౧౯౬౬న విమాన ప్రమాదంలో మరణించాడు.) అణుశక్తి సంస్థ సాధించిన విజయాలు మనకు కనువిప్పు కావాలి. డాక్టర్ భాభా చూపిన మార్గం మనకు ఎల్లప్పుడూ ఉత్తేజకారకమై అనుసరణీయం కావాలి.

మన పంచవర్ష ప్రణాళికలలో ఆర్థిక, సాంఘికాభ్యుదయ కార్యక్రమాలను పొందుపరిచాం. మూడవ పంచవర్ష ప్రణాళిక ముగియవస్తోంది. నాలుగవ ప్రణాళికలో అడుగిడబోతున్నాం. ఈ ప్రణాళిక స్వరూపాన్ని, పరిమాణాన్ని జాతీయాభివృద్ధిమండలి గత సెప్టెంబరు నెలలోనే స్థూలంగా ఆమోదించింది. అప్పట్లో మనం దేశరక్షణకృషిలో నిమగ్నులమై ఉన్నప్పటికీ, ప్రణాళికను విస్మరించలేదు. ఐతే విదేశీసహాయం ఎంత ఉండేదీ ఇదమిత్థంగా తెలియకనూ, ఇంకనూ మరికొన్ని సందిగ్ధపరిస్థితుల కారణంగానూ, నాలుగవ ప్రణాళిక వివరాలను రూపొందించడంలో అంతరాయం కలిగింది. ఇప్పుడు ఈ కృషి శీఘ్రగతిన సాగించాలని సంకల్పించాం. ఈలోగా ౧౯౬౬-౬౭ వ సంవత్సరానికి - అంటే నాలుగవ

ప్రణాళిక తొలిసంవత్సరానికి వార్షిక ప్రణాళికను తయారుచేశాం. పంచవర్ష ప్రణాళికలో ప్రధానాంశాలను దృష్టిలో ఉంచుకునే దీనిని రూపొందించడం జరిగింది.

ఇతర కార్యకలాపాలలోవలెనే ఆర్థికాభ్యుదయసాధనలో కూడా ఉద్దేశ్యాలకూ, ఆచరణకూ మధ్య అంతరం ఉంటూ ఉంటుంది. ఈ లోపాన్ని పూరించేందుకు పరిపాలనాయంత్రాంగంలో అవసరమయిన, కూలంకషమయిన మార్పులను ధైర్యంతో చేపట్టవలసి ఉంటుంది. మనం నూతన నిర్వహణ విధానాలనూ, ఆధునిక పరికరాలనూ, పద్ధతులనూ, వ్యవస్థానిర్మాణాన్నీ చేపట్టవలసి ఉంటుంది. ప్రభుత్వ యంత్రాంగంలో చురుకుతనాన్నీ, సామర్థ్యాన్నీ, ప్రజావసరాలకు తగ్గట్లు నడుపుకోగల గ్రహణశక్తినీ ఉద్దీపింపజేయాలి.

మన సంప్రదాయానుసారంగా అన్నిదేశాలతోనూ, మైత్రిని నెరపుతూ, శాంతిస్థాపన విధానాన్ని అనుసరిస్తూ వచ్చాం. ఐతే మన అభిప్రాయాలను స్వతంత్రంగా వెల్లడించే హక్కు మనం ఎప్పుడూ వదులుకోలేదు. మన వైదేశికవిధానానికి మూలమయిన సూత్రాలు మన ఉత్తమసంప్రదాయాలకు అనుగుణమయినవే. మనదేశ గౌరవప్రతిష్ఠకూ, జాతీయప్రయోజనాలకూ ఇవి ఎంతమాత్రమూ భిన్నమైనవికావు. ఈనాటికీ మనం ఆ సూత్రాలనే పాటిస్తున్నాము. నేను విదేశాలలో పర్యటించినప్పుడు అక్కడి ప్రభుత్వ నాయకులనూ, మిగతా ప్రముఖులనూ కూడా కలుసుకునే భాగ్యం నాకు కలిగింది. వారందరూ కూడా మన విధానాన్ని అవగాహన చేసుకుని మనపట్ల మైత్రిని నెరపుతున్నారు. మా తండ్రిగారు రూపొందించిన ప్రాథమిక సూత్రాలే ఇకముందుకూడా మనకు మార్గదర్శకాలు. ఆయనా, శాస్త్రీజీకూడా ఆ సూత్రాల పరిరక్షణకే తమ జీవితాలను అంకితం చేశారు. అన్నిదేశాలలోనూ ప్రజలు సమతాభావంతో పరాయిపాలనకూ, భయానికీ అతీతంగా మనుగడ సాగించగలిగేవిధంగా ప్రపంచశాంతినీ, అంతర్జాతీయసహకారాన్నీ పెంపొందించేందుకే నేను చిత్తశుద్ధితో పాటుబడతాను.

మనకు ఇరుగుపొరుగున గల దేశాలతో అత్యంతమైత్రీసంబంధాలు నెలకొల్పుకోవాలనే మన ప్రయత్నం. వారితో వివాదాలు ఏమయినా ఉంటే వాటిని శాంతియుతంగా పరిష్కరించుకోవాలనే మన ఆకాంక్ష. తాష్కెంటు ప్రకటన ఈ భావాలకే ఒక రూపకల్పన. మనం దానిని అక్షరాలా భావయుక్తంగా పూర్తిగా అమలుజరుపుతాం.

శాంతిసాధనే మన ధ్యేయం. కాని దేశస్వాతంత్ర్యాన్నీ, ప్రాదేశికసమగ్రతనూ పరిరక్షించడంలో ప్రభుత్వానికి గల బాధ్యత నాకు బాగా తెలుసు. కనుక మనం నిరంతరమూ అప్రమత్తులమై ఉండి అవసరమయినంతవరకు దేశరక్షణను పటిష్ఠంచేసుకోవాలి. మనబలాలు ప్రదర్శించిన శౌర్యమూ, కృతనిశ్చయమూ, ధైర్యమూ, త్యాగమూ మనకు ఉజ్జ్వలమైన ఆదర్శాలు. అసువులర్పించిన వీరుల కుటుంబాలకూ, వికలాంగులయినవారికీ నా సానుభూతి తెలియజేస్తున్నాను.

శాంతినే మనం వాంఛిస్తున్నాం. ఎందుచేతనంటే మనం సాగింపవలసిన సంగ్రామం వేరుగా ఉంది. అది దారిద్ర్యాన్నీ, వ్యాధులనూ, అజ్ఞానాన్నీ నిర్మూలించేందుకు జరగవలసిన

పోరాటం. ప్రజలకు అవసరమయిన ఉపాధి చూపి తిండీ, బట్టా, వసతీ, ఆరోగ్య, విద్యావసతు పాయాలు సమకూర్చగలమని ఇచ్చిన మాటను మనం నిలబెట్టుకోవాలి. బలహీనవర్గాలూ, వెనకబడిన ప్రజలూ నా మనోభావాలను ఎల్లప్పుడూ ఆకట్టుకుంటూనే ఉన్నారు. ఇకముందు కూడా వారి విషయమే అధికశ్రద్ధ వహిస్తాను. వీరందరికీ సాంఘిక భద్రత సమకూర్చేందుకు ప్రత్యేక చర్యలు అవసరం.

యువజనులకు ఇతోధికమయిన అవకాశాలు ఇవ్వాలి. ఈనాడు తాము దేశానికి ఇవ్వ గలిగినవానినే రేపు తిరిగి పొందగలుగుతామన్న సంగతిని వారు గ్రహించాలి. ఉన్నతాశయా లతో వారు ఉజ్జ్వలంగా ప్రకాశించాలని దేశం ఆశిస్తోంది. వైజ్ఞానిక కళాప్రపంచమూ, ఉన్నత భావాలూ, కార్యాచరణదీక్ష వారిని పిలుస్తున్నాయి. అవధులనూ, దూరాలనూ అధిగమిస్తూ సనాతన లక్ష్యసాధనకు పురోగమించాలి.

ఏ మతానికీ, రాష్ట్రానికీ, భాషకూ చెందినా మనం అంతా ఒకే జాతి, ఒకే ప్రజ అన్న సంగతి మరచిపోకూడదు. మనం అందరమూ—కార్మికులూ, కర్షకులూ, అధ్యాపకులూ, విద్యార్థులూ, శాస్త్రజ్ఞులూ, సాంకేతికులూ, పారిశ్రామికులూ, వ్యాపారస్థులూ, రాజకీయ వాదులూ, ప్రభుత్వోద్యోగులూ—అందరమూ కూడా శాయశక్తులా కృషిచేయాలి. మనం అంతా పటిష్ఠంగా సహనంతో, క్రమశిక్షణతో పాటుబడతాం. ఎందుచేతనంటే సహనమూ, క్రమశిక్షణే ప్రజాస్వామికానికి పునాదిరాళ్ళు. మనం నిర్మించదలచుకున్న చైతన్యవంతమయిన అభ్యుదయ సమాజమూ, న్యాయబద్ధమయిన సామాజికవ్యవస్థా, లక్ష్యసాధనలోని ఐక మత్యంతో, సహకారంతో శ్రమించి పనిచేయడంవల్లనే సాధించగలుగుతాం.

మన జాతికి మూలమయిన ప్రజాస్వామికమూ, మతప్రాధాన్యరహిత లౌకిక రాజ్య తత్వానికీ, ప్రణాళికాబద్ధమయిన ఆర్థిక, సాంఘికాభ్యుదయానికీ, అన్నిదేశాలమధ్య శాంతి, మైత్రీభావాలకీ పాటుపడతానని నే నీనాడు మరోసారి ప్రతిన చేస్తున్నాను.

భారతపౌరులారా, భవితవ్యంపై విశ్వాసంతో మనం పునరుజ్జీవనం పొందుదాం. మన భవితవ్యాన్ని తీర్చిదిద్దుకోవడంలో మనకుగల శక్తిసామర్థ్యాలను ధ్రువపరచుకుందాం. బ్రహ్మాండమయిన ఈ సాహస యాత్రలో మనం అంతా సహోదరులం, తత్సాధనకు అర్హుల మనిపించుకుందాం. మహాభారత పౌరులమనిపించుకుందాం. జైహింద్.

# గాల్‌బ్రెత్‌తో గోష్ఠి

[౧౯౬౧ మొదలు ౧౯౬౩ వరకూ మనదేశంలో అమెరికా రాయబారిగా పనిచేసిన జాన్ కెనెత్ గాల్ బ్రెత్ శ్రీమతి ఇందిరాగాంధీతో జరిపిన టెలివిజన్ గోష్ఠి, న్యూయార్కులోని టెలివిజన్ కేంద్రంద్వారా ౧౯౬౬ ఏప్రెల్ 3-వ తేదీరాత్రి భారతకాలమానం ప్రకారం ఎనిమిదిగంటలనుంచి తొమ్మిదిగంటలవరకూ ప్రసారమయింది. ప్రస్తుతం ఈయన హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో ఆర్థిక విషయాల ప్రొఫెసరుగా పనిచేస్తున్నారు.]

**గాల్‌బ్రెత్ :**—ఈ ఉదయం మిమ్మల్ని కలుసుకోగలగడం ఎంతో ఆహ్లాదకరంగా ఉంది. మనం కొన్ని నిమిషాలు స్వేచ్ఛగా సంభాషించుకునే అవకాశం లభించింది. ఈ వాషింగ్‌టన్ యాత్రను గురించి మీ అభిప్రాయం ఏమిటి? ఇది మీ తొలి అనుభవం కాదనుకోండి.

**శ్రీమతి గాంధీ :**—ఈ యాత్ర నాకు అమితానందం కలుగజేసింది. మీ ప్రెసిడెంటూ, నేను కలుసుకున్న ప్రజలూ నాకిచ్చిన హృదయపూర్వకమయిన స్వాగతమూ, వ్యక్తంచేసిన అవగాహనా, నెరపిన మైత్రీభావమూ నన్ను బాగా కదిలించి వేశాయి.

**గాల్‌బ్రెత్ :**—మొన్న ఒకరోజు సాయంత్రం భారత రాయబారి కార్యాలయం వద్ద సమావేశంలో ప్రెసిడెంట్ కూడా ఇదేభావాన్ని కలిగి ఉన్నట్లు నా కనిపించింది. ఆయన మీకు వీడ్కోలు చెప్పేందుకు ఎనిమిదిగంటలకు వచ్చినవాడు అర్ధరాత్రిదాకా ఉండిపోయాడు. మీపట్లా, మీరు ఎదుర్కోవలసి వస్తూన్న సమస్యలపట్లా ఆయనకు గల అభిమానాన్ని అది వ్యక్తం చేస్తోంది అనుకుంటాను.

**శ్రీమతి గాంధీ :**—ఆయనకు నిజమయిన అభిమానం ఉంది. నిజమైన సానుభూతి, యీ విషయమై ఏదో ఒకటి చేయాలన్న ఆకాంక్ష ఉన్నట్లే కనపడింది. నాకంటే మీకే ఎక్కువ తెలుసు అనుకుంటాను. ఆయన కార్యవాది అనీ, ఏదయినా ఒక విషయాన్ని గురించి అనుకున్నప్పుడు దానిని బుట్టదాఖలు చేసే తత్వం కాదనీ, తక్షణమే తగుచర్యలు తీసుకునే తత్వమనీనూ.

గాల్‌బ్రెత్ :— ఆ మాట నిజమే. గ్రామసీమలలో వ్యావసాయిక వాతావరణంలో పెరిగిన ప్రెసిడెంట్ జాన్సన్‌కు మిగతా అనేకమందికంటె భారతదేశంవంటి దేశాలపట్ల సహజంగా ప్రత్యేకమయిన అభిమానం ఉండే మాటకూడా నిజమే అనుకుంటాను. ఎంత లేదన్నా భారతదేశం విశాలమయిన వ్యావసాయిక దేశంకదా. ప్రెసిడెంట్‌కు ఈ వాతావరణం బాగా పరిచితం.

శ్రీమతి గాంధీ :—అది నిజమే. కాని అంతకంటెనూ కూడా భారతదేశ సమస్యలను ఆయన విశాలమయిన అంతర్జాతీయ దృక్పథంతో పరిశీలిస్తారని నే నను కుంటాను. భారతదేశప్రణాళికలనూ, కార్యక్రమాలనూ ఫలప్రదం చేయడంలోనూ, సుస్థిర మయిన సమైక్యభారతావని సౌభాగ్యంతో వర్ధిల్లడంలోనూగల అగత్యాన్ని ఆయన గ్రహించా రనుకుంటాను.

గాల్‌బ్రెత్ :—ఆహార సమస్యవిషయంలో ఇప్పుడు మీ అభిప్రాయం ఏమిటి? ఇంతవరకూ తీవ్రమయిన ఇక్కట్లేవీ ఎదురుకాలేదనీ, ప్రజలలో కొద్దిగా పోషణ లోపం ఉన్నా మొత్తంమీద ఈ పరిస్థితిని ఎలాగో దాటవేయగలిగారనీ నే ననుకుంటున్నాను. నా ఊహ సరియైనదే నంటారా?

శ్రీమతి గాంధీ :—ఒక్కసంగతి. ఇవన్నీ సాపేక్ష విషయాలు. మేము తీవ్ర మయిన ఇక్కట్లు అనుకునేవి మీకు అలా తోచకపోవచ్చు. కాని మీరు స్వయంగా చూస్తే పరిస్థితి తీవ్రంగా ఉన్నదని గ్రహించకపోరు.

గాల్‌బ్రెత్ :—చాలా కొద్దిమంది అమెరికన్లు మీరు ఎలాగైనా కొద్దిపాటి ఆహా రంతోనయినా గడుపుకోవాలని వాంఛిస్తున్నారని నా నమ్మకం.

శ్రీమతి గాంధీ :—దేశంలో తీవ్రమయిన కొరత ఏర్పడింది. కాని ఇది పరి మితమయిన ప్రాంతాలలోనే. అనేక రాష్ట్రాలలో యీ కరువు ఏర్పడింది. మహారాష్ట్ర, రాజ స్థాన్, కేరళ, మైసూరు, ఉత్తరప్రదేశ్‌లోని కొన్నిభాగాలలో తరుగు పరిస్థితులు ఏర్పడ్డాయి. పరిస్థితి నిజంగా ఎంతో జటిలంగా ఉంది. కాని మాకు లభించిన సహాయంతో ఎలాగో బైట పడగలిగాం. కాని ఈ సహాయం నిలిచిపోయినా, సకాలంలో అందకపోయినా పరిస్థితి మరీ ప్రమాదకరంగా పరిణమిస్తుందనుకుంటాను.

గాల్‌బ్రెత్ :—పంపిణీ సంగతి ఏమిటంటారు? లభించిన ఆహారాన్ని దేశంలో అందరికీ సవ్యంగా పంపిణీ చేయడం పెద్ద సమస్యగా పరిణమిస్తుందంటారా?

శ్రీమతి గాంధీ :—ఇది తీవ్రమయిన సమస్యే. మీకు తెలుసు, మా రవాణా సదుపాయాలు, సరిగ్గా, ఉండవలసిన విధంగా లేవని. అవి ఎంతో బాగుపడ్డాయి. కాని ఇంకా ఎంతో బాగుచేయాలి. అదృష్టవశాత్తూ మేము తీవ్రమయిన కృషి చేస్తున్న వివిధ రంగాలలో ఇది కూడా ఒకటి. ఒక్కొక్క రాష్ట్రంలోనూ ఇంచుమించు ప్రతి జిల్లాలోనూ విడివిడిగా

శ్రద్ధవహించి మరీ అవసరమయిన వారికి ఆహారపదార్థాలు లభ్యమయ్యేటట్లు బహుజాగ్రత్త వహిస్తున్నాం. ఆహారధాన్యాలు సప్లయి చేయడమే కాకుండా పసిపిల్లలకూ, చూలింతలకూ, బాలెంతలకూ తగిన పోషణ కల్పించేందుకు విటమిన్సు మాత్రలూ, మాంసకృత్తులుగల బిస్కెట్లూ మొదలయినవి పంచిపెట్టి పోషణ లోపం తీవ్రతరంకాకుండా తగిన జాగ్రత్త వహిస్తున్నాం.

గాల్‌బ్రెత్ :—ప్రెసిడెంట్ ఇచ్చిన సందేశంలో అత్యంత ప్రధానమయిన అంశం అమెరికాలో మేము వినియోగించుకునే ప్రతీ బుషెల్ గోధుమలకూ ఒక్కొక్క బుషెల్ వంతున వచ్చేయేడు భారతదేశానికి పంపదలిచామని చేసిన ప్రకటనే అని నా అభిప్రాయం. ఐతే దీనివల్ల మీకు మరో సమస్య ఎదురవుతుందేమో. మేము పంపేది గోధుమలే కదా. మీ దేశంలో బియ్యానికి బదులు గోధుమలు వాడడం తీవ్రమయిన సమస్యకాదా. మావద్ద బియ్యం మిగలదు. మేము ఇవ్వగలిగేది చాలాభాగం గోధుమలూ, చిరుధాన్యాలే.

శ్రీమతిగాంధీ :-ఈ సమయంలో నాకు దృఢమైన అభిప్రాయాలే ఉన్నాయి. ప్రజలు ఏది లభ్యమయితే దానినే తినాలి. తమకు ఏది అలవాటో దానినే తప్ప తినమని పట్టుబట్టకూడదు. కాని భారతదేశంలో ఇదంత సులభంకాదు. అక్కడ నే నీమాటను బహిరంగంగా అన్నప్పుడు ప్రజలు దానిని ఆమోదించలేకపోయినారు. కాని మద్రాసువంటి రాష్ట్రంలో ప్రజలు యీనాడు గోధుమలను బాగానే తింటున్నారు. కనీసం ఒకపూటయినా గోధుమలతో ఆహారపదార్థాలు తయారు చేసుకుంటున్నారు. బెంగాలులోకూడా చాలామంది ఇదివరకటి కంటే ఇప్పుడు ఎక్కువమంది గోధుమలు తింటున్నారు. కాని ఇందుకు ప్రత్యేకమైన కృషిజరిపి ప్రజలకు నచ్చజెప్పవలసివస్తోంది. బియ్యానికి బదులు గోధుమను వాడడం ఒక్కటే సమస్యకాదు. భోజనపు అలవాట్లపట్ల ప్రజల వైఖరిని మార్చడమే సమస్య. భారతీయులు తీసుకునే ఆహారంలో శరీరపోషణకు కావలసిన పదార్థాలన్నీ సమపాళంలో ఉండవని మీకూ తెలుసు. ఎక్కువగా ధాన్యాలే తింటారు. మాంసకృత్తులు తగినంతగా ఉండవు. ఈ సమస్యను ముఖ్యంగా పరిష్కరించవలసి ఉంది.

గాల్‌బ్రెత్ :-ప్రజలు పస్తులుండి కడుపు మాడ్చుకోవడంకంటె గోధుమలు తినడానికే సిద్ధపడతారని నా నమ్మకం.

శ్రీమతిగాంధీ:-తింటారనే అనుకుంటాను. కాని వారిని తినవద్దని ప్రోత్సహించేవారు కూడా చాలామంది ఉన్నారు.

గాల్‌బ్రెత్ :-ఇది జీర్ణం అవడానికీ, కాకపోవడానికీ సంబంధించిన వ్యవహారం కాదు. ఇది ఒక మౌలిక విషయం అనుకుంటాను.

శ్రీమతిగాంధీ :-అవును.

గాల్‌బ్రెత్ :-భారతదేశాన్నిగురించీ, అక్కడి ప్రజలనుగురించీ నేను స్వదేశానికి తిరిగివచ్చినప్పటినుంచీ పదే పదే అడుగుతూవచ్చిన ప్రశ్నలను ఒక్కసారి ఆలోచించు

కుంటే ఇక్కడి ప్రజల ఆందోళనలూ, వారికిగల ఆసక్తి విదితమవుతాయి. అన్నిటికంటేనూ ఎక్కువగా నన్ను తరుచుగా అడుగుతూ వచ్చిన ప్రశ్న—మీరు ఊహించగలరనుకుంటాను—సంతాన నిరోధానికి. జనాభాను అదుపులో పెట్టడానికి సంబంధించినది. ప్రెసిడెంటుకూడా తన సందేశంలో ఈ విషయాన్నిగురించే ఉద్ఘాటించిన సంగతి నేను గుర్తించాను. కరువు కాటకాల వంటి యీతిబాధలవల్ల జనాభాను అదుపులో పెట్టడమా? మానవతాదృక్పథంతో సంతాన నిరోధ విధానాలను అవలంబించడమా అన్నదే ప్రశ్న.

పరిమిత కుటుంబంవిషయంలో జరుగుతూన్న కృషిని గురించి మీ అభిప్రాయం ఏమిటి? ఇది ఎంతవరకూ విజయవంతం కాగలదని ఆశిస్తున్నారు?

శ్రీమతిగాంధీ :-సత్ఫలితాలు లభించే అవకాశాలే బాగా కనిపిస్తున్నాయి. గత సంవత్సరాలలో పని కొంతవరకూ మందకొడిగానే సాగింది. కాని గత కొద్దిమాసాలుగా కార్యక్రమం బాగా ముందుకు నడిచింది. సమాచార మంత్రిగా ఉండినప్పుడు ఈవిషయానికి, జిల్లాలవారీగా, తీవ్రమయిన ప్రచారం జరిపించాను. మేము, ఎన్నుకున్న మొట్టమొదటి జిల్లా పశ్చిమ బెంగాల్‌లో, కలకత్తాకు సమీపంతోగల హుగ్లీ జిల్లా. అది బాగా విజయవంత మయింది.

గాల్‌బ్రెత్ :-అది గ్రామాలు ఎక్కువగా ఉన్న జిల్లా కదా?

శ్రీమతిగాంధీ :-కలకత్తాకు ఆనుకుని ఉన్న గ్రామీణప్రాంతం అది. మురికి పేటలవారు అక్కడ నివసిస్తారు. కుటుంబ నియంత్రణ కార్యక్రమానికి సామూహిక ప్రచారసాధనాలు అన్నింటిని ఉపయోగించి తీవ్రమయిన ప్రచారం సాగించాం. అది బాగా ఫలించింది. ప్రతి రాష్ట్రంలోనూ ఇదే పద్ధతిని ప్రయత్నిస్తున్నాము. దీనిలో ఉన్న పెద్ద ప్రతిబంధకం ప్రజలు కారు. ఒక్కొక్కప్పుడు దీనిని నిర్వహించే కార్యకర్తలే ప్రతి బంధకం అవుతూఉంటారు. అంటే వారికి ఈ కార్యక్రమంలో నమ్మకం లేక కాదు. అనేక పనులు చేయవలసిరావడంతో వారు ఒక్కొక్కప్పుడు ఏకార్యక్రమానికి ఎంత ప్రాధాన్యం ఇవ్వాలో అంతగాఇవ్వరు. ఐనప్పటికీ ఇప్పుడు మహా సమర్థుడయిన కార్య దర్శిని యీ కార్యక్రమానికి నియమించాం. కార్యక్రమం చురుకుగా ముందుకు సాగుతుం దనుకుంటాను.

గాల్‌బ్రెత్ :-లూప్‌వల్ల ఈ కార్యక్రమంలో ఇదివర కెన్నడూ లేనంత ప్రగతిని సాధించవచ్చునని భావిస్తున్నారా?

శ్రీమతిగాంధీ :-అదే అన్నిటికంటేనూ బాగా చౌకకావడం, సులభంగా ఉపయోగించడానికి వీలవడంవల్ల భారతదేశంవంటి సమాజంలో ఎంతో ప్రయోజనకరం కాగలదు. ఢిల్లీ సమీపంలోని ఒక కర్మాగారంలో వీటిని రోజుకు ౨౦,౦౦౦ వంతున తయారు చేస్తున్నాం. ఈ ఉత్పత్తి ఇంకా పెరుగుతుంది. ఇతర కర్మాగారాలు కూడా నెల కొల్పుతాం.

గాల్‌బ్రెత్ :-మరొక్క ప్రశ్న. హూగ్లీని గురించి కానీ, మరో జిల్లాను గురించి కానీ మాట్లాడేటప్పుడు ఈ సాధనాల ప్రయోజనాలను గ్రామాలలోని ప్రజలు గ్రహించి అమలు జరుపుతున్నారా అన్న ప్రశ్న ఉదయిస్తుంది.

శ్రీమతిగాంధీ :-అవును. మేము సామాజికాభివృద్ధి కార్యక్రమాల ద్వారానూ, ప్రసూతి శిశుసంక్షేమ కేంద్రాలద్వారానూ వీటిని అమలు జరిపిస్తున్నాము. ఆ విధంగా ఇది గ్రామాలకుకూడా వ్యాపిస్తోంది. కాని భారతదేశం బహు విశాలదేశమని మీకు తెలుసు. అందు చేత ఏదోఒక ప్రాంతాన్ని తీసుకుని, అక్కడ పూర్తిగా అమలుజరిపి ఆ కార్యక్రమంవలని ప్రభావం ఇతర ప్రాంతాలకు వ్యాపించేటట్లు చేయడం బాగుంటుంది.

గాల్‌బ్రెత్ :-భారతదేశ విశాలత్వమే నన్నెప్పుడూ ముగ్ధుణ్ణి చేస్తూంటుంది. భారత దేశానికి సంబంధించిన ఏ లెఖ్ఖలు తీసుకున్నా ఊహించలేనంత పెద్దవిగా ఉంటాయి. అక్కడ గ్రామాలే ఆరులక్షలవరకూ ఉన్నాయి. యునైటెడ్ నేషన్సులోని మూడవవంతు సభ్యదేశాల లోని జనాభా అంతటికంటేనూ భారతదేశంలో గ్రామాలే ఎక్కువగా ఉన్నాయి.

శ్రీమతిగాంధీ :-అప్పుడే ఐదులక్షలమందికి లూపులు అమర్చబడ్డాయి. అలా గని పాతపద్ధతులను కూడా విస్మరించడంలేదు. అన్ని విధానాలనూ సమీకృతంగా ప్రచారం చేస్తున్నాం. లూప్‌లు తయారుచేసే కర్మాగారాలు ఎక్కువయిన కొద్దీ మిగతా పద్ధతుల ప్రాచు ర్యాన్ని క్రమేపీ తగ్గించవచ్చు.

గాల్‌బ్రెత్:-నూతన ప్రణాళికలను గురించి మీ అభిప్రాయం ఏమిటి? ఇది మూడవ సంవత్సరంలో ఆఖరి నెల కదా?

శ్రీమతిగాంధీ :-మూడవ పంచవర్ష ప్రణాళికగదా. అవును.

గాల్‌బ్రెత్ :-కొత్త ప్రణాళిక చాలావరకు నికరపరచినట్లే కదా?

శ్రీమతిగాంధీ :-అవును. కొంతవరకూ ఒకదారికి వచ్చినట్లే. చూడండి. ఆర్థిక వనరుల ఎంతవరకూ లభ్యమవుతాయి అన్నదానిపై ఇది ఎంతో ఆధారపడి ఉంది.

గాల్‌బ్రెత్:-ఒక విధంగా నూతన ప్రణాళిక క్రిందటివారం వాషింగ్‌టన్‌లో మీరు జరిపిన సంప్రదింపుల ఫలితంపైనా, ముందు జరపబోయే సాంకేతికచర్చలపైనా, మా సహాయాన్ని పునరుద్ధరించడంపైనా ఆధారపడి ఉందంటారు-అంతేనా?

శ్రీమతిగాంధీ :-అది నిజమే. మా మనస్సులలో పెద్ద ఊహలు ఉండవచ్చును. కాని ఆ ప్రణాళికలు ఎంత పెద్దవిగా ఉండాలి? మనం ఎంతవరకూ ప్రయత్నించవచ్చు? ఎటు వంటి విషయాలను గురించి ప్రయత్నించవచ్చు? అన్నవి, మనకు ఎంత డబ్బు అందు బాటులో ఉంటుంది అన్నదానిపైనే ఆధారపడి ఉంటాయి. కాని ఒక్క సంగతిమాత్రం తథ్యం. రెండింటికీకూడా నేను సిద్ధంగానేఉన్నాను. ఐతే సహాయమేమీ లభించకపోతే మేము

గడ్డుపరిస్థితులను ఎదుర్కోవలసి ఉంటుంది. ఏది ఏమైనా యీ ఇక్కట్లను ఎదుర్కోగల మన్న దృఢనిశ్చయంతో ముందుకు సాగవలసి వస్తుంది.

గాల్‌బ్రెత్ :-సహాయం తప్పక లభిస్తుందనే అనుకుంటాను-నేనిప్పుడు సాధారణ పౌరుణ్ణి కాబట్టి అదే హోదాలో మాట్లాడుతున్నాననుకోండి. కాని ఇతరదేశాలుకూడా బాగా ఎక్కువగా తోడ్పడగలవని నేను ఆశిస్తున్నాను, గత నాలుగైదు సంవత్సరాలలో ఇక్కడ జరిగిన మార్పులలో ఒకటి—అదే గొప్ప మార్పని అనుకుంటాను—సోవియట్ సహాయంపట్ల అమెరికావారి వైఖరిలో గణనీయమయిన పరిణామం వచ్చినసంగతి మీరు గ్రహించేఉంటారు. నేను మొదట్లో భారతదేశానికి వెళ్ళినప్పుడు యీ విషయమై కొంత ఉద్రేకంతో మాట్లాడే వారు. మీ విలేఖరులు కొందరు దీనికే ప్రాముఖ్యం ఇచ్చేవారు. వారు నాతో అనేవారుకదా— 'మీరీప్రణాళికను బలపరచకపోతే సోవియట్ యూనియన్ చేయవచ్చు.' అని. ఈ వైఖరివల్ల నాకెంతో వ్యథకలుగుతుందని వారు భావించిఉంటారు. అమెరికావారుసహాయంచేసినా,సోవియట్ యూనియన్ సహాయం చేసినా ఇంచుమించు ఒకే ప్రయోజనంకోసం చేస్తున్నాయని అమెరి కాలో ఇప్పుడు చాలామంది గ్రహించి ఉంటారని నాకనిపిస్తోంది. ఒకరు అందజేయలేని సహా యాన్ని మరొకరు లభింపజేస్తున్నారని కూడా గ్రహించారనుకుంటాను. సోవియట్ యూని యన్‌ను ఏకారణం చేతనయినా నిరుత్సాహపరచడం జరిగితే చాలామంది ఇప్పుడు విచారిస్తా రని కూడా భావిస్తాను.

శ్రీమతిగాంధీ :-అవును. మీరు సరిగ్గానే ఆలోచించారనుకుంటాను.

గాల్‌బ్రెత్ :-ఈ పరిస్థితి బాగా శ్రేయస్కరమయినది.

శ్రీమతిగాంధీ :-మాది ఎప్పుడూ యీదృక్పథమే. కనకనే ఇతరులు కూడా ఇదే తీరు ఆలోచించడం మాకు ముదావహం.

గాల్‌బ్రెత్:-ఇక భారతదేశపువైఖరి సంగతి. అది నేనెన్నడూ ఎత్తను. నాసంగతిమాత్రం చెప్పాలి. నేను భారతదేశానికి వెళ్ళినకొత్తలో మీతండ్రిగారితో అన్నాను; ఒకసారి - 'ప్రచ్ఛన్నయుద్ధం సాగించేందుకు నేనెక్కడికీ వెళ్లడంలేదని ప్రెసిడెంట్ కెన్నెడీ హెచ్చరించాడు' అని. ప్రచ్ఛన్నయుద్ధం ఎక్కడయినా సాగించవచ్చునేమో కాని భారత దేశం మాత్రం అందుకు ఉత్తమరంగం కాజాలదు. నేను భారతదేశంలో దాదాపు మూడేండ్ల వరకూ రాయబారిగా ఉన్నాను. ఈ వ్యవధిలో ఎన్నడూ కూడా సోవియట్ వ్యతిరేకప్రసంగం చేయకుండా గడపగలిగాను. ఇది రికార్డు చేయదగ్గ సంగతనే అనుకుంటాను.

మీరు తిరుగు ప్రయాణంలో మాస్కోలో ఆగుతారేమో ?

శ్రీమతిగాంధీ :-ఒక్కరాత్రే. సుమారు రాత్రి పదిగంటలకి అక్కడికి చేరు కుంటాం. తెల్లారగట్లే, సాధ్యమయినంత పెందలకడనే బయలుదేరాలని అనుకుంటున్నాం. ఐతే నేను ప్రధానమంత్రి కోసిగిన్‌ను కలునుకోవడానికి కలిగే వీలునుబట్టే నిర్ణయించుకో వాల్సి ఉంటుంది.

గాల్‌బ్రెత్ :—మీరు ఇంగ్లండులోకూడా కొంతసేపు గడుపుతారు. ఔనా?

శ్రీమతిగాంధీ :—అక్కడకూడా అంతే. సరిగ్గా విమానాశ్రయంలో.

గాల్‌బ్రెత్ :—కొత్తగా విజయాన్ని సాధించిన ప్రధాని విల్సన్‌ని మీరు కలుసుకోవటం లేదా?

శ్రీమతిగాంధీ :- ప్రధానమంత్రి విమానాశ్రయం దగ్గిరికే వస్తారు. మేము కలిసి విందారగిస్తాం. ఆ తరువాత నేను ప్రయాణం కొనసాగిస్తాను.

గాల్‌బ్రెత్ :—అన్నట్లు భారతదేశంలో ఎన్నికలెప్పుడు?

శ్రీమతిగాంధీ :—వచ్చే సంవత్సరం - జనవరి నెలాఖరినో. ఫిబ్రవరి ప్రారంభంలోనో. ఇది ఎన్నికల సంవత్సరమే.—ఎన్నికలముందు సంవత్సరం.

గాల్‌బ్రెత్ :—పెద్ద మెజారిటీ సంపాదించడం ఎలాగో మీరు హెరాల్డ్ విల్సన్‌తో సంప్రదించవచ్చు.

శ్రీమతిగాంధీ :—ఇందుకు సంబంధించిన సమస్యలు భారతదేశంలోనూ, ఇంగ్లండులోనూ ఒకే మోస్తరుగా ఉండ వనుకుంటాను.

గాల్‌బ్రెత్ :—ఎన్నికలంటే జ్ఞాపకం వచ్చింది—నేను స్వదేశానికి తిరిగివచ్చిన తరువాత అక్కడి రాజకీయాలు అంతగా తెలియవు. రాజకీయంగా కాంగ్రెసేతర పార్టీలకు బలం ఏమాత్రం ఉంది? రాజకీయ ప్రతిపక్షాలు-ఇటు దక్షిణవర్గంవైపా, అటు వామపక్షంవైపా మొగ్గేది? కాంగ్రెస్ పార్టీ శ్రద్ధ వహించేది దక్షిణవర్గంవారిని సంతృప్తి పరచడానికా, లేక వామపక్షాన్ని సంతృప్తి పరచడానికా?

శ్రీమతిగాంధీ :—అది 'మీరు ఏప్రాంతాన్ని గురించి మాట్లాడుతున్నారు' అన్న దానిపై ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు కేరళనే తీసుకుందాం. అక్కడ కమ్యూనిస్టులదే ప్రాబల్యం. పశ్చిమ బెంగాల్‌వంటి కొన్ని జిల్లాలలోనూ, కలకత్తావంటి కొన్ని ప్రాంతాలలోనూ కూడా కమ్యూనిస్టులే ఎక్కువ.

గాల్‌బ్రెత్ :—వీరూ..........................................

శ్రీమతిగాంధీ :—వీరు వామపక్ష కమ్యూనిస్టులు అనబడేవారు.

గాల్‌బ్రెత్ :—పీకింగ్ మనస్తత్వం వారా?

శ్రీమతిగాంధీ :—ఆ పదప్రయోగానికి వారు అభ్యంతరం చెబుతారు.

గాల్‌బ్రెత్ :—నిజంగా అభ్యంతరం చెబుతారా?

శ్రీమతిగాంధీ :-అలాగా ఇలాగా కాదు, బాగా తీవ్రంగా! వారు నా దగ్గరకువచ్చి తాము చైనాను ఏవిధంగానూ బలపరచటం లేదని హామీ ఇచ్చారు. వారి తగాదా అల్లా ఇతర కమ్యూనిస్టులు ప్రవచించే సిద్ధాంతాలను గురించే, తాము 'పదహారణాల' దేశభక్తులమనీ, ఇంకా ఏవేవో చెబుతారు. ఇక ఉత్తర భారతంలోని రాష్ట్రాలలో—ముఖ్యంగా హిందీ వాడుకభాషగా గల రాష్ట్రాలలో దక్షిణ వర్గాల వారినించే ప్రమాదం.

గాల్‌బ్రెత్ :-జనసంఘంనించా?

శ్రీమతిగాంధీ :-అవును. జనసంఘాన్నించే. మీకు తెలుసుగా, వీరు ఒక విధంగా మతపునరుద్ధరణకూ, వీరజాతీయతకూ చెందిన సంకుచితభావాలుగల వర్గంవారు. ఈ మాటంటే వారికి కోపం అనుకోండి. అది వేరేసంగతి. ముస్లింలను కూడా తమ పార్టీలో చేర్చుకుంటామనీ, ఇంకా ఏదేదో చెపుతూ ఉంటారు. కాని మొత్తంమీద వారి వైఖరిమాత్రం అది. ముఖ్యంగా పాకిస్తాన్‌తో పోరాటం జరిగినప్పుడు వారి యీ వైఖరి మరీ ఆందోళనకరంగా ఉండేది. ఈ విషయంలో మేమెంతో నిక్కచ్చిగా వ్యవహరించవలసి వచ్చింది.

గాల్‌బ్రెత్ :-వారు పాకిస్తాన్‌తో కుదిరిన ఒప్పందాన్ని దుయ్యబడతారా?

శ్రీమతిగాంధీ :-అవును. మరీ తీవ్రంగా.

గాల్‌బ్రెత్ :-ఇక స్వతంత్ర పార్టీ సంగతి ఏమయింది? నేను మొదట్లో భారత దేశానికి వచ్చినప్పుడు అక్కడి విలేఖరులు దానిని గోల్డు వాటర్ పార్టీతో పోలుస్తూండేవారు.

శ్రీమతిగాంధీ :-అది అలాగే ఉంది. ఇప్పుడదే పెద్ద ప్రతిపక్షం—పార్లమెంటులో. కమ్యూనిస్టు పార్టీ చీలిపోయిందిగా. కాని వారికి అంతటి ధాటి లేదు.

గాల్‌బ్రెత్ :-అది బాగా వృద్ధిలోకి వచ్చే సూచనలేవీ లేవా?

శ్రీమతిగాంధీ :-అబ్బే, అలాంటిదేమీ లేదనుకుంటాను. మేము ఒప్పుకోవాలే కాని, వారిలో చాలామంది మా పార్టీలో చేరడానికి తయారుగా ఉన్నారు.

గాల్‌బ్రెత్ :-అలాగా! నిజంగా వారు మీలో చేరడానికి సిద్ధంగా ఉన్నారా?

శ్రీమతిగాంధీ :-పార్లమెంటులోకాదు, కాని అంతకు దిగువస్థాయిలో.

గాల్‌బ్రెత్ :-సోషలిస్టులూ, ప్రజా సోషలిస్టుల మాట?

శ్రీమతిగాంధీ :-ప్రజాసోషలిస్టులు ఇంచుమించుగా అంతరించారనే చెప్పవచ్చు.

గాల్‌బ్రెత్ :-పార్టీయే అంతరించిందా?

శ్రీమతిగాంధీ :-అవును.

గాల్‌బ్రెత్ :-వారిలో అతి ముఖ్యమయిన సభ్యుణ్ని మీరు ప్రభుత్వంలోకి తీసుకున్నారు. అవునా?

శ్రీమతిగాంధీ :-మేం చాలామందిని తీసుకున్నాం-చురుకయిన యువజనులంతా వచ్చేశారు. కాని సోషలిస్టులే బాగా అల్లరిచేస్తారు. తాము ఎస్. ఎస్. ప్రభువులమని చెప్పుకుంటూ ఉంటారు వారు. నేను దేశంనించి బయలుదేరాక కూడా వారు పార్లమెంటులో ఎంతోగలాటా చేసినట్లు వార్తలు చేరాయి.

గాల్‌బ్రెత్ :-సోషలిస్టు పార్టీఅంటే? నేనూ........

శ్రీమతిగాంధీ :-వారి విధానాన్ని గురించి అడుగుతున్నారా?

గాల్‌బ్రెత్ :-అవును. నేను వారి ప్రసంగాలు పార్లమెంటులో విన్నాను. వారు ఎంతో తీవ్రంగా, ఉద్రేకంతో మాట్లాడేవారు. కాని వారి అసలు విధానం ఏమిటో నాకు సరిగ్గా తెలియదు. ప్రధానమంత్రిని వేధించడమేనా వారి పని?

శ్రీమతిగాంధీ :-వారి విధులలో అది ఒకటని అనుకుంటాను. కాదు. వారి ముఖ్య విధానం-వారు కూడా తాష్కెంటు ఒప్పందాన్ని ప్రతిఘటిస్తారు. హిందీని తీవ్రంగా బలపరుస్తారు. హిందీయేకాదు. అన్ని దేశీయభాషలు కూడా. కాని ఇంతకు తప్పిస్తే వారి విధానం ఏమిటో నాకూ సరిగ్గా తెలియదు. వారి విధానం తరుచూ మారుతూ ఉంటుంది. ఒక సమస్యపై ఒకప్పుడు వారొక పార్టీతో చేతులు కలపవచ్చు. మరో సమస్యపై మరో పార్టీతో చేతులు కలుపుతారు. ఇతర పార్టీలతో ఎన్నికల పొత్తులు కుదుర్చుకోవడంలో వారికి నమ్మకం ఎక్కువ.

గాల్‌బ్రెత్ :-అమెరికాలోని పేపర్లలో పడినదానినిబట్టి చూస్తే భాషా సమస్య పరిష్కారంలో మీరుఅద్భుతమయిన ప్రభావాన్ని ప్రసరింపజేసి, ఏడెనిమిది నెలలక్రితం కల్లోల కారణంగా పరిణమించిన వ్యవహారాన్ని ఒడ్డెక్కించారనుకుంటాను. ఈ విషయంలో ఉత్తరోత్తరా ఎట్టి పరిణామాలు సంభవించగలవని మీరు భావిస్తున్నారు?

శ్రీమతిగాంధీ :-ఈ సమస్య అంత జటిలమైనదని నేనెన్నడూ భావించను. అంటే నా ఉద్దేశం, దీనిని తగినంత సానుభూతితో పరిష్కరించడానికి పూనుకుంటే చిక్కులకు దారితీయదు. అందువల్ల విభేదాలకుగానీ, విచ్ఛిన్న ధోరణులకు గానీ ఆస్కారం ఏర్పడదు. ఈ విషయంలోనే కాదు, ఏ సమస్యకయినా అంతే. మొదట్లోనే సానుభూతితో వ్యవహరిస్తే, ఉభయపక్షాలకూ ప్రతిష్ఠాభంగం కారాదనే పట్టుదలలు పెరిగేవరకూ పరిస్థితి విషమించదు. భారతదేశంతో ఏదో ఒక భాష జాతీయభాష కావాలన్నది సువిదితం. అంటే నా ఉద్దేశం—ఏ దేశంలోనూ కూడా ౧౪ ముఖ్య భాషల్లోనూ, ఇంకా అనేక ఇతర దేశీయ భాషల్లోనూ దేశ వ్యవహారాలు జరుపుకోవడం సాధ్యంకాదని. అలాగని మనం ఎవరి మాతృభాషనూ కాదనలేం. ఎందుచేతనంటే ఇవన్నీ అతిప్రాచీనమైనవే. వీటన్నింటిలోనూ చక్కని

కవిత్వమూ, నాటకాలూ, సాహిత్యమూ మొదలైన వెన్నో ఉన్నాయి. వీటికి చిరస్మరణీయమైన చరిత్ర ఉంది. అందుచేతనే వీటన్నిటికీ అనుసంధాన భాష ఒకటి ఉండవలసిన అగత్యం ఏర్పడింది. ఆ అనుసంధాన భాష కాగల అర్హత హిందీకి ఒక్కదానికే ఉంది. ఎందుచేతనంటే ఇప్పటికే చాలామంది హిందీ మాట్లాడేవారున్నారు కాబట్టి, అంతకంటేనూ ఎక్కువ మందికి ఆ భాష అర్థమవుతుంది కాబట్టీని.

ఈరకం వాదంతో ఇటు బెంగాల్‌లోనూ అటు దక్షిణాదినా నచ్చచెప్పవలసి ఉంది. ఆవిధంగా బోధపరుస్తే వారు ఆమోదిస్తారు. దక్షిణాదిన హిందీ వ్యతిరేకోద్యమం బాగా ముమ్మరంగా ఉన్నప్పుడు నేను మద్రాసు వెళ్ళిన సంగతి మీకుతెలుసు. నేనక్కడ చెప్పిందిదే. మనకు అనుసంధాన భాష ఒకటి ఉండక తప్పదని చెప్పాను. "తమిళమే అలాటి అనుసంధాన భాష కావాలంటారా? చెప్పండి-దానిని నేర్చుకోవడానికి నేను సిద్ధంగానే ఉన్నాను. నేనప్పుడే నేర్చుకుంటున్నాను కూడాను. కాని ఇదివరకే నూరింట అరవయిమందికి తెలిసిన హిందీభాషను మిగతావారికి నేర్పడమే ఇంతకష్టంగా ఉంటే-అంతకంటె బాగా తక్కువ మందికి మాత్రమే తెలిసే తమిళాన్నో, బెంగాలీనో, మరో భాషనో అనుసంధాన భాషగా చేసి, మిగతా వారందరికీ దానిని నేర్చుకోమని నచ్చజెప్పడం జరిగేదేనా అని అడిగాను. కాదని వారే అన్నారు. 'అలాటప్పుడు మరేభాషను అనుసంధాన భాషగా చేద్దాం?' అని మళ్ళీ అడిగాను. అప్పుడు వారు కొంతసేపు ఆలోచించి, చివరికి, 'హిందీ కావలసిందే' నని ఒప్పుకున్నారు. అందుచేత నేననేదేమంటే, సహేతుకంగా వాదించి నచ్చజెప్పితే చాలామంది ఆమోదిస్తారనే అనుకుంటాను.

ముఖ్యంగా నచ్చజెప్పే విధానంలోనే ఉంది. ఈ విషయమై ఇంతటి వివాదం లేకపోతే, ఇంతగా వాదప్రతివాదాలు చెలరేగకపోతే ప్రజలు దానిని నేర్చుకుంటారు. యువతరంవారు నేర్చుకుంటూనే ఉన్నారు.

గాల్‌బ్రెత్:-భారత, పాకిస్తాన్ దేశాలు అమెరికా మోస్తరుగానే, తీవ్రరాజకీయ చైతన్యంగల సమాజాలని అనుకుంటూంటాను. ప్రజలకు తర్కించుకోవటానికి రాజకీయసమస్య ఏదీ లేకపోతే, వారే ఏదో సృష్టిస్తారు. ప్రస్తుతం మా దేశంలో వివాదగ్రస్తమైన రాజకీయ సమస్య ఏదీలేదు-అందుచేత వారికేమీ తోచడం లేదు. అందుచేతనే వారు పదేళ్ళతరువాత రాబర్టు కెన్నెడీ, హ్యూబర్టు హంఫ్రీ-ఈ ఇద్దరిలో ఎవరు అమెరికా ప్రెసిడెంట్ అవుతారని తర్కవితర్కాలకు పూనుకుంటున్నారు. ఇంతటి స్వల్ప విషయాన్నికూడా చర్చనీయాంశంగా చేసుకోవలసిన గతికి దిగజారిపోయాం ఇప్పుడు.

మీ దేశంలోకూడా చర్చించుకోదగిన రాజకీయ సమస్య అంటూ లేనప్పుడల్లా భాషా సమస్య తలెత్తుతూంటుందనుకుంటాను. ఇదెప్పుడూ మంచి చర్చనీయాంశమే.

శ్రీమతిగాంధీ:-అబ్బే. నే నామాట అనను. ఎందుచేతనంటే ఒక్క సంగతి నిజం.

గాల్‌బ్రెత్:-నేను మరీ చులకనగా మాట్లాడుతున్నానేమో.

శ్రీమతిగాంధీ :-అదికాదు. ప్రజల భావోద్వేగాలతో కూడిన సమస్య అది. ఇది నిన్నామొన్న తలఎత్తినదికాదు - ఏనాటిదో ఇది. బహుశా మీకు తెలుసునేమో - ఎప్పుడో ౧౯-౨౦ ప్రాంతంలోనే దేశాన్ని భాషారాష్ట్రాలుగా విభజించాలని కాంగ్రెసు నిర్ణయించింది. దేశానికి స్వతంత్రం రాకపూర్వమే భాష ప్రాతిపదికగా ప్రదేశ్ కాంగ్రెస్‌లు ఏర్పడ్డాయి. బ్రిటిష్ వారి హయాంలో పరిపాలనా సౌలభ్యం ప్రాతిపదికగా రాష్ట్రాలు రూపొందించడం జరగలేదు. అందుచేతనే ఆ భావం బాగా ప్రబలంగా ఉండిపోయింది. కాని ఎవరూ తమ భాషాభివృద్ధికి ప్రతిబంధకం కావడంలేదని గ్రహించిననాడు, వారు హిందీనో, మరోభాషనో తప్పక నేర్చుకుంటారు. కాకపోతే మరొకరి భాషను అధ్యయనం చేయడానికి కొంత ప్రత్యేక కృషి అవసరం అవుతుంది.

గాల్‌బ్రెత్ :-మరొక అనుసంధాన భాషగా ఇంగ్లీషుకూడా ఉండక తప్పదను కుంటాను. కాదంటారా ?

శ్రీమతి గాంధీ :-మీకు హిందీ మోస్తరుగా, మేముకూడా ఇంగ్లీషును అంత ర్జాతీయభాషగా రూపొందించుకోవాలనుకుంటున్నాం. ఐతే ఆ ఇంగ్లీషేరూపం దాలుస్తుందో ఎవరూ చెప్పలేరు. అది త్వరితగతిని మారిపోతోంది. ఇంగ్లండులో రాణీగారి ఆంగ్లభాష మోస్తరు, మాదేశంలో రాష్ట్రపతి ఆంగ్లభాష అని మేం అనుకుంటూంటాం.

గాల్‌బ్రెత్ :-అవును. ఇక్కడకూడా ప్రజలకు తాము వాడే భాషమీద మక్కువ ఎక్కువ. గత నూరేళ్ళుగా మేం ఇంగ్లీషుకు మెరుగులు దిద్దాం-అంటే బాగా మార్పులుచేశాం. దేశ పరిస్థితులకు అనువుగా సరిదిద్దుకునే హక్కు భారతీయులకు కూడా ఉండవచ్చు - కాదు, ఉందనే అనుకుంటాను.

అది సరే-పంజాబు విషయమై చేసిన నిర్ణయాన్ని గురించి చెప్పండి-అదే - ఆ రాష్ట్ర విభజనను గురించి నేనాదేశం విడిచిపెట్టివచ్చాక జరిగిన సంఘటన-ఇది నన్ను చకితుణ్ణి చేసింది. అంతకంటే-నన్నాశ్చర్యంలో ముంచిందనవచ్చు.

శ్రీమతిగాంధీ :-అదే. ఈ విషయంలోకూడా ప్రజలు ఎన్నాళ్లగానో—ముఖ్యంగా రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ జరిగినప్పటినించీ భావోద్వేగపూరితులై ఉంటున్నారు. కాని పంజాబులో పటిష్ఠమైన నాయకత్వం ఉన్నన్నాళ్లూ వా రా ఉద్వేగాన్ని అదుపులో పెట్టగలిగారు. కాని గత రెండు మూడేండ్లుగా పరిస్థితి చెయ్యిదాటిపోయింది. వెంటనే ఒక నిర్ణయం చేసి ఉంచే పరిస్థితిని అదుపులో పెట్టడానికి వీలయ్యేదేమోనని నేను ఇప్పటికీ అనుకుంటాను. చివరకు మార్గాంతరంలేని పరిస్థితులు ఏర్పడి కూర్చున్నాయి. అదీకాక ఇది అంతగా చెడి పోయిన వ్యవహారంకూడా కాదు. దీనిలో ప్రధాన సూత్రాలేవీ ఇమిడిలేవు. కేవలం సౌలభ్యా నికి సంబంధించిన సమస్యమాత్రమే.

గాల్‌బ్రెత్ :-భాషా రాష్ట్రవిభజన సూత్రాన్ని, ఒక విధంగా స్వల్ప విస్తీర్ణానికి విస్తరింపజేయడం అన్నమాట. అంతేగా ?

శ్రీమతిగాంధీ :-అంతే.

గాల్‌బ్రెత్ :-'చండీఘడ్‌లోని నూతనభవనాలు ఎవరికి వెడతాయి? ఇటు సిక్కు-రాష్ట్రానికా? అటు హిందూరాష్ట్రానికా?' అని ఎవరయినా అడుగుతారనుకోండి-దానికి మీ సమాధానం ఏమిటి?

శ్రీమతిగాంధీ :-ఆసంగతి ఇంకా తెలియదు.

గాల్‌బ్రెత్ :-చండీఘడ్ ఒక రాష్ట్ర రాజధాని అవుతుంది. అవునా?

శ్రీమతిగాంధీ :-అదే. వివరా లింకా నిర్ణయంకాలేదు. ఏకసభ్య సంఘాన్నే వేస్తారో, ఒక సంఘాన్నే నియమిస్తారో? ఏదీ ఇంకా ఆలోచించలేదు. కేవలం సూత్రప్రాయంగా పంజాబీరాష్ట్రాన్ని ఆమోదించాం-అంతే. కాని, భాషా విషయాలేకాక ఇతర అంశాలుకూడా తలెత్తాయి. కొండ ప్రాంతాల ప్రజలకు నిజంగా ఇదివరలో న్యాయం జరగ లేదు. ఈ అన్యాయం ఈనాటిదికాదు. తరతరాలుగా జరుగుతూ వస్తున్నది. మైదాన ప్రాంతప్రజలు నాగరికులు. వారికి తమ లక్ష్యాలు సాధించుకోవడానికి తగిన వసర్లు అందుబాటులో ఉండడమే అందుకు కారణం. కాని కొండప్రాంతాలవారు మరీ అమాయకులు. తమకు అన్యాయం జరిగిందనే భావం వారిలో ఉండిపోయింది. ఇది హిందువులూ, సిక్కులూ అనే భావమూ కాదు-భాషా విషయికమైన సమస్యా కాదు. పర్వత రాష్ట్రం హిమాచల ప్రదేశ్ ఉంది. అక్కడ వారికంటె ఎక్కువ అభివృద్ధినే సాధించగలిగారు. తాముకూడా వారితో కలిస్తే ఆ అభ్యుదయంలో భాగస్వాములం కావచ్చుననే భావం ప్రబలంగా ఉంది.

గాల్‌బ్రెత్ :-కొండల సంగతి వచ్చింది కాబట్టి - ఇవి ప్రపంచంలోకల్లా అత్యున్నతమైన పర్వతశ్రేణులని అనుకుంటాను, కాదా?

శ్రీమతిగాంధీ -నే ననేది కూలూ, కాంగ్రాలనుగురించి..................

గాల్‌బ్రెత్ :-ఈ ప్రాంతాల ప్రజలు బాగా అమాయకులే కావచ్చు. కాని, కనీసం నాకు తెలిసినంతవరకు, ప్రపంచంలోని మహోజ్జ్వలమైన చిత్రాలు ఆవిర్భవించినది అక్కడే నని అనుకుంటాను.

శ్రీమతిగాంధీ :-అవును, అతిసూక్ష్మమైన అక్కడి ప్రాచీన చిత్రాలు బహు సుందరంగా ఉంటాయి.

గాల్‌బ్రెత్ :-రంధావా, నేనూ కలిసి కాంగ్రా చిత్రకళపై రచించిన మహాగ్రంథం వెలువడబోతోంది సుమండీ?

శ్రీమతిగాంధీ :- అవును, మీరు చక్కని చిత్రా లెన్నో సేకరించారు.

గాల్‌బ్రెత్ :-నిజంగా చెబుతున్నాను. ఎంతో చక్కని పుస్తకం తయారవుతోంది సుమండీ. మేం అత్యుత్తమ చిత్రాలు ముప్ఫయ్‌నాలుగింటిని సేకరించాము. అమెరికాలో ఇట్టి చిత్రాలు చూడ్డం ఇదే ప్రథమం అనుకుంటాను. వ్రాయడం ఎంతో శ్రమగా, విసుగ్గా భావించేవాళ్ళలో నేనొకణ్ణి. కాని ప్రతిక్షణం ఆనందంతో పనిచేయగలిగింది ఈ ఒక్క పుస్తకం విషయంలోనే.

శ్రీమతిగాంధీ :-నా కెంతో సంతోషంగా ఉంది. అమెరికా ప్రజలు వాటిని తిలకించే అవకాశం కలగడం నిజంగా నా కెంతో ఆనందదాయకమైన విషయం.

గాల్‌బ్రెత్ :-ఇక్కడ లభ్యమయ్యే గోధుమలను భారతదేశానికి తరలించడం యుద్ధవ్యూహరచనఅంతగా క్లిష్టమైనదని అంటారు కాని - ఈ పుస్తక ప్రచురణే దానికంటే క్లిష్టమయినదని నా అభిప్రాయం. చిత్రాలు పూనాలో తయారవుతున్నాయి - బొంబాయిలో అచ్చవుతున్నాయి - పుస్తక ప్రచురణ బోస్టన్‌లో జరుగుతోంది. వీటన్నింటినీ సమన్వయించడమూ, మధ్యలో మీ దేశంలోని దిగుమతి కంట్రోళ్లూ అవ్వీ—

శ్రీమతిగాంధీ :-సరే-చివరకు శుభాంతం కాగలదని ఆశిస్తున్నాను. అది చక్కని పుస్తకంగా రూపొందగలదని నా విశ్వాసం.

గాల్‌బ్రెత్ :-చూడండి-భారతదేశంలో వ్యవసాయంపట్ల తగిన శ్రద్ధ వహించడం లేదనీ, అది ఎదుగూ, బొదుగూ లేకుండా స్తబ్ధుగా ఉండిపోయిందనీ విదేశీయుల్లో ఒక భావం ఉంది. ప్రెసిడెంట్ సందేశాన్నిబట్టి మీ దేశంలో వ్యవసాయోత్పత్తులు 1950 నించీ 75 శాతం పెరిగినట్లు తెలుస్తోంది. విపరీతమైన జనాభాగల ప్రాచీన దేశానికిది నిజంగా ప్రశంసనీయమైన ప్రగతే. కాని ముందు సంగతేమిటి? అదే-ఉత్పత్తి ఇంకా పెరుగుతుందంటారా?

శ్రీమతిగాంధీ :-పెరుగుతుందనే అనుకుంటాను. కాని ఇందుకు బృహత్కృషి జరగాలి. ఇంతగా ఉత్పత్తి పెరగాలని నిర్ణయించినంత మాత్రంచేతనే సరిపోదు. మనం కూడా రంగంలోకి దిగి ఉత్పత్తి ఎలా, ఏవిధంగా పెంచవచ్చునో ప్రతీవ్యక్తికీ, ప్రతీరైతుకూ నచ్చజెప్పాలి. కాని గమనార్హమైన సంగతేమిటంటే-రైతుల కీనాడు, కొత్తకొత్త సంగతులు నేర్చుకొని అనుసరించాలన్న ఆసక్తి కలిగింది. కొత్త పద్ధతులూ, సరికొత్త విధానాలూ అనుసరించడానికీ నాడాతడు విముఖంగా లేడు. ఇప్పుడున్న పెద్ద ప్రతిబంధకం-అతనికి తగిన సమాచారాన్ని అందజేసి, ఆధునిక వ్యవసాయపద్ధతులకు కావలసిన సాధనసంపత్తిని సమకూర్చడంలోనే ఉంది. రసాయనిక ఎరువుల ఉత్పత్తికి కొత్తగా కుదుర్చుకున్న ఒప్పందం వల్లా, మేం తీసుకున్న ఇతర చర్యలవల్లా, వ్యావసాయికోత్పత్తి పెరగగలదనే అనుకుంటున్నాం.

గాల్‌బ్రెత్ :-ఎరువులు మరీ ముఖ్యం అవునాండీ?

శ్రీమతిగాంధీ :-అదైనా నీరుంటేనే. ఇప్పు డదే ముఖ్యసమస్య. నిరుడు వానలు బొత్తిగా లేవని మీకుతెలుసు. అందువల్ల మైసూరువంటి రాష్ట్రాలలో శతాబ్దులుగా చెఱువుల క్రింద సాగుచేసుకునేవారికి ప్రప్రథమంగా నీటి ఎద్దడి ఏర్పడింది.

గాల్‌బ్రెత్ :-ఓహో, అలాగా?

శ్రీమతిగాంధీ :-చెఱువుల అడుగుభాగాలలో ఆఖరుకు తేమకూడా మిగల్లేదు. అందుచేత మా కెదురైనది తిండికొరతే కాదు - నీటి ఎద్దడి కూడాను. చివరకు ప్రజలకు త్రాగేందుకు మంచినీటినికూడా చేరవేయవలసి వస్తోంది.

గాల్‌బ్రెత్ :-నదులలోనూ, ఏరులలోనూ జలసంపదను పునరుద్ధరించడం ప్రత్యేక సమస్య అంటారా? అదనంగా భారీ వర్షాలు పడితేనేగాని ఇవి మళ్ళీ యథాస్థితికి రావంటారా?

శ్రీమతి గాంధీ :-మామూలుగా వర్షాలు పడుతూన్నంతకాలం ఇబ్బందేమీ ఉండదు.

గాల్‌బ్రెత్ :-మరో విషయం. నేను భారతదేశంలో ఉండగా ప్రధానమయిన సమస్య చైనా వారి బెడదే ననుకోండి. ఎత్తయిన పర్వత కనుమలలో నించి మళ్ళీ ఎప్పుడు ప్రమాదం వచ్చి పడుతుందోననే భయం ఉండేది. అప్పట్లో భారతదేశం చైనాను గురించి అతిగా ఆందోళన చెందుతోందేమోనని నాకు అనిపించేది. అంటే-మిగతా సమస్యలతోబాటు చైనా వ్యవహారాన్ని దీర్ఘ దృష్టితో చూస్తే బాగుండుననిపించేది. ఇప్పుడు చైనాను గురించి మీ రేమనుకుంటున్నారు? ప్రజల అభిప్రాయాలు ఎలా ఉన్నాయి?

శ్రీమతిగాంధీ:-భారతీయుల ఆలోచనాధోరణిలో చైనా వ్యవహారాలే ప్రాబల్యం వహిస్తున్నాయని నేను చెప్పను. కాని ఆ బెడద అలాగే ఉన్నమాటమాత్రం వాస్తవం. మేము సరిహద్దునంతటినీ నిరంతరం అప్రమత్తులమై రక్షించుకుంటూనే ఉండాలి. ముఖ్యంగా చైనావారు ఈనాటికీ బెదిరింపులతో కూడిన అధిక్షేపణ పత్రాలు పంపుతూనే ఉన్నారు. అడపా దడపా ప్రకటనలు జారీ చేస్తున్నారు. సరిహద్దు పొడవునా, వారు తమ బలాలను సమీకరించి ఉంచారనే నా నమ్మకం.

గాల్‌బ్రెత్:-మీకూ, చైనా ప్రభుత్వానికీ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలూ, సంప్రదింపుల లాంటివి ఏమయినా ఇంకా జరుగుతున్నాయా?

శ్రీమతిగాంధీ :-లేదు.

గాల్‌బ్రెత్ :-దౌత్యరీత్యా మీరింకా తెగతెంపులు చేసుకోకపోయినప్పటికీ వాస్తవమయిన ఉత్తర ప్రత్యుత్తరాలకు ఆస్కారం ఏదీ లేదనుకుంటాను.

శ్రీమతిగాంధీ :-ఒక దౌత్య వ్యవహర్త మాత్రం ఉన్నారు......

గాల్‌బ్రెత్ :-ఈ విషయంలో మా వైఖరికంటె మీరు కొంతవరకు వివేకంతో ప్రవర్తిస్తున్నారనుకుంటాను. చైనావారితో వేగడం అంత సులభం కాకపోయినప్పటికీ, వారితో సంబంధాలు పెట్టుకోవడం మంచిదని నాకు ఎన్నాళ్లగానో అనిపిస్తూ ఉంటుంది.

శ్రీమతిగాంధీ :-అవును. అందువల్ల నష్టంలేదు. ఉపయోగం ఉంటే ఉండవచ్చు, లేకపోనూ వచ్చు; కాని-

గాల్‌బ్రెత్ :-ఏదెలా ఉన్నా కమ్యూనిస్టుచైనా ప్రభుత్వం అసలే లేదని వాదించే వారి కృషి ఫలించలేదు.

అదలా ఉండనివ్వండి. ఇంకా రెండవసంగతి. పాకిస్తాన్ మాటేమిటి? నిజానికి మాకిది పెద్దసమస్యే. ఇటు భారతదేశంతోటీ, అటు పాకిస్తాన్‌తోటీకూడా సత్సంబంధాలు పెట్టుకోవాలని మా ఆకాంక్ష. వ్యక్తిగతంగా నాకు ఈ రెండుదేశాలపట్లా అభిమానం ఉంది.

శ్రీమతిగాంధీ :-మాసమస్యకూడా అదే.పాకిస్తాన్‌తో మంచిగా ఉండాలనే మేమూ కోరుకుంటున్నాం. పాకిస్తాన్‌తో మైత్రిని నెలకొల్పడానికే మేము ఎల్లప్పుడూ పాటుపడు తున్నాము. ఇదేదో సత్కార్యమనిగానీ సదాశయమనిగానీ, కాదు - ఉభయ దేశాలమధ్యా మైత్రీ, ఆర్థిక సహకారంవల్ల ఉభయులకూకూడా శ్రేయస్కరమనే ఉద్దేశంతోనే ఈప్రయత్నం. ఈ ఉభయదేశాలూ ఒకే ఉపఖండంలోనివి. ఉమ్మడి కార్యక్రమాలూ, ఉమ్మడి ప్రాజెక్టులూ చేపట్టడంవల్ల ఉభయులకూ బ్రహ్మాండమయిన ప్రయోజనం చేకూరుతుందని నా అభిప్రాయం. ఇదికాక స్పర్ధలు తొలగిపోవడంవల్ల శక్తిసామర్థ్యాలు, ఆర్థికవనర్లు వృథాపోకుండా ఉంటా యని వేరే చెప్పనక్కరలేదు.

గాల్‌బ్రెత్ :-పాకిస్తాన్‌వారికి చైనానించి ఆయుధాలు అందుతున్నా యనుకుం టాను. భారతదేశంలో ఈ విషయాన్ని గురించే బాగా తర్జన భర్జనలు జరుగుతూంటాయి కాబోలు.

శ్రీమతి గాంధీ :——అవును. ప్రజలకు ఈ విషయం బాగా ఆందోళనకరంగా ఉంది. పాకిస్తాన్-చైనాదేశాలమధ్య కుదిరిన ఒప్పందమూ, వారుభయులమధ్యా పెంపొందే పొత్తూ మాకు ఎంతో ఆందోళనకరంగా ఉన్నాయి.

గాల్‌బ్రెత్ :-వారికి లభించే మా ఆయుధాలు ఊరికే పేరుకేగాని ప్రమాదకర మయినవి కావేమోనని నా ఊహ. కాని-

శ్రీమతిగాంధీ :-వారు విమానాలూ, ఇంకా ఏవేవో తెప్పించుకుంటున్నారు.

గాల్‌బ్రెత్ :-గత శరత్కాలంలో జరిగిన సంఘర్షణవల్ల నేర్చుకోదగిన గుణ పాఠం విదేశాలనించి తెప్పించునే ఆయుధాలను గురించి విపరీతంగా భయపడుతున్నామేమో అని. పాటన్ టాంకులు కూడా భారతీయులు అనుకున్నంత ప్రమాదకరంగా పరిణ మించలేదు.

శ్రీమతిగాంధీ :-కావచ్చు, కాని ఇతర సందర్భాలలో అలాపరిణమించవచ్చు నేమో !

గాల్ బ్రెత్ :—అవి బాగా దెబ్బతిన్నాయికదా.

శ్రీమతి గాంధీ :—ఆ విషయం నా కంతగా తెలియదు. కాని గమనించవలసిన సంగతేమిటంటే, ఏ ఆయుధంగానీ, ఎంతప్రమాదకరమయినదీ అన్న సంగతి ముఖ్యం కాదు. ఈ ఆయుధాలు సమకూరినప్పుడు వాటిని ఎవరిమీద ప్రయోగిద్దామా అనేధోరణి ప్రబలమవుతూ ఉంటుంది. దాన్ని తప్పక గమనించాలి.

గాల్ బ్రెత్ :—మిగతా అన్నిటికంటేనూ కూడా యీ విషయంలో నేను మీతో ఏకీభవిస్తాను. నేను భారతదేశంలో రాయబారిగా ఉన్నకాలంలో ఆసియాదేశాలన్నిటికీ ఆయుధాలు సరఫరాచేసే విధానాన్ని మౌనంగా ఆమోదించవలసి రావడం నాకు మరీ బాధాకరంగా ఉండేది. ఆగ్నేయాసియా సంధి రాజ్యాలకు ఆయుధాలను సరఫరా చేయడమే పెద్ద పొరబాటని నా ఉద్దేశం. దానితో పేదదేశాలమధ్య ఆయుధాలకోసం పోటీ ప్రారంభమయింది. ఒకసారి ఆయుధాలు ఇవ్వడంతో సరిపోలేదు. ఆ దేశాలు వాటిని ఉపయోగించడంతో శిక్షణ ఇవ్వడానికి, సైనికుల దుస్తులకూ, ఆహారపదార్థాల సప్లయికీ, స్వల్పమైన తమ వనరులను వినియోగించాల్సి వచ్చింది. డల్లెస్ ప్రతిపాదించిన యీ విధానంలోని లోపాలను తెలియబరుస్తూ ప్రతి విమానాశ్రయంలోనూ కరపత్రాలు విక్రయిస్తే బాగుంటుందేమోనని నేను అనేకసార్లు సూచిస్తూ వచ్చాను. ఈ విషయంలో నాకు మీలోకూడా కొంత అభిప్రాయభేదం ఏర్పడడానికి ఆస్కారం ఉంది. చివరికి చైనా వ్యవహారంలోకూడా—వారివల్ల భారతదేశానికి ప్రమాదం సంభవించే అవకాశం ఉన్నాకూడా-భారతదేశానికి ఆయుధాలు సరఫరా చేయడానికి నేను అంతగా అంగీకరించను. అసలు ఆయుధాలసరఫరా విషయంలో నాది గాంధేయదృక్పథం.

శ్రీమతిగాంధీ :-బాగానే ఉంటుంది. కాని ప్రభుత్వానికి సంబంధించినంతవరకు అటువంటివైఖరి అవలంబించడం చాలా కష్టం. అంటే, దేశరక్షణకోసం పోరాడకతప్పదు. దురాక్రమణను ప్రతిఘటించి తీరాలి. లేకపోతే దేశాన్ని పాలించలేం.

గాల్ బ్రెత్ :-అదీ నిజమే అనుకుంటాను. కళాశాలలో అధ్యాపకుడుగా ఉండడం వల్ల కలిగే గొప్ప ప్రయోజనాలలో ఒకటి ఇష్టమొచ్చింది వ్రాయగలగడమే. నన్నడిగితే అసలు ఈ ఆయుధాల సరఫరాయే మానివేయాలంటాను. లేదా కనీసపరిమితికి తగ్గించనన్నా తగ్గించాలి; చివరికి ఆహారపదార్థాల సరఫరా విషయంలోకూడా, మా కాంగ్రెసు సభవారు, మేము ఇంతసొమ్ము కేటాయించామని చెప్పి ఊరుకోరు. ఉభయ దేశాలమధ్యా పంపిణీ ఎలా జరిగిందో అడుగుతూంటారు. ఇదికూడా ఒక విధమయిన పోటీక్రిందే వస్తుంది.

అదలా ఉంచండి. ఆగ్నేయాసియా, వియత్నాం వ్యవహారాలు మాకు పెద్ద తలనొప్పిగా పరిణమించాయి. వీటిపై మీ అభిప్రాయం ఏమిటి? ఈ అడుసులోనించి మేము కాలు బయటికి లాక్కునే ఆస్కారం ఏమయినా ఉందంటారా?

శ్రీమతిగాంధీ :-భారతదేశానికి ఈ వ్యవహారంలో ప్రత్యేకమైన ఆసక్తి ఉంది. ఈ పోరాటం ఉధృతమయిన కొద్దీ ఆ ప్రాంతంలోగల మావంటి చుట్టుప్రక్కల దేశాలకు ప్రమాదం మరీ ఎక్కువవుతుంది.

గాల్‌బ్రెత్ :-భారతదేశం ఇప్పటికీ అంతర్జాతీయ కంట్రోలు కమీషన్ అధ్యక్ష పదవిలో ఉన్నది కాబట్టి మీ కీ విషయంలో ప్రత్యేకాసక్తి ఏర్పడిందనుకుంటాను. ఔనా ?

శ్రీమతిగాంధీ :-ఔను.

గాల్‌బ్రెత్ :-ఆ సంఘం ఇప్పుడు అంతగా పనిచేయడంలేదు కదూ ?

శ్రీమతిగాంధీ :-ఔను. అది పనిచేయవలసినంత చురుగ్గా పనిచేయడంలేదు.

గాల్‌బ్రెత్ :-ఆ సంగతి నేనూ ఒప్పుకుంటాను. యుద్ధం ఒక అంటు జాడ్యం లాంటిది. ఆ పోరాటాన్ని తగ్గించడంగానీ, పరిమితం చేయడంగానీ జరిగితే బాగుండును. ఈ విషయంలో ప్రెసిడెంట్ జాన్సన్‌కూడా ఎంతో ఆందోళన పడుతున్నారు.

శ్రీమతిగాంధీ :-ఆ సంగతి నేనూ గ్రహించాను. ఆయనకు ఇదే పెద్ద ఆందోళన కలుగజేస్తోంది. దీనిని తలుచుకున్నప్పుడప్పుడల్లా రాత్రిళ్లు నిద్రపట్టడంలేదనికూడా అన్నాడాయన.

గాల్‌బ్రెత్ :-పరిస్థితి చేయిదాటిపోకుండా నిరోధిస్తున్నది ప్రెసిడెంట్ జాన్సనేనని అమెరికాలోని ప్రజలుకూడా గ్రహిస్తున్నారనుకుంటాను. ఆయనేగనక అదుపులోపెట్టి ఉండకపోతే పరిస్థితి మరీ విషమించి ఉండేది. ఈ వ్యవహారంలోనించి బయటపడడం ఏలాగో మీరేమన్నా ఆలోచించారా ?

శ్రీమతిగాంధీ :-ఇప్పు డీ వ్యవహారం మీ ఒక్కరి చేతుల్లోనే లేదు.

గాల్‌బ్రెత్ :-ఆమాట నిజమేననుకోండి. నేషనల్ లిబరేషన్ ఆర్మీగానీ, నేషనల్ లిబరేషన్ ఫ్రంటుగానీ రాయబారాలకు సిద్ధంగా ఉన్నాయని నమ్మదగిన సూచన లేవయినా కనపడితే మేముకూడా రాయబారానికి తయారుగా ఉన్నాం. రాయబారాలు జరపాల్సిందే.

శ్రీమతిగాంధీ :-చాలామంది యీ విషయంలో ప్రయత్నాలు చేస్తున్నారనుకుంటాను. కాని ఫలించడంలేదు.

గాల్‌బ్రెత్ :-మళ్లీ సాధారణ పౌరునిగానే మాట్లాడుతున్నాను — ఉత్తర వియత్నాంతో ఈ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడానికి భారతదేశం వెనకాడదనుకుంటాను. మీకు హనాయ్‌లో దౌత్యసిబ్బంది ఉన్నట్లున్నారు ?

శ్రీమతిగాంధీ :-అవును, ఉన్నారు.

గాల్‌బ్రెత్ :-ఎన్నికలు దగ్గరపడుతున్నాయికదా, మిగతా సమస్యలపై మీ అభిప్రాయం ఏమిటి ? ఆహారం, భాష... ........

శ్రీమతి గాంధీ :—పాకిస్తాన్ వ్యవహారమే మరీ ముఖ్యం. ఒక నెలరోజులలో ఏం జరుగుతుందా అనేదానిపై ఆధారపడి ఉంటుంది. ఇక అంతరంగిక పరిస్థితులు నిరంతర పరిణామం చెందేవి. వాటినిగురించి ఒక ఏడాదిముందుగా చెప్పడం కష్టం. అప్పటి కేవి ప్రాధాన్యం వహిస్తాయో చెప్పలేము. ఆహారసమస్య అప్పటికి కొంత తీరవచ్చు. ఎందుచేత నంటే వచ్చే రెండు, మూడు నెలలే మరీ గడ్డుమాసాలు. పంటలు బాగా పండితే ఎన్నికల సమయంలో ఆహారం పెద్ద సమస్య కాజాలదు. స్థానిక సమస్యలు ఎన్నో తలెత్తుతాయి. ఉదాహరణకు మహారాష్ట్రలో గోవా వ్యవహారం.

గాల్ బ్రెత్ :—నిజంగానా ? అంటే—గోవా దేనిలో చేరుతుందనా ? ఓహోహో.

శ్రీమతిగాంధీ :—చాలామంది మహారాష్ట్రలో చేరిపోవడానికే అనుకూలంగా ఉన్నారు.

గాల్ బ్రెత్ :—ప్రస్తుతం గోవా పరిస్థితి ఏమిటి ?

శ్రీమతిగాంధీ :—అది వేరుగానే ఉంది. కేంద్రప్రభుత్వ ఆజ్ఞాయిషీలో.

గాల్ బ్రెత్ :—అద్దే విస్తీర్ణం లేకపోయినా అక్కడ ఉత్పత్తులు బాగా ఎక్కువనుకుంటాను.

శ్రీమతిగాంధీ :—ఔను.

గాల్ బ్రెత్ :—అక్కడ ఉత్పత్తులు జరిగేది దేనితో ? బాక్సైటుతో కదూ !

శ్రీమతిగాంధీ :—ఔను, రాగికూడాను.

గాల్ బ్రెత్ :—ఉక్కు కర్మాగారాల విస్తరణ ఎలా జరుగుతోంది? ఈ విషయంలో నాకు ఆసక్తి ఎక్కువ. బొకారోలో కొత్త ఉక్కుకర్మాగారం స్థాపించేపని ఎలాసాగుతోంది ?

శ్రీమతి గాంధీ :—సోవియట్ ప్రభుత్వంతో ఒప్పందంపై సంతకాలయ్యాయి.

గాల్ బ్రెత్ :—ప్రభుత్వరంగంలోని నాలుగో ఉక్కుకర్మాగారానికి కదూ ! మిగతావి బాగా పనిచేస్తున్నాయా ?

శ్రీమతిగాంధీ :—ఔను. ఇప్పుడు బాగానే పనిచేస్తున్నాయనుకుంటాను.

గాల్ బ్రెత్ :—ఒడుదుడుకులన్నీ గడిచిపోయినట్లేనా ?

శ్రీమతిగాంధీ :—ఆ.

గాల్ బ్రెత్ :—ఎన్నికల సమస్యలు మరేమిటి ?

శ్రీమతిగాంధీ :—ఈ సమయంలో నాకు ఇంకేమీ స్ఫురించడంలేదు.

గాల్ బ్రెత్ :—కాంగ్రెసుపార్టీ విజయం సాధించగలిగినంత పటిష్ఠంగా ఉందా ?

శ్రీమతిగాంధీ:-పార్టీ అయితే పటిష్ఠంగానే ఉంది. కాని మెజారిటీ తగ్గవచ్చు నేమో అనుకుంటాను. అదికూడా వేర్వేరు ప్రాంతాలలోనూ వేర్వేరు రకాలుగా ఉండవచ్చు. ఇంతకుముందుకూడా మీరు కాంగ్రెసుకు ఎదురయ్యే పెద్దసవాలు ఏపార్టీవల్ల అని అడిగి నట్లున్నారు. మద్రాసులో ఒక ప్రత్యేకపార్టీ ఉంది. అది ద్రావిడ మున్నేట్రకజగం (డి. యం. కె.).

గాల్‌బ్రెత్:-డి. యం. కె. అంటే ఏమిటో మీరు వివరిస్తే బాగుంటుందను కుంటాను. ఈ టెలివిజన్ ప్రసారం దర్శించేవారు బాగా మేధావంతులే ననుకోండి. అయినా వారికికూడా ఈ పార్టీ ఆశయాలు ఏమిటో తెలియకపోవచ్చు.

శ్రీమతిగాంధీ:-ఇది కొంతవరకు సంకుచిత దృక్పథంగల పార్టీ. ఈ భాషా వివాదాలను లేవదీసింది వారే. ఉత్తరాదివారికీ, దక్షిణాదివారికీ ప్రమాదకరమయిన భేదభావాలు రెచ్చగొట్టిందికూడా వారే. కాని ఆ భావాలను ప్రజలు ఆమోదించారని నేననుకోను. ఒకవేళ వారు ఆ పార్టీని బలపరిచినట్లు కనిపించినా-అది కాంగ్రెసుపట్లగల వైషమ్యంవల్లనే గాని, డి. యం. కె. పట్ల అభిమానంవల్లకాదు. అందుకు ఎన్నో కారణాలు ఉండవచ్చు.

గాల్‌బ్రెత్:-ఇది వెనకటంతదిగా విచ్ఛిన్నకరంగా ప్రవర్తించడం లేదనుకుంటాను? ఔనా?

శ్రీమతిగాంధీ:-వీలుంటే వారు బహుశా విచ్ఛిన్నతకే కృషిచేస్తారనుకుంటాను. కాని మేము వారి ఆటలు సాగనివ్వడంలేదు.

గాల్‌బ్రెత్:-ప్రసారంలో మనకిచ్చిన సమయం తీరిపోయిందని అప్పుడే హెచ్చ రిస్తున్నారు? ఈ పర్యటనలో మీరు ఒక్కసంగతి గమనించారనుకుంటాను. నాతోసహా అనేకమందికి మీ తండ్రిగారంటే యీనాటికీ ఎంతో ప్రేమా, అభిమానమూనూ. మీ రాకవల్ల ఆయనను సంస్మరించుకునే అవకాశం కలుగజేశారు. ఇక శ్రీశాస్త్రికూడా పదవిలో ఉన్న స్వల్పవ్యవధిలో అపారమయిన గౌరవ మన్ననలు పొందగలిగారు. ఆయన మహోన్నతు డైన చిన్నమనిషి అని అంతా అనుకుంటూంటారు. మీ తండ్రివంటి ఒక మహావ్యక్తి మరణించిన తరువాత, ఆయన రూపొందించిన విధానాలు అవిచ్ఛిన్నంగా కొనసాగించగలిగిన శాస్త్రీ, మీరూ పదవిలోకిరావడం అదృష్టమని మా అందరి అభిప్రాయమూను.

శ్రీమతిగాంధీ:-అమెరికా - భారతదేశాల మధ్యగల మైత్రీభావం మా కందరికీ ఆనందదాయకం. ఈ భావం కొనసాగగలదనే మా ఆశ.

గాల్‌బ్రెత్:-మీరు అప్పుడప్పుడు వస్తూంటే ఈ మైత్రి బాగా వృద్ధిచెందడానికి వీలుంటుం దనుకుంటాను. ప్రెసిడెంట్ జాన్సన్ త్వరలోనే మీ దేశానికి వెడతారని ఎవరో అనగా విన్నాను.

శ్రీమతిగాంధీ:-అవును. వారిని మేము ఆహ్వానించాము. ఆయన భారతదేశం వస్తే మేమెంతో సంతోషిస్తాం.

గాల్‌బ్రెత్:-మీ రీ అవకాశం ఇచ్చినందుకు ధన్యవాదాలు.